# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

## మొదటి భాగము

## నిత్యపారాయణ గ్రంథము





వద్దిపర్తి రాజారావు "శ్రీవత్స"
ఉభయ భాషాప్రవీణ

SRI VENKATACHALA MAHATMYAMU (PART-I)

by

*Vaddiparti Raja Rao 'Srivatsa'*

Published under Aid to Authors Scheme of
Tirumala Tirupati Devasthanam, TIRUPATI.



**Smt. V.D. BHAVANI,** M.A
Daughter of Sri. V. Raja Rao
2-184, Balaji Nagar, opp. APSP Qtrs.
KAKINADA - 533 005.



| | |
|---|---|
| 1st Edition | 1998 |
| 1st Print | 1998 |
| Copies | 750 |
| Price | Rs. 80/- |

for copies :
*Tallapragada Bhaskara Rao*
2-184, Balaji Nagar, opp. APSP Qtrs.
KAKINADA - 533 005. Tel : 26359

Title Designed by
**BAPU**

Printed at
**LATA OFFSET PRINTERS**
C/o. RAJ SCREEN PRINTERS,
Majestic Cine St.,Kakinada - Tel : 66897

రచయిత - సతీమణి



జననము 1903

**శ్రీ వద్దిపర్తి రాజారావు - సత్యవతీ దేవి**

ఉభయ భాషా ప్రవీణ

స్వాతంత్ర్య సమరయోధులు



# సమర్పణ

శ్రీ వేంకటగిరి పతికిన్
శ్రీ విభునకు, దేవతావరిష్ఠునకును, వి
ద్యా వైభవ సందాతకు
గోవిప్రసురార్త రక్షకునకున్ హరికిన్॥

ఆద్యంతరహితునకు, స
ద్విద్యా ఫలదునకు సర్వ విభునకు, గంగా
నద్యంబు సృష్టికర్తకు
సద్యో మోక్షానుదాతృ శక్తియుతునకున్

నేను సమర్పించెద, వి
జ్ఞానరసమ్మైన శేషశైలపతికథన్
వాని చరణంబులకు, బ్ర
హ్మానంద మ్మనుభవింతు నాత్మనికపయిన్

*శ్రీమతే నారాయణాయనమః !*

# అనేక మంగళాశాసనములు

కన్న శిశువుల క్షేమం కోసం పలురకాల పాట్లు పడే తల్లిదండ్రులవలె, ఈ లోకంలోని బద్ధజీవులు క్షేమం కోరి సర్వజగన్నాథుడగు శ్రీయఃపతి ఎన్ని శ్రమలు పడుతాడో మన వైదిక వాఙ్మయం వివరిస్తోంది. మన ఇతిహాస పురాణాలా విషయాలను మరింత స్పష్టంగ మనకు చూపాయి.

ప్రతి పురాణంలోనూ మానవజాతి యొక్క చరిత్రను ఒక్కొక్క కోణంలోంచి చూపిస్తాడు పురాణకర్త బాదరాయణ వేదవ్యాస భగవానుడు.

ఈ మానవ సమాజ నిర్మాతలైన పురాణ పురుషుల చరిత్రలను మనకు చూపుతూ, వారిలో ఆస్తికులై భగవద్భక్తి పరులైన మహానుభావుల కథలను తెలుపు సందర్భాలలో వారు పర్యటించిన పుణ్యక్షేత్రాలు, అక్కడ వారు సేవించిన దివ్య దేవాలయాలు అక్కడి విశేషాలు గూడ తెలుపుతూ రాబోయే తరాలవారికి అనాటి భౌగోళిక పరిస్థితులనూ తెలిపారు. అసలు ఆలయ నిర్మాణం, ఆరాధనా సంప్రదాయము, సుమారు రెండువేల సంవత్సరములకు ఇటు అటులోనే ప్రారంభమైంది తప్ప అంతకుముందు లేదనేది ఆధునిక పరిశోధకులందివాదన. దానిని బట్టే చాల రాజ్యాంగ విధానాలు గూడ రూపుదిద్దుకొన్నాయి. న్యాయస్థానాలలో వ్యవస్థ చెల్లుబాటవుతోంది.

ఆవాదనకు విరుద్ధంగా కొన్ని వేల సంవత్సరాలకు ముందే ఆలయాలనేకమున్నాయని, అవి సుప్రసిద్ధమైన వ్యవస్థను కలిగి ఉన్నవిగూడాననే వాస్తవాన్ని పురాణ గ్రంధాలు చూపిస్తాయి.

పరిశోధకుల కందని కాలానికే చెందిన పురాణాలలో అనేక దేవాలయాల ప్రస్తావనా, అవి ఆనాటికంటే వెనుక ఎన్నో వేల ఏండ్లుగనే ప్రసిద్ధి చెందిన క్షేత్రాలుగ భక్తుల కోరికలు తీర్చే ఫలసిద్ధినిచ్చే దివ్య దేశాలుగ అనేకుల ఆరాధనలందుకోవడం మనకు పురాణ వాఙ్మయంలో కనిపిస్తుంది.

అలా ప్రసిద్ధిగాంచిన ఆలయాలలో విశేషముగ కీర్తించబడినది, సుమారుగ పన్నెండు పురాణాలకు పైగా ప్రస్తావించిన దివ్యప్రభావంకల క్షేత్రం శ్రీ వేంకటాచల క్షేత్రం. 'కట' ములంటే అనుభవిస్తేతప్ప తీరని ఋణాలవంటి

ప్రబల కర్మరాశి. దాన్ని 'వేం' కాల్చివేయును. ఎవ్వరూ తొలగించ జాలని కర్మలన్నింటినీ తొలగించుటలో సాటిలేనివాడు 'వేంకటేశుడు' అతడే 'వేంకటేశ్వరుడు'. అతని సాన్నిధ్యముచే ఆ కొండ 'వేంకటాచల' మైనది. అదీ అలాంటి శక్తి కలదే. దాని సంబంధం కల ప్రక్క కొండలూ అలాంటివే నంటారు ఆళ్వార్లు. ఇరువురు బిడ్డల నొకేసారి కన్నతల్లి ఇరువైపులా స్తన్యపానము ఒకేసారిగావించునట్లు, పైలోకాల వారికే అందుతూ, ఈ లోకవాసులకి దూరంకానట్టు ఏడు కొండలపై నిలచి ఉన్నాడు రక్షకుడై అంటారు శ్రీనమ్మాళ్వారు.

ఆ స్వామి మాహాత్మ్యమును గ్రాంథికమైన తెలుగులోనికి అనువదించిన **శ్రీమాన్ వద్దిపర్తి రాజారావు గారు** ధన్యులు. ఇప్పటి వారికీ భాష సులభగ్రాహ్యముకాక పోయినా వారియందుండే పితృగౌరవముతో వారి సంతాన మీ గ్రంథముద్రణకు పూనుకోవడం నిజంగా శ్లాఘనీయం.

మూలాన్ని చాలావరకు యథాతథంగా తెనిగించిన వీరి ఈ గ్రంథము రాబోవు కాలంలోని వారికొక మంచి విషయగ్రహణతో బాటు భాషాభ్యసన గ్రంథంగా గూడ ఉపయోగపడుతుందనడంలో సంశయంలేదు. జిజ్ఞాసువు లందరికీ ఇదిజీవాతువై వెలుగొందుగాక !

జై శ్రీమన్నారాయణ

వేద విశ్వవిద్యాలయం
సీతానగరం - 522 501

19/3/98

**(శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన జియ్యర్ స్వామి)**

# నిత్యపారాయణ గ్రంథము

శ్రీ వద్దిపర్తి రాజారావుగారు స్వాతంత్ర్య సమరయోధులు. అచ్చమైన గాంధేయవాది. తెలుగు పండితులు. శ్రీ వేంకటాచల మాహాత్మ్యాన్ని వచనప్రబంధంగా గద్యకావ్యంగా తెలుగు పాఠకులకు అందిస్తున్నారు. శ్రీనివాసుడి కథ జగత్ప్రసిద్ధం. దీనికి పురాణాల మూలాలు వెదికి వేసారడంకన్నా యథాతథంగా పారాయణ చేసి తరించడం మిన్న. ఇంతకాలంగా ఆంధ్రపాఠకలోకం అదేచేస్తోంది.

ఏడుకొండలవాడు ఎవడు ? అమ్మవారా ? అయ్యగారా ? అక్కడ జరిగే పూజావిధానం ఏమిటి ? ఇలాంటి అతితెలివి ప్రశ్నలు వృధా. వీరు ఏమైనా భగవత్స్వరూపమే. అతడు ఆద్యంత రహితుడు. అనాది. అప్రమేయుడు. మూలప్రకృతి. త్రిగుణ - త్రిలింగాతీతుడు. ఈ అవగాహన ఉంటేచాలు. భక్తి అదే కుదురుకుంటుంది.

కలియుగ వైకుంఠం తిరుమల. సకల తీర్థాలూ సకల దేవతలూ సకల క్షేత్రాలూ అక్కడే ఉన్నాయి. సాక్షాత్తూ బ్రహ్మదేవుడు స్వామివారికి ఉత్సవాలు జరిపించాడు. ఇప్పటికీ జరిపిస్తున్నాడు. అందుకే అవి బ్రహ్మోత్సవాలు. వాటి వైభవం తిలకించే తీరాలి. అసలు అక్కడ నిత్యమూ ఏదో ఒక ఉత్సవమే. నిత్యకల్యాణం పచ్చతోరణం అనేమాట అక్కడే చెల్లుతుంది. అక్కడి నుండి విలుబుత్తూరి అనుబంధం. శ్రీ రంగంతో సంబంధం. దక్షిణాపథాన్ని సమైక్యంగా సంధానించే దైవతం శ్రీనివాసుడు.

ఔత్తరాహులకు బాలాజీ. వ్యాపారులకూ, పారిశ్రామికులకూ రాజకీయులకూ వడ్డీ కాసులవాడు. ధన రూపంలో మన పాపాలను తర్జుమా చేసి ప్రక్షాళన గావించే పరాత్పరుడు. ఎంత మానసిక సంతృప్తి. ఎంత మనశ్శాంతి. ఈ విధానమే లేకపోతే మనిషి పాపాగ్ని దగ్ధుడైపోడూ !

సదరు వేంకటాచల మహాత్మ్యాన్ని సరళ సుందరమైన వచనంలో అందించిన శ్రీ రాజారావుగారికి భక్తలోకం ఋణపడుతోంది. వస్తువుని బట్టి భాష ఉండాలి అన్నారు. శైలిమారాలి అన్నారు. ఇది భక్తి బంధురమైన స్థలపురాణం. కనకభాషకూడా అలాగే ఉండాలి. గ్రాంథిక శైలిలో సాగాలి. అదే చేసారు ఈ చరయిత. అయితే బరువైన ప్రబంధ గద్యలుగా నడిపించకుండా ఉదాత్తగంభీరంగా నడిపించారు. వీరి ఔచిత్యదృష్టికి ధన్యవాదాలు.

స్తుతులూ స్తోత్రాలూ వచ్చినచోట ఛందోమయవాణిని ఉపాసించారు.

భక్తులు కంఠస్థం చేసి పారాయణ చేసుకోడానికి ఛందస్సు బహుధా ఉపకరిస్తుందన్న రహస్యం వీరికి తెలిసింది. అనుభవజ్ఞులూ, జీవితంలో పండినవారూ కదా !

ఇటీవల వచన రచనలకు భక్తులు దీక్షగా పారాయణలు చేస్తుండటం గమనిస్తున్నాం. అలా పారాయణ చేసి ముక్తి పొందడానికే పుణ్యఫలాలు అనుభవించడానికే ఈ గ్రంథం ఉపకరిస్తుంది. భక్తులు సద్వినియోగం చేసుకుని లబ్ధిపొందుదురు గాక అని ఆకాంక్షిస్తున్నాను. సెలవు

భవదీయుడు

(ఆచార్య బేతవోలు రామబ్రహ్మం)
12-3-98

---

## స్థిత ప్రజ్ఞుడు

"అన్నయ్య వేంకటాచల మాహాత్మ్యము పుస్తకం అచ్చు విషయములో చేయు ప్రయత్నము ఆనందాన్ని ఇచ్చింది. తన జీవితం విద్యాభ్యాసం మొదలు చివరి వరకు స్వశక్తి మీద, స్వాధ్యయనం మీద పైకి వచ్చింది. గాంధీజీ స్వాతంత్ర్యోద్యమము ఆనాటి యువకులలో దేశభక్తితో బాటు సత్ప్రవర్తనా దృష్టిని కూడా ప్రసాదించింది. ఆత్మ పరిశోధనకై గాంధీజీ ఎన్ని ప్రయోగాలు చేసారో అన్నీ జీవితములో ఆచరించి సఫలీకృతుడైనాడు. స్థిత ప్రజ్ఞుడు.

ఈ 95 సంవత్సరముల వయస్సులో గూడా ఆధ్యాత్మిక గ్రంథ పఠనను మానలేదు. యిక్కడే భగవంతుని సాన్నిధ్య సుఖాన్ని పొందుతూ పరిపూర్ణ జీవితాన్ని అనుభవిస్తున్న ధన్యజీవి.

ఇట్లు,
సోదరి
పాలకోడేటి రమణాదేవి

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః శ్రీ వాగ్దేవ్యై నమః

# ముముక్షుజనపదము

1979 వ సంవత్సరం హైదరాబాద్‌లో మా పెదనాన్నగారు శ్రీ రాజారావు గారు, నేనూ వారింటి ముందు మామిడి చెట్టు క్రింద కూర్చుని మాట్లాడు కుంటున్నాము. నేనా 13, 14 సం॥ల బాలుడను. అయినా నేనంటే ఆయనకున్న అపారప్రేమతో ఒక రహస్యం విప్పి చెప్పారు. ఆ సమయంలో వారు వ్రాస్తున్న శ్రీ వేంకటాచల మాహాత్మ్యము చంపూకావ్యమును గురించినది.

వారు 1940 వ సంవత్సరం ఆగష్టులో తిరుపతి వేంకటేశ్వర దర్శనమునకు వెళ్లారు. ఆ రోజులలో మెట్లెక్కి కేవలం కాలినడకనే పైకి వెళ్లవలసి ఉండేది. భక్తులు 10, 12 మంది కంటే స్వామి దర్శనమునకు రాలేదట ఆరోజు. పరమ ప్రశాంత వాతావరణంలో స్వామిని సందర్శించిన శ్రీ రాజారావు గారికి ఇక శేషజీవితం శేషాచలేశుని సన్నిధానంలో గడపాలనిపించిందట. మూడురోజులు అక్కడే ఉండిపోయారు. అప్పుడే స్వామి జీవిత చరిత్ర వ్రాయాలనే సంకల్పం కలిగింది. మూడవ రోజు రాత్రి కలలో స్వామి ప్రత్యక్షమై, సంసార బాధ్యతలను విడువరాదని, విధినిర్వహిస్తూ తన సేవ చేయుమని ఆదేశించారట. ఆ మరునాడే తిరిగి ఇంటికి వెళ్లిపోయారు. ఆనాటి నుండి శ్రీ వేంకటేశ్వర చరిత్ర ఏ యే పురాణాలలో ఉన్నాయో అవన్నీ పఠించి పరిశోధించటం సాగించారు. ప్రధానంగా వరాహపురాణం వారికాధారమైనది.

సహజ పాండిత్యం దానికి తోడు ఉభయభాషా ప్రవీణ విద్యార్హత అన్నిటినీ మించి శ్రీమద్భగవద్గీత వారికి జిహ్వాగ్రస్థితము. రాత్రులు నిద్రలో కూడా గీతాశ్లోకాలు పఠించడం నేనెరుగుదును. సరే, వీటికి తోడు వద్దిపర్తి వంశంలో కవిత్వం చెప్పని వారెవరూ ఉండరని ఆరోజులలో ప్రసిద్ధి. మానాన్నగారు శ్రీ చలపతిరావు గారు కవిపండితులు. సరే, అంతో ఇంతో నాకు కవిత్వ వాసన ఉందన్నది జగద్విదితమే. శ్రీ రాజారావు గారి సోదరీమణులు, సోదరులు సంతానం అంతా విద్యావేత్తలే.

అన్నీ తోడయ్యాయి. 1976 లో ప్రారంభమయినది శ్రీ వేంకటాచల మాహాత్మ్యము. 1983 నాటికి పూర్తయినది. గద్య పద్యాలలో హృద్యమైన పద్యరచన సాగింది. కాని కాలమహిమ. ఈ నాటికి వెలుగును చూస్తోందీపొత్తం.

క॥ తెనిగించితి నెపుడో, దీ
నిని, ముద్రణ చేయలేక నేనీ పొత్తం
బును మూలఁ బెట్టియుంచితి
కనుగొనెనిది నేటి వార్ధకమ్మున వెలుఁగున్ ॥

అని వారు హృదయాన్ని బయట పెడితే సహృదయుల హృదయాలు ఘోషించకమానవు.

ఈ మహోత్కృష్ట రచనము సంస్కారులకు చిత్త శ్రవణానందము, ముముక్షు జనపదము, హరిస్తవము. ఆదికవి నుండి ఆదిభట్ల వరకు తెలుగులో వచ్చిన సమస్త సాహిత్యాన్ని ఆపోశన పట్టిన శ్రీ రాజారావు గారి వచన రచనా చమత్కృతి పండితులకు హర్షోత్కర్షమును కలిగించక మానదు. ఈ కవి నిస్వార్థభక్తుడు.

భక్తియందు లేదు స్వార్థంబునకుఁ దావు
స్వార్థముడుగు సేవ భక్తియె యగు
వేష భాషలందు వెల్లడించుట కాదు
నీతి చేతలందు నియతిఁ జూపు.

పుట 86

నిస్వార్థసేవ కూడా భక్తియే అనుట వీరివేదాంత రసజ్ఞతకు నిదర్శనము. వీరి వచన రచనలో సహజ పాండితీప్రసన్నని పోకడలు స్ఫుటంగా కనిపిస్తాయి. బ్రహ్మాదులు శేషశైలేంద్రుని దర్శింపబోవు సందర్భములో శేషాచల వర్ణన అత్యంత సహజసుందరమై సాగింది. ఇందు కొన్ని స్తోత్రాలు మహామహిమాన్వితాలు. వ్యూహలక్ష్మీ మంత్రము అష్ట ఐశ్వర్యములు ఇచ్చునని శాస్త్రము. అట్లే 82వ పుటలో శ్రీ వేంకటేశ్వరాష్టోత్తర శతనామావళి స్వామి నిత్యపూజకు ఎంతో ఉపయోగకరము. ఇందు వేంకటాచల మందలి సకలతీర్థాల వర్ణనలు, మాహాత్మ్యములు ఉన్నాయి. ఒక్కముక్కలో ఇది శ్రీ వేంకటేశ్వర సర్వస్వము.

ఇక పద ప్రయోగాలు అత్యాశ్చర్యాలు. రచనలో ధారాశుద్ధి అడుగడుగునా గోచరిస్తుంది. భక్తిభరిత చిత్తము ప్రతి స్తోత్రములో తొంగిచూస్తుంది. చెప్పిన విషయాలు ఆచరించాలనే తపన కనిపిస్తుంది వీరి రచనలో. వీరొకప్పుడు ఒక పద్యంలో ఇలా అన్నారు

" చిలుక పలుకులుపన్యాసములును కాదు
జ్ఞానమాచరణంబునఁ బూనునదియ "

అదినిజము. ఆచరించి తరించిన మహాభక్తులు, జ్ఞానులు శ్రీ రాజారావు గారి ఈ రచన ఆంధ్రపురంధ్రుల్లాసకారణ మనుటలో అత్యుక్తిలేదు.

వద్దిపర్తి పద్మాకర్
శతావధాని
ఆంధ్రోపన్యాసకులు
సి.ఆర్. రెడ్డి కళాశాల, ఏలూరు

ఓం శ్రీ విఘ్నేశ్వరాయనమః ఓం శ్రీ వేంకటేశ్వరాయ నమః

## శ్రీ వేంకటాచలమాహాత్మ్యము - శ్రీ రాజారావు గారు

శ్రీ వడ్డిపర్తి రాజారావుగారు తూర్పుగోదావరి జిల్లా వడ్లమూరు గ్రామము నందు శ్రీ భాస్కరరావు, బాపనమ్మ దంపతులకు క్రీ.శ. 1903 వ సం॥లో జన్మించిరి. విద్యాభ్యాసము పెద్దాపురము - కాకినాడలలో జరిగినది. స్వాతంత్ర్యసమరయోధులు. గాంధీగారి పిలుపునందుకొని స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొని నిజాయితీ, క్రమశిక్షణలే, తమ ఆయుధాలుగా పని చేసిన కార్యకర్త. జైలుకు వెళ్ళి శిక్షననుభవించిరి. మహాత్మా గాంధీగారు ప్రకటించిన నిర్మాణ కార్యక్రమ ప్రధాన అంశములైన ఖాదీ, హిందీ ప్రచారము, స్త్రీ జనోద్ధారణ హరిజన సేవలకే తన జీవితమంతా వెచ్చించిరి. పరిపూర్ణ గాంధేయులు. శ్రీమతి దువ్వూరి సుబ్బమ్మగారితో కలిసి రాజమహేంద్రవరమున స్త్రీ సనాతన విద్యాలయము స్థాపించి, ఉచిత స్త్రీ విద్యా బోధన చేసిరి. పరమసాధ్వి. దయామయి అయిన భార్య సత్యవతీ దేవితో వారి గృహస్థాశ్రమజీవితము వారి ఆదర్శములకు అనుగుణముగా సాగినది.

ఉభయభాషా ప్రవీణ అయిన వీరిని అప్పటి ప్రముఖ నాయకులు జిల్లా బోర్డు అధ్యక్షులు అయిన మల్లిపూడి పల్లంరాజుగారు, తెలుగు భాషాధ్యాపకులుగా మలికిపురమున నియమించిరి. 1968 సం॥న తూర్పుగోదావరి జిల్లా మామిడికుదురు గ్రామమున ఉద్యోగ విరమణ చేసిరి.

వీరి రచనలలో శ్రీ ధారమల్లేశ్వరలింగశతకము, శ్రీ రాఘవేశ్వర శతకము. శ్రీరామ శతకము, ఆత్మ ప్రబోధము అచ్చయి వెలుగులోనికి వచ్చినవి. ఇవి వీరి సాహితీ సేవలోని మచ్చుతునకలు. అచ్చుకాని రచనలు, గీతా మకరందము, బ్రంహ్మాండ పురాణము వంటివి యింకనూ గలవు.

సీ॥ పూజింపనిన్ను నీపూవులాపూవులం
చట్టెట్టు పర్వులు పెట్టనేల
తీయతీయని బత్తి తేనియలొలికెడి
పసగుల్కు కల్కు హృత్పద్మముండ
అభిషేకమునకును నమృతంబు లంబువు
లంచును దేరగాగించయేల
ఆనంద బాష్పపూరామృతధారలు
భావంబుపూరముల్ పరిఢవిల్ల

తే॥ ఆలయంబునకని పోవునాసలేల
దేహమే యాలయంబయి తిరముగాగ
మనమునను నిల్పియర్చింతు ననవరతము
ఈశ భవనాశధారమల్లేశ లింగ.

ధార మల్లేశ్వర శతకము

ఉ॥ నమ్మితి నిన్నె నెమ్మనమునన్మతి యన్యులనమ్మలేదువే
గమ్మున నార్తి బాపి ననుగావుము దీనుడ ! నార్త రక్షకా !
యిమ్మెయి నీవెవీడ నను నెవ్వడు ప్రోచెడివాడు కల్ల ! రా
రమ్మురయమ్మునం గరుణ రక్షణ సేయుము రాఘవేశ్వరా !

దేవునందే యాసక్తులై యనన్యమైన భక్తియోగమున ధ్యానించుచు ఉపాసించుచు భగవంతునందే భారముంచి ఫలమును గోరక పవిత్రముగా శ్రద్ధా భక్తులతో కర్తవ్య కర్మల జీవితము గడపిన ధన్యులాయన.

ఇక దివ్యము అప్రాకృతము అగు ఆవేంకటాద్రి, అందలి వేంకటాచలపతి, శ్రీనివాసుడు, కలియుగము నందలి పాపకర్మలచే జుట్టుముట్టబడి, తెన్ను గానక యున్న మానవులకు ఏకైక శరణము. వారి మాహాత్మ్యమును తెలుగున, వచన రూపమున అందించి సామాన్య మానవులను సహితము భగవంతుని కృపాపాత్రులను చేయవలెనని వీరి అభిమతము.

తే॥గీ దేవభాషను గలయట్టి తావకీన
మహిమలన్నియు చదివి సంబరము పడితి ।
తెలుగునను దీని వ్రాసినన్ తెలుగు వారి
కందజేసిన నెంతొ మేలగునుగాదె ॥

అను పద్యము వారి ఈ గ్రంథ రచనాభిలాషను వ్యక్త పరచుచున్నది.

శ్రీ వేంకటాచలమహాత్మ్యమును, చదివిన, విన్న వినిపించిన ఎల్లరును ఆయురారోగ్య ఐశ్వర్యములు బడసి కైవల్యమును పొందుదురన్నది బ్రహ్మవాక్కు. అట్టిది శ్రీ వేంకటాచలమాహాత్మ్యమును వ్రాసిన వీరు భక్తర్షి.

అశ్వరాజమగు నుచ్చైశ్రవము, గజశిరోరత్నమగు నైరావతము, అనంతుడగు నాగరాజు, వేదస్వరూపుండగు గరుడుండు వాహనములుగా జగన్మాత లక్ష్మి నంకము నిడికొని అమూల్య వస్త్ర రత్నాభరణాద్యలంకృతుడై భక్తజనుల గంధర్వాదిదేవతల తరింపజేయుచు తిరుమలను వీధి వీధుల నూరేగు బ్రహ్మోత్సవములవర్ణన కన్నులకుగట్టు నట్లు వర్ణించిరి.

తిరుమలను బృందావనమును బెంచియు, ఫల పుష్పవాటికలనాటియు, వాని ఫల, పత్రపుష్పములచే నన్ను బూజించియు, మాలలు కట్టియు, మృష్టాన్నంబుల నైవేద్యంబులనర్పించియు, భక్తుల కన్నాదానము, జలపానము వస్త్రదానమొసంగి, దీనజనుల క్షుత్పిపాసలు తీర్చిన భక్తులు పునర్జన్మలేక బ్రహ్మేంద్రాది దివ్యలోకములను పొందుదురని సాక్షాత్ శ్రీనివాసభగవాను మాట. ఈ విధముగా కవి తిరుమలను అన్న, వస్త్ర దానముల - ఉద్యానవన పెంపకముల ప్రాశస్త్యమును చాటియున్నారు.

వాయువొనర్చిన విష్ణుస్తవము. మహాద్భుతము. బ్రహ్మకృతభగవస్తుతి. శంభుడొనరించిన భగవత్ప్రార్థన. మహర్షికృత భగవంతుని స్తుతి. సమస్త దేవతల సంస్తుతులు. శ్రీ మహావిష్ణుని విశ్వరూప దర్శనము. ఈ మాహాత్మ్యమునకు మకుటాయమానములు.

కలియుగమున భక్తి తత్పరులగు మానవులు స్వామి పుష్కరిణిని స్నానమొనరించి, దివ్యవిమాన సంస్థితు ఆదిదేవు, గోవిందు స్తుతించువారు, శ్రీ వేంకటాచలమునకు మ్రొక్కువారు, భగవానుడు ఆ కొండనెల్లదానై, గుహల కందరముల, ప్రవాహముల, సానువుల వివిధ రూపములదానై వశించును. కావున ఆ దివ్య మహావేంకటాచలమున నెచ్చటనేని కూరుచుండి భక్తి తత్పరులై జనార్ధను నర్చించు వారు దర్శించుకొనువారు భగవంతుని సాన్నిధ్యము పొందుదురని అగస్త్యముని వరుని ద్వారా కవి కలియుగ మానవుల కందించిన మోక్షసాధనము "శ్రీ వేంకటాచల మాహాత్మ్యము."

శ్రీ వరాహదేవమంత్రారాధనమున "ఓం నమః శ్రీ వరాహాయ ధరణ్యుద్ధరణాయ స్వాహా" ఈ మంత్ర రాజమును ధరణీ తరుణీ మణికి చెప్పుటద్వారా అల్పులమగు మనకు మోక్షసాధనమగు ఈ మంత్రమాహాత్మ్యమును చెప్పిరి. శ్రీహరి ప్రాదుర్భవించిన కుంభమాసమున పూర్ణిమ తిథిని పొనర్చిన కుమారధారికా స్నానము ఉత్తమ ఫలమునిచ్చునని, పదునేడు పుణ్యతీర్థములయు, నూట ఎన్మిది దివ్యతీర్థములయు మాహాత్మ్యములు వివరించి ఇంకనూ ఎన్నెన్నియో, వేంకటాచలమునగల పావన తీర్థంబుల వర్ణింప నేరికిని వశంబుకాదని దేవుకృప, చేతనయినంతగ వివరించుచుంటినన్ని తన నమ్రభక్తిని ప్రకటించుకొనినారు.

దేవతల ద్వారా లక్ష్మీ మాతృస్తుతి, త్రిదశ వరకృత స్తోత్రంబును మన కందించిరి. భీముడను కుమ్మర భక్తుని చరిత్ర ద్వారా పవిత్ర, నిర్మల, వినమ్ర భక్తిచే నెట్టివాడైన ఎవ్వడయిన నన్ను వశమొనర్చుకొనునని దేవుని వాక్యము భక్త్యహంకారులకు జ్ఞాన ప్రదాయిని. శ్రీ వేంకటేశ్వర అష్టోత్తర శతనామావళి వీరు నిత్యపూజకందించిన కుసుమము. కర్మ యోగమును పరమాత్మ

వివస్వంతునకు, వివస్వంతుడు మనువునకు, మనువిక్ష్వాకునకు, ఆయోగమునే శ్రీ కృష్ణుడు పార్థునకు, వ్యాస భగవానుడు మానవులెల్లరకు ప్రసాదించిరి. సులభశైలిని ఈ కర్మ యోగమును తెలుగు వచనమున ప్రసాదించిన వీరు ధన్యులు

భక్తి యందు లేదు స్వార్థంబు నకుఁదావు
స్వార్థముడుగుసేవ భక్తి యెయగు
వేష భాషలందు వెల్లడించుట కాదు
నీతి చేత లందు నియతిచూపు

ఇది వారి వ్యక్తి గత అభిప్రాయము. వ్యక్తిత్వమునకు మచ్చుతునక.

దేవగణములేకమై "పుండలీక నయన దండముల్ దండముల్" అని వేనోళ్ల ప్రార్థింప ఆ స్వామి పుష్కరిణీ పశ్చిమ తటమ్మున మహాతేజంబున గన్నులకు హర్షోత్పాదకంబగు దివ్యమూర్తి మహద్విమానము, ఆలయముతోచెను. కల్పాదిని, కృతయుగమున జంబూద్వీపమున భరతవర్షమున గంగానదికి దక్షిణదిశను రెండువందల యోజనముల దూరమున దూరుపుసంద్రమునకుం బడమటి దెస నైదు యోజనముల దూరమున నారాయణాద్రి యందు స్వామి పుష్కరిణీ పశ్చిమ తటమ్మునందున బాద్రపద శుద్ధ ఏకాదశీ తిథిని శ్రవణ నక్షత్రయుక్త సిద్ధి యోగమున సోమవారమున లోక రక్షకుడు శ్రీనివాసుడు యవతరించి యనుగ్రహించి, కలియుగమున మానవకోటి యిడుమలు బాపుటకై పద్మావతీ అమ్మవారితో స్థిరనివాసమేర్పరచుకొనెను. ఈ విషయము తెలుగు జాతికి భారతావనికి గర్వకారణము.

కృష్ణవేణి నదికి దక్షిణంపుదెనను ముప్పదిరెండు యోజనముల దూరమునగల సువర్ణముఖరీనదీ తీరమున శ్రీనివాసునిచే నొనరింపబడిన పద్మాసరోవర ప్రశస్తి ప్రశస్తము.

ధరణీమాతకు పద్మావతీదేవి వైష్ణవ లక్షణములు. భక్తవరు లక్షణములు వివరించినది. ఆసందర్భములో కవి "ఒడలెల్లంగాల్చికొనినంత మాత్రాన గాడు వైష్ణవ భక్తుడు, హృదయ మాదేవునకు సర్వార్పిత మొనర్చినవాడు గావలెను. అట్టివానికి జాతిమత కులబేధములులేవు. ఎల్లరం దనయందును, నెల్లరందున దన్నుంగాంచుచు, సర్వమున విష్ణుంగాంచుచు అంతయు విష్ణుమయమని యెరింగి వర్తింపవలయును. అట్టివానికే యీ చక్రాద్యంకితము లెంతయు మేలుగూర్చును" అని యదార్థవాదియై తన భక్త హృదయమును స్పష్టపరచికొనినారు.

శ్రీనివాస పద్మావతుల ప్రథమ సమావేశవేళ "మదనుఁడే యేమో ? కాదు కాదు. ఆ యనంగున కింతయందమా ? అనుచు శ్రీనివాసుని దివ్య సౌదర్యమును వర్ణించిన తీరు. శ్రీనివాసుడు మనకు ప్రత్యక్షమయినట్లే ! ఇది మొదలు శ్రీనివాస కల్యాణము - పెండ్లి వారి తిరుగు పయనము వరకు ఆ పుణ్యగాధ చదివి తరించ వలసినదే గాని వర్ణింప సాధ్యము గాదు. నిర్లిప్తుడై త్రికరణముల భక్తిని పవిత్రుఁడై యా వేంకటేశ్వర దేవుని కళ్యాణోత్సవము జరిపించు నాపుణ్యుని పున్నెమే పున్నెము. అట్టి భక్తుడు దేవుని సాయుజ్యమును పొందును.

ఆత్మ సంయమయోగమున కర్తవ్య కర్మల వీడి కాషాయములు కట్టి సోమరియై దేశద్రిమ్మరి యగు వాడు కాదు సన్యాసి. ఇతరుల కర్మఫలమును గుడుచువాడు యోగియునుగాడు. కర్తవ్య కర్మల ఫలాపేక్ష మాని నిర్వర్తించు వాడే సన్యాసి. అని వివరించిన తీరు వీరి గృహస్థుననే సన్యాసతత్వమును ఆచరించెడి వ్యక్తిత్వమును స్పష్టపరచుచున్నది.

పితామహుడు బమ్మదేవర లోకాభ్యుదయము, మంగళమ్ము, మదినెంచి ఆ వేంకటేశ దేవుననుమతిని, ధ్వజారోహణమాదిగ, పురుషోత్తముని పవిత్రావభృతస్నానము, పుష్పయాగమహోత్సవముల వరకు కన్నులకు గట్టినట్లు వివరించిన కవిబ్రహ్మ రాజారావుగారు ధన్యులు.

పరమేశ్వరునిచే పార్వతీ మాతకు ఉపదేశింపబడిన "ఓమ్" ప్రణవమునుంచి పిదప నమః జేర్చి శ్రీ సహిత వేంకటేశ శబ్దము "ఓం నమః శ్రీ వేంకటేశాయ" కలియుగమున పాపకూపమున బడియున్న మానవులందరికి మోక్షమంత్రము.

తీర్థ యాత్రా వైభవమున - పాపమన నేమందురా ? ఇతరులు తనకు ఏమి చేయఁగోరునో తానును అన్యుల కదియే చేయనగును. అన్యులేది చేసినఁదనకు బాధకలుగునో అది అన్యులకుదాను చేయరాదు. అట్టు కాదని చేయుట మహాపాపము" అనియీ వివరణ రచయిత సాత్వికస్వభావమును వారి జీవన విధానమును తెలియజేయుచున్నది.

శేషశైలము, గరుడాచలము, తీర్థాగము, చింతామణిగిరి జ్ఞానక్ష్మాధరము, నరశింహాద్రి, వరాహాద్రి, నీలగిరి, వేంకటాద్రి శ్రీనివాసగిరి, ఇంకనూ అనేక తిరుమలనామముల ప్రాశస్త్యమును వర్ణించిన వీరు ధన్యులు. అట్లే స్వామి పుష్కరిణి కుమారధార కపిలతీర్థములాదిగ పదునేడు తీర్థములయు, చక్ర కపిల ప్రతతీర్థములాదిగ నూట ఎనిమిది తీర్థములయు యింకను మరెన్నియో

మాహాత్మ్యములువర్ణించిన వీరు శ్రీ వేంకటేశ్వరుని కృపాపాత్రులు. వారు జీవితమును శ్రీ వేంకటేశుని కంకితమొనర్చు కొన్న ధన్యజీవులు. శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును ఆసాంతము చదివిన ఎవ్వరికేని శ్రీ రాజారావుగారు, సూతముని వరుడు, శుకమహర్షి వాల్మీకాదుల అంశను జన్మించిన మహానుభావులు కాదుగదా! అని అనిపించకమానదు. అట్టి వీరికి కుమార్తెగా జన్మించుట నాపూర్వజన్మ పుణ్యఫలము.

శ్రీ వేంకటేశుని చరణదాసిని

ద్యుమణీ భవాని



# ధన్య జన్మ

1. కాలనాలికలైన కర్ణకుండలములు
   కంఠసీమను వింత కాంతులీన
   వైభవోన్నతమైన వజ్రకోటీరమ్ము
   మేఘమండలమందు మెరుపుగాగ

   చీకటి ముద్దపై చిగురు కస్తురి రేఖ
   కారుచీకటిలోన కాంతి గాగ
   జయవిజయుల బోలు శంఖచక్రమ్ములు
   కారుణ్యలోకాల కాపుగాయ

   అన్నమాచార్యపదములే అన్నములుగ
   భక్తజనపాళి చూపులే వస్త్రములుగ
   తిరుపతిని నిండుకొలువున్న తీర్థమూర్తి
   ఏడుకొండలవాడు మిమ్మేలు గాక!

2. కొడుకు శతావధానఖని, కూతురు కావ్యరసైక దీక్షతో
   బడిబడిగాగ కూర్చుకొని ఓపికతో తమ గ్రంథరాజముల్
   నుడినుడి పొల్లుపోక సుమనోహర రీతుల నచ్చువైచె; నొ
   క్కడవ యదృష్టవంతుడవు, కాంచితి సంతతి రత్నసంతతిన్

3. వేంకటగిరి మాహాత్మ్యము
   సంకట హరణమ్ము భువిని స్వర్గద్వారం
   అంకితముగ రచియింపగ
   నింకునె పుణ్యాబ్ధి మీకు నేజన్మమునన్

4. శివ కేశవ శతకమ్ములు
   వ్యవధానము లేక భక్తి వ్రాయుట చేతన్
   భవసర్పమ్ములు మీకిక
   నవభూషలు, శయ్యలౌను నయభయములతో

డా॥ గరికిపాటి నరసింహారావు
మహాసహస్రావధాని

# విషయసూచిక

పేజీ సంఖ్య

## ప్రథమాధ్యాయము



## ద్వితీయాధ్యాయము

## తృతీయాధ్యాయము



## చతుర్థాధ్యాయము



## పంచమాధ్యాయము

## షష్ఠాధ్యాయము



## సప్తమాధ్యాయము

## అష్టమాధ్యాయము



## ఓం శ్రీ వేంకటేశాయ నమః

౧. శ్రీపతి పాదపద్మములు, చేరిన భక్తుల కండదండలై
పాపపుంజీకటుల్దరుమ భాస్కర బింబము లర్థి లోకమున్
బాపి భయంబు,- కోర్కులిడి పాలన చేసెడి కల్పకంబులు
ద్దీపిత తేజ పుంజములు దివ్యము లాత్మను బట్టి కొల్చెదన్.

౨. తే॥ అంతకును నాది కారణంబైనవాని
వేలుపులకును వేలుపై వెలయువాని
నాది మధ్యాంతములు లేక యలరు వాని
హరిని దత్ప్రియ లక్ష్మిని నంజలింతు॥

౩. తే॥ తనువు లేకంబుగా నాది దంపతులయి
తల్లిదండ్రులుగా జగాల్దయను బ్రోచు
పార్వతీ పరమేశుల భావమునను
హత్తు బత్తిని సతతంబు నర్థిఁగొల్తు.

౪. తే॥ విద్దెలకునెల్ల మొదలింటి వేల్పులైన
పలుకువెలందిని బమ్మను బత్తిఁగొలుతు
విద్దెబుద్దులు సౌఖ్యము ల్వితతముగను
గరుణ మాకిచ్చి బ్రోవఁగాఁగలరటంచు.

౧. తే॥ విఘ్ననాధుని నేవేళ వేడికొలుతుఁ
గడక నిచ్చలు మాపూనుకార్యములను
విఘ్నములు సేరనీక నిర్విఘ్నముగను
జేసి మమ్మేలఁగల్గు జేజే యటంచు.

౨. కం॥ శ్రీశుని శేషధరాధర
వాసుని సతతమ్ముఁ జిత్తపథమున మెలగన్
దోసంబులు తొలఁగించి వి,
కాసంబును, శాంతి, నొసఁగఁగడఁగితలంతున్

౩. కం॥ కొలుతును భక్తిని యుక్తిని
నలివేల్మంగ న్మదంబ, ననవరతంబున్
దలఁగని జాలినిగని వ
త్సలతనుమము విడక ప్రోచి తనరెడిననుచున్.

౪. కం॥ అలిమేల్మంగా సతితో
మొలకెత్తిన జాలిచూపు పొలుచు కనులతో
నిలువేలుపు వేంకటపతి
మెలపున వే వచ్చి, ప్రోచి, మేలిడు మనకున్.

౫. ఆ॥ మమ్ముగన్నతల్లి మాయలమేల్మంగ
కన్నతండ్రి వడ్డికాసులయ్య
చెట్టపట్టి వచ్చి చేదుక మముఁబ్రోవఁ
గలరు దర్శనమ్ము గరుణ నిచ్చి॥



## నైమిశారణ్యము - మునుల జన్నము

## సూతాగమనము - కథాకథనము.

## ప్రథమాధ్యాయము.

ఆది నైమిశారణ్యము. కడుంగడు సుందరము. అది యెల్లఋతువుల నెల్లవేళల నొక్కరీతిని పుష్పఫలభరితమై కనుల పండువొనర్చుచు, నొడలికి నెడఁదకు నానంద మొనగూర్చు చుండును. ఎల్ల విధముల ననుకూలమై యొప్పుదాని యొప్పు కనుంగొని శౌనకాది మహామునులటకుం జేరి దీర్ఘ సత్రయాగముం జేయఁ దొరకొనిరి. దినములు వారములు నెలలు కడచిపోవుచుండెను. అటంగల మునులును జన్నమును జూచు వేడుక రోమహర్షణకుమారుండు, మునితల్లజుండు, సూతభగవానుఁడచటి కేతెంచెను. వచ్చిన ఋషివరుని సంపూజించి మునులా తపోనిధానునిచే నెన్నెన్నియో పురాణేతిహాసంబులు వినుచు నొక్కదినమున నిట్లడిగిరి.

నాలుగు వేదంబుల కడలుగాంచిన, ధర్మంబుల నెల్ల నెఱింగిన యోకృపానిధానా! సూతభగవానుడా ! విష్ణుక్షేత్రంబులందెల్ల శ్రేష్ఠమై, స్వయంవ్యక్తమై, భగవానుండగు విష్ణుదేవున కతి ప్రేమపాత్రమై, యెల్లసిద్ధుల నొడఁగూర్చునదై, బత్తిహత్తినియెడందలతో నట నివసించు వారికెల్లఁ గనులవిందుగ నాగోవిందుని దరిసెనముంగలిగించునదై యొప్పు దివ్యక్షేత్రము నొక్కటిని వీనులవిందగు దానికతలను మాకెల్లరకు వినిపింపం గోరెదము. అయ్యది వినిన పిమ్మట మఱి వినుటకేమియు నుండదు కదా.

వారల పలుకుల నాలించిన యా సూతముని వరుండొకింత తడవు తలంపున నుండి, తపోధనులును, ధ్యానమగ్నులును, సమాధి స్థితులునునగు నామునివరులంగాంచి యిట్లనియె. ఓహో మునివరులారా! అపూర్వమైన యానందజనకమగు నంశమునడిగినారు. దానిని మీకు వినిపింప నాకును మనస్సువ్విళ్లూరుచున్నది. దత్తచిత్తులుకండు, సావధానులై యాలకింపుడు. భగవంతుడగు శ్రీహరి యొక్క పలువిధములగు వినోద క్రీడలతోఁ గూడి చెన్నొందు శేషాచలము, దానినంటి యొప్పు వరాహకల్ప వృత్తాంతముంజెప్పెద. అది పలువిధములగు వినోదరసములఁ బరిప్లావితమై సర్వసిద్ధిదమును సర్వైశ్వర్యకరమునై యొప్పును; సర్వమంగళకరమును, బవిత్రమునై యాయుష్యముం గలిగించును. అట్లని నేను వేరుగఁ జెప్పుట యెందులకు.

పూర్వకాలంబున సంద్రంబు లేడును నొక్కటై, మున్నీరు పెన్నీరయ్యెను. అందున భూమి మునిగి యుండెను. వేలకొలఁదిగ యుగములా భూమియట్లేజలతలమున నణఁగిమణఁగి యుండెను. అత్తరి, గల్పాదిని విష్ణుభగవానుఁడు వటపత్రశాయియై,

యద్భుతమ్ముగ నానీటిమీదఁ దేలియాడుచుండెను. సర్వశక్తిసంపన్నుండగు నాభగవానుండు నారాయణుఁడాలోచించి, ఆలోచించి తొల్లిటియట్ల జగత్తునంతను మఱల సృష్టియొనరింపను, నెప్పటియట్లమనుపను సంకల్పించెను. సర్వమునకును ధాతయు, సర్వశ్రేష్ఠుండును, సర్వాత్ముండును, సర్వజగత్స్వరూపుండును, సర్వేశ్వరుండునగు నా మహాత్ముఁడు తరుణాంబుజాక్షుఁడు, దామోదరుఁడు, సంకల్పముతోనన యెల్లవిధముల సృష్టినొనర్ప జతనము పొనరించెను.

ఇట్లనుచున్న మహాత్ముని ముని సంఘసేవ్యుని సూతుని విని మునులెల్లరప్పుడు విస్మయానందముల విరిసిన మనఃపద్మములు కలవారై, వేదవిదుండును, శ్రేష్ఠుండును, మునిగణ సంసేవ్యుండును నగు నాసూతమునితో నిట్లనిరి. కడచిన కడచుచున్న కాఁగల యెల్లవానిఁగూర్చిన మేటి యెరుకచే విరిసిన యెడందమ్మిచే నొప్పునోరౌమహర్షణీ! పిమ్మట నారమాపతి భగవానుఁడేమి యొనర్చెనోగదా! ప్రళయమననేమి? అదియెప్పుడు ఎట్లయ్యెను? అంతజల మెచ్చటినుండి వచ్చెను? అప్పుడీ భూమి యేమాయెను? ఎచ్చటకుంబోయెను? ఉన్నతోన్నతములగు గిరులేమైపోయెను? ఓ భగవంతుఁడా! యంతయు వివరించి చెప్పుమా, మాకెంతయు వినఁగోరికయగుచున్నది. ఇట్లడుగుచున్న యా మునిపుంగవులంగని సూతముని వరుండిట్లని పలుకసాగెను.

## జల ప్రళయ వృత్తాంతము

ఓ మునివరులారా! సంగ్రహముగ నాచెప్పు జలాగమన వృత్తాంతము నాలకింపుఁడు. ఇది యెంతయు వింతయగు వృత్తాంతము. మన మానవులకు నాలుగు యుగములు కలవుగదా! అందునకలియుగము (4,32,000) నాలుగు లక్షల ముప్పది రెండువేల సంవత్సరములు ప్రమాణముకలది. దానికి రెట్టింపు అన (8,64,000) ఎనిమిది లక్షల అరువది నాలుగువేల వత్సరముల ప్రమాణము కలది ద్వాపరయుగము. అట్లే ఆ కలియుగమువకు మూడురెట్లు అన (12,96,000) పన్నెండ్రు లక్షల తొంబది ఆరువేల వత్సరములు ప్రమాణము కలది త్రేతాయుగము. ఇక కృతయుగమన్ననో యా కలియుగమునకు నాలుగు రెట్లు అన (17,28,000) పదునేడు లక్షల ఇరువది ఎనిమిదివేల వత్సరములు ప్రమాణము కలది. ఇట్లు ఈ కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు నాలుగును కలిపి యొక మహా యుగమునాఁబడును. ఇట్టివి వేయి మహాయుగములు బ్రహ్మకు నొకపవలగును. అట్లేమఱియు వేయిమహాయుగములు రాతిరి కాగలదు. బ్రహ్మతవ పగలున మేలుకొని కార్యతత్పరుడై సృష్టికార్యములను గొనసాగించును. పగలు కడచవివంత నాతడు తనరేయిని నిదురకుంబోవును. దినాంతమై రేయి కాబోవువాకాలముననే మహా ప్రళయముకాగలదు.

ఆ నలువకుఁ బలవంతమగు సమయమునకు, భగవంతుండును, త్రిమూర్త్యాత్మకుండును నగు నాసూర్యదేవుఁడు రుద్రమూర్తియై తన వేయి కిరణములతో వెలుగుచూ మహాఘోరమగు నగ్నిని గురియుచు నెండట నిండుగఁగాయును. ఇట్లు యెడతెగని యగ్నుల జిమ్మునెండలతో నెన్నియో వత్సరములఁ దనుక వానచినుకనునదియే లేకయుండును. అప్పుడు భూలోకవాసులగు, తపోధనులు, యోగధనులు మునివరులు నెల్లరు జన లోకమునకుంబోయి చేరినవారై బ్రహ్మకు రాతిరియగు నాకాలమంతయు నటనే వెళ్లఁబుత్తురు. అప్పుడా కాలాగ్నిచే భూమియందలి అడవులు, పర్వతములు నన్నియు దగ్ధములైపోవును. ఇట్లంతయు బూడిదయు బుగ్గియుఁ కాగా సర్వాత్మకమగు మహావాయువనేక సంవత్సరముల దనుక యెడతెగక వీచుచునేయుండును. అటుపిమ్మట మహాకాయములును, మహా బలవంతములుననగు మేఘములు అంతట నలుముకొని, జలములతో బరువెక్కి మూసలధారలుగా యేండ్లకొలదిగ నిటరాత్రిం దినములు కురియుచునే యుండును. ఇట్లా స్వయంభువునకుం దివసావసానమున ఘోరమగు జలప్రళయము జరిగిపోయెను. దాన భూమియెంతయు మునిగి యధఃగామిని కాగా సప్తసముద్రము లొండొంటిం గలిసి యేకమై యొకేయొక మహావారాసియయ్యెను. ఇట్టులుకాలము కడచికడచి వేల్పులపెద్దకు నాలుగువేల యుగముల పరిమాణము గల యారేయియుం గడిచిపోయెను. రేయి కడచని పవలు కానుండెను. అత్తరి మున్నీటిపై మఱ్ఱియాకున వేడుకగా పసిపాపఁడట్టులు పరుండి వినోదించుచున్న యా విష్ణుదేవుఁడు, సృష్టిస్థితి సంహారకారకుండగు నాగోవిందుఁడు జలమధ్యముననుండి, భూమినుద్ధరించుపనికి, గిరీశ, వాగీశులకుంగూడ అలవికానిదానికిఁ బూనుకొనెను. దానికై అప్పుడే మంగళంబునూ, సర్వ యజ్ఞమయంబుననగు శ్వేత వరాహరూపమును బూనెను. పిమ్మట మహా రౌద్రమూర్తియై యప్పుడ మహాజలమధ్యంబునఁ బ్రవేశించి చలంబున బలంబున నల్లకల్లోలంబొనర్చి, పాతాళ రసాతలముల వరకుంబోయి పోయి యంతట వెదకి వెదకి భూమిం గనుంగొనెను.

అటఁబాతాళంబున ఘోర రాక్షసుఁడు హిరణ్యాక్షుఁడనువాఁడు మహాకాయుఁడు ఆ దేవదేవునకెదురయ్యెను. అంతట వారి కట నభూతపూర్వంబగు, ఘోరంబగు మల్లయుద్ధము తుములమై బాహాబాహి ముష్టాముష్టిం ప్రవర్తిల్లెను. అంత మిక్కిలి కోపోద్దీప్తుడై మహా వరాహమూర్తి తన దంష్ట్రాగ్రంబున హిరణ్యాక్షు ఘోర రాక్షసుఁజీల్చిచెండాడెను. ఆ శ్వేత వరాహమూర్తియు నెల్లప్రత్నములకు సమాశ్రయమైన, పాతాళగామియైన ఆభూమిని తన దంష్ట్రాగ్రమున యెత్తిపట్టి తొందరగ ఆ జలంబులెల్ల విక్షుబ్ధములగుచుండ శేషనాగుని పడగలపై బాదముంచి లేచి పర్వతమట్లు నిలిచి యుండెను. ఆ దివ్యమూర్తిని కనుగొన్న బ్రహ్మాది దేవతలును, మునులును సిద్ధులును

బరమర్షులును, వేదమంత్రంబుల శ్రేష్ఠమ్ములగు స్తోత్రముల నాయాదిదేవుని వినుతింపసాగిరి.

హే దేవా! మహాపోత్రీ నీకుజయము. హిరణ్యాక్ష మహారాక్షస విదారణవిచక్షణా, అచ్యుతా! జయము జయము. నీవు ఆది మధ్యాంతములు లేనివాడవు. నీకంటె వేరొకడు ఘనుడులేడు. సృష్టినొనరించుతరి నీవు బ్రహ్మవై అంతయు సృష్టించుచుందువు. ఈ జగత్తునంతను నీవ విష్ణుదేవుడవై కాపాడుచుందువు. కల్పాంతమున కాలాగ్నివై రుద్రరూపంబున అంతను సంహారమొనరించుచుందువు. నీవదేవదేవుండవు, సర్వాంతర్యామివి, భగవంతుండవు, సర్వకర్తవు. నీ పరబ్రహ్మస్వరూపంబును దేవతలమగు మేమును యెరుంగజాలము. ఓకేశవా! అనంతా! ఆదిదేవా! యెల్లప్రాణుల నివాసార్ధము భూమిని నుద్ధరింపుము. దీని నెప్పటియెట్లయుంపుము, అనుగ్రహింపుము, అని దేవాదులు అనేక ప్రార్ధనలు జరిపిరి.

అటు పిమ్మట డెందమ్ములఁబొందించి తన్నాలకించుచున్న యాశౌనకాది మహామునులతో యా సూతుండిట్లని చెప్పదొడంగెను. ఓ మునితల్లజాలారా! సర్వయజ్ఞమయుండగు శ్రీహరి యాభూమిని యెప్పటియెట్ల నెలవుకొలిపి యేడు సముద్రములను, నేడు పర్వతములను, నేడు ద్వీపములనుగా విభజించి పరమేష్ఠిని బిలిచి యెప్పటి యెట్ల జగత్తునంతను మరల సృష్టినొనర్పుమా యనిపలికెను. దేవదేవుని యనుమతింగొన్న యాతమ్మిచూలియు, గ్రహతారకల చలనము లెప్పటియట్ల సాగగఁజూచి మాతన సృష్టికిల దొరకొనెను.

ఆ పరమేష్టి ఆనంతునిఆన సృష్టి వికాసమును, మానవ వికాసమును, నెంతయుఁగావించెను. నదీనదములు, వనపర్వతములు, పల్లెలు, పత్తనములు, అన్నియు అందముగ విలసిల్లెను. జలచరములు, భూచరములు, పిపీలికాది బ్రహ్మ పర్యంతము, సృష్టియంతయు నెంతయు సర్వాంగసుందరముగ నొనరించెను.

## వైకుంఠంబుననుండి భగవంతుని క్రీడాచలము భూమికి గొనివచ్చుట

అంతట శ్వేత వరాహరూపమును దాల్చియున్న యాలోకనాయకుఁడు రమాధవుండు లోకమునను గ్రహించు కోరిక కలవాడయి, ఈభూమి యందతాను నెలకొనఁదలంపు కలవాఁడాయెను. దానికై యాగోవిందుండును మనంబున దివ్యస్థలంబును నిశ్చయించి గరుడునిం బంపి యద్భుతమగు గిరివరముం దెప్పింపం బూనెను. అటుఁజూచి "మహాసత్వ సంపన్నుండవగు నోవైనతేయా! వేగముగఁబోయిన వాఁడవై వైకుంఠధామమందలి

క్రీడాచలము నిటకుం గొనిరమ్ము. దానితో బాటుగ విష్వక్సేనాదులతో నెల్ల పారిషదులను గొనిరమ్ము" అనియెను. అదివిన్న యాగరుడుండు నప్పుడయాకసంబున కెగిరిపోయెను.

నగరాజంబగు నా క్రీడాచలముందేర నట్లా నాగాంతకుండేగిన పిదప నాశ్రీహరి వరాహ రూపంబున నెప్పటియట్ల తాఁగుదురుపఱచిన యాభూమిపై నడుగులిడికొనుచు నడిచినడిచి గోమతీనదీ తీరభూమికి వచ్చెను. దానికిం దక్షిణముగ నరువది యోజనముల దూరమున తూరుపు నీరధికిం బడమరదెస నైదుయోజనముల దవ్వున రుక్మానది (స్వర్ణముఖి) కుత్తరమునఁ బుణ్యాత్ములగు జనులచేనిండిన పవిత్రమగు తలమునకుంబోయి యట వినతాకుమారు రాకకై యెదురుచూడసాగెను. ఆఖగపతియు వియత్పథంబున పోయి పరంధాముని పురవరంబును జేరెను. పుణ్యనిలయమును, బురుషోత్తముని క్రీడాచలమును గనుగొనెను. అయ్యది యప్రాకృతము నమేయమునై యెల్ల రతనములకు, నిలయమై, యుపనిషత్పంచక స్వరూపమై స్వర్ణమణిమయములగు నున్నత శిఖరమ్ములతో, నాగపున్నాగ చంపకాశోక తాలహింతాల కల్పకానేక వృక్షసంశోభితంబును, శుకపిక శారికా మయూర కలహంస కపోతాదిపక్షికుల సంభ్రమంబును నైయొప్పుకులుకు. అద్ది సురభిళ మల్లికా మాలతీ సంధ్యావర్తాది లతాలంకృతంబును, భ్రమరగీతా మనోహరంబును, కమ్మతావుల గుమ్మరించు రంగురంగుల, నందాల గిలకరించు పూలజల్లులకిల్లును నగు సింహశార్దూల తుంగమాతంగ కురంగ

కారండవ వానర వరాహాది జంతుసంతాన సంకులంబునయి, తీయతీయని పాటల నుల్లములఁబల్లవింపంజేయు కిన్నరీ కిన్నర జనానేక రమ్యంబును కలకలధ్వనులఁ గులుకునుఱుకులఁబారుచు డెందంబుల కానందంబుఁ గూరుచు తేటనీటి సెలయేళ్ల వెల్లువలచేఁ బుష్కరిణ్యాది ద్వివ్య తీర్థంబులచే నుల్లసితంబును, బలుతెఱంగుల ముక్తజనంబులచేఁ గోరికలు తీర సేవింపఁబడునదియు నాదిదేవుండగు నాపుండరీకాక్షుని లీలావిహారమ్ములనొప్పు నారాయణగిరి నాఁబడు నాక్రీడాద్రి (ముప్పది యోజనమ్ముల పొడవును, మూఁడు యోజనమ్ముల వెడల్పునుగలదై) యాదిశేషువునుంబోలు నాకారముకలదియై యెల్లదేహధారుల భవమునెల్ల శోషింపంజేయుచు మోక్షదాయకమైయొప్పును. అట్టి దివ్యాకారముంగల శైలరాజముంగని యావైనతేయుండు దానిభుజంబుల నిడికొని, పొంగుబంగరుకాంతుల వెలుంగుచు, భగవత్పరివారము నెల్లరంగూడ కొండమూపున నిడికొనిమహావేగంబున నెగిరివచ్చెను. ఆ వేగంబున నాకశంబున మహావాయువు నిండివీచెను. విష్ణువాహనమగు తార్క్ష్యుడు తేజోరూపంబున ఱెక్కలల్లలాడించుచు భూమికిం దిగుచుండ కోటిసూర్యప్రభలు వెలుగొందెను. మహావేగంబున నపారతేజంబున దిగివచ్చి నాగరుటామంతునిగని లోకేశ్వరుండు శ్రీహరి వానితో నాకొండనట నుంపుమని చూపిపలికెను. అంతట నావిష్ణురథుండును, దాని

నా ప్రభునానతి నటనే స్థాపించెను. అటుపిమ్మట నాశ్వేతవరాహమూర్తి యాపుణ్యా గిరినెక్కి స్వామిపుష్కరిణీ తీరంబున పుణ్యాకాననమునఁ గోటిసూర్య ప్రభల వెలుగొందు పవిత్ర దివ్యవిమానంబున నవరత్న ఖచితగోపు రంబుల శోభించు దానియందు రత్నస్తంభ సమేతమగు, నయనానందదాయకమై పలుకనేని శక్యముకాని మహామణి మంటపంబు నధిరోహించెను. అపరాత్పరుఁడు, దేవదేవుఁడు, శ్రీనివాసుఁడు పద్మాక్షుఁడు, శంఖచక్ర గదాధారి యామధ్యే విమానంబున నెంతేనియు విరాజిల్లెను.

## దేవాదికృత శ్వేత వరాహప్రార్థన

అంత నచ్చటకు దేవతలెల్లరును, గంధర్వ యక్షరాక్షసులును, సిద్ధసాధ్యులును, సప్తర్షులాదిగా నెల్లమునులును, తుష్టులును, సురజ్యేష్ఠుండగు బ్రహ్మదేవుండును, బార్వతీ ప్రియుండగు శంకరభగవానుండును, నింద్రాది లోకపాలురును నాయాదిదేవు గేశవు, వాసుదేవు, హృషీకేశుంగొలువ వచ్చి యిట్లుగా సన్నుతులును నొనరింపసాగిరి.

లోకనాయకా లక్ష్మీ మనోనాయకా! నీకు జయమగుగాక. భూమిధరునకు, విష్ణునకు నీకు జయము, జయము. త్రిమూర్త్యాత్మునకు నీకు విజయము. పెనుకోరల వెఱపుంగొలుపు మొగముతో, బొమముడితో నెఱ్ఱగజాచు చూపులతో మిక్కిలి నుగ్రంబగునీరూపము చూపరులకెంతయు, భయముంగొల్పునదైయున్నది. మిణుగురులంజిమ్ము శస్త్రమ్ములతో నొప్పుననేకానేక భుజమ్ములిరువైపుల వెలయు నీరూపముంగవి నంతన మునులును, దేవతలును వెఱపుంగదురు చిత్తములతో వగపున మునుగుచున్నారు. లోకులనెల్ల ననుగ్రహింపనే యిచ్చట నీపర్వతంబున నెలకొనవలసినదిగ వేడుకొనుమమ్మనుగ్రహించి నీవిట వెలసితివి. కాని నీరూపమిది కడుంగడు నద్భుతమును భయంకరమునై యున్నది. దీనింగన్నంత ధీరులగు మానవులును వెఱపుగదురఁ గలత నందివ డెందంబులఁగుందెదరు. నీవన్నో యీభూమిని దేవతలయు మనుజులయు మనికికినైయే నీటి యడుంగుననుండి పైకెత్తి పట్టితివి; మమ్ముల నెల్లననుగ్రహింపనే యిట నిరవుకొంటివి. కావున నోదేవదేవ! దేవమానవుల రక్షణ కొఱకు నెల్లరశ్రేయంబును మదినెంచి, సౌమ్యరూపముందాల్పుము. హేప్రభో! ధ్యాన యోగమునందు శక్తులును, గర్మాచరణము నందు సమర్థులునునగు మనుజులకును, ధర్మాను వర్తులగు భక్తులకును వరదుడవై మనోహర రూపమున దర్శనమిమ్ము. దానికై యోదేవదేవా! నీవిచ్చటనే యెల్లవేళల నివసింపుము. అని వారందఱుఁ బలుతెఱంగుల వేడుకొనుచుండ వారివేడికోలుల కాదేవుండు మిగులఁబ్రసన్నాత్ముఁడాయెను. అప్పుడె చతుర్భుజుండును, బుండరీకాక్షుండును నైభూదేవీ సహితుండై సౌమ్యరూపమున నచటనిలిచెను. శరత్కాలేందు సుందరవదనుండును సర్వాభరణభూషిత భాసురాంగుండునునగు నాశ్రీనివాసుఁడు

సురమునివరుల నెల్లరంజేరఁ బిలిచి యల్లనవారలతో నిట్లనెను.

ఓ సురమునివరులారా! వేంకటాద్రియనవొప్పు నీనగరాజము వైకుంఠమునకన్న మిన్న. భూదేవితో నేనిచ్చట నివసింపంగలవాఁడను. హృదయములు పవిత్రములుగ భక్త్యుక్తులై ప్రార్థించిన మానవులకెల్లఁ గోరికలు దీర్చి తనియింపంజేయుదును అని బ్రహ్మేంద్రాది విబుధవరులకు ఋషిమునులకు నెల్లరకుంజెప్పి, వారి వారికిందగునట్లుగ నాజ్ఞలనిచ్చి యా హృషీకేశుండు గోవిందుండంతట నచ్చటనే యంతర్ధానుండాయెను. వేల్పులెల్లరును, మునులందఱును నంత దమతమ యిరవులకుం దఱలిపోయిరి.

అది యాలించిన శౌనకాది మునివరులు సూతమునితల్లజుంగని యిట్లని యడుగసాగిరి. ఓతపోధనా! ఇంతకు మున్ను ప్రసంగవసంబున నామలవిమల తలమ్మున గల ఆస్వామి పుష్కరిణి యెట్టిది ? ఆశైలరాజమ్మున నాపుష్కరిణీ మహాత్మ్యంబెట్టిది? అది యంతయుఁదేటతెల్లంబుగ వివరింపఁ గోరెదము అన సూతమునివరుండు వారికిట్లని పలుకందొడంగెను.

## స్వామి పుష్కరిణీ మాహాత్మ్యము

ఓ తపోధనులారా! మీరడుగునదెంతయు మేలు. దానికై నేఁజెప్పఁబోవుదాని నించుక మనసుంచి యాలకింపుడు. పవిత్రమును బుణ్యప్రదమునగు నావేంకట నగోత్తమమునందు నెన్నెన్నియో పావన పుణ్యతీర్థంబులలరారుచున్నవి. దానియొద్దులు పరిసరములు నానాపాదపమండితములు, నత్యంత మనోహరములు. వాని యన్నింటిఁగాదని దేవుండు స్వామిపుష్కరిణీ తీరముననే యేలనెలకొనియెనని కాదా మీసందియము. ఆలింపుడు.

తొల్లి సరస్వతీదేవి తీర్థంబులం దెల్ల నుత్కృష్టమైయొప్ప వలయునను కోరికనంది బ్రహ్మవర్తమున సరస్వతియను పేర నదిగాఁబ్రవహింపసాగెను. అత్తరిఁ బులస్త్య భగవానుఁడానదీ తీరమున తపంబొనరింపంబోయెను. వచ్చిన యా పులస్త్యునెడఁ బుత్రభావమును బూనిన సరస్వతి వాని కంతగ సేవాసత్కారమ్ముల నందింపకపోయెను.

దానికింగినిసిన యాముని తల్లజుండిట్లనియెను. ఓ సరస్వతీ! నదీమతల్లివి కాగోరివచ్చిన నీకోరిక నన్ను నాదరించుటంజేసి వమ్మగుంగావుత, గుణములచే నీకు సాటియైన దయ్యును, విష్ణుపాదోద్భవ యగుట నతిపావనియై ప్రభావముంబొందిన దివిజగంగ నేలకుందిగివచ్చి పవిత్రగంగయన నీకుమించినపేరంది, తీర్థంబులందెల్లఁ బావనియై యొసఁగఁగలదనెను. అట్లు తనకకారణమ్ముగఁ దపోగర్వమ్మున నొడలు మఱచి శాపంబొసంగిన యాముని కలిగి యానదీమతల్లియు నిట్లనియెను. ఓయీ!

యకారణకోపీ! నాయందలి మాతృభావమునైనఁ దలంపవైతివే. తన కోపమతన శత్రువనుమడి నిక్కము. కోపముంబొందిన వివేకమెల్ల నశించునుగదా. కానిమ్ము; దానికింఫలము నీవందఁదగినదియ. రక్కసునట్ల వర్తించితివి కావున నీవంశంబున విష్ణుద్వేషులు, రాక్షసులు జన్మింతురు, పొమ్ము అనియెను. దానికామునియుఁ దనతొందరపాటు నెఱింగి, యెంతయుఁ బరితాపమునొందఁగని యాయమ్మ కరుణించి మఱల నిట్లనియెను. నాయనా! చింతింపకుము. నేనును తొందరపడిన దాననైతిని. చెయిజారిపోయిన పిమ్మట చేయునదేమున్నది. కాని నాదొక్కమాట. కలతనొందకుము. కడపటి కుమారుఁడుగా విభీషణనామకుడు భగవద్భక్తుఁడు సద్వైష్ణవుఁడు దయింపంగలఁడు; కల్పాంతము దనుక చిరంజీవియై యశము నందంగలండు. అనియనుగ్రహించెను. మునియును దృప్తినొందెను. దేవియుఁ బరదైవతముంగూర్చి తపంబొనరింపసాగెను. పెక్కులు వత్సరములు కడచిపోయెను. దానికి మిగుల సంతసమంది దేవదేవుండా యమకుఁ బ్రత్యక్షంబై నీకోరికయేమన నాయమయు ఓదేవా! బ్రాహ్మణవరుచే నావాంఛితము విఫలమైనది. ఉత్తమోత్తమ తీర్థంబుగానుండు భాగ్యము నాకుంగలిగింప వేయుని కోరెను. అంత నాదేవుండామె ననుగ్రహించి యిట్లనియెను. ఓసరస్వతీ! వంతనందకుము. ఆముని విన్నునిట నిలను మేటి నదివికాకుండనే శపించెను. కాని వేరుకాదు. నీవట వైకుంఠమున మాకుఁగ్రీడాసరోవరముగ వెలుగొందుదువు.

ఆపిమ్మటఁ దరితోడనె నిటకు భూమికి శేషగిరికింబొమ్ము. నేనును నటనివసింపంగోరి వచ్చుచుంటిని. ఆభూధరమున దక్షిణభాగమున నున్నతశిఖరమున స్వామిపుష్కరిణి యనుపేర ముఖమున నెలవుకొనియుండుము. ముల్లోకముల మూడున్నరకోట్లు పుణ్యతీర్థంబులు కలవు. అవియుం, దమ్మునమ్మి మున్గినవారి పాపమ్ము లెల్లంగ్రహించి వారింబావనుల నొనరించి తమ్ముఁజేరిన పాపములనుండి విముక్తింబొందింప నన్నుంగోరుచున్నవి. ఓశుభాంగీ! అట వేంకటగిరిని వెలసిన నీయందలిస్నానముచే వానికెల్లం, బాపవిముక్తి కలుగననుగ్రహించుచున్నాను. ధనుర్మాసంబున శుక్లపక్షమున ద్వాదశీతిథిని నరుణోదయవేళ నవియెల్లవచ్చి నీయందుమునుకలిడి పావనతనందును. వానిపాపమ్ములెల్లఁగడిగివేయఁబడును. ఆవేళను నీయందు స్నానమొనర్చిన నరుడును ముక్తినవశ్యము నొందును. అట నా యునికిని, నా దర్శనస్పర్శన భాగ్యముల నీవు నిత్యపావనివై యేపాపములంటక యలరారెదవు. నేనును నట నీతీర ప్రాంతముననే సుస్థిరముగ వాసము పొనరించికొని దివ్యవిమానమున నుందును. ఇంతియకాక ద్వాపరమ్మున వకుళమాలిక మాతృభావమ్మునవాకుం భోజ నాదులంగూర్చుచుఁ దనియించుట వెంతయు బ్రసన్నుఁడనైతిని. ఆయమయుట నాపరిసరభూమి కధిదేవతయై మాయనుగ్రహమ్మున నొప్పుచున్నయది. ఆతల్లి యవ్యాజ ప్రేమయు, పవిత్రతయు,

సేవాపుణ్యఫలమును నామెసంగతి నీకునునంటిపావనతం జేకూర్చును. అనియను గ్రహించెను. ఇట్లాదేవునను గ్రహముచే, సాన్నిధ్యముచే నాస్వామిపుష్కరిణి, తీర్థములకెల్ల స్వామియై పావనంబుల కెల్లఁ బావనతం గూర్చునదై యొప్పుచున్నయది.

స్వామి పుష్కరిణి దర్శన స్పర్శనములనే పాపముల నెల్లఁగడిగి వేయఁగల వరమపావని. వైకుంఠముననది యాపుండరీకాక్షునకుఁ గ్రీడావరస్పగముండి ముదముంగూర్చునది. శ్రీదేవీ, భూదేవులకు వేడుకంగూర్చి ప్రేమపాత్రమైనది. అదియెంతయు మనోహరమును, సుగంధితమునై, యప్రాకృతమైనది. గంగాది పవిత్రతీర్థంబులకెల్ల మూలమై, జన్మస్థానమై, శుభోదకమై యొప్పునదా వైకుంఠుని క్రీడావాపియే. కావుననేయది యటనుండి యాలోక నాయకునకుఁ గ్రీడార్థమిటకు వైనతేయునిచేఁ గొనిరాబడి యిట నెలకొల్పఁబడినది. పవిత్ర స్వచ్ఛజలంబుల నొప్పు నాస్వామి పుష్కరిణి విరజానదియుంబోలె మేర మీఱినఘోరపాపములంగూడ సర్వనాశమొనర్పఁ గలదియే. పవిత్రమానసమున తనయందు మునుకలిడినంత మాత్రమున వారికి నైహికార్థంబునెల్ల నెల్లవేళల నవిరళంబుగ నొసంగంగలదు. దర్శన స్పర్శనలచేతనే యెల్ల సిద్ధుల నొడఁగూర్చునది యన్నచో స్నానమొనర్చు వారికెల్ల యభీష్టములు చేకూర్పంగలదని యేఱుగఁ జెప్పనేల? ఆ దివ్యతీర్థమున నెవ్వరేని నొక్క పరిస్నాన మొనరించిన మాత్రముననే వేలమారులు గంగాది పవిత్రతీర్థముల స్నానమొనరించిన పున్నెము నందఁగలరు. కావుననే దాని మహాత్మ్యమిట్టిదని పలుకుటకు దేవతలును జాలరు. తత్తీర ప్రాంతముల వసించు మానవులు దేవతలకంటెను భాగ్యశాలురు. గత జన్మములనవిరళామిత సత్కార్యములొనరించిన పుణ్యాత్ములైన వారికేయట స్వామి పుష్కరిణిని మునుగు భాగ్యములభించును.

స్వామిపుష్కరిణీ తీర్థస్నానమును, నద్గురుపాదసేవయు, నేకాదశీ వ్రతాచరణంబును నీమూఁడును దుర్లభంబులు. అందు పుష్కరిణీ స్నానమత్యంత దుర్లభంబు. అట్లే మానవజన్మము దుర్లభము. అందునఁ బవిత్రజీవితము మఱియు దుర్లభము. పవిత్రమగు హృదయముతో స్వామి పుష్కరిణీ తీర్థ స్నానము దుర్లభాతి దుర్లభము. దుర్లభంబులనెల్ల దుర్లభమగు స్వామి పుష్కరిణీ మహత్తును వర్ణింప నా వేయిపడగలవాడును సమర్థుండుకాడు. నేననెంతవాడను. అట శక్తిననుసరించి తనకున్న కొలఁదిగ యధావిధిని దానధర్మము లొనరింపవలయును. సాలగ్రామములు, గోధనధాన్యాదులు, దధ్యన్నాదులు, భూగృహాదులు దానములొసంగిన వారికి బ్రహ్మలోకప్రాప్తి యగును. పితృదేవతల నుద్దేశించి శ్రాద్ధాదులొసంగవలెను. దాన పితృదేవతలును తరింతురు. ఇంతకు తాను పవిత్రమానసుడు కావలెను. భావిని మఱలనెట్టి చెడ్డవర్తనలకు, బాపములకు పూనుకొనరాదు. సూర్యోదయమాదిగ, నారుగడియల ప్రొద్దెక్కు వరకు

నాతీర్థమున వెల్ల తీర్థములు సమావేశమైయుండును. కావున నావేళను నందలి స్నానమనంత పుణ్యము నొసంగి తరింపంజేయును. స్వామి పుష్కరిణీ స్నానము మహాపాపముల నెల్లఁదొలచివేయు ననుటకు తారకాసురాంతకుడు కుమారస్వామియే నిదర్శనము. మునక మాత్రముననే తారకాసురహత్యాదోషము తొలఁగి యాతఁడు పవిత్రుఁడాయెను గదా. లోకహితార్థముకాని యెఱుఁగక కానిచేసిన పాపమునకు ననుతాపంబంది ప్రాయశ్చిత్తముం జేసికొనఁ గోరువారికిఁ బవిత్రమును బుణ్యప్రదమును కామ్యప్రదాయినియు నగు నీస్వామిపుష్కరిణీ తీర్థస్నానమే సులభోపాయము. ఎఱిఁగి యెఱింగిచేయు నికృష్టజీవుల పాపములకు నిష్కృతి యేమియునుండదు. ఎన్నటికేని తమచేసిన పాపములకుం బరితప్తులైమఱియట్టి వానిఁజేయక నిల్చువారు పవిత్రుల కాఁగలరు.

విశేషించి వేంకటాద్రి దర్శన సంప్రాప్తియే నిత్యనైమిత్తిక కర్మయుఁగాఁగలదు. 'విష్ణోః కర్మాణి పశ్యత' దేవుని కర్మల నాచరణల చూతురుగాక, యాచరింతురు గాక యనునది సనాతన శ్రుతియైయున్నది. కావున నెల్ల నైమిత్తిక కర్మల నాస్వామిపుష్కరిణీ తీర్థంబుననే చేయునది. తత్తీరంబున నంగవైకల్యాది దోషంబులు పట్టవు. ఇంద్రాది దేవతల కోర్కులు కూడ నిచ్చటనెఱవేరుట ప్రత్యక్షగోచరము. పెక్కుమాటలేల? సాంగ కర్మలఁజేయజాలని మానవులకు, స్త్రీలకుఁ బురుషులకు నెల్లజాతులవారికిఁ బాపులకు నెల్లరకు వేంకటాచలమే మోక్షదాయిని. ఇంతకు మించి వేరుగతిలేదు. లేదు. ఇదినిక్కము, నిక్కము. ఇందు సందియమే మాత్రమునులేదు. కాని పశ్చాత్తాపము పొందిమఱల నెట్టి పాపకార్యములకుం గడంగక పవిత్ర హృదయులు కావలెను.

## శ్రీ క్రీడాద్రి స్థిత శ్రీ వరాహ దేవుని దివ్య వైభవము

పరంబులును నపౌరుషేయంబులునగు వేదాదులును, నపరంబులగు స్మృతి పురాణేతిహాసాదులును నెఱింగిన, సర్వభూతహితమ్ము నెఱింగి చేయు, సర్వంజ్ఞుండవగునో మహాభాగా ! సూతముని శ్రేష్ఠా ! మేము కోరియడుగఁబోవు దీనికిఁదామక్కటికంబూని తగు రీతిని వివరించి చెప్పెదరు గాత.

వరాహావతారముందాల్చిన యాభగవానుఁడు భూమినుద్ధరించిన పిమ్మటఁగరుణాళుఁడై యెప్పటికిని నాశేషశైలరాజముననే నివసించెనా ? అటు కాక కాలాంతరముననఁగాని మఱెప్పుడు గాని మఱెందేని పోయి నివసించెనా ? అట్లు పోయి వసించిన, నట నేమేమి లీలలు వెలయించెను ? ఎవరెవరి నెట్లుద్ధరించి కరుణించెనో గదా; అని యడిగిన యా మహామునులకు నా సూతముని వరుండిట్లనియెను. ఓ ముని సత్తములారా ! మీయడిగిన యర్థంబెల్లనేవివరించి చెప్పఁగలను. మీరును సావధాన చిత్తులైయాలింపుడు.

ఆది నారాయణుఁడు శ్వేత వరాహరూపమున భూమి నుద్ధరించి యెప్పటి యట్ల యిరవొందఁజేసినయపుడే తాను గరుడు నియోగించి పనిచే, తన క్రీడాద్రివి వైకుంఠంబునందుండి యటకుందెప్పించెను. లీలారస సముద్రుండగు నా ప్రభువు రమాదేవి తోడుగ నటఁగొండనెత్తమ్ముల నదీ తీరమ్ముల నిర్ఝర ప్రాంతములఁగొన్ని సమయంబుల నదృశ్యంబుగ గొన్ని కాలంబులఁ బ్రకాశంబుగ ప్రత్యక్షంబుగ విహా విహారంబులం జరుపుచునుండెను. కల్పాది నుండియు నంతముదనుక యిట్లా త్రివిక్రముడట క్రీడానగంబున విరాజిల్లంగలండని యా పరమేష్టియ వచించెను. అట్లుండిన యేదేవాది దేవుఁడప్పుడు పుణ్యమూర్తులకు దర్శనంబులనిచ్చు చుండువాడు. ఇత్తెఱంగున నాయచ్యుతుండు కల్ప కల్పంబున ధరాతలంబును శ్వేత వరాహ రూపమున నుద్ధరించి సుస్థిరంబు సేయుచుండు, కావున నాయాకాలములు శ్వేత వరాహ కల్పంబులను పేర నొప్పుచుండును.

ఎపుడెపుడు సాధు సజ్జనులకు బాధయు, ధర్మమునకు నాశమును గలుగునో; యెప్పుడు దుష్టులు నధర్మవర్తనులుఁబ్రబలులై యధర్మము బలవంతమగునో యపుడపుడెల్ల నచ్చటచ్చట నాకా నుగుణముగ, దేశ పాత్రానుసారముగఁదనకుఁదానై మానవుఁడుగనో, వేలుపుగనో, మతేరూపుననో పొడ చూపి యాది మహావిష్ణువు చెడుగులనెల్ల నాశమొనర్చుచుండును. అధర్మమునంత నణఁచి, ధర్మమునుద్ధరించును. దుష్టులను దండించి నాశమొనరించి, సాధుజనులను, వేదధర్మములను బోషించును. అందందుఁ దనకుఁదాన యెల్ల ప్రాణుల హితమును గోరి ప్రత్యక్ష రూపమున వెలసి నివసించుచుండును. ఇంకను నాపరంధాముఁడెల్ల వేళల దర్శనంబిచ్చి జనములఁబ్రోవగా జగములతల్లి రమామతల్లింగూడి యా శేషశైల రాజమున విహరించుచుండును. నిత్య ముక్తులతోఁ గామరూపులగు దేవవరులతో కూడిన వాడై ఎల్లప్పుడు వైకుంఠమను పేరనొప్పు నానగరాజమందు విహరించుచుఁగాపురంబుండును. నిజము భక్తజనులకా వైకుంఠాచలము స్వర్గమునకంటెను, సూర్యలోకమునకంటెను, దమతమ ఇండ్లు వాకిండ్లకంటెను, బ్రియతమమై యొప్పు. ఆ పర్వత రాజమా భగవంతునకును పుణ్య పవిత్ర కాననములతో హృదయమును జూఱగొన్నదై యొప్పియుండును.

అందుఁజేరి దానింభక్తి గొలిచిన వారి కందు మంత్రసిద్ధియు తపస్సిద్ధియు యజ్ఞసిద్ధియు కలుగగలదు. ఇది యది యననేలఁగోరిన మంచి కోరికలెల్ల సిద్ధింగాంచగలవు. అందు జేరిన భక్తజనుల, సజ్జనుల సత్కర్మంబులకు వేనికిని నెన్నటికివి ఏమాత్రమును విఘ్నములు పొరయఁజాలవు. ఆ గిరివరమునందొనర్చిన యే సత్కర్మగాని, తపస్సు గాని యల్పమైనను ఘనముగ సిద్ధించి యొప్పగు ఫలమును జేకూర్ప గలదు. ఎల్ల పుణ్య తీర్థంబులును, నెల్ల పుణ్యెంబులును, అందనవరతముఁగూడి యుండును. భక్తి శ్రద్దల

దావి వెల్ల కాలమును సేవించువాఁడు జ్ఞానార్థియైన జ్ఞానమును ద్రవ్యార్థియైన అమితమగు ద్రవ్యమును, ఇది యది యననేలఁగోరినదాని నెల్లంబొందఁగలడు. పుత్రులంగోరు వారు పుత్రులను, బ్రహ్మానందముం బొందఁగోరు వారు బ్రహ్మానందమును పొంది తరింతురు. ఇట మానవులేమేమి కోరిక నవియెల్లఁబొందఁగలరు. పవిత్ర మానసమ్మున నన్య భక్తితో యెవ్వరేమి కోరినను వారి పాలికది కోరికలు కురియు చింతామణియేయని యెరుంగునది.

## వేంకటాద్రికింగల వేలు వేలు నామములు

ఓ ముని తల్లజులారా! భగవంతునకనంత నామములట్ల యా గిరివరమునకును పలు పేరుల్పొప్పును. యవి కొన్ని చెప్పెదనాలకింపుడు. జ్ఞానప్రదాయిని యగుటనది **జ్ఞానాద్రి** యనియు, సకల తీర్థరాజంబులతో గూడి యున్నదగుట **తీర్థాచలము** యనియు, ననంత మహిమల గడలేని యందముల రమణీయ పుష్కరమ్ముల కిమ్మగుటచే **పుష్కరాద్రి** యనియు పలునామమ్ముల దత్వ దర్శులగు మహాపురుషులచే పిలువబడుచున్నది. ధర్మ దేవతయు నిటఁదన ధర్మాత్వాభి వృద్ధికై తపంబొనరించి పెంపొందుచున్నది యగుట వేద పారగులగు మునులు దానిని **వృషాద్రి** యని పిలుతురు. బంగరుఁబోలు రంగును కాంతియుఁగలదగుటంజేసి **కనకాద్రి** యనియుం బిలుతురు. ఒకప్పుడు నారాయణుడను పద్బ్రాహ్మణుడు నిట మురారింగూర్చి నియమ వ్రతమునఁ పెద్దయుఁదపంబొనరించి పరమాత్మున్బ్రసన్ను నొనరించుకొని పరాత్పరుచేఁదన పేర నానగంబు పిలువంబడువట్లుగా వరమువొందెను. అది కారణంబుగ అప్పటి నుండి యా మల యాతని పేర **నారాయణాద్రి** యనియుఁబరఁగుచుండెను. అయ్యది వైకుంఠమువ నుండి కొనిరాఁబడిన దగుట **వైకుంఠాచలము** అనబడుచున్నది. ఘోర రాక్షసు హిరణ్యకశిపు నాశమొందింపను, భక్తు ప్రహ్లాదు నను(గ్రహించి కాపాడను నిందే నారసింహ రూపమున భగవానుడు వెలయుటచే నప్పటినుండియు **నరసింహాశైలము** యనియుఁగొనియాడఁ బడుచున్నది. ఈ పుణ్య భూధరమందుననే యంజనాదేవి తపంబొనరించి హనుమంతుని కుమారుని బడసినదగుట దేవతల్లెల్లరు నటనుఁజేరి దేవకార్య దురంధరుఁడు విబుధ సాహాయ్య కారకుడు అంజనీ పుత్రుఁడట బుట్టుటచే నా యచలమును **అంజనాద్రి** యని యాదరంబునఁబలుకసాగిరి. వరాహక్షేత్రంబగుట నది **వరాహాద్రి** యనియుఁబేర్కొనఁబడుచున్నది. వీరాధి వీరుండును వానర శ్రేష్ఠుండును నగు నీలునకియ్యది నిచ్చలు నివాసంబైతనరుట **నీలగిరి** యను పేరున దీనిని బిలుచుచుందురు. **వేం** కారము అమృతబీజము, **కట** పదమునకైశ్వర్యమని యర్థము. అమృతైశ్వర్యములకైయది మూలకందమగుటనది **వేంకటాద్రి** యనియుఁ బ్రకాశితమగుచున్నది. అందు దేవాది దేవుడు శ్రీనివాసుఁడు విరాజిల్లుటంజేసి యాకొండను విబుధవరులు **శ్రీనివాసగిరి** యని యుద్ఘోషింతురు. భగవంతునకు క్రీడాస్థానంబై యానందకందమగుట **ఆనందాచలము**

యని వైకుంఠపురవాసులు దానింబిలుచుచుందురు. శ్రీ స్థానంబై యెల్ల సంపదలనొసంగున దగుటను శోభామయంబై శబ్ద శక్తి నలరారుటను నెల్ల గుణ రూపంబులంగూడి యుంటను శ్రీశైలము అను నభిఖ్యను నీకు ధరరాజ మలరారుచుండును. కల్ప భేదంబులచే నిట్లది యెన్నెన్నియో యుక్తనామంబులఁ బొంది పిలువంబడుచున్నది. ఆ భగవంతునం దెట్టి కళ్యాణ గుణ గణములు దనరారుచుండెనందురో యా కళ్యాణ గుణంబులన్నియు నీ భూధర రాజంబునను రాజిల్లుచూ (బరమపావనమై యొప్పును. ఈ శ్రీ వేంకటశైల రాజముయొక్క గుణగణమ్ములను, మహత్తును, వర్ణించి చెప్ప నాలుగు మోముల వేల్పు పెద్దయు, ఆరుమొగంబుల కుమారుండును, వేయితలల నిరువేలనాల్కల చిలువఱేఁడును, బలుకు దేవతయుంగూడఁజాలరన నితరులంగూర్చి జెప్పుట యెందులకు. ఇట్లు సూతమునివరుండు చెప్పినదంతయు మనసార నాలకించిన మునివరులెంతయు సంతోషచిత్తులైరి. కాని మఱి మఱి యాది దేవు కథామృతముఁగ్రోలఁ గోరికపడుచున్న వారి కోర్కికిఁ దనివియే లేదయ్యెను.

## వేంకట గిరీశుఁడు యజ్ఞవాటికంజేరి మునుల ననుగ్రహించుట.

రోమహర్షణ ముని వరుండాముని తల్లజాలంగాంచి యిట్లనియెను. ఓ పూజ్యులారా! ఆకొండ నెత్తమ్ముల నావేంకట విభుండేమేమి పొనర్చెనదియంతయుఁదేట తెల్లముగఁ దెలియఁ జెప్పఁ దమిమీఱ, మీరు నాకు ముదలయిడుచున్నారు. నేనును ధన్యుండను. కొంత కొంత నాయోపినంత తెలియఁ బలుకెదను. నాలింపుడు. మాయలకన్నింటికిని మూలకందంబును, సర్వశక్తి వంతుండును, సమర్థుండును, లీలా వినోదుండును నగు నాభగవంతుని లీలలు, వింతచేతలు, గలయట్లుగఁ బరిపూర్ణముగ వర్ణించి చెప్పుట కెవ్వండు సమర్థుండగును ? ఒకప్పుడామాయలాడు, రమానాథుఁడు దేవితోఁగూడి విలాసవేషంబున నాకుధరంబున నుత్తర భాగంబున లీలా విహారంబు లొనరించుచుండెను.

ఆకాలమున నాపర్వతరాజ మహాత్మ్యంబును నాలించినవారై, తత్త్వదర్శనులును, మహాభాగులునగు కొందఱు తపోధనులట నాకొండ నెత్తమ్మునఁజేరి తమిమీఱనిట్లని తలపోసిరి. ఈయది యెంతయుఁబవిత్రము, పున్నెముల ప్రోవు, ఫల పుష్పభరితములగు వృక్షలతాదులచే నలరారుచున్నది. ఇందుఁ గంద మూలాదులును సమృద్ధంబుగఁ గలవు. ఈయది యజ్ఞయాగాను కూలంబులగు పలుతెఱఁగుల చెట్లు చేమలచే నొప్పారుచు గలగలపాఱు సెలయేళ్ల మొత్తమ్ములతోఁ జిత్తాకర్షకంబై యున్న యది. పెక్కురు మునులకు నెలవులైన భూజంబులతో నలరారుచు నెట్టి యిక్కట్టులు పొరయనిదై, నిర్బాధకమైన, కన్నుల విందగుచు డెందమునకానందము నిచ్చునదైయున్నది. ఇది

మవకెల్ల కాలము నివసించియుండవనువై యున్నది. అని మనమ్ముల నిశ్చయించిన వారై యటనవారు కౌతుకమ్మున నెలవుకొని యథాశాస్త్రముల విష్ణుదేవునుద్దేశించి యొక మహాయజ్ఞమును బొనరింపఁ దలకొని కొనసాగింపసాగిరి.

మాయా నటుండగు నాజగన్నాటక సూత్రధారుండును గలుముల జవరాలిని గెలకుల నుంచికొని యా మునులొనరించు జన్నంపు మంటపమును దరియఁబోయెను. అందాల యద్దకంబుల ముద్దులుగుల్కు బంగరురంగులీను, వలిపంబుంగట్టి, వలె వాటు వేసి చూడనొప్పియుండెను. తలపాగవెట్టి పుక్కిటఁదావులజిమ్ము పచ్చకప్పురపు విడెమిడికొని చిఱునగవులు చిలుకుచు నెడమచేత బంగరుపిడి చురికం బట్టికొని కస్తురిగంధంబుల యొడలిపూతల తావులు నలుకెలకుల నలుముచు గుబాలించుచుండ, విశాల పుండరీకాక్షుండును,గంబుగ్రీవుండును, మహాభుజాండును, జగన్మోహనా కారుండును, దనువొందిన సాక్షాన్మదనునట్టిడును, హేమయజ్ఞోప వీతధారుండునునై యా మనోహర కోమలాంగుండు మత్తే భగమనంబున నాయజ్ఞ సదనంబున నా మహాత్ముల మధ్యను బ్రవేశించెను. అట్లు తరుణీ ద్వితీయుండై తమ నడుమను జేరిన యా మనోహరగాత్రుని, కనులకింపగు వేషంబుబూని లీలాంబుజంబును గరాంబుజంబునఁబట్టి, పుటమిడిన బంగరు కాంతిని బురుడించు, పద్మకేసర రజముతోఁ బదియారు వన్నెబంగరు వన్నెతో, జెలిమి చేయు నొడలి యొడికమ్ముతో, శరత్పూర్ణేందు వదనయు, గుటిలాలకయు, నాకర్ణాంతనేత్రయుగళయు, దాంబూలరంజిత వదనయునై హిమకర దీధితులంగూడ వెనుకఁబెట్టు చల్లని కాంతితో నభూత పూర్వ సౌందర్యంబున నొప్పునాయన్నుల మిన్నను గాంచి యామునులెల్లరును విస్మయోత్ఫుల్ల మానసులయి యీభూమండలం బెల్లనేకచ్ఛత్రంబుగఁ భావింపఁదగిన రాజకుమారుని వలెనున్న యీతఁడెవ్వఁడో కదా ! మూర్తీభవించిన సౌందర్య దేవతయాయన సాక్షాల్లక్ష్మీ దేవియుం బలెనున్న యీయమ యెవ్వరోకదా ! అని తలపోయుచు నిట్లడుగందొడంగిరి. ముప్పదిరెండగు సల్లక్షణములంగూడి సాక్షాత్తు రెండవ రామునివలె నున్న యోపురుషోత్తమా ! నీవిటకెట నుండి యెందులకేతెంచినాడవు ? నీవెందుల వాడవు ? ఎచ్చటి వారలు ? రాజచంద్రమా ! నీ తలిదండ్రులెవరో ? రాజ్యమేదియో వివరింపుమా ! యనినవారికి భగవానుండిట్లు పలికెను.

మునిసత్తములారా ! నేనేమియు రాజునుగాను, విప్రుండనుగాను, నాకొకజాతియే లేదు. నాకేరును దలిదండ్రులనువారేలేరు. నేనుండుటకొకటెంకియు లేదు. ఇందునందు ననక యెల్లెడనేనుందును. నేసర్వసముండను. సర్వభక్షుండను. ఎల్లతావులకు నడ్డు లేకపోఁగలవాడను. ఈ యా రూపంబననేల నన్ని రూపంబులఁ బొందఁగలవాఁడను.

దగు నుత్తరంబిండు. ఈయౌదంబరీ స్తంభంబంతయువ్యాఘ్ర చర్మంబునఁ గప్పబడియున్నయది. మఱిమీరు దానితాకితాకియేమి గానము చేయుచున్నవారు? అదియేమి? అని ప్రశ్నించుటయేకాక యింకనునట జన్నంబునఁ జరుగుచున్న లోపంబుల నెల్లనెత్తిచూపి వానింబ్రశ్నించెను. అంతట మునులెల్లరును జేరి వారినెల్ల విధములఁ దగురీతి నాదరించి పూజించిరి. పిదప వారు హోమకాలము దాటిపోవుచున్నదని యెఱింగినవారై త్వరపడి యందఱు నా నవనాగ్నియందుఁ బవిత్ర గంధంబగు వపాహోమమును శాస్త్రోక్త విధానంబున బాగుగ వ్రేల్చి హెూమకార్యంబుల సర్వసంపన్నం బొనర్చిరి. అంత యజ్ఞపురుషుండగు నాభగవానుఁడును, శంఖచక్రగదాధారియు, శ్రీవత్సలాంఛనుండును, నిత్యశ్రీయుతుండును, సర్వాభరణ భూషితుండునునై తొందరతొందరగఁ బోయి కోటి సూర్యసమప్రభల వెలుంగువాఁడై యాౘ్రేల్చిన వపనురెండుచేతులుసాచి గ్రహించెను. ఆదివ్యతేజస్సుచేఁ గొన్నిక్షణముల వరకు నామునులెల్లరు కన్నులు మిఱుమిట్లు కొనఁగా బొమ్మలవలె మాటలుడిగి యుండిపోయిరి. తరువాతఁ గొంతవడికిఁ దేరుకొన్నవారై యా మునులందఱును సాక్షాత్తుగ భగవంతుఁడె వచ్చి తమ్మనుగ్రహించెనని యెంతయుఁ దనిసిరి. తమజీవితమే సుజీవితము, తమయదృష్టము పాటిలేనిది; యనుకొనుచు మిక్కిలియుత్సాహానందములతో మిగిలిన క్రతుకార్యంబులను నేమియుఁగొఱవడనీక పూర్తిచేసిరి.

## కుమార ధారాస్నానంబున వృద్ధుండు యువకుఁడగుట

తపోధనులారా! మున్నొకపుడు వేంకటనాథుఁడు, మనోహరకోమలాంగుండును, విశాల వక్షుండును నైనకుమారాకారంబున నాపర్వతమూర్ధంబున వినోద విహారంబులఁ జరుపుచుండెను. అందొకయెడ నాతనికి గుంటలువడిన కనులతో, ముడతలువడి బక్కచిక్కిన యొడలితో, గ్రుంగి వంగిన నడుముతో, నడువలేక నడువలేక నడుచుచు నాకలిదప్పుల నలమటించునొక ముసలిపాఱుఁడు కాననాయెను. అతఁడు దారి తెన్నుతెలియక, యెటకుంబోవుటకుఁ గాళ్లురాక, యటనడవినొక రాతిబండపై యట్టె చతికిలంబడి, నోరెండి, గొంతుకారి, పెదవులు తడఁబడుచుండ మాటిమాటికి నిట్లు వాపోవసాగెను. నాయనా! కౌండిన్యా! నూరేండ్లు నిండిన ముసలివగ్గను నన్నునిట నొంటరిగ విడిచి యెందుఁబోయితివయా?" ఇట్లు వాపోవుచున్న వాని వినుచున్న కుమారరూపుండా ముసలిందరిసి, అయ్యా! ఎవరికొఱకెందులకిట్లు నీవువగచుచున్నావు? మానవుఁడే కానరాని యీయడవిలోఁ గౌండిన్యుండెక్కడమన్నాడు? అనియడిగిన నాతని విన్నవృద్ధు, "అయ్యో, అయ్యో! నేనెంతయుఁ జబ్బినవాఁడనైతిని. మాయాశ్రమము కడుంగడు దవ్వులనున్నది. నేనచ్చటికిం జేరఁగలుగుటయెట్లు? ఓయి! దేవుఁడా! స్వయముగఁ బోయి

కాలకృత్యములుకూడఁ దీర్చికొనఁ జాలని నన్ను బంధుమిత్రులందరటికి దూరుఁడనైన పవికిమాలిన దుర్బలు నీలోకమున నేలనుంచితివయా? స్వామీ! అనివిలపించెను. అతవి యావగవును విన్న యాయకారణ కరుణార్ద్ర హృదయుండగు కుమారుండు మోమువఁ జిరునగవు తొలుకాడ మెల్లననిట్లనియెను. ఓద్విజవరా! నిజముగ మీరు బతుకునందిచ్ఛలేవి వారుగనే యట్లంటిరా? లేక యేదోవిసువుననంటిరా! నిజమే, పాపము! ముసలితనంపు మున్మురమున నొడలెల్ల నొడిలిపోయి ముడుతలువడి వ్రేలుచున్నది. తలవెంట్రుకలా ముగ్గుబుట్టవలె నెఱసిపోయెను. కనుబొమలుసాగి, ముందునకు సాగియున్నవి. కన్నులా కవరావుగదా; విసువుకాకమతేమి; మీభావమేమి యోచెప్పుడు. ఏదోవిసుగందియంటివి గాని యింకను బదికాలముల పాటు బ్రతుకవలెనని యున్నదందురా? అనియెను. అదివిన్న యాముసలి బాపనయ్య నాయనా నాకుబ్రతుకునందేమియు మమకారము పట్టియుండలేదు. కానియేమిచెప్పను? ఇంతవరకు జ్యోతిష్టోమాది నిత్యకర్మలేమియు నొనరించియుంచుకయు దేవఋణమ్మునుండి విముక్తుండను గాఁజాలకపోతిని. దీన దుఃఖితులకండగా మానవసేవయే మాధవసేవయని యెఱింగి ప్రజాసేవ యొనర్చి యుంచుకయు బ్రజాఋణంబును నీగనైతిని. దీనికంతయు నాశారీరి కార్థిక దుర్బలతయే కారణము. ఇట్టి ఋణములతో నేను మేను విడిచిన నాకుత్తరగతులేమియోగదా! అనువదేవంత. ఇంతకుమించి వేరుచింత నాకావంతయులేదు. నేనునీకు నిక్కమ వచించుచున్నవాఁడనని పలికెను. అదివిన్న యాకుమారుఁడా జన్నిగట్టునకుఁ జేయూతనిచ్చి నావెంటరండనెను. అప్పుడాపుడమి వేల్పును నాతనిచేయి పట్టుకొని మెలమెల్లన నడిపించుచు ముందునకుసాగెను. వారిద్దరు కొంతదవ్వరిగిరి యెదుటఁ దియ్యని తేటనీటితోఁ గన్నులవిందగుచున్న దాని గలగలవీనుల విందుగ, నులివులొనరించుచుఁ గదలిపోవుచున్న దానిఁ బరమ పవిత్రంబగు సెలయేటి నొకదానిం గాంచిరి. అదికన్న కుమారుండా భూసుర వృద్ధుతో "అయ్యా యియ్యేట మునుకలిడి రండు. పిమ్మట మీయాశ్రమమునకుం బోవుదుము. అని నదీజలంబులకడకుం జేర్చినిలిచెను. అంతనా ముదుకయాయేటి నీటఁగ్రుంకులిడి, లేచి విలిచినంత యెంత వింత మున్నెన్నడు, గన్నదియు విన్నదియుం గాదు. ఒక్కమారుగ నాతఁడు సుకుమార, సుందర నవయువకుఁడుగ నయ్యెను. తన దేహస్థి తింజూచికొని యాద్విజుఁడు తనకండ్లనే తాను నమ్మఁజాలకపోయెను. నిజమో కలయో తెలియలేకుండెను. ఎదుటఁ జూడఁగ నింతకు మున్నున్న యాకుమారుఁడును గావరాలేదు. ఆహా! అచ్చట వా దివ్యమూర్తియెవ్వరు? వేయిముఖముల వేలకన్నుల, వేలబాహువులతో విశ్వాత్ముండగు దివ్యమూర్తి, కన్నులయెదుటఁ దోచుచుండెనే అనుకొనెను. అంతట వాకసమున వింతంగూరిన వేలుపులు గుములుగఁ దోఁచిరి, జయజయధ్వానంబుల రోదసివిండించిరి. దేవదుందుభులు మొఱయుచుండ వేలుపుఁ జెట్టులు విరుల వానలు

కురియసాగెను. ముదిత మానసులగు నా త్రిదశులాదేవు సంతుష్టుం జేయ దివ్యస్తోత్రంబుల పాటంబులొనరించిరి. అంత విశ్వాత్ముండును విశ్వరూపుండునునగు నాదేవదేవుండు బ్రాహ్మణుంగాంచి విప్రసత్తమా! నీకుఁ జాలినంత ధనధాన్యంబుల నిచ్చితిని. యోగ్యములగు కర్మలనెల్ల ననుష్ఠించి పూర్తిచేసికొనుము. అని పలుకుచు నంతర్ధానం డాయెను. అటుపిమ్మట నటఁ జేరిన దేవతలెల్లరు మొత్తంబుగ నిట్లనిరి. ఈ పవిత్ర నదీమతల్లిని స్నానములొనరించి యీ మూడుకాళ్ల ముదుసలియుఁ గుమారుం గనయ్యెను గదా! కావున నీపవిత్రధార కుమారధారయను పేర లోకమ్మునఁ బ్రసిద్ధిని బొందఁగలయది. ఇంద్రియంబుల వశంబున నుంచికొని మూఁడుమాసములు విడువక మూఁడువేళల నిందున మునుకలిడు ధన్యుఁడు వయసుమీఱిన వాఁడయ్యును బడుచువాఁడగును. బక్కచిక్కిన బడుగుకూడ వజ్రకాయుఁడగును. అంతియకాదు పాపములెల్లఁ గడిగివేయఁబడి విముక్తుఁడై పరమపదమ్మును, విష్ణులోకమ్మును బొందును. ఇట్లు పలికినవారై దివౌకసు లెల్లరును భగవంతుని కరుణావిశేషమ్మున కెంతయు నెడందలు విస్మయోత్ఫుల్లములు కాగా దేవుం బ్రస్తుతించుచుఁ దమలోకమ్మునకుం జనిరి.

## అగస్త్యముని వరుఁడు చెప్పిన పుణ్యకథ

సూతమునివరుఁడు శౌనకాదులంగాంచి మఱియునిట్లుఅనియెను. మునివరులారా తొల్లి అగస్త్యమునివరుండు తనయాశ్రమమునకుంజేరిన మార్కండేయాది మహామహులతో నీశ్రీవేంకటాద్రి మాహాత్మ్యముం గూర్చియిట్లు చెప్పసాగెను.

ఓ మహనీయులారా! అన్నివిధముల వెంకటాద్రియెల్లలోకములంగడుఁ బ్రసిద్ధము. అచట ననేకానేకములు పుణ్యతీర్థములు కలవు. వానినన్నిటిని వివరించి చెప్పనావశముకాదు. ఆయన్ని తీర్థములకును, కాదుకాదు ఎల్లలోకములంగల పుణ్యతీర్థములకును స్వామియై స్వామి పుష్కరిణి విరాజిల్లుచున్నది. ప్రతివత్సరమునను అందున స్నానమొనరింపఁ బృథ్వీతలంబుల నెల్లయెడలగల పుణ్యతీర్థములును ధనుర్మాసమున శుక్లపక్షమున ద్వాదశిదినమున నరుణోదయకాలమున నటకువచ్చిచేరును; స్వామితీర్థమున మునకలిడి తాము పావనములగును. కావున నాసమయమున నందున మునకలిడువారు విష్ణుపులై పున్నెమునొందుదురు. కావుననే పృథ్వీతలంబున నెల్లయెడల మండియనేకులట స్వామిపుష్కరిణిని మునకలిడ వత్తురు.

సర్వలోకపితామహుఁడు బ్రహ్మదేవుడు భాద్రపదమున శ్రీవేంకటేశ భగవానునకు ధ్వజారోహణ మహోత్సవమును సుసంపన్న మొనర్చెను. అత్తరి ప్రతివర్షమునా ధ్వజారోహణోత్సవ మట్టులె సుసంపన్నము అగుచుండ నత్తరిదేవుసేవలొనరింప నేటేట

అంగ, వంగ, కళింగకాశీ, కోసల, కర్ణాటక, ఘూర్జర, చోళ, కేరళ పాండ్యాది యెల్లదేశముల వసించు మానవులును దమతమ కుటుంబములతో నటకు నేతెంతురు. ప్రతి సంవత్సరమును ఋషిమునులు, సిద్ధులు, యోగులు, దేవతలు నటకువత్తురు, దేవునర్చించి తవియుదురు. భాద్రపదమాసమున శ్రీవేంకటేశ మహోత్సవమునం బాల్గొని; దేవుసేవలొనరించు వారెల్లరును సర్వపాపవిముక్తులగుదురు. పవిత్రులై యుత్తమోత్తములగుదురు.

ధన్యతములారా! పూజ్యవరులారా! నేనింకను మఱికొన్ని పుణ్యతీర్థముల పావనకథల, వైభవముల వర్ణించిచెప్పెదను. అన్నాని చరితలు విన్నమాత్రన పవిత్రఫలము లొనగూడును. అవి మీరెల్లరు సావధానులైయాలింపుడు. స్వామితీర్థమున కుత్తరమున పాపనాశన"మనునెల్ల పాపములనశింపఁ జేయఁగల మహత్తరమగు పుణ్యతీర్థము కలదు. అద్దానికి వాయవ్య దిగ్భాగమున పరమోత్తమము కుమారతీర్థము కలదు; అద్దికుమారధారిక యనియులోకమున బ్రసిద్ధమైయున్నది. దానియద్భుత మాహాత్మ్యము నింకను వచించుచున్నాను. మీరలాలింపుడు.

## కుమారధారికా వైభవగాథ

ప్రాచీనకాలమున దరిద్రతచేఁ గడుంగడు పీడితుఁడగుచు నొకవృద్ధుడు తనకుటుంబపాలన పోషణము నొనరింపనింతయు శక్తిచాలక రేబవళ్లు విలపింపసాగెను. కటకటా ఈలోకముననేని, యాలోకముననేని సుఖమును బొంద ధనముకావలయును. "ధనమూలమిదంజగత్" అన్నారుకదా. పూర్వజన్మమున నాయొనర్చినయేపాపముననో నాకాధనమింతయు లేకపోయెను. పరలోకమునమేలు, సుఖముకావలయునన్న నిట దానాది ధర్మకార్యము లొనరింపవలయును. అవ్వి, ధనమున్ననే సంపన్నములగును. ముసలితనముచే దౌర్బల్యముచే నేనవ్వి యేమియు సొనరింపఁ జాలకున్నాడను. అన్నిట నశక్తుఁడ, నాయీ జన్మమువ్యర్థము. ఈసైనేనిక చేయఁగలిగిన దేమున్నది? ఇట్టులెంతయు వ్యథనంది చింతించుచు నాయిబిడ్డలనీడియటకా సువర్ణముఖరీనదీ తటమ్మునకు వచ్చిచేరెను. నేనీ శేషాద్రిశిఖరమ్మునకెక్కియటనుండి క్రిందికింబడి ప్రాణములు విడుతును; అనివిశ్చయించి యాయున్నతశిఖరమ్మున నుండి పడిచచ్చుట కాతఁడాయున్నత పర్వత శిఖరాగ్రమునకెక్కి చేరి బిగ్గరగ నిట్టులరచి పలికెను. ఓ బ్రహ్మ విష్ణుమహేశులారా! సూర్యచంద్రులారా! అశ్వినీకుమారులారా! ఎల్లభూతమ్ములారా! అత్యంత దుఃఖితుఁడనగు నాయీవచనమ్ములాలకింపుడు దరిద్రతచే, వృద్ధతచే నాయీజన్మ వ్యర్థమైపోయెను. నేనవశ్యమిటనుండి క్రిందికింబడుదును; పడిమడియుదును. ఇదియ నానిశ్చయము.

ఇందేమియు సందియములేదు. ఇట్లరచుచున్న నా మానవు, నాపర్వత తలమునకే వచ్చి రాకుమార రూపమున దిరుగాడుచున్న మృగయారసికుడు శ్రీవేంకటేశ భగవానుఁడు నని కని దరిసి చేయెత్తి యిట్లనియెను. ఓయీనరోత్తమా! చాలుచాలుచేయకు నిట్టిపాపముచేయఁబోకుమాత్మహత్యా మహాపాతకము. మానవులు భృగుపాత మొనర్చుట, గోతంబడిచచ్చుట యేమియు మంచిదికాదు. శాస్త్రములద్దియొప్పవు. ఇట్టిబలవంతపు చావుచే పిశాచమవై కడు దుఃఖమందుదువు. కావుననట్టి చెడుగును తొందరపడిచేయకుము. నీహితముం గోరియేననిది చెప్పుచున్నాను. నీవుదిగిరమ్ము నాచెప్పునది వినుము. అన్నయాదేవు నాలించి, యటుచూచి రాజునను, యువకుంగని యాతండాపావన పర్వతశిఖరమున నుండి దిగివచ్చి యిట్లనియెను. ఓరాజపుత్రా! మీరునన్ను నాయాలుబిడ్డల రక్షింపుడు, రక్షింపుడు; మా దారిద్ర్యముంబాపుడు; మమ్ముద్ధరింపుడు. ఇట్లులాతడన్నంత భగవానుఁడు మాధవుండిట్లనియెను. నే మీకంతయు నొసంగెదను. నీవు నాచేయిపట్టుకొని నావెనువెనుక నడిచిరమ్ము. అనినంత నాముసలివగ్గు ఆయువకు చేయింబట్టుకొని నాతనివెంట మెలమెల్లనడిచెను. శ్రీమాన్ వేంకటనాయకుడు, భగవానుఁడాతని నట్టిపట్టినడుపుచుఁ బాపనాశని కుత్తరమునంగల యాతీర్థమునకుం గొనివచ్చి యత్యంత దుఃఖితుఁడగు నావ్యక్తింగని యిట్లనియెను. ఓ మానవోత్తమా! దుఃఖముంబాపికొన, శాంతింబొంద నీరిందున స్నానమొనరింపుము. దాన నీమనోవ్యాధ, పరితాప మంతయుం దీరును. అని యాదేవుఁడనినంత నాతఁడాతీర్థమునం దిగి తానమాడి బయటకువచ్చెను. అతడుతన్నుంగనుంగొని తానెయబ్బురమందెను. తాను ముసలిగాడు నవయువ్వనుఁడు. ఇదియేమేని పట్టపగలు, మేలుకొని యుండనేవచ్చిన వింతకలయా? అనుకొనుచు ఒడ్డునకెక్కి నలువైపులం గలయంజూచెను. ఆతనికెచ్చట నాజవ్వనుఁడు కానరామికడుంగడు దుఃఖితుఁడాయెను. ఓనాయిష్టదైవమా! నన్నిట్లు విడిచి యెందులకెచ్చటికింబోతివి? అనిగొంతెత్తి పలుకుచు కన్నులనీరు కార్చుచు దుఃఖితుండై నిలిచెను. అంతనన్తర్హితుండైన దేవుండాకాశమునుండి యిట్లు పలికెను. అగునగునేను నీస్వామిని వేంకటేశుండను. ఇందునవేమియు సందియములేదు. ఓయీ మనుజవరా! ఈతీర్థస్నానముచే, నేనే, నీకిట్లు కుమారత్వము నొసంగితిని. ఇందుచే నీకైశ్వర్యప్రాప్తియునైనదియు. ఇప్పుడె నీవిటనుండి నీదేశమున, కింటికింబొమ్ము. భార్యాపుత్రులం జేరికొనుము. పెండ్లామును వీడుట వేదించుట, అనాదరించుట, నింద్యములని విబుధులు పలుకుదురు. సద్వర్తనుడవు కమ్ము. నీకు శరీరమునెంతయు శక్తిచేకూరినది. శారీరక ధర్మములు బాగుగనొనరింపుము. నేనెల్లరంగలను; గావున నెవరినివేదింపకుము నవమానింపకుము. ఎవరినవమానించి బాధించినను నన్నవమానించి బాధించుటయే. అట్లొనరించిన మహాపాప మనుభవింతురు.

కలిమిం బొందిననీవు లేనివారికి, నశక్తులకు దానములొనరింపుము. గురువుల పెద్దల బంధుమిత్రుల, బరిత్యక్తుల నొనరింపుము. జాతికులమత భేదములెంచకుము. ఆకలిగొన్న వారికి నతిధ్యభ్యాగతులకుం, గుడువంబెట్టుము. నీవును గుడుపాలంగుడిచి కులుకుము. అనిషిద్ధ కర్మంబులను, అనిషిద్ధభోగములను విడుచువాతడు, అనిషిద్ధ కర్మ లొనరించువాఁడు, నిషిద్ధ భోగములం గుడుచు వాడు పశుసమానుఁడు కాదు కాదు పశువు కంటెనుహీనుడు. మహాపాపి, రౌరవాదిఘోరనరకములను పొందఁగలడు. సత్కార్యములొనరింపుము. నీవొనరించిన సత్కార్యముల భగవాను వేంకటాధీశుఁ బ్రసన్నునొనరింపనే చేయుము. నీచేయు పవిత్రకార్యములు భగవంతునివి; భగవంతుని కొఱకె, ఫలమునాశింపక శ్రద్ధాశక్తులతో, బవిత్రముగ నొనరింపుము. ఇట్టులాకాశమున నుండి భగవద్వాక్యము వినవాయెను. ఇంతలో దేవతలటకు వచ్చిచేరియిట్లనిరి. ఆహాహా! ఏమియా తీర్థమహిమ! ఇదిచెప్పనలవికాదు; పలుకులకందనిది. కనుచుఁగనుచుండఁగనే ముక్కాలి ముసలి నిది నవయౌవనమునొనరించినది; కటికిదరిద్రునిఁ గలవానిగ నొనర్చినది. దీనిచే నీతఁడువ్వెత్తుగ, గుమారతనందియుండుట నిదిలోకమునఁగుమారధారిక యను పేరునం బ్రసిద్ధము కాఁగలదు. ఈకుమారతీర్థమ్మున పవిత్రమననమున స్నానంబొనరించు నాతఁడు పాపము లెల్లఁ బాసి పావనుఁడై పుణ్యజీవియై నిత్యసుఖియగును.

ఇట్లనుచు నాయమరవరులెల్లరు త్రిదివమునకుంజనిరి. ఇటనావరవరుండును, అటనుండి తన స్వదేశమునకు, స్వగ్రామమునకు, మహదానందమునంబోయి నిజగృహముం జేరి పెండ్లామును బిడ్డలను గలిసికొనెను. అట్లటఁజేరిన యాతఁడంతంతలోన మహదైశ్వర్యవంతుఁడాయెను. ఆతఁడు నాలుబిడ్డలు మహదుత్సాహమున నెన్నెన్నియో ధర్మకార్యములు చేసిరి: చేయుచు శ్రీవేంకటేశ భగవానుడు ప్రసన్నుండగు గాతో! మనుచుఁ బలుకుచు మనంబున నెంతయు భక్తింజరించుచు నిటప్రత్యక్షఫలముం బొందుచు నంతమున శ్రీవిష్ణులోకమును బొంది తరించిరి. అనిచెప్పుచు నగస్త్యుఁడు వారితో భగవంతుఁడు శ్రీనివాసదేవుఁడే యొకమారు దీనిని గుమారదారికయని ప్రశంసించెనన్న విన్నవారు శ్రీహరి విష్ణుభగవానుఁడు దానినెప్పుడేల నట్టులుపలికెను? ఆమహద్విషయమును మాకువీనులవిందుగ విస్తరించి వివరింపరే యన్నవారికాచరిత మిట్లనఁగస్త్య మహాముని వరుండు చెప్పెనని సూతుడు శౌనకాదులకు నిట్టులాకత చెప్పెను.

ఓం శ్రీమన్నారాయణాయ శ్రీ వేంకటేశాయ నమః

శ్రీ వైఖానస మునిశ్రేష్ఠ పూజితాయ వేంకటేశాయ నమః

## కుమారుడు కార్తికేయుడు - కుమారధార

దక్షప్రజాపతికిఁ దొలుతొల్త సతియను కుమరితకలిగెను. ఆపిమ్మట మఱి యేబది మంది కుమార్తెలుకలిగిరి. అందునఁ బెద్దకుమరితను సతీదేవినాతఁడు శంకరునకిచ్చి పెండ్లిచేసెను. పిమ్మటఁ బదమూవురఁ గశ్యప ప్రజాపతికిచ్చి పెండ్లిచేసెను. వారివలనవే యీసృష్టియంతయు విస్తరించెనని యెఱుంగునది. పిమ్మటఁ బదుగురిని ధర్మదేవతకును, యిరువదేడ్గురను జంద్రునకును నిచ్చి వివాహమొనర్చెను. వింతయేమన నల్లుఁడగు శంకరునందు మామకు దక్షునకు నొకవిధమగు నయిష్టముకలిగెను. అందుచేనాతఁడు శంకరునివీడి, యెల్లర దేవతల మునుల మిత్రుల నాహ్వానించి మహాయజ్ఞమొండు చేయసాగెను. తండ్రి జన్నమొనరించుచుంట యెఱిఁగి యెట్లెట్లో పతిదేవుననుమతింగొని పతియందునకేగెను. కాని వచ్చిన కుమరిత నాతడేమియు నాదరింపని వాడాయెను. అటనామె తండ్రి దక్షుఁడు పతిని శంభునినవమానించుట గాంచి యామెయెంతయు పరితాపమంది యటనాయజ్ఞశాలను యోగాగ్నిని శరీరమును దగ్ధమొనరించికొని మృతినొందెను. ఈశ్వరుఁడది యెఱింగి కోపమున తనవెంట్రుక నొకదానిబీకి నేలంగొట్టి నందుండి వీరభద్రుడు మహావీరుడు జన్మించెను. అతనిపరివారంబుతో నీశ్వరుడు దక్షుని దండింపబంపెను. ఆతడువచ్చి దక్షుంజంపి వానితల హోమాగ్నింబడవైచి జన్నముం భగ్నమొనర్చి తిరిగివచ్చెను. దక్షుందగురీతిం దండించియుఁ దానా సతినిగాక వేరొండుభార్య నొల్లనని యోగియై హిమవంతమునఁ దపమొనరింపసాగెను. అట నాసతియు హిమవంతునకుం బుత్రికయైజన్మించి గారాబమునఁ బెఱుఁగుచుండెను. ఆమె ఉమయని, కాత్యాయని, హైమవతియనియు పిలువబడుచుండెను. తనవాసమును హిమాద్రిని వెలవుగఁజేసికొని తపమొనరించుచున్న మహేశునకు నుచితసేవలొనరింప హిమవంతుఁడు నియోగింప గౌరి దినదినము యాతని యాశ్రమమునకుంబోయి తగునుపచర్యలొనరించి వచ్చుచుండెను.

అక్కాలమున దారకుండను నొక్కరక్కసుఁడు బమ్మనుగూర్చి ఘోరతపమొనరించి మెప్పించి చంద్రశేఖరునీశాను తనయుచేఁగాక తనకు మఱెవ్వరిచేతను మృతికలుగ కుండునట్లు వరముపొందెను. పెండ్లాడనని దీక్షంగొన్న శంకరునకుం బిడ్డలు కలుగరనియు, దనకు మరణములేదనియు నెంచినవాఁడు కడుంగడు దుండగీడై పెచ్చుపెఱిఁగి లోకముల హింసింపసాగెను. శంకరునకుం బుత్రుఁడు కలుగవలెనన్నఁ బార్వతియే వానికిందగు పతియనియెంచి కాత్యాయనియందున శివునకుం బ్రేమముదయింపఁ జేయ నింద్రుఁడు ప్రేరేపమదనుఁడు వచ్చి గిరీశుబ్రేమ బాణమ్ములఁ బూవుటమ్ములంగొట్టి శర్వుమనంబును గలంచెను. దానికలిగి రుద్రుఁడా కాముని దనమూడవకంటి యగ్గిమంటల బుగ్గియొనర్చెను.

అంతమదను నిల్లాలు రతీదేవి యెంతయు విలపించి భక్తిని మహేశ్వరునర్చించి ప్రసన్నుం జేసికొని పతిభిక్షం బెట్టుమని ప్రార్థింప నాదేవుండామెం గరుణించి, కనికరమూని యామెపతి యనంగుఁడయ్యు లోకమ్ములకుం బ్రేమదేవత కాఁగలఁడనియు నామెకు మాత్రము పొంగుండై మోదముం గూర్చుననియు వరంబొసంగెను. అంతం బ్రహ్మేంద్రాదులు కోరినంత, నట నీశ్వరునేపతిగాఁ గోరి తపమ్ము నొనర్చుచున్న పార్వతి నను(గ్రహించి యీశుండు గౌరింబెండ్లాడెను. వారికిం గలిగిన వాఁడు కుమరుఁడు. ఆతండు పెరిఁగి పెద్దయై దేవసేనానియై పోయి తారకునెదిర్చి ఘోరరణమ్మున వానింజంపి విజేతయాయెను. అదేమియబ్బురమ్మో! వానింజంపిన దాదిగఁ బెద్దదగు హత్యాదోషము, మహాపాపము వానింబట్టి పీడింపం దొడంగెను.

తారకాంతకుఁడు కార్తికేయుఁడెంతయు దుఃఖితుండై తనతండ్రిని శంకరుని సమీపించి యిట్లులనియెను. ఓ పితృదేవా! ప్రభూ! సాంబశివా! నాదుఃఖగాధ నాలింపుడు. దేవతల కుపకారముగాఁ దారకాసురుఁడు వధింపంబడెను. వానింజంపిన యాపాపము, హత్యాదోషము వెంటాడి నన్నెంతయుఁ బట్టిపీడించుచున్నది. కావున నోదేవా! తత్పాపనివృత్తికి, నేదేని ప్రాయశ్చిత్తము నాకుంజెప్పుడు. కరుణింపుడు. అనుచుఁ దనయెదుట దీనముగ నిలిచియున్న కుమరునాలించి సర్వజ్ఞుండు శ్రీశంకరుఁడు నిబుధహితకారిని కుమారునిగాంచి యిట్లులనియెను. ఓయీ పుత్రవరా! మానవుఁ డొక్కమారు మనసుంచి భక్తిన్నారాయణ నామస్మరణ మొనరించిన కల్పశతత్రయము గంగాది సర్వపుణ్యతీర్థముల స్నానమొనరించిన వాఁడగును, తత్పుణ్య ఫలంబును బొందును. అనియాదేవుండు మఱియు నిట్లులనియెను ఇదోనేను నీకొక పరమరహస్యము, సర్వోత్తమ ప్రాయశ్చిత్తము నచించుచున్నాడ దాని మనమున బాగుగనెంచి యుంచికొని యాచరింపుము. సువర్ణముఖరీ నదీతీరమున లక్ష్మీపతినివాస భూమి సర్వలోక ప్రసిద్ధము వేంకటాద్రికలదు. అందెన్నెన్నియో పవిత్రతీర్థములు కలవు. అందువఁ గొన్నినీకు నేఁజెప్పెద నాలింపుము. చక్రతీర్థము, స్వామితీర్థము, మత్స్యతీర్థము, పాండవతీర్థము, నాగతీర్థము, బిల్వతీర్థము, జాబాలితీర్థము, ఆకాశగంగాతీర్థము, పాపనాశనతీర్థము, తుంబురతీర్థము, వామనతీర్థము, కుమారతీర్థము, మొదలగునవి; యివ్వియెల్లఁ బవిత్రతీర్థములె. వేంకటాద్రిం గల యీపావనతీర్థముల నెవ్వాడు సర్వదాకీర్తించుచుండు నాతండును దన యనేక జన్మముల పాపములు నశించిపోగాఁ బవిత్రుండగును. ఇందునవేమియు సందియములేదు.

అందు స్వామి పుష్కరిణీ తీర్థతీరభూమిని పరాత్పరుఁడు, శ్రీనివాస భగవానుఁడు, సర్వలోకహితకాముఁడై నిత్యనివాస మొనరించుచున్నవాఁడు. అచ్చట నిర్మలమతి భక్తియుక్తి నెవ్వఁడు ప్రణవయుక్తముగు "ఓం శ్రీ వేంకటేశాయ నమః" అను అష్టాక్షరీమంత్రమును

స్మరించుచుండువో యన్నానివి విష్ణువు ప్రసన్నుండై ప్రోచును. కుమార నీవు నచ్చటికింబోయి విష్ణుభగవానునకుం భక్తిని నమస్కరించి స్నానమ్మొలాడ కుమార తీర్థమునకుంబొమ్ము. అటు విజితేంద్రియుండవై యాశ్రేష్ఠతీర్థంబున ముమ్మేళల స్నానమ్మొలొనరించి, ప్రణవముతోడి యీ యష్టాక్షరీ మంత్రమును జపింపుము. తపమొనరింపుము. ఓం నమః శ్రీ వేంకటేశాయ.

పితృవాక్యము నాలించి దేవసేనాపతి కార్తికేయుండు షణ్ముఖుండు పయనమ్మైపోయి శ్రీ వేంకటాద్రింజేరి, చక్రతీర్థమున మునకలిడి స్వామి పుష్కరిణికి వెళ్లిచేరెను. స్వామిపుష్కరిణినిస్నానమొనరించి శరజన్ముండు కార్తికేయుండు శ్రీవేంకటేశభగవానునకుం బ్రదక్షిణంబులు, ప్రణామంబులు పొనరించి ఓ మాధవా! బ్రహ్మరుద్రేంద్రాది దేవవంద్యా! మీకివే నమస్కృతులొనరించుచున్నవాడను, భజించుచున్నవాఁడను. రమాధవా! మాధవా! మాకగునిష్టంబులెల్ల వినష్టమొనరించి యిష్టసిద్ధి పొనరింపుము. ఇట్టులాదేవునెంతయు మ్రొక్కి ప్రార్థనలొనరించి యటనుండి, పాపనాశిని జేరి యందున భక్తిశ్రద్ధల స్నానంబులాడి పావనుండై లేచెను. అచ్చటనుండి వాయువ్యదిశగపోయి యటనొక దివ్యధారికను దరిసెను. అద్ది పర్వతోపరి స్థలంబుననుండి, ధారారూపమునం బర్వతము యొక్క యత్యంత గంభీర గహ్వరమ్మునం బడుచునుండెను. చూతమందార పనసకుట జార్జునాది మహావృక్షములు, శాఖోపశాఖా పుష్పఫలపల్లవ సమృద్ధమ్ములు సుందరలతా పరివృతమ్ములటఁ గన్నులపండు వొనరించుచుండ శరభశార్దూల సింహగజ హరిణాది జంతుసమారోహంబై, నియతాహారులు, తపోనిష్ఠులు నగు తాపసులచే నిండియున్న యాతావున నాతీర్థమున గజాననానరజుఁడు కృతస్నానుఁడై దేవఋషితర్పణంబులొనరించి శుద్ధవసనంబులుదాల్చి యత వాక్కాయమానసుఁడై ప్రాఙ్ముఖమ్ముగ సుఖాసీనుఁడై లక్ష్మీ భూదేవీసహితు, భూషణోత్తమభూషితు, స్మేరాననాంబుజు, పీతాంబరధరు, నధోక్షజు, శ్రీవేంకటాధీశుని మహాదేవోక్తమంత్రమ్మును దివారాత్రమ్ములు, జపమొనరించుచు ఫలాహారియు, జలాహారియు, నిరాహారియునై యట వసించెను.

నీలకంఠుని శంకర భగవానుని పుత్రరత్నము శుభమూర్తి షణ్ముఖుండట్లు తపంబొనరించుచుండ కుంభమాసమున మాఘపూర్ణిమను, మఘానక్షత్ర సమయమున, సోమవారమున, మధ్యాహ్నకాలమున, నాతనియెదుట శ్రీ వేంకటేశ భగవానుఁడు సరిగ నాతఁడే రూపమున తలంచుచుండెనోయదే రూపమునఁ బ్రత్యక్షమాయెను. అట్లుతోచి భోకుమార! భోకుమార! యని గంభీరస్వరంబునం బలికెను. అదివిన్నకుమారుఁడట్లె కన్నులుతెఱచి, యెదుటఁ జూచెను. ఎదుట చేతుల శంఖచక్రములు ధరించి, శుభఫలమును సూచించుచు నెడమచేతిని జంఘమంచి, మఱియొకచేత, బ్రణతార్తిహరములు చరణములు చూపుచు, సుందరస్వరూపలు, అశేషసుందర భూషణ భూషితలు, అత్యంత ప్రసన్నముఖ కమలలునగు లక్ష్మీ భూమాతలచే సంసేవితుఁడైయున్న ప్రసన్న హృదయు

భగవంతునిగాంచెను. చూచినంతన లేచి ముమ్మారు ప్రదక్షిణలొనరించి, యనన్య మనస్కుఁడై మాటిమాటికి సాష్టాంగ ప్రణామమ్ములాచరించుచు, చేతులు జోడించి యెదుట నిలిచి యిట్లు స్తోత్రపాఠమొనరింపసాగెను. ఓదేవా! జగన్నాథా! లక్ష్మీపతీ! జయము, జయము. భూమాతామనోహరా! ఓలోకేశా! మీకుం జయముగుఁగాత, ఓసర్వేశా! మాదోషంబులు సర్వపాపంబులు నాశమొనరించు నో దేవదేవా! పరమపురుషా! మీకివే నమస్కృతులు.అంతనెల్ల వాద్యములు మ్రోగసాగెను. శంఖధ్వనులాయెను. చేతులవీణలుగొని దేవుంగీర్తించుచుఁ దుంబురనారదాదు లేతెంచిరి. భగవంతుఁడు కార్తికేయునకుం దరిఁజేరి దర్శనంబీవచ్చెనని తెలిసి తనవారందఱితో బ్రహ్మయునటకుం జేరెను. పుత్రానురాగంబు ముప్పిరికొన విఘ్నరాజును, ప్రమదగణమ్ముల వెంటనిడికొని, దేవేరి, యుమారాణితో శంకరుఁడును నటకు నందీశ్వరునెక్కి హుటాహుటి వచ్చిచేరెను. ఇంద్రాదిలోకపాలురు, అశేషామృతాంధసులు, వైఖానసులు, వాలఖిల్యులు, ఋషులు, తపోధనులు, గంధర్వకిన్నరాప్సరసలు, విద్యాధరులాదిగ నెల్లరు దేవయోనులు నటకు వచ్చిచేరిరి. వచ్చిన వారెల్లరును శంఖచక్రగదాధారిని, వనమాలా శోభితు, శేషనాగశయను, గరుడవాహనారూఢు, విష్వక్సేనాది పార్షదులచే నిత్యసేవితు ననేక విధముల సంస్తుతులొనరించిరి. ఓ వేంకటాచలనాథా! విష్ణుదేవా! మునిజనసేవితా! శేషాచలనివాసీ! సకలజనహితాభిలాష నవతరించిన దేవా జయము జయము, భక్తజనాభిరామా! అమరజనాభివందితా! సంరక్షకా, పాహిపాహి యనుచు స్తుతించుచు ప్రణమిల్లి దేవు శ్రీవేంకటేశ్వరుం గనులారంగాంచుచు నిలిచిరి. అంతలోననె మఱల శ్రీ భూమిసహితా! చతుర్బాహూ! కిరీటీ, రక్షింపుము, రక్షింపుము అనుచు ప్రహ్లాద శుకదేవ సంతానములచే ఛత్రచామరధారులచే నిత్యసంసేవితు, పరమప్రసన్నచేతను, భగవాను శ్రీవేంకటాధీశు నెద నిలిపి తన్మయత మాటిమాటికి మ్రొక్కుచు నిలిచియుండిరి. అప్పుడెల్లరు నాలింప శ్రీమహాదేవసూనుఁడు, కార్తికేయుఁడిట్టులు పలికెను.

ఆ॥వె॥ వేంకటాద్రివాస! విష్ణుదేవా! హరీ
సూర్యచంద్రనేత్ర! సుజనపాల!
బ్రహ్మశంకరాది వందిత! నారాయ
ణాద్రివాస, శ్రీశ యంజలింతు ॥

ఆ॥వె॥ సర్వలోకవాస! సర్వేశ! భక్తజ
నార్తి హరుఁడ ! మాధవా! మురారి
దనుజవనదవాగ్ని ! దామోదరా! జిష్ణు!
వందనంబుల భవ ! ప్రణతపాల!

ఆ॥వె॥ అఖిలలోకపూజ్య! అఖిలాంతరాత్ముండ!
అఖిల జీవకర్త! అఖిలభర్త
పరమపురుష! వరద! ప్రణతార్తి హార! దేవ
గొనుమ వందనములు, గనుమ ప్రేమ॥

ఓయనంతశక్తీ దేవాధి దేవతాపతీ! ఉత్తమకౌస్తుభధారీ! విశ్వత్రాణపరాయణు వేంకటేశు నిన్నునెంతయు భాగ్యవంతులె (అదృష్టవంతులె) కాంచగలరు. ఆహో! ఏమినాభాగ్యము! ఇరుకెలంకుల నిలిచిన ప్రేమ దయామూర్తులు లక్ష్మీభూమాతలచే సేవింపఁబడుచున్న నిత్యబంధుని, కృపాసింధుని, నిన్ననేనిప్పుడు కనులారంగాంచఁ గలిగితిని. ఇట్టులు పలికి పార్వతీపుత్రుఁడు కార్తికేయుఁడు షణ్ముఖుఁడు ప్రేమావేశమున మేఘగంభీరవాక్కుల నారుముఖమ్ముల నాదేవదేవుంగని యిట్టులనియెను. ఓదేవా! కృపాసింధూ! వేంకటేశా! మిమ్ముంగాంచఁగన్న నాయీకన్నులు ధన్యములు, కృతార్థములైనవి. ఓ కరుణామయా! అట్టులేనాశ్రవణమ్ములను గూడ వాగమృతముంగురిసి శ్రీసూక్తామృత సేచనమ్మునఁ గృతార్థములొనరింపుడు. అనియిట్లు శంకరకుమారుఁడు కుమారుడు పలికినంత స్మేరముఖాంబుజుఁడు శ్రీహరిమహాదేవుని శివునిగాంచి యెల్లరువిన నిట్టులనియెను. ఓ శంభూ! ఇట్టిసుపుత్రుంగన్న నీవెంతయు ధన్యుఁడవు. పెక్కుజన్మంబుల తపస్సు కృతముల యొక్కఫలము చేతనే సత్పుత్రులు కలుగుదురు. అట్లే పెక్కుపుట్టువులం బొనర్చిన పాపములచేతనే దుష్టులు పుత్రులు పుట్టుదురు. ఇట్టులని యా కరుణానిధి యటుతిరిగి శూలపాణి శంకరు పుత్రుంగని యిట్టులనియెను. ఓకుమారా! ధన్యుఁడవు. కృతకృత్యుఁడవు. ఇప్పుడె ఏదేనివరమును గోరికొనుము. నీవొనర్చిన తపస్సుచే, స్తోత్రములచే నాకెంతయు ముదమాయెను. ప్రామాణికులం దెల్లపరమోత్తముఁడవు, తండ్రిపలుకులు ప్రమాణములుగఁగొని పండ్రెండేండ్లు ఘోరనిశ్చల తపమ్మొనరించి, శాంతుండవైతివి. సుఖివికమ్ము అనవిని, ఓ భగవంతా! వేంకటేశా! ఇంకనాకుం గోరవలసినదేమున్నది? ఈపై నాకర్తవ్యమేమి? నేడునేను మీసేవాభాగ్యమును బొందఁగంటివి. ఎల్లలోకమ్ములు నెల్లపుడు మీపాదసేవా భాగ్యము నే కోరి ప్రార్థించుచుందుమ. ఓ దేవ! శ్రీహరి! ఈ పర్వతమహిమ మత్యంతోత్తమము. ధన్యము. ఓ శ్రీనివాస, దయామయా! దురితక్షయ, తారకా! తారకవధచే నాకంటిన యామహాపాప మెల్ల నిప్పుడు తొలఁగి నశించినది. కరుణాసాగరా కైమోడ్పులు కైమోడ్పులు. అని కుమరుడు వందనంబులిడినిలిచెనంత భగవానుఁడిట్టులనియెను. ఓమహామతీ! బుద్ధిమంతుఁడా! నామ మంత్రముం జపించుచు సుఖివికమ్ము. ఎంతయువివేకియేనియు నీపర్వతము నధిరోహింపంగోరిక గొన్న వాని పాపములన్నియు నశించును. భక్తిసంపన్ను నీవంటి వానింగూర్చి చెప్పునదేమి? ఇఁకనీస్వామి పుష్కరిణిని స్నానమొనర్చినఁ గోట్లు పాపములు నశించును. మఱియు నోదేవతలారా!

పేర్లు గాలింపుడు. ఓస్కందా! కార్తికేయా! పాపములు కాలింపుము, ఇంతటినుండి యీధార పేరున కుమారధారికయని పిలువంబడును. స్త్రీలుగాని పురుషులుగాని ఎవ్వరేని యందున స్నానమొనర్చిన వారియెల్ల పాపములును మొదలంట నశించిపోవును. వారు పావనులగుదురు. సత్యము, సత్యము, నేపలుకుచున్నదెంతయు యధార్థము.

మాఘమాసమున నుత్తమపూర్ణిమను మఘానక్షత్రయుక్తమగు తఱింగాని, అట్టుగానిచో, మఱియెప్పుడు గాని యీ కుమారధారికాతీర్థమున భక్తియుక్తిని స్నానమొనరించువారు బ్రహ్మవిష్ణు మహేశులాదిగ దేవతలకును బూజ్యులగుదురు. ఎవ్వారలు నేనావిర్భవించిన యీపుణ్యతిథి నిందు స్నానమొనరింతురో వారి పుణ్యమిట్టిదని శేషనాగుడు కూడఁ జెప్పఁజాలఁడు. ప్రతిసంవత్సర మీదినమున నెల్లరు నిటనిందు స్నానమొనరింప వలయును. కుమారధారా స్నాన మెల్ల పాపముల నాశమొనరించునదని వెలుగడుమ జెల్లరు పలుమారులు వేనోళ్ల ప్రశంసించిరి, పొగడి చెప్పుచుండిరి.

ఈతీర్థమున నణు మాత్రము సువర్ణదాన మొనరించినను నది మేరు నట్టులు మహాపుణ్యఫలమొసగును. అటనాయందున, నవన్యభక్తిని, వస్త్రదానము, గోదానము, భూదానము నొనరించు వారి యిండ్ల లక్ష్మి సదా సుస్థిర నివాస మొనరించును. ఈ తీర్థమున నొక్కదినమున నేని యన్నదానంబొనర్చు వారు వేల బ్రాహ్మణులకు, దీనజనులకు నన్నదాన మొనర్చిన పుణ్యఫలమును బొందుదురు. ఇచ్చటికి వచ్చు మార్గమున, శీతల జలపూర్ణమౌ చలివేంద్ర మునుచి చల్లని నీరము త్రాగనిచ్చువాని, వాని సంతతులనెల్ల నేకవికరించి రక్షింతును. ఇట బ్రాహ్మణులకుఁ దమలపాకులు, చందనము, నేమేని నిచ్చు వారి పది పూర్వతరములవారు, పది తరువాతి తరములవారు పాపవిముక్తులై తరింతురు.

కుంభమాసే, పూర్ణమాస్యాం !! ప్రాదుర్భావ దినే హరేః !!
కుమార ధారి కాస్నానం !! కులకోటిసముద్ధరేత్ !!

శ్రీ హరిప్రాదుర్భవించిన కుంభమాసమున పూర్ణిమ తిథిని సొనర్చిన కుమారధారికా స్నానము కోటికులముల సముద్ధరించును. ఈ మంత్రమును జపించుచు నీ కుమారధారికను స్నానమునొనరించు వారుత్తమ ఫల లాభమును బొందఁగలరు. ప్రతి వర్షంబునను కుంభమాసమున మఘానక్షత్రయుక్త పౌర్ణమాసిని ఎల్లదేవతలు, నీ కుమారధారికను స్నానమొనరింపవత్తురు. పితృదేవతలును నిందు మునుగవత్తురు. కావున నెల్లమానవులా పుణ్యదినమున నిటకువచ్చి స్నానము లొనరింతురుగాక. పుణ్యదేశంబులం దెల్ల, పుణ్యక్షేత్రంబులందెల్ల వెంకటాద్రి కడునుత్తమము. అందునఁ దీర్థంబులందెల్ల స్వామి పుష్కరిణి పరమ శ్రేష్ఠము. అందునను నాయావిర్భవించిన యీ పుణ్యదినమున కుమారధారిక కడుంగడు శ్రేష్ఠతమము, పుణ్యతమము. ఓ శంకరకుమారా

నీవిట కల్పపర్యంతము నుండి భక్తియుక్తిని నన్నుం బూజించుచు నిచ్చటఁ దపం బోనరించుచు నుండుము.

ఎల్ల దేవతలు మునులు, ఋషులు నీతీర్థంబుల మహిమల నెఱింగియే ప్రతి సంవత్సరమిట స్నానములొనరింపను, నన్నుందర్శింపను, నాయుద్భవదినమున సావధానులై వచ్చు చుందురు. కావుననే యోశంభుకుమారా! నీవిట నీపర్వతమున సుఖనివాస మొనరింపుము. ఇటకు వచ్చిన యా భక్తజనులఁదనియింపుము తనియుము. ఇట్టులని భగవానుఁడాతని తను వెల్ల తన కరపద్మములంబట్టి నిమిరెను.

అటుపిమ్మట నచ్చటి యెల్లదేవతలు, ఋషిముని వరులు, గంధర్వ విద్యాధర యక్షకిన్నరులు నాదిగ నందఱును గడుంగడు నాశ్చర్యమాశ్చర్యమనుచు భగవంతు దివ్యనామ సంకీర్తనంబుల వేనోళ్లఁబొనరించుచుఁ గుమారధారికామాహాత్మ్యము నత్యంతము ప్రశంసించుచుఁబరమానంద కందళిత హృదయులయి తమతమ నివాసములకు మఱలిపోయిరి. ఈశ్వరతనయుడు కార్తికేయుడును, అచ్చటనే శ్రీ వేంకటాద్రినాయకుంభజించుచు నాకుమారధారి కాతీర్థంబుననే చిరకాలముగ వాసమొనరించుచుండెను. ప్రతి సంవత్సరమా మహాతీర్థమున తానమ్ములు దానమ్ములు నొనరింప దానమ్ములాడ సిద్ధులు గంధర్వులు, దేవదానవులు, ఋషిగణములు, మఱియు పృధ్వీతలమందలి యనేకానేకులు మానవులు వచ్చి మునుకలిడి మురియుదురు, పావనులైతనియుదురు. ఆహా! ఏమి శ్రీ వేంకటగిరి వైభవము, ధన్యతమము అనుచు సువర్ణముఖరీనదీతీరమున లోపాముద్రాపతి యగస్త్యుండిట్టులు పలుకుచు మఱియు నచ్చటిముని సమూహముంగాంచి యిట్టులనియెను. ఓమహానుభావులారా ! అయిదారు దినములలో నామంగళమయము మాఘపూర్ణిమ రానున్నది. ఓమునివరులారా! ధన్యతములారా ! నాటికెల్లరము నచటికి శ్రీ వేంకట శైలమునకుంబోవుదము. స్వామి సరోవరమున మునిగి శ్రీ వేంకటేశుందేవదేవుందర్శించి ప్రార్థనలు పొనరించి యటకుత్తరమునగల పాపనాశనతీర్థమున స్నానమ్ము లొనరించి యటనుండి కుమారధారికకుం జేరనగును. అటనెల్లరుందమతమ పాపములంబాపిశుద్ధులయి యైశ్వర్యయుతులగుటకు, నందున పావనమనమ్మున, నిశ్చలమతి స్నానములు పొనరింతురు గాక! అనియె నంత నచ్చటివారెల్లరు నగస్త్యముని వరుతోగూడి కదలిపోయి వృషభాచలము నధిరోహించి స్వామి పుష్కరిణిందరిసి యందునఁబావన స్నానంబు లొనరించి స్వామిని వేంకటేశుందర్శించి ప్రార్థించి మాఘపూర్ణిమను పుణ్యతిథిని పాపనాశనిని మునిగి పావనులై తదుపరి పవిత్రకుమారధారికనుజేరి స్నానము లొనరింపం బోయిరి. ఆవచ్చిన వారి నెల్లంగాంచిన కుమారుఁడు కార్తికేయుఁడెంతయు ముదిత మానసుఁడై

మరల సత్కరించెను. అందఱును గూడి పోయి కుమారధారికను పావనస్నానములను నిర్మల మతినొనరించి ప్రముదితులైరి. శ్రీ భగవదర్పణంబుగ నెందరెందరో యెన్నేని దానంబు లొనరించిరి. వారెల్లరును తానంబులాడిన పిదప నెంతయు సంతసమొందిన వారైరి. కుమారుఁడును నందున స్నానమొనరించెను. విష్ణునామ యుతముగ శ్రీసూక్తము, భూసూక్తము మంత్రముల బాగుగపఠించి ప్రసన్నచిత్తుఁడై యొడ్డున కెక్కి " ఓం నమో బ్రాహ్మణదేవాయ, ఓం నమో గోబ్రాహ్మణ హితాయచ జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః" అనుచు దేవునకు నమస్కరించెను. బ్రాహ్మణులను దేవులుగ నెంచు దేవదేవునకు నమస్కారము. గోబ్రాహ్మణ హితకరునకు నమస్కారము. లోక హితకారునకు శ్రీ కృష్ణునకు గోవిందునకు నమస్కారము. అనుచు దేవునకు నమస్కృతు లొనరించెను.

అంతట శంఖచక్రగదాధారి, వరదుఁడు వేంకటనగాధీశుడు, విష్ణుదేవుడు వారి కెదుటందోచి దర్శనమిచ్చెను. రమాదేవీభూదేవులం గూడి యెదుటందోచిన దేవుని శ్రీ హరిని కాంచిన వారెల్లరు నాదేవునకు భక్తివినమ్రులై నమస్కృతు లొనరించిరి.

లక్ష్మీమహీసేవితా ! వేంకటేశా ! నమస్కృతులు. కృష్ణాజగత్రయేశా, కృపాసింధూ, వందనశతమ్ములు. అనాథునన్నేలు, మనాథనాథః అబ్జనాభ యబ్జనేత్రయబ్జపాద నీకివె యభివందనములు. అనుచుం దన్నుంగని నమస్కృతు లొనరించుచున్నవారిం గాంచి ప్రసన్నవదనుండై దయామతిని భగవానుడు శ్రీహరి మేఘగంభీర ధ్వానంబులం గ్రింది పరచు గంభీరవాక్కుల నిట్లులనియెను.

వాయందున ప్రేమ భావంబున నిట విధి విధానమున నొనర్చిన స్నానమ్ములు మీకెల్ల పాపములు హరించి సంపూర్ణానందము నొసంగును. ఇద్దానిచే మీకు సర్వ తీర్థస్నాన పుణ్యఫలము నొసంగంబడెను. నాచే మీకెంతయు శ్రేయస్సు చేకూర్పంబడెను. అరుగుడు బంధుమిత్రుల భార్యాపుత్రుల నెల్లరంగూడి సదాచారమ్మున వర్తించుచు సుఖింపుడు, సుఖింపుడనుచు నాదేవుఁడంతర్హితుఁడాయెను. ఇట్లులు భగవానుడు పల్కియంతర్హితుడైనంత నెల్లరుం దమతమ తావులకేగి బంధుమిత్రులంగూడి సుఖముండి స్నానదానములు జపతపములు చేయుచు ఓం శ్రీ వేంకటేశాయనమః అని జపించుచు నిర్మలమతింజరించుచు నిహమున సుఖభోగములంది పరలోకమునఁ బరమసుఖమునొందిరి.

ఓం శ్రీ బలభద్రాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ వరాహాచల నాథాయ వేంకటేశాయ నమః

# ద్వితీయాధ్యాయము

## శంఖణభూపాలుడు మరల రాజ్యమును బొందుట

శౌనకాది మహామునులంగాంచి సూతుండగు రౌమహర్షణి మహర్షి మఱియు యిట్లని చెప్పఁదొడంగెను. ఓమునిసత్తములారా! తొల్లివాల్మీకి మహాముని వరుండు నుడువఁ గా విన్నయర్థమును మీకుంజెప్పుచున్నాఁడ దత్తచిత్తులై యాలకింపుఁడు. తొల్లి పాంకాశ్యదేశంబునఁ జంద్రవంశీయుఁడగు శంఖణుండను నరపాలుండు వంశాను గతంబుగఁ దనకు సంప్రాప్తంబైన పెక్కుసామంతరాజ్యములతోఁ గూడి విశాలంబయిన యొకమహారాజ్యమునకు నేలికయైయుండెను. కాలము మాఱుటను, బూర్వకృతఫలముగా నాతని సామంతులె యొకట్టై యాతనిపై నెదురుతిరిగి, రాజ్యం బపహరించిరి. దురదృష్టవంతుండగు నాతడు భార్యతో, భక్త్యనుయాయులగు సచివులతో రాజ్యమునుండి వెడలి, దుఃఖమున దురపిల్లుచు దక్షిణదిశగఁ బోయిపోయి శ్రీరామసేతువును దర్శించెను.

అచట మహోదధిని స్నానంబులాచరించి, దర్భశయను శ్రీరామచంద్రు దర్శించి యటనుండి వెనుతిరిగి బయలువెడలి మెలమెల్లనఁబోయి సువర్ణముఖరీనదిని దరిసి యందు, దానంబులాడి, దానియుత్తరతీరంబునఁ గల పద్మసరోవరమును జేరి స్నానంబులొనరించి విధివిహితములగు పూజాదికృత్యములనెల్ల నెఱవేర్చికొని వగపునం గుందివందియిట్లని చింతింపందొడంగెను. అయ్యో! దైవమా! రాజ్యమా యపహృత మాయెను; వనవాసము సంప్రాప్తమయ్యెను. అధికారము తొలగి శత్రువులచే నవమానితుఁడనై పరతంత్రుఁడనై పొందునీదుఃఖమున కంటె మరణమే యొంతయు మేలుకదా. ఓ భగవంతుడా! నన్నెందులకుఁ బుట్టించితివయా? ఈ కష్టజీవితముం గడపుటచే నాకొలుకునదేమి? అయ్యయ్యో! ఎక్కడికి బోఁగలము? ఏమిగతి? అని యిట్లుదురపిల్లుచునే యాతఁడు నిద్దురం బడెను. నిద్దురను మునిగియున్న యాతని నొక యశరీరవాణి యిట్లని విననై మేలుకొలిపినట్లాయెను.

ఓ మహాబాహూ! ధైర్యమవలంబింపుము. బుద్ధిమంతుఁడవు. ఇట్లు విచారింపం దగునే? ఇచటినుండి యుత్తరదిక్కుగ నొకక్రోశమాత్రదూరంబున వేంకటా చలంబను పేరంబరగు నొక శైలరాజము కలదు. అయ్యది యీభూమండలంబున నాపన్నులపాలిటి కామధేనువు; దుఃఖపీడుతుల యెడఁ గల్ప వృక్షమెయగు వంతం గుందువారి చింతలఁ బాపనది చింతామణియె. అందేవాసంబుగ పాక్షాత్కమలాపతి, భక్తవరదుండును, నిష్కారణ కరుణాకరుండునునై యెల్లవేళల నిలచియుండు. అచ్చటన విరిసిన తమ్మిపూల నయనానందం బొనరించు స్వామిపుష్కరిణి యనుపేరంబరగుచు నొక తామరకొలను దనరారును. శుభస్వరూపిణియగు దాని పడమటియొడ్డున శ్రీమంతంబై ఘనమగు

వాల్మీకము పొలిచియుండును. లెమ్ము, పొమ్ము! నీవటఁ గుటీరంబును నిర్మించికొని నివసింపుము. అచ్చటనెయుండి మూడువేళల నాపుష్కరిణిని మునుకలిడుచు ఆయద్రిరాజమున విరాజిల్లిన శ్రీ వేంకటేశుని పవిత్రమనంబునఁ దలపోయుచుఁ జతుర్భుజుండును శంఖచక్ర గదాధరుండునునగు నాదేవునిఁ బూజలఁదనియింపుము. శ్రద్ధాభక్తియుక్తుఁడవై యాఱుమాసంబులందుండి యాదేవుని విడువక యారాధించిన నీవుమఱల నీరాజ్యముం దప్పక పొందఁగలవు. ఈదివ్య వాక్కుల నాలించిన యాతఁడప్పుడే మేలుకొని నిర్గతశోకుఁడై ప్రసన్నహృదయుండాయెను. అప్పుడె తనవారితో బయలుదేరి పుణ్యంబును బరమపావనంబును నగు నాకొండకుం బోయి పైకెక్కిన వాడాయెను. అన్నగముం గనినంత నెల్లరకును మనంబులు దుఃఖమలినంబు తొలంగి ప్రసన్నంబు లాయెను. ఎడందలు పావనంబులాయెను. కొండయెక్కి నంతన దండిగ సుఖమబ్బినట్లుగ నాయెను. దానియందమే మనందగును? సంపెగలు, పలుతెఱఁగుల మామిళ్ళు, నుసిరికలు, నశోకపున్నాగములు, తాలహింతాలములు, చందనాగరులు, తిలకకోవిదారపిచు మందమందార సప్తపర్ణకేతకీకర వీరములు మొదలగు వృక్షములచేతను, జాజి, సన్నజాజి, విరజాజి, మల్లెమొల్ల, మరువకములాదిగ పూలతీవెలచేతను నొప్పి ఫలపుష్పభరితంబులై కన్నులవిందుగ నుండెను. చెంగుచెంగునఁ గ్రేళ్లుఱుకు లేళ్లు, తావులంబిమ్ముక స్తూరీమృగమ్ములు, అందాలచమరీ మృగాలు, మొదలగు నందచందముల నానందములు జిలకరించు జంతుసంతతులచేతను సంతసము కొలుపుచుండెను. శుకపిక శారికాది శకుంతసంతానంబుల కలకలారావంబులు, మయూరనృత్యంబులు నత్యంత ముదమ్మును గూర్చుచుండెను. అట్టిమనోహరంబగు నాకొండ నెత్తమ్ము, నధిరోహించి యాశంఖచూడ నరేంద్రుఁడు తావిన్న, యెఱిఁగినగుఱుతులం జూచికొనుచు, వెదకుచుంబోయి యెదుటనొకయెడ నిర్మల స్ఫటికోపమ జలంబులనిండినసరోవరంబును స్వామిపుష్కరిణిని గనుంగొనెను. దానిపలుకెలంకుల పుష్పఫలభరితంబులగు వృక్షంబులయు, దావులంబిమ్ముచు, దేనెలుకురియు పుష్పకోరకముల పొలుపునఁ జెలువొందులతా వితానములయు, వనంబులు బలిసియుండ వికసించిన రక్తరాజీవములు, పుండరీకమ్ములు, ఇందీవరములు, నొప్పుచుండెను. కలువమొగ్గలు నిగ్గులు తీరుచుండెను. దానింగాంచిన రాజూడెందంబున నమందానందంబు గ్రందుకొనఁగా నాయెడనె తనకుటీరమ్ము నిర్మించికొని నివాసంబు పొనరింపసాగెను. వ్రతనియమంబును పూని మూడువేళలఁ బుష్కరిణిని స్నానంబు లొనర్చుచు శ్రీవేంకటేశు నారాధించుచు నియతాహారనియమంబుల దినంబులు వెళ్లబుచ్చుచుండెను.

మాసంబులారును గడచినంత నొకదినంబున రాజు పుష్కరిణిని జేరఁబోయినంత నెదుట సరోవర మధ్యంబున నొక దివ్య విమానంబు కన్నుల విందొనర్చెను. అత్యంత అద్భుతావహంబును ననేకసూర్య సదృశకాంతుల దిశలు వెలిగించునదియునై యొప్పుచున్న, దానియందు నానాభూషణ భూషితుండును, శంఖచక్రగదాధరుండును నగు దేవదేవుఁడు

శ్రీనివాసుఁడు శ్రీభూసహితుండై విరాజిల్లుచుండెను. అంత నచ్చటకు బ్రహ్మాదిదేవత లెల్లరును, సప్తర్షులును, అష్టవసువులును అష్టదిక్పతులును, సిద్ధసాధ్య విద్యాధరులును, ఏకాదశ రుద్రులును వీరువారననేల దేవాదులెల్లరటఁ జేరి యానందంబున, దేలి యాడుచుఁ బరమోదారంబులగు వేదమంత్రంబుల, శ్రావ్యగీతంబుల, నాదేవుని స్తుతి యొనరింపసాగిరి. కిన్నర గంధర్వులు పాడుచుండ నచ్చరమచ్చెకంటులాడసాగిరి. ఆకసంబున భేరీమురజ మృదంగాది వాద్యంబులు మ్రోగసాగెను. రాజాను నొడలు మఱచి, మనసేదియోకాగాఁ దొందరతొందరగ ముందునకడుగులు తడఁబడఁబోయి నిలిచి యాకరుణామయు వరదుఁ బరమేశు వేంకట గిరీశు, బ్రణతులఁ బ్రస్తుతులఁ బ్రసన్నునొనరించి యిట్లునుతించెను.

ఆ॥వె॥- అంతకాదినుంటి వలరెదవంతతో
నంతచెడినపేదప వలరఁగలవు
నప్రమేయు విన్ను నాది మధ్యాంతముల్
లేనివానిఁ దలఁతుఁబూని కొలుతు॥

ఆ॥వె॥- దేవవరులు మునులు తెలిసి నిన్నొగడంగ
జాల; రెంతవాఁడ సంస్తుతులను
బ్రస్తుతులను నిన్నుఁ బరమేశుఁదనియింపఁ;
గరము నూతనిచ్చి కావుమయ్య

అమృతవల్లి॥-
దేవదేవాలోకనాథా, దీనరక్షణ తత్పరా
కావవేమము వేడెదము నేవేళ దీనదయానిధీ
నీవెదిక్కుగ నమ్మియుంటిమి నెమ్మనమున రమాధవా
ప్రోవకున్నను దిక్కుకలదే పుండరీకదళేక్షణా -

సుగంధివృత్తము॥-
శ్రీనివాస వేంకటేశ శ్రీసతీమనోహరా
దీనరక్ష దివ్యరూప! తీర్థపాద! ప్రోవుమా
కావవేగజేంద్రునాఁడు కామితార్థదాయకా
భావమిచ్చి కొల్తు నెంచి పట్టుకొమ్ము దేవరా

ఆభిమానిని వృత్తము:-

వేంకటశైల నివాస రమేశ ప్ర
పీడిత భక్తజనావనరక్షా॥
సంకటముల్ దొలగించి కృపామతి
సాకవెనీపద పద్మయుగంబే॥
బింకము మీఱగ నమ్మి భజించెద
వేడెదఁబాడెదఁ గూరిమితోడన్॥
పంకజనాభ హరే! చెయినూతగఁ
బాలనసేయవె పాలితదేవా॥

దేవదేవా! జగద్రక్షణ తత్పరా జగన్నాధా! వంశక్రమాను గతమ్ముగ నాకుం బ్రాప్తంబైన రాజ్యాధికారంబు పరరాజులచే నపహృతంబైనది. అభాగ్యుడనై నేను రాజ్యభ్రష్టుండనై పలుక్లేశంతతులకు లోనై తిరుగుచున్నాఁడను. నాయందుఁ గనికరమూనుము. రక్షింపుము. నియమంబులఁబూని వ్రతంబు లాచరించుటయెఱుంగను; జపతపముల క్రమము తెలియను. కాని యో దేవదేవ! కేశవ! ఏ భాగ్యవశంబుననో నిన్నుఁ గన్గొనఁగాంచు భాగ్యము చేకూరినది. అదియంతయు నీయక్కటికమ్మె. నిక్కము నిక్కము. అని మఱిపెమ్మట భక్త్యానందముల పెల్లు వెల్లువ నెడందంబొంగి గొంతు పొరలి కన్నుల నీరునిండ నోటమాటరాక నిలిచెను. అంతట నాతనింగాంచి జాలి గొన్నవాడై ప్రేమవాక్కుల నావేంకట నగేశుండిట్లని పలికెను.

ఓ రాజా! దుఃఖింపకుము. నాచే నొసంగఁబడిన దివ్యరాజ్యపదము నీకు మున్నే ప్రాప్తమైనది. స్వామి పుష్కరిణీ జలంబులందున నీవుంచిన భక్తి శ్రద్ధల ఫలంబుగ నీవు ప్రకృత రాజ్యంబును, స్వామిత్వంబును బొందఁగలవు. వారు నెఱవేర్చు వ్రత నియమాను సారంబుగ వారికా స్వాధికారంబు చేకూరఁగలదు. ఇందేమియు సందియము లేదు. వెనుకటి జీవితంబెట్టిదైన నిటఁజేరిన పిమ్మటనైన వెనుకటి కాని జీవితమున కనుతాపమంది మనము నిర్మలము చేసికొని నడతను దిద్దుకొనని వాని బ్రతుకు వ్యర్ధమేయగును. చరిత్ర పవిత్రమైన వారికిఁ బరాధీనత యనునదుండనే యుండదు. నీవును నీరాజ్యమునకుం బొమ్ము. అకంటకంబగు రాజ్యంబునుంబొంది, పరిపాలించికొనుము. ఇట్లు బ్రహ్మాది దేవతలెల్లరు నిముషుండంబలికి యాస్వామియంతర్హితుండాయెను.

స్వామి పుష్కరిణి యనువాను మీతీర్థంబునకే యొప్పియుండెను. ఎల్లతీర్థంబుల దివ్యశక్తులు నిందిమిడియుండెను. ఎల్లతీర్థంబులకునిది స్వామినియగుటయు స్వామి పుష్కరిణి యగునని మున్ను భగవంతుండె నచియించెను. ఆహా! యీ పుణ్యతీర్థ

మాహాత్మ్యంబును నేమనిచెప్పంగలము? దీనిం దర్శించిన మాత్రాన వారి వారి పాపములెల్ల నాశమగుంగద. ఇఁక స్నానమొనర్చిన వారింగూర్చి వేరే చెప్పనేల? మఱియీ తీర్థతీరంబునను యిల్లు కట్టుకొని నివసింపఁగలిగిన వారి భాగ్యమే మహాభాగ్యము, వారే ధన్యులు అనికొనుచు దేవతలెల్లరు నానంద వికసిత హృదయులై వెడలిపోయిరి. ఆ మహారాజు శంఖణుండును, ఆ పవిత్ర తీర్థంబును, విడువలేక విడువలేక, దేవుదర్శనము దలంచికొనుచు నెట్టెట్లో నిజకాంతతో, నమాత్యులతో దేవదేవునవ్యాజ కరుణమనంబునఁ దలఁచి తలఁచి మురియుచు నటనుండి కదలి పర్వత రాజమును దిగి తనదేశమును గూరిచి మెలమెల్లఁ జనియెను.

అట రాజ్యంబు నపహరించిన వైరిరాజు లెల్లరెవరికి వారె యా రాజ్యాధికారమునుఁ గాజేయవలెనని కుటిలతనుబూని, యీరాజ్యమంతయు నాబల పరాక్రమములచేతనే సంప్రాప్తమయ్యె, నిది నాకే చెందునని పలుకసాగిరి. వాది నాదియని తమలోఁదాము కలహించి నశించుచుంటయే కాదు, దేశ ప్రజలకును నాశముం గలిగించుచుండిరి. కడకు వారును గలహంబున నేమియుందేల్చికొనఁజాలక విసిగివేసారి, తమలో నొకనిం బ్రభునిగాఁ జేసికొను నేరుపునోరుపు లేక కడకు "ఇది మనయందెవ్వనిదియుంగాదు. ఇది యెవ్వనిదో వానికే చెందుట యెంతయు మేలగును." అని తలపోసి శంఖణభూవరు వెదకితెండని నలువైపులకును దూతలనంపిరి. వారును బోయిపోయి వెదుకసాగిరి. నందొక తెగవారు గోదావరీతీరంబున రాజుంగనుంగొని సంతసంబున ఓరాజా! నమస్కృతులు. దయ చేయుఁడు. మీరాజ్యమును మీకెయొసంగ వారెల్లరును పంపిద్దులై యున్నవారలు. అని పలికిరి. అది వినిన రాజును దేవుని వాక్కులందలంచి కొనుచుఁ దనరాజ్యమునకుం బోయిచేరెను. అట రాజులెల్లరది తెలిసి శంఖణు నెదుర్కొలిచ్చికొనిపోయి రాజ్య సింహాసనంబుననుంచి యభిషేకించి తొంటియట్ల సామంతులై సేవించుచుండిరి. శంఖణనరపాలుండును బోయిన రాజ్యమును వేంకటేశ్వరాను గ్రహంబుననుఅలంబొంది నిష్కంటకముగఁ బ్రజాను కూలంబుగఁ బాలించుచు దేవునను గ్రహంబును దలంచి కొనుచు హత్తిన బత్తిని సుఖంబుండెను. ఇట్లని మునివరులారా! వింటిరికదా, తీర్థరాజ మాహాత్మ్య మెట్టిదో? యని మాతముని వరుండు మరియు నిట్లు చెప్పదొడంగెను.

ఓం శ్రీ ముకుందాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ అనంతాయ శ్రీ వేంకటేశాయ నమః

## వ్యూహలక్ష్మీ మాహాత్మ్యము, తన్మంత్రము

ఉ॥ తల్లిసమస్త లోకులకు దైవతమూర్తి దయాప్రపూర్ణ, చం
చల్లవితాక్షి, సద్విమల చంద్రనిభానన పద్మషండ మ
ధ్యోల్లల డోలికా విహరణోద్ధత లాలన మానసాబ్జ, సం
పల్లలితాంగి శార్ఙ్గధర వక్షవిహారిణి, గొల్తునిచ్చలున్

నాయనా! కనుల నక్కటికములలు వేయుచుండ నిండుచందురుం బోలిన మోము గలిగిన యానల్లనయ్య యిల్లాలు లోకముల కెల్లం దల్లి. యాకలుముల జవరాలు; మహాలక్ష్మి ప్రారబ్ధకర్మల పట్టుకూడ చెఱచి పాపంబుల హరింపంగల పావనురాలు, కోరిన కోర్కులెల్లం దీర నెల్లసంపదలు కొల్లలుగ నిచ్చి యనుగ్రహించు పాల్కడలి పట్టి యా మంగళదేవతయె జయ, కీర్తి, లక్ష్మి యనుపేరుల విలసిల్లుచుండును. అందున వ్యూహలక్ష్మి యనవొప్పు నాతల్లి యెంతయు ముద్దరాలు కరుణామయి. ఆయమ్మయె, యునాయానమ్మున, నమగ్రహించి, పాపంబులెల్ల హరించి, యైశ్వర్యంబుతెల్ల దయవొసంగఁగలది. ఆయంబను వశంబు చేసికొని యునాయానంబున ననుగ్రహంబుం పొందగల మంత్రంబిదిగోనుము. వినుము.

ఓమ్ శ్రీ, ఓం నమః పరమలక్ష్మై, విష్ణు వక్షస్థితాయై, రమాయై
ఆశ్రితతారకాయై, నమః వహ్నిజాయైనమః॥

ఈ మంత్ర రాజమెల్ల కోర్కుల నొసంగు వేల్పుజెట్టే, యనియెఱుంగుము. పద్మాసనప్రియయు, ద్విభుజయు, వెన్ను పెన్నురమున నెన్నడును నిల్లుకట్టుకొని యున్నయమ్మనిన్నయునగు నాకలుముల జవరాలిని వ్యూహలక్ష్మిని శరణొందుము. ఎల్లవేళల డెందమ్మున నాయమ్మనె నిల్పుము. మఱియెడందను చెడ్డతలంపుల జేర నీయకుము. తులువ నమలకుం దొరకొనకుము. త్రికరణంబులఁ బవిత్రుండవై ప్రవర్తింపుము. లేకున్న మఱియుం బెడిసి కొట్టుమనుమా. యని ఆత్మారామునకు యామంత్రమిచ్చి యామునివరుండు కనుమొఱంగెను; మఱికానరాలేదు.

ఆత్మారాముఁడు వెఱపుగదుర, వింతనందినమనమ్మున సంతోషమ్మును బొందియుఁ దనచేతనైన, తొలిపుట్టువునందైన పాపంబులకునై యెంతయు, దుఃఖమ్మునొంది యనుతాపమ్మున దురపిల్లి తనచే నీజన్మమున మఱలనట్టి పాపంబేదియు జరుగకుండ ననుగ్రహింపుమనియుఁ దిన్ననితెన్నునఁ బట్టిపోనెడందకుఁ గడిందిబలము నిమ్మని యా దేవదేవుఁ వేంకటేశు బ్రార్థించుచు మంత్రానుష్ఠానంబునకుం దగినతావును జూచికొన నటనుండి వెడలిపోవుచు నిట్లని చింతింపందొడంగెను. నేనెట్టి పాపినైనను

తొలిజన్మమున నేదో కొంత పుణ్యపుకార్యము నాచేనయ్యెనుగాబోలు. దానికి ఫలముగనేకదా యీ మహా పురుషుని దివ్యదర్శనంబు చేకూరెను. ఆ మహాభాగుఁడకారణమగు నక్కటికను నన్ననుగ్రహించెను. నేటితో దుఃఖంపు కాళరాత్రికడచెను. శుభోదయముతోచుచున్నది. ఇట్లనుకొనుచుఁ బర్వతంబెక్కి పోయిపోయి, యందందుఱాలనడుమల నుండి జలజలపాఱు సెలయేళ్లంగాంచుచు నొకచోఁదొలి పుణ్యంపు ఫలముగా స్వామి పుష్కరిణిని గమగొనెను. దానింజూచినంత నాతం “ డిది నన్నుద్ధరింప నాకాశంబున నుండి దిగివచ్చిన మందాకినియ. ఇది నాపాపంబులనేకాదెల్లర పాపంబుల నాశంబొనర్పంగల పుణ్యఖని. నిజముగనిది పాపనాశనియు, బుణ్యప్రదాయినియు నగు విరజానదియేయగును. అనితలంచి అర్ఘియె తనకునికిగాఁ దగినదని తలంచి, యందయుండి, మంత్రంబును, విధియుక్తముగ జపించుచు వ్యూహలక్ష్మిని, నారాధింప నిశ్చయించెను. అందే నిలిచి, యాశ్రమముం పొనర్చికొని యాతఁడు భక్తిశ్రద్ధలు ముప్పిరిగొన నియమమునఁ దగురీతిని, నియత నిర్మలమనమ్మున స్నానమొనరించి లేచినంతన యేదియో గొప్ప బరువు దిగిపోయినట్టుల యొడలెల్లఁదేలికాయెను. అచ్చటనె యాసనబద్ధుండై విధియుక్తముగ మంత్రమున దేవి నారాధించి నిలిచి యా పవిత్రవనమున నలునైపులఁ దేటిపాఱఁ జూచెను. అందొకచో నాతనికి దేవనిర్మితంబుగఁ దోచుచు నొకదేవాలయము కానవాయెను. అయ్యది సిద్ధసంసేవ్యంబై యొప్పియుండెను. మనోహరంబులగు పెక్కుగోపురంబులు, మండపంబులు నలరారుచుండెను. అవియెల్ల మేలిమి బంగారమున వినిర్మితములై, నవరత్నములు పొదిగి, కనులకు మిఱుమిట్లు కొలుపుచుండెను. నృత్య వాద్యంబుల డెందంబుల కమందానందంబు గూర్చుచు సురముని సంఘసంసేవితంబై గంధర్వ నగరంబును మించి కన్నుల విందొనరించుచుండెను. ఈ నిర్జనారణ్యంబున నీదివ్యదేవాలయంబేమి? అని నిబ్బరమగు నబ్బురంబునఁ గమంగొనుచు నాతఁడు తనివిసనక దరియంబోయి చూచుకోరికనటుసాగెను. ఆహా! అదియేమి! ఏమిభాగ్యము! వికసిత పుండరీకనయనుండును, శంఖచక్రధరుండును, నవరత్నఖచిత సువర్ణకిరీట మండితమస్తకుండును, సర్వాభరణ భూషిత సుందరశరీరుండును, పీతాంబరుండును నగు శ్రీ వేంకటేశుండు నెదుట నభయహస్తంబునెత్తి పట్టి వరదానంబుల నొసంగనో యనఁ గుండలాభా సంశోభిత వదనంబును గొంచెముగవంచి తన్నేచూచుచు దర్శనంబిచ్చెను. కోటి కందర్ప లావణ్యుండగు నా ప్రభువు చెంగట భూదేవి విరాజిల్లు చుండెను. వెడంద యొడందను సిరి, కలుముల జవరాలునలరారుచుండెను. అంతనాత్మారాముండును నొడలు మఱచియిట్లనెను.

ఓ దేవదేవా! నిన్నాశంకర భగవానుండును, బితామహుండునుం గూడ తెలిసియెన్నం జాలరు. ఎల్లరకుం నీవపరంధాముండవు, నీవ పరమాత్మవు, పరమగతివి, ఈ లోకంబు లెల్లను బుట్టింపను, బెంపను, గిట్టింపను నీవకర్తవు. నీవ మహేశ్వరుండవు” అని ప్రణమిల్లి

లేచి, ప్రభూ! నీవయంతయు నెఱుంగుదువు; నీయెదుట నేనేమికోరుదును? ఏమని విన్నుం బ్రార్థింతును? నేఁజేయఁ గలిగినది మనసుంచి నమస్కారమ్ము మాత్రమే. అని గొంతు తొట్రుపడుచుండఁ గన్నుల నానందాశ్రులు తొరంగనట్టే యాదేవుని తెప్పలార్పక చూచుచు నిలిచి - దేవదేవా! జగత్పతీ! దీనరక్షకా శరణు శరణు రక్షింపుము. మనసును ప్రశాంతముగను, సుస్థిరముగ నొనర్పుము. చంచలేంద్రియమ్ముల చంచలతమాన్పుము నదుపుననుండగ ననుగ్రహింపుము. నామనంబెప్పుడును నీయంద నిశ్చలముగనుండ, సదాచరణుడనుగ ననుగ్రహింపుము. అనియట్టె యంజలించి నిలిచెను.

సర్వజ్ఞుండును, నకారణకరుణామయుండును బరాత్పరుండును, నగు శ్రీనివాసుండు వాని మౌగ్ధ్యంబును నెఱింగి వత్సా! వెఱపును విడువుము. విచారింపకుము. తొల్లినీవలననైన యపరాధంబు లెల్ల క్షమింపంబడియెను. వ్యూహలక్ష్మి నారాధించి నీవ్వ నిజముగ నలభ్యంబగు లాభంబును బొందఁగాంచితివి. నీకెడదెగని శుభంబులొదఁ గూడఁగలవు. అవంతైశ్వర్యంబు, నమూల్యంబగు నారోగ్యము నీకు సులభ్యంబగును, దీర్ఘాయువు విలక్షణ జ్ఞానము నీకగును సజ్జనుఁడవై చిరకాలంబీ మహద్భోగంబుల ననుభవింపుము. ధర్మ జీవివైభావికిఁ జిక్కని బాటవేసికొనుము; పరమపదమందఁగనుము. అనిపలుకుచున్న యాదేవునకాతఁడు దండంబువలె నేలంబడి దండములొనరించి లేచి చూచునంత వాదేవుం డంతర్హితుండాయెను. మఱికానరాలేదు. అంతనాతఁడిది కలయా, నిక్కమా! మాయయా! మతిభ్రమయా! ఏమియో యెఱుంగఁజాలకున్నాను. అనుకొనుచు దేవునను గ్రహము వ వంతయు నిక్కమెయగునని నమ్మి యాపర్వతరాజమును డిగ్గి తత్సమీపంబునవె నివాసంబుండి, చిరకాల మానువ్రతుఁడెడంద దేవునిలిపికొని ధర్మాను వర్తియగుచు సుఖభోగంబులంబొంది కడపటఁబరమపదముం బొందెను. అనితొల్లి వాల్మీకి మహర్షి వలననిదియంతయుం జెప్పఁబడెనని సూతుండనెను.

## పదునేడు పుణ్యతీర్థంబుల కథనము

వరహాద్రి కథనిను మానవులకు నమృతపానమే యగును. కావుననే యావైకుంఠాద్రి చరితము మాటిమాటికి నాలకించుటకుఁగోరిక లూరుచుండును. కథాసందర్భమున వింతకుముమ్ము మీరు కనకాచలమునఁ బదునేడు పుణ్య తీర్థములున్నవని వచించియున్నారు. కావున నోసూతమునివరా! పున్నెములఁబెంపొందింపఁగల యాపదునేడు పవిత్ర పుణ్యతీర్థంబులయు మాహాత్మ్యం బెట్టిదో మాకుంబూర్తిగ వివరింపఁగలరని కోరుచున్నామనుచున్న శౌనకాదులకు సూతుండాదరమ్మునఁ జేరఁబిలిచి యిట్లనెను.

అయ్యలారా! ఈ పుణ్యతీర్థంబుల మాహాత్మ్యంబు సర్వమును బూర్తిగ వివరింప నేరికిని వశముగునదికాదు. ఏదో కొంతకొంత తెలిసినంతవరకుఁ జెప్పంగలంతవరకు

నేవివరింతును. మీరును మనసుంచి యాలకింపుఁడు. ఇంతకుమున్ను మీకుఁ గొంతకొంత 1 స్వామిపుష్కరిణివి గూర్చియుఁ 2.గుమారతీర్థంబును గూర్చియు వచియింపం బడియెఁగదా. ఉన్నవానింగూర్చి నావివరించునదాలింపుడు. ఈ బంగారు కొండ పాదునందు మొదటితావున నొకప్పుడు భూమిం బగుల్చుకొని పరమపావనమగు నీశ్వరలింగమొండు వెలికివచ్చెను. శివకేశవులకుం భేదములేదని, దేవునారాధించి, పొందుటకుఁ బవిత్ర హృదయము, సదాచారము మాత్రమే ప్రధానమని బోధింపనే యుద్భవించిన యాశివలింగమును నెల్లదేవతలటఁ బ్రతిష్టించి పూజలఁ బ్రార్థనలఁ దనియించి వెడలిరి. దానికి ముందెయిలను బగిలించి పవిత్ర జలములూరి నిర్మలంబులై యట తీర్థరాజంబుగఁ దిరమయ్యెను. అయ్యది తొల్లిపాతాలమునఁజిరకాలము కపిల మహామునియట పాతాలమున నున్న యాపుణ్య తీర్థమును, దివ్యలింగమును సేవించి యనంతమగు మహత్తునంది మహర్షియగుటంజేసి యా లింగమునకుఁ గపిలలింగమనియు, నాతీర్థమునకు, 3.గపిలతీర్థమనియు, బ్రసిద్ధనామంబులు కలిగెను. అయ్యావియే పాతాళమున నుండి యవని నగలించి మానవుల నుద్ధరింపనిటవచ్చి వెలసియున్నవి. ఇచ్చటను వానికా పేరులే యొప్పియుండెను.

అటనుండి కొండమీదికిఁ గొంతదూరము పోయినంత 4. శక్రతీర్థము కానవగును. తొల్లియహల్యా గౌతములవంచించి, యహల్యా సంగమమునకుద్యమించిన శక్రుండు తత్పాప ఫలితంబుగ నందిన ఘోరశాపమ్మునఁ బరితపించి, యాగౌతమువనుగ్రహమున నేయుట నాదివ్యశైలమును జేరియాతీర్థమున మునకలిడి శాపవిముక్తిని పొందెను. కావుననే యది శక్రతీర్థంబని పిలువఁబడుచుండెను. శక్రుడు అనునదియు, నింద్రునికిం గలయొక నామమే.

అటనుండి కొంతముందునకు నడిచిన 5.విష్వక్సేనతీర్థము, పుణ్యావిర్థవము కానవగును. అచ్చటనెవరుణ కుమారుండు విష్వక్సేనుండు దుష్కరంబగు తపంబొనరించి, దుర్లభంబగు సారూప్యంబును, నావైకుంఠుని సేవాధిపత్యంబును బొంది ప్రమోదమునొందెను. కావుననే యది విష్వక్సేన తీర్థంబునాఁ బరగెను.

అమీఁదనొక్కెడఁ గ్రమమున నైదుతీర్థంబులు, గలవు. ఆది దేవుండగు వైకుంఠుని పర్వవమర్థంబులు, పర్వపాపహరంబులునగు నాయుధమ్ములయిదును, 6.పాంచ జన్యంబనఁబడు శంఖంబును, 7.సుదర్శన చక్రమును, 8.కౌమోదకినాఁబడు గదయును, 9.నందక ఖడ్గంబును, 10.శార్ఙమ్మునాఁబరగు చాపమ్మును నానొప్పునీయైదు నాయుధంబుల వలనసుద్భవిల్లి, దర్శన స్పర్శన పవిత్రకరములగు జలంబులనిండి సేవించిన జనులకు శరణంబై రక్షింపఁగలవు. కావుననేయవి పంచాయుధ తీర్థమ్ములన నొప్పెను.

11. అటనుండి కొంతదూరము ముందునకు పోగిపోయిన వహ్నికుండము కానగును. దానం దానంబులాడినవారి పాపములన్నియు వహ్నింబడిన శలభంబులట్ల దగ్ధములగును.

12. దానికింగొంత దవ్వుముందునకుం బోయిన హత్యాదోషంబులను గూడ నాశం బొనర్చి, పున్నెమ్ముంజేకూర్పంగల బ్రహ్మతీర్థంబును దర్శింపనగును.

13. దానిందాటిమీదుగఁ గొద్ది యెడఁగఁబోఁగలిగిన ఋషితీర్థంబనియు, సప్తర్షితీర్థం బనియుఁ బిలువంబడు పవిత్రతీర్థంబు కాననగును. ఒకప్పుడట నెలవుగ నిలిచి యేడ్వురు మునులు నాతీర్థంబున మునకలిడి తపమొనర్చి వెన్ను ననుగ్రహము బొంది పెంపొందిరి.

ధార్తరాష్ట్రులు దుష్టులై మాయాద్యూతంబున వంచించి పాండవుల నడవులకు వెడల నడచిరి. ఎఱుఁగరాని వింత చేష్టలవాఁడగు వానల్లనయ్య బోధింప నాపాండుపుత్రులు యుధిష్ఠిరాదులు పవిత్రనగోత్తమంబున వేంకటాచలమును సేవింపవచ్చిరి. వారా పర్వత రాజంబున క్షేత్రపాలురచే సురక్షితంబై పవిత్రమై యొప్పునొక్క తీర్థంబుదరిని నివాసంబుండి స్నానపానాదులంద తీర్చికొనుచు ధర్మానురక్తులై యొకవత్సరంబు దమకకాలంబు వెళ్లఁబుచ్చిరి. అప్పుడొక నాటి రాతిరి ధర్మరాజునకొక యుత్తమ స్వప్నం బాయెను. ఆకలనొక దివ్యపురుషుండు తోచియాతనింగాంచి యిట్లనియెను. మీరిట నీపవిత్రతీర్థంబున నియమిత ధర్మచిత్తులై యొకవత్సరము సేవించినవారైతిరి. కావున మీజన్మ జన్మంబుల పాపంబులెల్ల నాశంబై మీరు పవిత్రులైతిరి. ఆపుణ్యఫలంబుగ రాబోవు యుద్ధంబున మీరు విజయులు కాఁగలరు. క్రమాగతంబగు రాజ్యంబు మీకుంజేకూరఁగలదు. అదివిన్న రాజిట్టలేచెను. అట్లనెవారు తరువాత రణమున విజయులై రాజ్యమును బొంది సుఖించిరిగదా. ఆది మొదలుగ నాతీర్థరాజము 14. పాండవతీర్థంబనఁ బ్రసిద్ధమాయెను.

అట స్వామి పుష్కరిణీ తీర్థమునకుఁ దూర్పుభాగమునఁ జింతామణి గిరివర గహ్వరమున 15. జరాహరము, 16.వలిఘ్నము, 17.రసాయనము, ననుమూఁడు పవిత్ర పుణ్యతీర్థములు గలవు. అవి మాయాతిరోహితములు, కావున వానింగనుంగొనుట చాలా కష్టము. ఎంతటి తలగలవారమనుకొను వారును నావింత తీర్థములఁదెలియఁజాలరు. ఇవి యెల్లదశాధిక ఫలంబులంజేకూర్పం గలవు. వాని మాహాత్మ్యంబు పూర్తిగ వివరింప నావల్లనగునదికాదు. ఆకనకా చలమున నెన్మిదిలోహఖనులు గలవు. అయ్యవి పుణ్యాత్ములకు మాత్రమే యుగభేదంబుల గనవచ్చుచుండును. ఆ పవిత్రకుధర రాజమున

నింకను నెన్నెన్నియో పావన తీర్థంబులు విరాజిల్లును. వాని నన్నిటింబేర్కొన, వాని మహత్తునునెన్ననేరికిని వశముకాదు. అందునఁగొన్ని కొన్నినేఁ జెప్పెద నాలింపుడు. అందున కృష్ణతీర్థంబొండు విరాజిల్లును. మకరమాసమున రవివాసరమునఁ బుణ్య నక్షత్రయుక్త పౌర్ణమాసిని, ఇంకను బుణ్యతిథుల నాకృష్ణతీర్థమున స్నానమొనరించు వారి పాపములెల్ల నశించవారి పవిత్రవాంఛలెల్లఁదీరును.

## ఫల్గునీ తీర్థ మాహాత్మ్యము

ఆనగోత్తమంబున నీశాన్యదిశా భాగంబున ఫల్గునీ తీర్థమొప్పును. ఒకప్పుడా తీర్థతీరంబున సనకాదియోగివరులు సప్తర్షులును తానంబులాడి తపంబులొనరించి తరియించిరి. ఆతీర్థ తటమ్మునని ప్రాచీన కాలమున నరుంధతీదేవి నియమమున, భక్తిశ్రద్ధల స్నానంబులొనరించుచు తపంబుపొనరించెను. ఆ యమతపమునకు నెంతయు, బ్రసన్నురాలై మంగళదేవత శ్రీదేవి ఫాల్గున శుద్ధ పౌర్ణమిని బ్రత్యక్షంబై యనుగ్రహించెను. కోరినవరములిచ్చి తనియించెను. తనకాతల్లి ఫాల్గుణమున నాతీర్థము కడఁబ్రత్యక్షంబగుట నాతీర్థమునకు ఫల్గునీతీర్థమను పేరుకావలయునని యరుంధతి కోరుటనాపె కోరికమేర, కదిమొదలుగ నది ఫల్గునీతీర్థమన నొప్పెను. ఫాల్గున మాసంబునఁ బూర్వఫల్గునీ నక్షత్రయుక్త పూర్ణిమయందు నాఫల్గునీ తీర్థమున భక్తి విశ్వాసములతోఁ బవిత్ర హృదయముతో స్నానమొనరించు వారి యందెంతయుఁ బ్రసన్న చిత్తమునఁ దనివితో వారి కోర్కులనెల్లఁ దీర్చుచు, వారియిండ్ల నెలకొనియుందునని వరంబిచ్చి యాలోకమాతరమాదేవి యరుంధతీదేవి ననుగ్రహించి యంతర్ధానమాయెను. నాడు మొదలుగ మునివరులా తీర్థరాజము తీరముననే యాశ్రమముల నెలకొల్పుకొని నివసింవసాగిరి. ఆసిరి వలన భగవానుఁడు లక్ష్మీపతియునట నివసించును. మనమును నాదేవదేవుని వేంకటేశుని సేవలంజేయుచు నందే నివసింతము అనిపెక్కురు దేవతలుకూడి యాలోచించిరి. వారాస్వామి తీర్థమునకుత్తరమునఁ దీరమునకుం గొద్దిదూరమున తమతమ యాశ్రమముల నెలకొల్పుకొని యందు సుఖముగ నివసింపసాగిరి.

## జాబాలి తీర్థమాహాత్మ్యము

ఆఫల్గునీ తీర్థంబున కుత్తర దిశనొక తటాకమొప్పుచుండెను. దాని పశ్చిమ తటమ్మున జాబాలిముని వరుండు తనశిష్యగణములతో నాశ్రమమొనరించికొని సుఖానందములతో నివసించుచుఁ దపశ్చర్యలఁగాలము వెళ్లఁబుచ్చుచుండెను. అది కారణంబుగ నది జాబాలితీర్థంబనఁ బరగెను. మఱియుఁ బెక్కురన్య మహర్షులును నా

సమీపమ్ముల నాగిరివరమున నాశ్రమముల నివసించుచు నాదేవదేవుదినదినంబు నారాధించి తనియుచుండిరి. మఱియు నెందరోమునివరులా నగరాజమునకు దాపున నివసించుచు దినదినము వచ్చి గోవిందునర్చించి, మఱల రాఁగలమని తలంచి మనసచ్చట నుంచిపోవుచుండిరి. మహామహిమాన్వితుఁడు మహాముని యగస్త్యభగవానుఁడట నాశైలతటమున నుత్తమపుష్పోద్యానమును నాటి పెంచి యనవరతమందలి వివిధ సుగంధిత కుసుమములతో నాపుండరీకాక్షునర్చించుచుఁ జిరకాలముగ శిష్య సంఘములతో వసించి సంతోష పీయూషమ్ముం గ్రోలితనియుచుండెను.

పురుషోత్తముఁడు శ్రీ వేంకటేశుఁడు శ్రీ భూదేవులతోఁగూడి కృతత్రేతాద్వాపరములను మూడు యుగముల నింద్రాదులచేతను, రాజుల, మహారాజులచేతను, భక్తజనంబులచేతను, సాధుసజ్జనులచేతను, సుసంపన్నములు చేయఁబడిన పలువిధములగు నిత్యోత్సవములచేఁ బూజింపఁబడుచు వారలకు, సద్విజులకు, నభీష్టములొసఁగి తనియించుచు సమ్మోదితుం డై వరించుచుండెను. ఇఁక కలియుగంబున నో భగవానుఁడు వేంకటాచలమున మెఱుపు తీగెయట్లు, మెఱయుచు, భక్తులఁగోర్కులిచ్చి తనియించుచుఁ బ్రత్యక్షదైవమై యలరారుచుండెను. అనియా సూతముని వరుండు చెప్పియింకను దనియక వినిపింప నుత్సాహపడసాగెను. మునులును స్వామిలీలల నింకనింక నాలింపనుత్కంఠ నందియుండిరి.

## సనక సనందన తీర్థమాహాత్మ్యము

యోగాభ్యాసముచే మానవుఁడు వజ్రకాయుడగును. మఱియుఁగాల మృత్యువును గూడ నిర్జించి యాచంద్రతారకముగ జీవించియుండును. ఆయోగమున భగవంతుని యెడందను సుస్థిరముగఁ బట్టి ధ్యానయోగ మందఁగలుగును. దాన పరమపదమొందును. అగునగు సత్కార్యాచరణములకు విఘ్నములు మెండు. ఇట నిట్టి యోగమునకు విఘ్నభయములొదవినచో వేంకటాద్రి మల్లిపిల్లు సనకసనందన సరోవరమున స్నానము లొనరించుచు యోగాభ్యాసమునకు దొరకొనిన నిర్విఘ్నమై యోగము సిద్ధినందును. వేంకట నగరాజమునఁ బాపనాశక పుణ్యతీర్థమునకుత్తరమున నర్ధక్రోశ దూరమున సురసిద్ధముని, సంసేవితమగు సనకసనందన తీర్థరాజమురాజిల్లుచున్నది. అది మిక్కిలి గోప్యమై మలభగోచరముకాక యుండును. మార్గ శీర్షమాసమున శుక్లపక్షమున ద్వాదశిని నరుణోదయము వేళ దృఢ సంకల్ప చిత్తుఁడై స్వామి పుష్కరిణీ తీర్థమున స్నాన మాచరింపవలెను. మఱునాఁడు త్రయోదశి మొదలుగఁ బ్రతిదినము నాసనకసనందన తీర్థమున స్నానమాచరించుచుండవలెను. అటుఁ దానమాడి పవిత్రుఁడై దినదినమున

శ్రీమద్వేంకట నగాధినాథుని భగవంతుని శ్రీమదష్టాక్షరీ మంత్రమును ప్రణవయుక్తముగఁ బదివేల మాఱులు జపించుచుండవలెను. అటుపిమ్మట యోగాభ్యాసము నొనరించిన నిర్విఘ్నముగ సంసిద్ధినందును.

ఓం శ్రీ వేంకటేశాయ నమః
ఓం నమః శ్రీ వేంకటేశాయ

## కాయరసాయన తీర్థ మాహాత్మ్యము

ఆ సనకసనందన పుణ్యతీర్థమునకు దగ్గరగా గుహ్యాతి గుహ్యమై కాయరసాయన తీర్థమలరారుచున్నది. తజ్జలములఁ ద్రాగినంత మాత్రమున, తక్షణమున, శరీరము పవిత్రమగును. కావలయునన్నఁ బరీక్షార్థమొక పండుటాకు నాజలముల జారవిడిచి చూచునది. అప్పటికప్పుడె యది శ్యామలమై, సుందరమై యొప్పును. సనకాదులచే నాతీర్థము పాషాణపిహితమై యున్నది. మహాత్ములగు పుణ్యమతులకది కానవచ్చును. ఏవిధముచేనైనను దానింగాంచి సేవించియె బుద్ధిమంతుఁడు దేహమును సుదృఢ మొనర్చికొని యెల్లపుడు నావేంకటేశునికిఁ గైంకర్యముంజేయు చుండవలెను. శేషరూపియగు భగవంతుని సేవయే మానవజీవితమునకుఁ బరమావధి. మానవసేవయే మాధవసేవ; భగవదారాధన, అదియెఱిఁగి యాచరించిన వాఁడె మానవుఁడు సేవావిహీనుఁడగు మానవుఁడు స్వామిద్రోహి, భగవద్రోహియగును. ఇందున తిలమాత్రమేని సందియములేదు. కావున బుధుఁడగువాఁడు నిత్యనైమిత్తిక కర్మలను దైవార్పితముగఁ బవిత్రముగఁ దప్పకచేయవలెను. అదియే భగవంతుఁడు తనపూజగ గ్రహించియనుగ్రహించును. శాస్త్ర విరుద్ధములును, నిందితములును గాని పవిత్ర కర్తవ్యముల సేవాకర్మల నితరములను జేయుచుండఁదగును. శరీరధారణము, భోగభాగ్యములు, జ్ఞానవిజ్ఞానములు, బల సామర్థ్యములు, క్షేత్రగృహారామములు, ధన ధాన్యములు మొదలగు వానినింకను జేకూర్చుకొనుటకై యెన్నెన్ని సాధనసంపత్తులు కలవో వానినెల్ల మానవుఁడు వినశ్వరములని యెఱిఁగి, యెంచి, భగవదర్పితము గావించి బుద్ధిమంతుఁడుగ జీవితముఁ బవిత్రముగఁ గొనసాగింపవలెను.

## షట్తీర్థ మాహాత్మ్యము

కుమారధారికా మాహాత్మ్యము:- ఇది వరాహ దేవుడు భూమాతకుంజెప్పెను. ఓదేవీ! ఆయారుపుణ్యతీర్థముల దగు కాలముల స్నానాదికము లొనర్చు దానిఫలమును, బాపవినాశమును జెప్పెదఁ జెవి యొగ్గివినుము. ఈ పర్వత రాజమునఁ గలలోకపావని

కుమారధారికా పవిత్ర తీర్థ తీరమునఁ బర్వతరాజకుమారీకుమారుఁడు అగ్నిసూనుఁడు కార్తికేయుఁడు నిజపత్నివి దేవసేనంగూడి యుండి, నిరంతరంబు, తానంబులఁ దనియుచు శ్రీనివాస సమర్చనములు సొనరించుచు ముదమందుచుండును. దాననయది కుమారధార యనవొప్పారుచుండును. దానపున్నెంపు నీరముల మీనమాసమున, అనఁగుంభరాశిని రవియున్న తరిని రవివాసరములందును, పరమ పవిత్రమగు మఘపూర్ణిమయందున, మఘానక్షత్రయుక్త దినమున మధ్యాహ్నకాలముననుస్నానము లొనర్చునతనికిం గలుగు ఫలమమోఘము, ననంతము. ఓ జగద్ధాత్రీ! వినుము. గంగాది పవిత్ర తీర్థములందెల్ల నియమ పూర్వకముగఁ బండ్రెండు వత్సరముల నిరళముగ స్నానాదులొనరించి నియమ నిష్ఠలమండు వాని కెట్టిఫలముచేకూరునో యదియెల్ల నీపవిత్ర తీర్థమున నాయా పుణ్యకాలముల నిర్మలమనమున నొక్కపరిమునిగి శ్రీహరిందలంచి మ్రొక్కినంతన పొందును; రాజ సూయయజ్ఞ ఫలముపొందును. వంశాభివృద్ధియగును; ఆజన్మముననే మోక్షప్రాప్తియగును. అట యథాశక్తివర్తించి సదక్షిణముగ నన్నదానంబొనరించు వానికి నంతకుమిన్నగ పుణ్యఫలమబ్బును.

**తుంబుతీర్థ మాహాత్మ్యము:-** ఓధరారామా! మీనమాసమున అన మీనరాసిని రవి యున్నతరిని పున్నమి తిథిని, ఉత్తరఫల్గుణీ నక్షత్రయుక్త చతుర్థకాలమున అన అపరాహ్ణమునను, ఆగిరి రాజమునంగల తుంబుతీర్థమున నభిస్నాతులగువారికి, బునర్గర్భ వాసముండదు; అన మఱిజన్మముండదు. ముక్తింబొంది తరింతురు. ఆకాలముననెల్ల తీర్థములు వచ్చి యాతుంబుతీర్థమునం జేరునుసుమా.

**ఆకాశగంగా మాహాత్మ్యము:-** సూర్యభగవానుఁడు మేషరాశి నలరుచుండి యన మేషమాసమున చిత్తానక్షత్రమున నొప్పు పుణ్యకాలమున, పౌర్ణమాసిని, ప్రాతఃకాలముననెల్ల తీర్థములు వచ్చి యాకాశగంగంజేరును. ఆయావేళల నాకాశగంగా సరిత్తున స్నానముసొనరించు నాతనికి మోక్షము కరతలామలకమేయగును. అట సువర్ణాది దానములాచరితములయి యనంతఫలమొసఁగును.

**పాండవతీర్థము :** ఓ రత్నగర్భా! సూర్యుఁడు వృషభరాశినున్న తఱిని వైశాఖమాసమున, భౌమసమన్విత కృష్ణపక్షముననేని, శుక్లపక్షముననేని, ద్వాదశి తిథియందున, ఆదివారమున, సంగమకాలమున, నాతీర్థముననెల్ల పావనతీర్థములు వచ్చిచేరును. కావున నాయావేళల నాపాండవతీర్థమున మునుకలిడు నావ్యక్తియీలోకమున నెన్నడును దుఃఖమందఁడు పరలోకమునను ననంతసుఖానంద లాభములొందును. గోదానాదులొనరించు వారికి జననమరణ బంధములు పాసి ముక్తిచేఁబడును.

పాపనాశనతీర్థ మాహాత్మ్యము:- ఓ మహాభాగా! ఏతద్భూధరేంద్ర శిఖరస్థ పావన పాపనాశన తీర్థరాజమున పుష్యమాసమునందు, శుక్లపక్షముననో బహుళపక్షముననో, పుష్యమితోఁగాని హస్తా నక్షత్రముతోఁ గాని కూడియున్న ఆదివారమునను, సప్తమి తిథిని, ఆశ్వయుజ మాసమున శుక్లపక్షమున భానువాసరమునను, ఉత్తరాషాఢ యుక్తసప్తమిని, ఉత్తరాభాద్ర తోడి ద్వాదశిని నియమమున స్నానము పొనరించు నాపుణ్యజీవికోటి జన్మలపాపములను బాసి పవిత్రుఁడై ముక్తుఁడు కాఁగలఁడు. అట విధిపూర్వకముగ స్నానములొనరించు శాలగ్రామ శిలాదానమొనరించిన వారి కాజన్మముననేకాదనేక జన్మలం జేసిన పాపములును హరించి ముక్తి సంప్రాప్తమగును.

దైవతీర్థ మాహాత్మ్యము:- ఓ దేవీ! ఆలింపుము. అనంతమను నాయద్రిరాజమున మదీయమగు దివ్యాలయమునకు వాయువ్య దిశనున్నత శిఖర గహ్వరమున రహస్యాతి రహస్యమగు దైవతీర్థమన నొప్పు సుందర తమ తటాకమొండొప్పుచుండును. అందున మునుకలిడఁదగు పున్నెపువేళల నుడువుచున్నాఁడ నాలింపుము - పుష్యమి కడచిపోయిన గురువారముననో, శ్రవణానక్షత్రయుక్త సోమవారముననో, స్నానములొనరించు వారికిం గలుగు ఫలమనంతము. అది వివరముగఁ జెప్పుచున్నాఁడను. మనముంచి యాలింపుము. తెలిసియో తెలియకయో యేరీతిగఁజేసినవైనను నెల్లపాపములు నీ పవిత్ర దైవతీర్థమున స్నానమాచరించినంత సమసిపోవును, పున్నెము పెంపుగాంచును. ఆపుణ్యతీర్థమున స్నానమాచరించినంతనె దీర్ఘాయువును, నైశ్వర్యోన్నతియుఁ బుత్రపౌత్రాభివృద్ధియు, బంధుమిత్ర సమృద్ధియు నొందును, కడపట స్వర్గలోకమును బొంది చంద్రలోకమున సమున్నతినందును. అచటఁ బవిత్రదినమున నన్నదానమొనర్చువాడు. అఖండాన్న దాతయగు వాని పుణ్యఫలమును బొందఁగమను. ఓ వసుమతీ నీకునేవతి గుహ్యతను విషయముల నెఱుంగంజెప్పితినిసుమా. అన్న విన్నయాపృథ్వీలలనామణి యెంతయుఁ బ్రసన్న మనంబున నాభూవరాహమూర్తిం దీయతీయని పలుకుల నిట్లని ప్రస్తుతించెను.

హే వరాహవదనా! దేవాధిదేవా! అచ్యుతా! అనంతా, భగవంతా! క్షీరసాగర సదృశ శరీరాభా! వజ్రశృంగా! మహాభుజా! ప్రభువరా! మీకివే వందనములు. ఓదివ్య స్వరూపా! విష్ణుదేవా! మహాసముద్రాగాధ జలముల మునిఁగి పడియున్న నన్నుఁ గల్పాదిని నుద్ధరించి పాలించితిరి. మీయనుగ్రహముననే, వేవేల బాహువుల నుద్ధరింపబడినే నీజగతీతలమును బట్టియున్నాను. భారముంబూని భరించుచున్నాను. నానావిధ దివ్యాభూషణ భూషితా, యజ్ఞసూత్రవిరాజితా! అరుణారుణాంబరధరా! రత్నరంజితగాత్రా! ఉద్యద్భాను ప్రతీకాశ పాదపద్మా! నమోవాకములు. బాలచంద్రవంకనుబోలు, సుతీక్షణమై ప్రకాశ వంతమగు దంష్ట్రాగ్రముల నొప్పునోసామీ కైమోడ్పులు! దివ్యచందన పరిలిప్తాంగా, మహాంగా

తప్తకాంచన కుండలమండితా, మహాబల పరాక్రమా! ఇంద్రనీలమణిజటిత సుశోభిత సువర్ణ మయాంగ దాలంకృతాంగా, వజ్రదంష్ట్రాగ్ర వినిర్భిన్న మహాబల విపక్ష హిరణ్యాక్షా! మహాదక్షా, నీకివే వేవేలుదండ ప్రణామములు. వికసిత విశాల పుండరీకనయనా! ఆతామ్రాక్షా, సామస్వనమనోహరా, వేదాంత భూషణా, వేదాంత వేద్యా సర్వాత్మా, సర్వేశ్వరా, విచిత్ర విక్రమవిరాజితా, వందనములు. హరహిరణ్య గర్భాదివందితా, ఆదిదేవా, సర్వవిద్యా మయాకారా, సర్వజ్ఞా, సర్వభూతహితవ్రతా, శబ్దాతీతా! నమస్కృతులు. ఆనంద విగ్రహా; అనంతా, కాలకాలా, కమనీయాకారా, ప్రణతులు; వేవేలువినతులు. అనిప్రస్తుతులు సానరించుచు నాభూమాతయూ దేవదేవు పాదపద్మముల కౌఁగి దండ ప్రణామము లొనరింపసాగెను. వరాహ దేవుండామెను నిజకేరంబులఁ బట్టి యెత్తి, హృదయమునకు హత్తుకొనెను. మూర్ధమాఘ్రాణించి వామాంకమున నుపవసింపఁజేసెను. అంతలోనన సంకల్ప మాత్రమునఁ దన్నుంజేరిన గరుటామంతుమూపున ధరణీ తరుణీ ద్వితీయుండై యధిరోహించి, నారదాది మునివరులు దేవవరులు సంకీర్తనము లొనరించుచుండ వృషభాచలముంగూర్చి పోయెను. అటలోకపూజితమగు స్వామి పుష్కరిణీ పశ్చిమతీరమున నిల్చి బ్రహ్మతుల్యులగు మహాత్ములచే మునివరులచే, వైఖానసులచే నిరతంబుఁ బూజింపంబడుచునుండెను.

## కమలాతటాక మాహాత్మ్యము

తొల్లితొండ మానుఁడను రాకుమారుడు లక్ష్మీమాతను, కమలాలయ నారాధించి యెన్నియేని వరములందెను. అట్లుదేవినుండి వరములంది ముందునకు సాగిపోయి కమలాతటాకము దరి శుకమున్యాశ్రమమును జేరి యాతపోధనునకు నమస్కరించి పూజించినిలిచెను. మునియుఁబ్రసన్న చిత్తుఁడై యుంటగ్రహించిన, యారాజాకమలా నామకతటాకము యొక్క మాహాత్మ్యము దనకు వివరముగఁజెప్పుండని వారింగోరెను. దాని కామునివరుండిట్లని చెప్పందొడంగెను.

తొల్లి దూర్వాసుఁడు కోపమ్మున శాపంబీయగా నాతపోధను భక్తుంగించపటుచుట కిచ్చగింపక యాకలుములజవరాలు, కేశవునిల్లాలు పతిదేవునితో వెన్నునితో వైకుంఠమును వీడివచ్చి బంగరుతామర పూలనొప్పు వీకొలనుంజేరినిలిచి యిటఁ బెక్కువర్షంబులు తపంబొనరించుచు నుండిపోయెను. అట నింద్రాదులు వేల్పులు వైకుంఠమునఁ జిరకాలముగఁ బద్మాలయయు, బద్మాక్షుఁడును లేకుంటకుఁ జింతించి, యన్వేషించి, యిటఁ గమలాక్షుతోఁ గూడియున్న లోకమాతను గమలాలయను గాంచి యానందోత్ఫుల్లనేత్రులై యాదేవీ దేవులకు లోకపితలకు నమస్కరించి నిలిచిరి. మఱియు వారపుడు హరిప్రియను గమలను కలుములతల్లిని యిట్లని స్తుతులొనరించిరి.

## దేవతలొనరించిన లక్ష్మీమాతృస్తుతి

ఉ॥ శ్రీలలనా శిరోమణికిఁ జెల్వగుతమ్మివసించు నమ్మకున్
మేలిమి బంగరున్దెగడు మేనిహొరంగుల మించు లచ్చికిన్
జాలికనుంగవంగనుచుఁ జక్కగ బత్తులఁ బ్రోచుతల్లికే
వేళను భక్తి మీఱగను వేడి, పొనర్తుము వందనమ్ములన్

కం॥ కమలాలయకును మ్రొ క్కులు
కమలాక్షికిఁగై మొగుపులు కమలకు వినతుల్
కమలాననకును జేజే
ల్గమలాంఘ్రికి వందనములు కడలి తనయకున్

చ॥ కలుములతోయజాక్షికిని, గంజదళాక్షుని డెందమిల్లుగా
నిలిచిన, లోకముల్గరుణ నిచ్చలు నేలెడి, తమ్మియింటితా
య్యలికిని, జాలిచూపుల మహామతికి న్సిరికమ్మయమ్మకం
జలిఘటియించి మ్రొక్కెదము జాబిలి యక్కకులోక మాతకున్

మానిని:- దండము లక్ష్మికిఁ దామరసాక్షికి
దండము విష్ణుతలోదరికిన్
దండముకల్మల తన్వికి, భక్తులఁ
దన్పు దయామతి కిందిరకున్
దండము పద్మకు, దండముశ్రీకిని
దండము మంగళ దేవతకున్,
దండములోకము తల్లికి, దర్పకు
తల్లికి మాకు రమామణికిన్

రమణకవృత్తము: నలువ జననికిని నలినసదనకును
నగధర సతికిని నతులు సదా
జలనిధి తనయకు జలజనయనకును
సరసిజ ముఖికిని శతవినతుల్
కలుముల పడతికిఁగనికరమున మముఁ
గనిమనుచు సిరికిఁ గయిమొగుపుల్
అలరుల విలుతున కలరెడి జననికి
నవవరతము నివె యభి వినతుల్ -

కం॥ హరియురమున శ్రీవత్సము
దరిఁజింతామణికిఁ బిరుదుఁ దనరెడి యమ్మా
కరివరదుని కనకాంగీ!
వెరవున మమ్మేలు మమ్మ విదితశరణ్యా

సీ॥ దండమొక్కటి నీకు దైత్యారిదయితరో
దండము|లెండు వేదండ గమన
మూఁడు దండములు కల్మొలనిచ్చు నమ్మరో
దండముల్నాల్గు పద్మాలయస్థ
అయిదు దండంబులో యమరేంద్ర పూజిత
పదియు దండంబులు పద్మనయన
దండముల్పది పదుల్తరళాయ తేక్షణ
వేయిదండంబులు ప్రేమ హృదయ

తే॥ లక్షదండముల్కరుణా కటాక్ష వీక్ష
ఎన్నియెన్నియొ దండములివిగో తల్లి
పుండరీకాక్షు కైదండపూనివచ్చి
కనికరమ్మున మమ్మేలు కమలనయన.

కం॥ పద్మానన, పద్మాసన
పద్మనయన పద్మహస్త పద్మాంఘ్రియునౌ
పద్మాననుగన్నమ్మను
బద్మనయను పతిఁగొలుతుము పద్మనుసతమున్

తే॥ మంగళంబబ్ధి కన్యకు మాకు శ్రీకి
మంగళము వెన్ను నన్నునకుంగమలకు
మంగళములోక జననికి, మంగళమ్ము
పద్మకుందల్లి తల్లికి భార్గవికిని

ఇట్లు విబుధ వరులెల్లరుమ బరిపరివిధములఁ బ్రార్థించుచుండఁ బ్రసన్నురాలై భార్గవిక్షీరసాగర కన్యక వారికి వైకుంఠునితోఁ గూడివచ్చి దర్శనంబిచ్చి యిట్లనియెను.

ఓ సుమనసులారా! దివౌకసులారా! ధర్మశూన్యుల, సత్యదూరుల, సురవైరుల రాక్షసుల నెల్లర సంహరించి విజయులై మీరు మీమీనెలవులకు నేగుదురుగాత. స్థానహీనులు: స్థానభ్రష్టులునగు మానవులెవ్వరీ త్రిదశవరకృత స్తోత్రంబున నన్నుం గీర్తింతురో వారును వారి వారి పదవుల స్థానంబులు నొందుదురు. భూమింగల

మానవులుగాని స్వర్గవాసులు త్రిదశులుగాని యీగీర్వాణకృత స్తోత్రంబుతో, నఖండ బిల్వపత్రములతో నన్నేరు పూజింతురో వారు ధర్మార్థకామములఁ బూర్ణులైతుదను మోక్షముంబొందుదురు. ఈతామర కొలకును, కమలా తటాకమును, జేరి యేరువేల్పులుగాని నరులుగాని యెవ్వరుగాని స్నానములొనరింతురో, యీ స్తోత్రముచే విష్ణువల్లభను నన్నుంబూజింతురో వారు సిరిసంపదలనంది దీర్ఘాయువులై, మేటి విద్యావినయ సంపన్నులై, విరాజిల్లుదురు. తేజోవంతులై, పుత్రపౌత్రాభివృద్ధిని, వంశోన్నతిని బొంది సుఖింతురు. ఇట్లు మాత పెక్కువిధంబుల వరంబులొసఁగి విష్ణు భగవానునితో గరుడా రూఢయై వైకుంఠమునకుంబయనమై పోయిచేరెను. ఇట్లనిశుకుండు మఱియు నిట్లనియెను. ఓరాకుమారా! ఈ పద్మసరోవరముం గీర్తించిన స్నానమొనరించిన రాజులకును నధికైశ్వర్యంబు లొనగూడును. నీవునునిందున స్నానమొనరించి పొమ్మన నాతఁడందున మున్కలిడి పవిత్రుఁడై మునివరునకు నమస్కరించి సెలవుతీసికొని నిజతురఁగమధిరోహించి, తనపురమునకు వెడలిపోయెను. తొండమానుఁడును రాజై ప్రజామంజకముగఁ బరిపాలన సాగించుచుండెను.

## అస్థితీర్థ మాహాత్మ్యము

ఇట్లు తొండమానుడు రాజ్యపాలనము సాగించుచుండ నొక సంవత్సరమునఁ గార్తీక మాసమున వసిష్ట గోత్రోద్భవుడగు వీరశర్మయను నొకవిప్రవరుఁడు మృతినొందిన తన పితృదేవుని యస్థులం, గొనిపోయి గంగంగలిపి పుణ్యతీర్థంబుల స్నానంబులొనరించిరాఁ గోరిక కలవాడై రాఘవుఁడను నొకపుత్రుని, లక్ష్మియనుపేర నొప్పు గర్భవతిని, తనభార్యను, పతివ్రతను తనవెంటఁగొని పయనమాయెను. పోవుచుఁ బోవుచు నిండుచూలాలగు దనభార్య నడిచి పయనము చేయలేకుండుటంగాంచి యెంతయుఁ జింతించెను మార్గవశంబున, దైవయోగమున జాతుర్వర్ణ్య జనాకీర్ణంబగు తొండమాను నగరంబును చేరెను. తొండమాను కీర్తినత డంతంత వినియుంట నాపట్టణమున నొకయెడ విడిసి భార్యను బుత్రుని నటనుంచి తానొక్కరుడుఁ రాజదర్శనమునకు నేతెంచెను. ద్వారపాలురచే నాతనియాగమనము విన్నరాజు వానిలోనికిం బిలిపించి సింహాసనమునకుం జెంగట నొక యాసనమున వేదవేద్యులగు విప్రజన మధ్యంబున, బండితజనాకీర్ణంబగు నాసభా మధ్యమున గూర్చుండఁజేసి, ఓ ద్విజోత్తమా! మీరాకకుంగారణమేమి? మీకైనేనేమి యొనర్పంగలను? సాదరమున జెప్పుండనెను. అదివిన్న యావిప్రోత్తము డెంతయు ముదమంది రాజును నాశీర్వాదములతో విశేషస్తుతులొనరించి యిట్లనియెను. ఓ నృపవరా! నలుదెసల నెల్లజనములు కీర్తింపనీకీర్తి నాలించినేనిట నీకడకు వచ్చితిని. ఓ నృపవరా! మాజనకులు కాలసంప్రాప్తినందిరి. వారి యస్థినిచయము కొనిపోయి గంగా నిమజ్జనం

బొనరింపఁ గృతనిశ్చయుఁడనై కాశికిం బయలుదేరితిని. నాభార్య గర్భవతి. పుత్రుండు పంచాబ్దంబులవాఁడు. అంతదనుక నడచిగానిసమర్థులు గాకయున్నవారు. కావున నే దిరిగివచ్చునంత దనుకవారినిట మీకడనుంచి పోనెంచితిని. ప్రజాసురక్షా, ఓ బ్రాహ్మణ జనప్రియా! వారిందండ్రివలె రక్షింపనర్హుఁడవు. ఆమెనెటులును నిప్పుడు నాతో తీసికొని పోఁజాలను. నామె దండ్రి వలె రక్షింపనర్హుండవు. పతివ్రతలగు స్త్రీలకుఁ బతిగృహముననే యుండవలయును. అటుకాని నాడు సూమయింటనో, పినమామయింటనో యుండనగును. అటుకానిచోఁ బితృగృహమున నక్షణమున నుండఁదగును. అందెందును అవకాశము లేనినాడు ప్రజాపతియగుట రాజగృహమునఁ బరిరక్షణమునఁ నుండఁదగును వనితలకు నల్గురు తండ్రులుగానెన్నఁదగినవారనుట సువిదితముగదా. వారిని రక్షింపు భారము మీయదియ. తీర్థయాత్రలొనరించి చేసికొని గంగాస్నాన మొనరించి యస్థి నిమజ్జనంబొనరించి తిరిగి వచ్చి యామెను గొనిపోదును. అంతవరకు నామెనిట సద్గృహమున నుంచికాపాడుము. పుణ్యశాలినియుఁ బవిత్రశీలయును బతివ్రతయునగు నామెయు నిటశాంతముగఁ గాలమువెళ్లఁబుచ్చఁగలదు. అన నారాజా విల్లిదుని యాజ్ఞన్నిగట్టునెంతయు నాదరించి వాని పయనమునకుం జాల దనమిచ్చిపోయిరమ్మనెను.

ఆ వీరశర్మయు భార్యాపుత్రులకడకుం బోయి వారిని రాజనగరంబునఁ జేర్చి తాను కాశికింబోయి పుణ్యభాగీరథిని మునుకలిడివత్తుననియు నంతదనుక వారినట రాజాశ్రయమున నుండుడనియుఁ బలికెను. దానికా వనితా రత్నము కన్నులనీరు గ్రుక్కుచు స్వామీ గంగను స్నానమాడి విశ్వేశ్వరదేవు నర్చించి తొందరగ రావలయునని పదముల వ్రాలెను. భూసురుఁడును పత్నినిపట్టియెత్తి యిట్లనె. తొందరగనె తిరిగివత్తును విచారింపకుము, పుత్రుని బెంగగొనకుండఁజూచికొనుము; అనియోదార్చుచు నేడ్చుకొడుకుంగౌగిటంజేర్చి యూరార్చి వారు తనపోవువైపునకే బాష్ప సందిగ్ధలో చనులగుచుఁగనుచుండ వెట్టెట్టోవారి విడిచి ముందునకుంగాళ్లు సాగకయె సాగిపోయెను. పతివెడలిన పిమ్మట బ్రాహ్మణపత్నియు గనులనీరు తుడిచికొని కన్న కుమరు కన్నులందుడుచుచు రాజపత్నికడకుం బోయెను. ఆ పిమ్మటనంతిపురిం జేరినరాజా పాటుతంగాంచి లోకమున మానవులు పలుతెఱఁగులవారు. ఈ బ్రాహ్మణకాంతను యత్నమునంగాపాడి యాజన్నిగట్టునకుం జేర్చుటయే మనధర్మము, అనిపలుతెరంగుల యోచించి యామాతా సుతుల యునికికిం బ్రత్యేకముగ నొక సుందరభవనము నెల్ల వసతులతో నిర్మించి యందుండ నియోగించెను. వారి కారెన్మిది మాసముల దనుక కావలసిన ధాన్యములు, పప్పులు మొదలగు నెల్ల సంబారములు, పాయిమీదికి,(బొయి క్రిందికిఁగట్టను బెట్టను వలయు సామగ్రి యంతయు, నిదికొఱతయనునది లేకుండగ, నిదికావలయునని యడుగ నవసరము లేకుండగవన్నియు నాయింట సర్వసమృద్ధిగ నుండఁజేసెను. అటు రాజాజ్ఞచేఁ బోతుటీగకేని బోవీలు లేకుండెను.

బొనరింపఁ గృతనిశ్చయుఁడనై కాశికిం బయలుదేరితిని. నాభార్య గర్భవతి. పుత్రుండు పంచాబ్దంబులవాఁడు. అంతదనుక నడచిగానిసమర్థులు గాకయున్నవారు. గాననే దిరిగివచ్చునంత దనుకవారినిట మీకడనుంచి పోనెంచితిని. ప్రజానురక్షా, ఓ బ్రాహ్మణ జనప్రియా! వారిందండ్రివలె రక్షింపనర్హుండవు. ఆమెనెటులును నిప్పుడు నాతో తీసుకొని పోఁజాలను. నామె దండ్రి వలె రక్షింపనర్హుండవు. పతివ్రతలగు స్త్రీలకుఁ బతిగృహమునా యుండవలయును. అటుకాని నాడు నామయింటనో మేనమామయింటనో యుండనగును. అటుకానిచోఁ బితృగృహమున. రక్షణమున నుండఁదగును. అందెందును అవకాశము లేనినాడు ప్రజాపతియగుట రాజగృహమునఁ బ్రరక్షణమున నుండఁదగును. వనితలకు నల్గురు తండ్రులుగానెన్నఁదగినవారనుట సువిదితముగదా. వారిని రక్షింపు భారము మీయదియ. తీర్థయాత్రలంబూర్తి చేసికొని గంగాస్నాన మొనరించి యస్థి నిమజ్జనంబొనరించి తిరిగి వచ్చి యామెను గొనిపోదును. అంతవరకు నామెనిట సద్గృహమున నుంచికాపాడునది. పుణ్యశాలినియుఁ బవిత్రశీలయును బతివ్రతయునగు నామెయు నిటశాంతముగఁ గాలమువెళ్ళఁబుచ్చఁగలదు. అన నారాజా వల్లెయని యాజన్నిగట్టునెంతయు నాదరించి వాని పయనమునకుం జాల దనమిచ్చిపోయిరమ్మనెను.

ఆ వీరశర్మయు భార్యాపుత్రులకడకుం బోయి వారిని రాజనగరంబునఁ జేర్చి తాను కాశికింబోయి పుణ్యభాగీరథిని మునుకలిడివత్తుననియు నంతదనుక వారినట రాజాశ్రయమున నుండుడనియుఁ బలికెను. దానికా వనితా రత్నము కన్నులనీరు గ్రుక్కుచు స్వామీ గంగను స్నానమాడి విశ్వేశ్వరదేవు నర్చించి తొందరగ రావలయునని పదముల వ్రాలెను. భూసురుఁడును పత్నినిపట్టియెత్తి యిట్లనె. తొందరగనె తిరిగివత్తును విచారింపకుము, పుత్రుని బెంగగొనకుండఁజూచికొనుము; అనియోదార్చుచు నేడ్చుకొడుకుంగౌగిటంజేర్చి యూరార్చి వారు తనపోవువైపునకే బాష్ప సందిగ్ధలో చనులగుచుఁగనుచుండ నెట్టెట్టోవారి విడిచి ముందునకుంగాళ్లు సాగకయె సాగిపోయెను. పతివెడలిన పిమ్మట బ్రాహ్మణపత్నియు గనులనీరు తుడిచికొని కన్న కుమరు కన్నులందుడుచుచు రాజపత్నికడకుం బోయెను. ఆ పిమ్మటనంతిపురిం జేరినరాజా పాటుతంగాంచి లోకమున మానవులు పలుతెఱఁగులవారు. ఈ బ్రాహ్మణకాంతను యత్నమునంగాపాడి యాజన్నిగట్టునకుం జేర్చుటయే మనధర్మము, అనిపలుతెరంగుల యోచించి యామాతా సుతుల యునికికిం బ్రత్యేకముగ నొక సుందరభవనము నెల్ల వసతులతో నిర్మించి యందుండ నియోగించెను. వారి కారెన్మిది మాసముల దనుక కావలసిన ధాన్యములు, పప్పులు మొదలగు నెల్ల సంబారములు, పొయిమీదికి,(బొయి క్రిందికిఁగట్టను బెట్టను వలయు సామగ్రి యంతయు, నిదికొఱతయనునది లేకుండగ, నిదికావలయునని యడుగ నవసరము లేకుండగనన్నియు నాయింట సర్వసమృద్ధిగ నుండఁజేసెను. ఇటు రాజాజ్ఞచేఁ బోతుటీగకేని _ బోవీలు లేకుండెను.

వాబావవయ్యాను గూరుచుండఁ బెట్టి, యిట్లని పలుకసాగెను. ఓ ధరణీసురవరా! తొందర పడకుము; మనసును జిక్కపట్టుకొనుము. పుత్రునకై పొగులకుము; భయముడుగుము. నీవనితారత్నము క్షేమముగఁ బుత్రికం బ్రసవించినది; కుమారీ కుమారులతో సుఖమున్నది. ధరామరవరా! యిటు వినుము. గడచిన శుక్రవారము నుండి శేషశైలవాసునకు వేంకటేశునకు నభిషేకములు జరుగుచుండెను. ఆ పుణ్యకార్యములను గాంచ నిచటి మాయెడంగల పుణ్యాంగనలెల్లను వెడలినారు. వారలతో నీపత్నియు నాపున్నెముంగనఁ బుత్రీపుత్రులతో వేంకటగిరికిం బోయియున్నది. నేడో, రేపటెల్లటనో నీయంతికమునకు వారు రాగలారు. అనుచు నాతని నూరటఁబెట్టి యేకాంతమున రాజు పుత్రకుంగని యిట్లనియెను నాయనా! తొందరపడకుము. దృఢమతి నా బ్రాహ్మణి గృహమ్మునకుం బొమ్ము. ఆ బ్రాహ్మణిం గనుంగొనుము. ఆయమను సంతానముతో వేగమ యిటకుం దోడ్కొనిరమ్ము; పొమ్ము, తడయకుమనెను. జనకు నాజ్ఞచొప్పున నాతఁడును వేవేగము నాగీమునకు వచ్చిలోనంజొచ్చి యెందును వారింగానక యొకయెడ వారి యస్థిపంజరములంగని యట్టె నిర్విణ్ణుఁడాయెను.

ఆ బ్రాహ్మణి యాయింట నున్నంతదనుక తిని కాలము వెళ్లఁబుచ్చెను. పంచారములన్నియు సమాప్తముగా దినఁదిండిలేక మలమలమాడెను. అభిమానవతియు, శీలవతియునగు నామె తనయున్న యింటిగడప దాటి బయటికిఁబోలేదు. కడకామె పుత్రుడు మలమలమాడి మృతినొంద నాతనింగాంచుచు నామెయు ప్రాణములు విడిచెను. వారియస్థిపంజరములం గాంచిన రాకుమారునకు పైప్రాణములు పైననే పోయినట్లాయెను. అయ్యో; యీ విప్రకుటుంబాంతముతో మావంశాంతముగూడ నేమో;యనుచుఁ బరిపరి తెఱంగులఁ బరితపించుచు నా రాకుమారుఁడు వేవేగ నయ్య కడకువచ్చి యేకాంతమున నిట్లనియెను. నాయనా! యేమనిచెప్పను? నేటితో మన వంశవాళము తెగిపడినదగును. అన్నపానములు లేక యాపాఱుత బిడ్డలతోఁ జనిపోయినది. యెముకల గూడులె యటఁ బడియున్నవి. అన్నీ విన్నరాజు వెతకుఁబరిమితియే లేదయ్యెను. అయినను దేకువగొని యాబ్రాహ్మణునకపుడ తిండికి స్వయంపాకమునకు బియ్యము పప్పులు మొదలగునవి ఇచ్చి కుశలమగునొక యింటికిం బంపి తానటనుండి వడివడి బిలమార్గమున లక్ష్మీపతిం దీనశరణ్యు శరణంబు నొంద శేషాచలమునకుం బుత్రునితో బోయెను. పోయిన యాయిర్వురును నాదేవుందర్శించి యడుగు దమ్ములంబడి కన్నీరు మున్నీరుగఁ గార్చుచుండం గాంచిన దేవుం డిట్లనియెను. రాజా! యిట్టియకాలమున నింత తొందరగ నిటకువచ్చిన పనియేమి? ఇప్పుడు మీపరితాపమునకుం గతమేమి? ఎంతయుధీరులు, దృఢమతులు, వీరులు, మీరిట్టులు వికలతనొందఁదగునా? యను నాదేవుమాటలేమియుం జెవిఁబడక నోటమాటరాక నిలిచియున్న నృపతింగని వానిడెంద మందలి కుందు వెతింగి సర్వాత్ముండిట్టులనియెను.

వాబావవయ్యాను గూరుచుండఁ బెట్టి, యిట్లని పలుకసాగెను. ఓ ధరణీసురవరా! తొందర పడకుము; మనసును జిక్కపట్టుకొనుము. పుత్రునకై పొగులకుము; భయముడుగుము. నీవనితారత్నము క్షేమముగఁ బుత్రికంబ్రసవించినది; కుమారీ కుమారులతో సుఖమున్నది. ధరామరవరా! యిటు వినుము. గడచిన శుక్రవారము నుండి శేషశైలవాసునకు వేంకటేశునకు నభిషేకములు జరుగుచుండెను. ఆ పుణ్యకార్యములను గాంచ నిచటి మాయెడంగల పుణ్యాంగనలెల్లను వెడలినారు. వారలతో నీపత్నియు నాపున్నెముంగనఁ బుత్రీపుత్రులతో వేంకటగిరికిం బోయియున్నది. నేడో, రేపటెల్లటనో నీయంతికమునకు వారు రాగలారు. అనుచు నాతని నూరటఁబెట్టి యేకాంతమున రాజు పుత్రకుంగని యిట్లనియెను నాయనా! తొందరపడకుము. దృఢమతి నా బ్రాహ్మణి గృహమ్మునకుం బొమ్ము. ఆ బ్రాహ్మణిం గమంగొనుము. ఆయమను సంతానముతో వేగమ యిటకుం దోడ్కొనిరమ్ము; పొమ్ము, తడయకుమనెను. జనకు నాజ్ఞచొప్పున నాతఁడును వేవేగము నాగీమునకు వచ్చిలోనంజొచ్చి యెందును వారింగానక యొకయెడ వారి యస్థిపంజరములంగని యట్టె నిర్విణ్ణుఁడాయెను.

ఆ బ్రాహ్మణి యాయింట నున్నంతదనుక తిని కాలము వెళ్లఁబుచ్చెను. పంచారములన్నియు పమాప్తముగా దినఁదిండిలేక మలమలమాడెను. అభిమానవతియు, శీలవతియునగు నామె తనయున్న యింటిగడప దాటి బయటికిఁబోలేదు. కడకామె పుత్రుడు మలమలమాడి మృతినొంద నాతనింగాంచుచు నామెయు ప్రాణములు విడిచెను. వారియస్థిపంజరములం గాంచిన రాకుమారునకు పైప్రాణములు పైననే పోయినట్లాయెను. ఆయ్యో; యీ విప్రకుటుంబాంతముతో మావంశాంతముగూడ నేమో;యనుచుఁ బరిపరి తెఱంగులఁ బరితపించుచు నా రాకుమారుఁడు వేవేగ నయ్య కడకువచ్చి యేకాంతమున నిట్లనియెను. నాయనా! యేమనిచెప్పను? నేటితో మన వంశవాళము తెగిపడినదగును. అన్నపానములు లేక యాపాటుత బిడ్డలతోఁ జనిపోయినది. యెముకల గూడులె యటఁ బడియున్నవి. అన్నీ విన్నరాజు వెతకుఁబరిమితియే లేదయ్యెను. అయినను దేకువగొని యాబ్రాహ్మణునకపుడ తిండికి స్వయంపాకమునకు బియ్యము పప్పులు మొదలగునవి ఇచ్చి కుశలమగునొక యింటికిం బంపి తానటనుండి వడివడి బిలమార్గమున లక్ష్మీపతిం దీనశరణ్యు శరణంబు నొంద శేషాచలమునకుం బుత్రునితో బోయెను. పోయిన యాయిర్వురును నాదేవుందర్శించి యడుగు దమ్ములంబడి కన్నీరు మున్నీరుగఁ గార్చుచుండం గాంచిన దేవుం డిట్లనియెను. రాజా! యిట్టియకాలమున నింత తొందరగ నిటకువచ్చిన పనియేమి? ఇప్పుడు మీపరితాపమునకుం గతమేమి? ఎంతయుధీరులు, ధృఢమతులు, వీరులు, మీరిట్టులు వికలతనొందఁదగునా? యను నాదేవుమాటలేమియుం జెవిఁబడక నోటమాటరాక నిలిచియున్న నృపతింగని వానిడెంద మందలి కుందు నెఱింగి సర్వాత్ముండిట్టులనియెను.

ప్రాణములతో, రక్తమాంసములు చర్మములు కల్గి సుందర సురమ్య శరీరములతో వారు ముప్వురు నొప్పిరి. అదియంతయుఁ బైనుండి కనువింతఁగఁ గనుగొనుచున్న బ్రహ్మ రుద్రేంద్రాది దేవతలు దాని ప్రభావమున కెంతయు నబ్బురమంది జయజయకారము వాసెలయేటిలో, బూలవానలు గురియించి యస్థులగూడులకును తన్నిమజ్జనము రక్తమాంసములు ప్రాణములు కల్గిని రూపము లొప్పుటచే దాని నస్థితీర్థంబని ముక్త కంఠములఁ బ్రశంసించిరి. అదియ దానికిం బేరాయెను. మహాపాపుల నరకమున మ్రగ్గ వారి యెమ్ముల గూడులును గొనివచ్చి యీ పుష్కరిణి నీజలముల ముంచి యెత్తిన వారి పాపపుంజములన్నియుఁ దొలఁగి నశించి వారు స్వర్గమున కుంబోయి చిరముగ సుఖింతురని వారుగ్గడించిరి. సప్రాణయైన యా భూసురకాంతయెంతయు వింతను మునిగిన చిత్తంబున బిడ్డలంగూడి నారాణులతోఁగూడి యందున మోదమ్మున మునుకలిడి వెలుపలికి వచ్చెను. రాణులతో వారిసఖులతో గూడియామెయు దేవదర్శనము పొనర్చి సమ్మోద మందెను. రమాధవుండా రాజవరుంగాంచి యిట్లనియెను. ఈ విప్రవరుడు కడు నియతాత్ముఁడు. మదీయ భక్తవరుడు. ఇతనియట్టివాఁడొరుఁడులేఁడు. ఈతడు జన్మాంతరమున మూడు వేదముల వివరించి ప్రవర్తిల్లఁ జేయఁగలఁడు. ఆ పిమ్మట నీతఁడు మదీయ సాయుజ్యముం బొందఁగలడు.

ఇట్లని భగవానుడు మఱియు నిట్లనియెను. పృథ్వీపతీ! భక్తికి విలువయేమని, యెంతయని కట్టవచ్చును. దానికెంతయైన నీయనే, నాకోరిక. నీభక్తి నీసోదరునను రక్తికి నుపకృతికి నేనువశుఁడను. ఇంతవరకును నేను భక్తులకుం బ్రత్యక్షమునందోఁచి ముఖాముఖి మాటలాడితిని. కాని యింతనుండి నాసంకల్పము మాఱినది. ఈ కలికాలమున నవ్యాజా, ప్రమాద సుస్థిర భక్తి సంపన్నులగు నేకొందఱి తోడనోకాక, యే ప్రత్యక్షము నందోఁచిమాటలాడను. అవసరమైనఁ బరోక్షముగనే ప్రసంగింతును. ఓ ధరాతలపతీ! నీవు నీపురమునకుంబొమ్ము; నిష్కంటకముగఁ బ్రజానుకూలముగ పాలనముం బొనరింపుము. ప్రజలను బిడ్డలుగాపెంచి, యా ప్రజలందుననే దేవుని నన్నుంగనుగొనుము. వారికేయిడుములు కలుగనీయక, కలిగిన యిడుములుమాపి వారికిం దండ్రివై, ధర్మమూర్తివై పరిపాలన సాగింపుము. అదియెపాలకుఁడగుటకు ఫలము. ప్రజానురంజకుఁడు కాని పాలకుడిహపరముల రెంట నీచాతినీచుఁడై నశించును. అనియారాజు, పుత్రుల వీడుకొల్పి తాను నంతర్థానమాయెను. ఇట్లు త్రివిక్రముచేఁ జెప్పంబడి రాజు పుత్రునితో రాణులతో బ్రాహ్మణ కుటుంబమును వెంట విడికొని నిజపురమునకుం జేరెను. అట్లు వచ్చి యా విప్రునీశర్మంగాచి వాని భార్యను బిడ్డల నర్పించి యిట్లనియెను. ఓధరామరా! ధన్యుఁడను. దైవయోగమునఁ బుత్రీపుత్రకులతో మీభార్య మీకుందక్కినది. వీరింబరిగ్రహింపుడు. అని జరిగిన యుదంతమంతయుం జెప్ప విని యాజన్నిగట్టును తబ్బిబ్బును నబ్బురమున

ప్రాణములతో, రక్తమాంసములు చర్మములు కల్గి సుందర సురమ్య శరీరములతో వారు ముప్పురు నొప్పిరి. అదియంతయుఁ బైనుండి కనువింతఁగఁ గనుగొనుచున్న బ్రహ్మ రుద్రేంద్రాది దేవతలు దాని ప్రభావమున కెంతయు నబ్బురమంది జయజయకారము వాసెలయేటిలో, బూలవానలు గురియించి యస్థులగూడులకును తన్నిమజ్జనము రక్తమాంసములు ప్రాణములు కల్గిని రూపము లొప్పుటచే దాని నస్థితీర్థంబని ముక్త కంఠములఁ బ్రశంసించిరి. అదియ దానికిం బేరాయెను. మహాపాపుల నరకమున మగ్గు వారి యెమ్ముల గూడులును గొనివచ్చి యీ పుష్కరిణి నీజలముల ముంచి యెత్తిన వారి పాపపుంజములన్నియుఁ దొలఁగి నశించి వారు స్వర్గమున కుంబోయి చిరముగ సుఖింతురని వారుగ్గడించిరి. సప్రాణమైన యా భూసురకాంతయెంతయు వింతను మునిగిన చిత్తంబున బిడ్డలంగూడి నారాణులతోఁగూడి యందున మోదమ్మున మునుకలిడి వెలుపలికి వచ్చెను. రాణులతో వారిసఖులతో గూడియామెయు దేవదర్శనము పొనర్చి సమ్మోద మందెను. రమాధవుండా రాజవరుంగాంచి యిట్లనియెను. ఈ విప్రవరుడు కడు వియతాత్ముఁడు, మదీయ భక్తవరుడు. ఇతనియట్టివాఁడొరుఁడులేఁడు. ఈతడు జన్మాంతరమున మూడు వేదముల వివరించి ప్రవర్తిల్లఁ జేయఁగలఁడు. ఆ పిమ్మట నీతఁడు మదీయ పాయుజ్యముం బొందఁగలడు.

ఇట్లని భగవానుడు మఱియు నిట్లనియెను. పృధ్వీపతీ! భక్తికి విలువయేమని, యెంతయని కట్టవచ్చును. దానికెంతయైన నీయనే, నాకోరిక. నీభక్తి నీసోదరునను రక్తికి మవకృతికి నేనువశుఁడను. ఇంతవరకును నేను భక్తులకుం బ్రత్యక్షమునందోఁచి ముఖాముఖి మాటలాడితిని. కాని యింతనుండి నాసంకల్పము మాఱినది. ఈ కలికాలమున నవ్యాజా, ప్రమాద సుస్థిర భక్తి సంపన్నులగు నేకొందఱి తోడనోకాక, యే ప్రత్యక్షము నందోఁచిమాటలాడను. అవసరమైనఁ బరోక్షముగనే ప్రసంగింతును. ఓ ధరాతలపతీ! నీవు నీపురమునకుంబొమ్ము; నిష్కంటకముగఁ బ్రజానుకూలముగ పాలనముం పొనరింపుము. ప్రజలను బిడ్డలుగావెంచి, యా ప్రజలందుననే దేవుని నన్నుంగనుగొనుము. వారికేయిడుములు కలుగనీయక, కలిగిన యిడుములువాపి వారికిం దండ్రివై, ధర్మమూర్తివై పరిపాలన సాగింపుము. అదియెపాలకుఁడగుటకు ఫలము. ప్రజానురంజకుఁడు కాని పాలకుఁడిహపరముల రెంట నీచాతినీచుఁడై నశించును. అనియారాజ, పుత్రుల వీడుకొల్పి తాను నంతర్థానమాయెను. ఇట్లు త్రివిక్రముచేఁ జెప్పంబడి రాజు పుత్రునితో రాణులతో బ్రాహ్మణ కుటుంబమును వెంట విడికొని నిజపురమునకుం జేరెను. అట్లు వచ్చి యా విప్రునిశర్మంగాచి వాని భార్యను బిడ్డల నర్పించి యిట్లనియెను. ఓధరామరా! ధన్యుఁడను. దైవయోగమునఁ బుత్రీపుత్రకులతో మీభార్య మీకుందక్కినది. వీరింబరిగ్రహింపుడు. అని జరిగిన యుదంతమంతయుం జెప్ప విని యాజన్నిగట్టును తబ్బిబ్బును నబ్బురమును

ప్రతిదినమట కుంబోయి, యాతని, నాతని యర్థాంగినిఁ గాంచి ప్రసన్నత నందుచుందుము. అహంకారమంటని యాతని మట్టిపూలె నాకెంతయు ముదమునొసంగును. రాజా! విరాగులు విగతాహంకారులునగు భక్తులు పలుతెఱంగుల వారు నాకెంతయుఁగూర్చు వారలుగలరు. పవిత్ర, వినిర్మల, వినమ్ర భక్తిచేనెట్టివాఁడైన నెవ్వడైన నన్ను వశమొనర్చుకొన గలండని యెఱుంగుము. అట్టి భక్తుని వెనుక కోడెవెనుకంబోవు గోవునట్లనే పోదుము. అనుదేవుని వ్యోమతల వాక్కులను వినినరాజా తనయహంకృతికి మిగుల లజ్జించి వినమ్రమస్తకుఁడై మాటిమాటికి దేవునకు నమస్కరించుచు దనరాజ ప్రసాదమును వీడి దిగికాలినడకన దేవుఁడు తెలిపిన తెన్నున నాకులాలుఁడున్న యెడకుం బయనమాయెను. ఆతురతతో కాలినడకను బోవుచు కుర్వగ్రామముంజేరి యాపరిసరముల భీముండెచ్చట? ఆధన్యజీవికులాలుండెందుండును? వానియిల్లెచ్చట? అని యడుగుచుండ రాజుంగని యందున్న వారలాకుమ్మరి భక్తినెంతయు వినుతించుచు నాతఁడున్న తావుంజూపిరి. ఆతొండమాన భూపాలుఁడును వారుచూపిన తెన్నున భీమునింటికింబోయెను. ఆ యింటికి వెలుపలనె నిలిచి యాభూపతి యాగృహపవిత్రతకు నెంతయు ముగ్ధుండై యెంతయుమతించెను; తన్మయుఁడై యాయింటి గుమ్మము కడనట్టె మైమఱచిపడిపోయెను. అదికన్న వారిడు పిలుపులు విని లోనున్న భీముఁడు తొందరగ బయటకు వచ్చి, మూర్ఛను మునింగియున్న రాజుంగాంచెను. కాంచి మిగులబెగడందుము నయ్యయో! ఎంతకష్టమాయెను? ఈ మహా ప్రభువరుండిట కేలవచ్చెను? వచ్చిన యాతఁడిటనిట్లుపడుటయేమి? ఇందునాదోషమేమున్నదో! హా! దైవమా! అగుగాక తలఁచిన నీమహారాజా యమునట్లనన్నుఁ గఠినముగ దండింపఁగలఁడు గదా? ఇట్లుపడుటయేమి? ఓదేవదేవా! రక్షింపుము రక్షింపుము. నీకు నివేదనములర్పింప నూరుకడవల నిత్తును. ఈరాజవరుండానతిచ్చిన వన్నియు నిప్పుడె సమర్పింతును. అనియాతఁడనుచు నుండ నంతనరాజా వ్నృతినంది మూర్ఛందేరి లేచి యాతురతను ఏడీ యా భీముఁడెక్కడ? ఆశ్రీహరిభక్తవరుఁడు కులాలుండెక్కడ? శ్రీకృష్ణభక్తుని యాతని పాదపద్మములకేనిదే యొరగెదను. అనిరాజనుచుండ భీముఁడు వినమ్రుఁడై రాజునకు నమస్కరించి చెంగట నిలిచెను. అంతట రాజాకులాలు భీముంగాంచి భక్తవరా! నీవుదేవు నేవిధిఁ బూజించు చుందువు? అదియెల్లనాకుం జెప్పవే యని యడిగెను. అదివిన్న కులాలుఁడు రాజుతో నిట్లనెను. ఓ భూపాలచంద్రమా! పూజలు పునస్కారములు పున్నెములు నాకేమి తెలియును? కుండలామకొనువాఁడను. ఎల్లపుడు మనసున నాదేవునేయుంచికొని తలుచుకొను చుందును. వలువురు కాదనుతెన్నును మానినడుచుకొందును. ఎఱిఁగి యెవరికిని బాధ కలిగింపఁదొరకొనను. అంతయు నాదేవుని దయవలననే నాజీవితమిట్లు సాగుచున్నది. ఇదియంతయు నాదేవునను గ్రహమే యని పలుకుచుండగనే భక్తవత్సలుఁడు భగవానుఁడు శ్రీహరియప్పుడ మహాత్ముఁడగు నాకులాలు నెదుటఁదోచెను. ఎదుటం దోచిన జగద్రక్షకు

ప్రతిదినమట కుంబోయి, యాతని, నాతని యర్ధాంగినిఁ గాంచి ప్రసన్నత నందుచుందును. అహంకారమంటని యాతని మట్టిపూలె నాకెంతయు ముదమునొసంగును. రాజా! విరాగులు విగతాహంకారులునగు భక్తులు పలుతెఱంగుల వారు నాకెంతయుఁగూర్పు వారలుగలరు. పవిత్ర, వినిర్మల, వినమ్ర భక్తిచేనెట్టివాఁడైన నెవ్వడైన నన్ను వశమొనర్చుకొనఁ గలండని యెఱుంగుము. అట్టి భక్తుని వెనుక కోడెవెనుకంబోవు గోవునట్లనే పోదును. అనుదేవుని వ్యోమతల వాక్కులను వినినరాజు తనయహంకృతికి మిగుల లజ్జించి వినమ్రమస్తకుఁడై మాటిమాటికి దేవునకు నమస్కరించుచు దనరాజ ప్రసాదమును వీడి దిగికాలినడకన దేవుఁడు తెలిపిన తెన్నున నాకులాలుఁడున్న యెడకుం బయనమాయెను. ఆతురతతో కాలినడకను బోవుచు కుర్వగ్రామముంజేరి యాపరిసరముల భీముండెచ్చట? ఆధన్యజీవికులాలుండెందుండును? వానియిల్లెచ్చట? అని యడుగుచుండ రాజుంగని యందున్న వారలాకుమ్మరి భక్తినెంతయు వినుతించుచు నాతఁడున్న తావుంజూపిరి. అతొండమాన భూపాలుఁడును వారుచూపిన తెన్నున భీమునింటికింబోయెను. ఆ యింటికి వెలుపలనె నిలిచి యాభూపతి యాగృహపవిత్రతకు నెంతయు ముగ్ధుండై యెంతయునుతించెను; తన్మయుఁడై యాయింటి గుమ్మము కడనట్టె మైమఱచిపడిపోయెను. అదికన్న వారిడు పిలుపులు విని లోనున్న భీముఁడు తొందరగ బయటకు వచ్చి, మూర్ఛను మునింగియున్న రాజుంగాంచెను. కాంచి మిగులబెగడందుచు నయ్యయో! ఎంతకష్టమాయెను? ఈ మహా ప్రభువరుండిట కేలవచ్చెను? వచ్చిన యాతఁడిటనిట్లుపడుటయేమి? ఇందునాదోషమేమున్నదో! హా! దైవమా! అగుగాక తలఁచిన నీమహారాజు యమునట్లనన్నుఁ గఠినముగ దండింపఁగలఁడు గదా? ఇట్లుపడుటయేమి? ఓదేవదేవా! రక్షింపుము రక్షింపుము. నీకు నివేదనములర్పింప నూరుకడవల నిత్తును. ఈరాజవరుండానతిచ్చిన వన్నియు నిప్పుడె సమర్పింతును. అనియాతఁడనుచు నుండ నంతనరాజు స్మృతినంది మూర్ఛందేరి లేచి యాతురతను ఏడీ యా భీముఁడెక్కడ? ఆశ్రీహరిభక్తవరుఁడు కులాలుండెక్కడ? శ్రీకృష్ణభక్తుని యాతని పాదపద్మములకేనిదే యెరఁగెదను. అనిరాజనుచుండ భీముఁడు వినమ్రుఁడై రాజునకు నమస్కరించి చెంగట నిలిచెను. అంతట రాజాకులాలు భీముంగాంచి భక్తవరా! నీవుదేవు నేవిధిఁ బూజించు చుందువు? అదియెల్లనాకుం జెప్పవే యని యడిగెను. అదివిన్న కులాలుఁడు రాజుతో నిట్లనెను. ఓ భూపాలచంద్రమా! పూజలు పునస్కారములు పున్నెములు నాకేమి తెలియును? కుండలానుకొనువాఁడను. ఎల్లపుడు మనసున నాదేవునేయుంచికొని తలుచుకొను చుందును. పలువురు కాదనుతెన్నును మానినడుచుకొందును. ఎఱిఁగి యెవరికిని బాధ కలిగింపఁదొరకొనను. అంతయు నాదేవుని దయవలననే నాజీవితమిట్లు సాగుచున్నది. ఇదియంతయు నాదేవుననుగ్రహమే యని పలుకుచుండగనే భక్తవత్సలుఁడు భగవానుఁడు శ్రీహరియప్పుడ మహాత్ముఁడగు నాకులాలు నెదుటఁదోచెను. ఎదుటం దోచిన జగద్రక్షకు

వేదాలు మాకెట్లుతెలుసు? ఏదారిని మిమ్ముఁ బూజించి ప్రార్థింతుము మాపాలియన్న యయ్యలారా! మమ్మెట్టులను గనికరించి వచ్చినారు. వండిసిద్ధముగనున్నది. మాపెట్టుపీయన్న ముందననిగఁదిని మమ్మనుగ్రహింపుడు. కాదనకుడు. అదిచు మాకుపదివేలు. మేమేపాటువారము. ఇదియంతయు మీయనుగ్రహమ్మ; మీయిచ్చినది మీకైవండఁబడినది. అదిగోనాపతిదేవుఁడు మీయొప్పుదలకై యున్విళ్లూరుచు వెట్టుట చూచుచున్నాఁడో. మాపెట్టినకుడుపుకుడువుఁడు. అదియమాకానందము. అనుచు బలుతెలుంగులనేమేమియో పలికిపేడుకొనుచుండ నాభక్తురాలికిఁ దమాలినికిం బ్రసన్నుడై వెన్నెలదొంగ లచ్చిమోముంగని చిన్నగనవ్వెను. ఆమెయుఁ జిఱునవ్వు నవేయానాస యుత్తరమొసంగెను. అంతనాయనంతుఁడు జగన్నియంత నాకుమ్మరి వడుపుతో నిట్లనియెను. బిడ్డా! భక్తిని మీరుపెట్టు నాయన్నమును మేమెంతయుఁ బ్రేమనన్నను గ్రహింతుము. అదియట్టిదిట్టిది యననేల? భక్తిరసమున బొదిగిన యదిమాకు మిగుల కమ్మగ రుచివంతముగనగును.అనుచు నావాత్సల్య సముద్రుఁడు శ్రీనివాసుఁడున్న యాకులాల దంపతులిడిన భోజనమును వారియింటనెంతయుం బ్రీతిని నాపక్షి శ్రీదేవితోఁగూడ నారగించెను. ఈ వినోదముం గనుచున్న శివ విరించ్యాదు లత్యా మనమ్మున నాజగత్కర్తను జగత్కళ్యాణమూర్తి ననేక విధములఁ గీర్తింపసాగిరి. దివిజులు దివ్యదుందుభులు మ్రోగించిరి. కల్పద్రుమములు పూలజల్లులుగఁ గురిసెను. అనమయమున నొక యుత్తమ విమానమటకువచ్చెను. ఆవచ్చిన విమానముఁ గాంచిదేవుఁడా శీమునకు దివ్యకిరీటము, శంఖ చక్రములు, పీతాంబరము, దివ్య మాలాలంకారములు నిచ్చెను. లక్ష్మీమాతయు దివ్య మాల్యాంబరాభరణము లానవితారత్నమునకుఁ దమాలినికిచ్చెను. ఆ కులాల దంపతులును దివ్యాభరణాంబర భూషితులై దేవీదేవులకు మ్రొక్కుచు, రాజును గృతజ్ఞతంగనుచుఁ బరాత్పరుననుమతంబున నావిమానమునెక్కి విష్ణులోకమునకుంబోయిరి. అదియంతయుం గాంచిన తొండమానుఁడు వారలగతికెంతయు నానందమును నబ్బురమునొందియుఁ దనగతికెంతయుం జానవతముఖుఁడై దేవుంగాంచి యిట్లుపలికెను. ఓ దేవా యిది యేమి యన్యాయము. వారాధ్యమునఁ గల్గునొక నాల్గవ జాతివానికిఁ గష్టజీవికి నొడలితో సాయుజ్యమొసంగితివే. నిన్నే నమ్మిభక్తి ప్రవర్తిమన్న నన్నిట్టులుపేక్షించితివి. నేచేసిన పాపమేమి? అనుచుండ దేవుండు కనికరమున నిట్లనియెను. ఓరాజా దుఃఖింపకుము. నాకొకఁడు మిత్రుడు నొకడు శత్రుఁడు లేఁడని తెలిసికొనుము. ఎవఁడుకాని తనచేతకుఁ దగిన ఫలముంబొందును. మంచికి మంచియేఫలము. అట్లేచెడ్డకుం జెడ్డఫలమె సంప్రాప్తమగును. నాటిన వేపవిత్తు మొలకెత్తి చెట్టై చేదగువేపకాయలె కాయును, తీయని మామిడిపండ్లను గాయదుకదా! నిజమె నీవెంతయు భక్తుఁడవు. పవిత్రవర్తనుఁడవు. కానిశుద్ధమగు మంచిపాల నొకింతపులుపుచేతి విఱచి చెఱచునట్లు నీగర్వమె నీయభ్యుదయ

వేదాలు మాకెట్లులెఱుక? ఏదారిని మిమ్ముఁ బూజించి ప్రార్థింతుము మాపాలియున్న యయ్యలారా! మమ్మేటులను గనికరించి వచ్చినారు. వండిసిద్ధముగనున్నది. మాపెట్టునీయన్న ముందనివిగఁదిని మమ్మనుగ్రహింపుడు. కాదనకుడు. అదియె మాకువదివేలు. మేమేపాటువారము. ఇదియంతయు మీయనుగ్రహమ్ము; మీయిచ్చినది మీకైవండఁబడినది. అదిగోనాపతిదేవుఁడు మీయొప్పుదలకై యువ్విళ్ళూరుచు నెట్లుఁ జూచుచున్నాఁడో. మాపెట్టినకుడుపుకుడువుఁడు. అదియమాకానందము. అనుచు బలుతెఱంగులనేమేమియో పలికివేడుకొనుచుండ నాభక్తురాలికిఁ దమాలినికిం బ్రసన్నులై వెన్నెలదొంగ లచ్చిమోముంగని చిన్నగనవ్వెను. ఆమెయుఁ జిఱునవ్వు నవ్వేయానన యుత్తరమొసంగెను. అంతనాయనంతుఁడు జగన్నియంత నాకుమ్మరి సదుమతో నిట్లనియెను. బిడ్డా! భక్తిని మీరుపెట్టు నాయన్నమును మేమెంతయుఁ బ్రేమననుఁ గ్రహింతుము. అదియట్టిదిట్టిది యననేల? భక్తిరసమున బొదిగిన యదిమాకు మిగులఁ గమ్మగ రుచివంతముగనగును.అనుచు నావాత్సల్య సముద్రుఁడు శ్రీనివాసుఁడున్నన యాకులాల దంపతులిడిన భోజనమును వారియింటనెంతయుం బ్రీతిని నాపత్ని శ్రీదేవితోఁగూడ నారగించెను. ఈ వినోదముం గనుచున్న శివ విరించ్యాదు లుత్సాహమునమ్మల నాజగత్కర్తను జగత్కళ్యాణమూర్తి ననేక విధములఁ గీర్తింపసాగిరి. దివిజులు దివ్యదుందుభులు మ్రోగించిరి. కల్పద్రుమములు పూలజల్లులుగఁ గురిసెను. ఆసమయమున నొక యుత్తమ విమానమటకువచ్చెను. ఆవచ్చిన విమానముఁ గాంచిదేవుఁడా భీమునకు దివ్యకిరీటము, శంఖ చక్రములు, పీతాంబరము, దివ్య మాలాలంకారములు నిచ్చెను. లక్ష్మీమాతయు దివ్య మాల్యాంబరాభరణములానవితారత్నమునకుఁ దమాలినికిచ్చెను. ఆ కులాల దంపతులును దివ్యాభరణాంబర భూషితులై దేవీదేవులకు మ్రొక్కుచు, రాజును గృతజ్ఞతంగనుచుఁ బరాత్పరునను మతించిన నావిమానమునెక్కి విష్ణులోకమునకుంబోయిరి. ఆదియంతయుం గాంచిన తొండమానుఁడు నారలగతికెంతయు నానందమును నచ్చెరమునొందియుఁ దనగతికెంతయుం జావనతముఖుఁడై దేవుంగాంచి యిట్లుపలికెను. ఓ దేవా యిది యేమి యన్యాయము. నారాధ్యమునఁ గల్గునొక నాల్గవ జాతివానికిఁ గష్టజీవికి నొడలితో సాయుజ్యమొసంగితివే. నిన్నే నమ్మిభక్తి ప్రపత్తినున్న నన్నిట్టులుపేక్షించితివి. నేచేసిన పాపమేమి? అనుచుండ దేవుండు కనికరమున నిట్లనియెను. ఓరాజా దుఃఖింపకుము. నాకొకఁడు మిత్రుడు నొకడు శత్రుఁడు లేఁడని తెలిసికొనుము. ఎవఁడుకాని తనచేతకుం దగిన ఫలముంబొందును. మంచికి మంచియే ఫలము. అట్లేచెడ్డకుం జెడ్డఫలమె సంప్రాప్తమగును. నాటిన వేపవిత్తు మొలకెత్తి చెట్టై చేదగువేపకాయలె కాయును, తీయని మామిడిపండ్లను గాయదుకదా! నిజమె నీవెంతయు భక్తుఁడవు. పవిత్రవర్తనుఁడవు కానిశుద్ధమైన మంచిపాలనొకింత పులుపుచేత విఱిచి చెఱుచునట్లు నీగర్వమె నీయభ్యుదయ

సురముని పూజితుడు భగవానుడు శ్రీహరి సర్వజనారాధితుఁడు శ్రీనివాసుఁడు నీలోకమున నిట్టివెన్నెన్నియో వింతచరితల బత్తులందనియించుచు, సాధుసజ్జనుల మనోరథము లందీర్చుచు నీకలియుగమునఁ బ్రత్యక్ష దైవమై యావేంకటనగంబున నేడుకొండలవాడు, నిలిచి యెల్లరకును సుగమ్యుఁడై వెలసియుండెను. ఆ దేవుంబొందు కోరిక యేని పవిత్రవినమ్ర, జీవితముంగడపందగును. ఎల్లరందున దేవుని దేవునందెల్లర దన్నుంగనుచు, నాదేవునెడ నుడుగని భక్తినుంచి కామక్రోధముల మదమత్సరములు విడిచి సర్వసమభావమున నొప్పనగును.

## మాటయెనిమిది దివ్య తీర్థములు

ఓ భగవానుఁడా! భక్తివైరాగ్యముల నొసంగునా నూటయెన్మిది దివ్యతీర్థములేవియో పేర్కొమండన్న శౌనకాదులకు రోమహర్షణి యిట్టులనియెను. అగునగు నాదివ్యతీర్థముల పవిత్రనామములు దినదినము పేర్కొనియు, వినియుఁజదివియు వినుచు వారల పాపములెల్లందొలంగి, పున్నెములొదవి ముక్తిచే కూరునన వానియందెప్పుడును స్నానంబు లొనరించుచువట సత్కర్మల నిరతము నొనరించు నాపవిత్ర హృదయుల భాగ్యముంగూర్చి వేరెచెప్పటెందులకు? అనుచు మఱియు నిట్టులు చెప్పసాగెను.

దేవునకుఁ బూర్వదిశనాగ్నేయ దిగ్భాగమున చక్రరాజాధిష్ఠితమగు పరమ ప్రశిద్ధమగు, చక్రతీర్థము కలదు. దానికిఁబైన మిగుల మనోహరమగు వజ్రతీర్థము తనరారును. ఆమీద నింద్రునియుఁ బాపములహరించిన యుత్తమమగు విష్వక్సేన తీర్థమొప్పును. ఆ తరువాతఁ బంచాయుధతీర్థమును హలాయుధ తీర్థమును దానికీశానమున మనోహరములగు వారసింహకాశ్యప తీర్థములును నామీఁద మన్మథ బ్రహ్మాగ్ని గౌతమ తీర్థంబులును దనరారును. పిమ్మట దైవ దైవల విశ్వామిత్ర భార్గ వాష్టావక్ర తీర్థములును వాపై వాగ్నేయదిశను దురారోహణ తీర్థము నొప్పియుండెను. వానికీశానమునఁ బిశాచముల నొదిల్చి తరుమఁగల భైరవతీర్థ మలరారును. పిమ్మటనుదర రోగములను గుదుర్చు మేహాతీర్థమును, దానికిఁ బశ్చిమమున క్షేత్రపాల శిలాతీర్థము పాండవతీర్థము నటమీఁదఁ బుణ్యాభరితము వాయుసేవితమువగు వాయుతీర్థము నొప్పియున్నవి. ఆపైనున్న దృష్టితీర్థము. అది మహాపుణ్యప్రదము. అందునమృతుల యస్తులు వైచినవారు దివ్యదేహముల నొంది పరమపదప్రాప్తులు కాఁగలరు. అటుపిమ్మట స్నానమొనరించిన మాత్రన దీర్ఘాయువుంగలిగించు మార్కండేయ తీర్థమును జాబాలితీర్థము, వాలఖిల్యతీర్థమును వాపైనెల్లజ్వరాది రోగములఁబాపు జ్వరహరి తీర్థముం గలవు. ఆదరిన విషహరి తీర్థమొప్పును. దావఁవానములాడినఁ దక్షకసందష్టులగు వారి యొడలివిషమును దిగి నిర్విషులై

సురముని పూజితుడు భగవానుడు శ్రీహరి సర్వజనారాధితుఁడు శ్రీనివాసుఁడు నీలోకమున నిట్టివెన్నెన్నియో వింతచరితల బత్తులందనియించుచు, సాధుసజ్జనుల మనోరథము లందీర్చుచు నీకలియుగమునఁ బ్రత్యక్ష దైవమై యావేంకటనగంబున నేడుకొండలవాడు, నిలిచి యెల్లరకును సుగమ్యుఁడై వెలసియుండెను. ఆ దేవుంబొందు కోరిక యేని పవిత్రవిగ్రహ, జీవితముంగడపందగును. ఎల్లరందున దేవుని దేవునందెల్లర దన్నుంగనుచు, నాదేవునెడ నుడుగని భక్తినుంచి కామక్రోధముల మదమత్సరములు విడిచి సర్వసమభావమున నొప్పనగును.

## మూటయెనిమిది దివ్య తీర్థములు

ఓ భగవానుఁడా! భక్తివైరాగ్యముల నొసంగునా నూటయెన్మిది దివ్యతీర్థములేవియో పేర్కొమండన్న శౌనకాదులకు రోమహర్షణి యిట్టులనియెను. అగునగు నాదివ్యతీర్థముల పవిత్రనామములు దినదినము పేర్కొనియు, వినియుఁజదివియు వినుచు వారల పాపములెల్లందొలంగి, పున్నెములొదవి ముక్తిచే కూరునన వానియందెప్పుడును స్నానంబు లొనరించుచువట సత్కర్మల నిరతము నొనరించు నాపవిత్ర హృదయుల భాగ్యముంగూర్చి వేరెచెప్పటెందులకు? అనుచు మఱియు నిట్టులు చెప్పసాగెను.

దేవునకుఁ బూర్వదిశనాగ్నేయ దిగ్భాగమున చక్రరాజాధిష్ఠితమగు పరమ ప్రశిద్ధమగు, చక్రతీర్థము కలదు. దానికిఁబైన మిగుల మనోహరమగు వజ్రతీర్థము తనరారును. ఆమీద నింద్రునియుఁ బాపములహరించిన యుత్తమమగు విష్వక్సేన తీర్థమొప్పును. ఆ తరువాతఁ బంచాయుధతీర్థమును హలాయుధ తీర్థమును దానికీశానమున మనోహరములగు వారపింహకాశ్యప తీర్థములును నామీఁద మన్మథ బ్రహ్మాగ్ని గౌతమ తీర్థంబులును దనరారును. పిమ్మట దైవ దైవల విశ్వామిత్ర భార్గ వాష్టావక్ర తీర్థములును వానైవాగ్నేయదిశను దురారోహణ తీర్థము నొప్పియుండెను. వానికీశానమునఁ బిశాచముల నొదిల్చి తరుమఁగల భైరవతీర్థ మలరారును. పిమ్మటనుదర రోగములను గుదుర్చు మేహతీర్థమును, దానికిఁ బశ్చిమమున క్షేత్రపాల శిలాతీర్థము పాండవతీర్థము నటమీఁదఁ బుణ్యాభరితము వాయుసేవితమువగు వాయుతీర్థము నొప్పియున్నవి. ఆపైనున్న దృష్టితీర్థము. అది మహాపుణ్యప్రదము. అందునమృతుల యస్థులు వైచినవారు దివ్యదేహముల నొంది పరమపదప్రాప్తులు కాఁగలరు. అటుపిమ్మట స్నానమొనరించిన మాత్రన దీర్ఘాయుష్యంగలిగించు మార్కండేయ తీర్థమును జాబాలితీర్థము, వాలఖిల్యతీర్థమును వానైనెల్లశ్వాసాది రోగములఁబాపు జ్వరహరి తీర్థముం గలవు. ఆదరిన విషహరి తీర్థమొప్పును. దానఁవానములాడినఁ దక్షకసందష్టులగు వారి యొడలివిషమును దిగి నిర్విషులై

నొనంగునవై కాశ్యపాశ్రమమాదిగ నర్థయోజనము మేరవరకుంగల యాతావు కొండనెత్తమ్మునఁ గుమారధారికకుం బశ్చిమంబునఁ గలవు.

ముల్లోకములందునను ముప్పదికోట్లయేబది లక్షల పుణ్యతీర్థంబులు గల్వ, అందెల్లఁ బ్రకృతి జన్యములయి సహజ పావనములగు తీర్థమ్ములీ శ్రీనివాస శైలరాజమ్మునఁ కలవు. ఓమునిసత్తములారా! భూప్రదక్షణ మాచరింపఁగోరిక కల మానవుఁడు సర్వతీర్థమయంబును సకల పుణ్యక్షేత్ర సంయుతంబునునగు నీపవిత్ర వేంకటాచలమును బ్రదక్షణంబుగఁ జుట్టి వచ్చిన భూమియందలి యెల్లపుణ్యక్షేత్రంబులు సేవించినఁ బొందఁగలుగు ఫలంబును బొందఁగలఁడు. తొల్లిద్వాపరయుగంబున హలాయుధుఁడగు బలరాముఁడు వేంకటాచల శృంగాగ్రమును గాంచినంత మాత్రమున నె సంపూర్ణముగా తీర్థయాత్రాఫలమును బొందెనని వినబడుచున్నది.

ఎదహత్తినబత్తి నెవ్వఁడీ సిరిమలననెక్కి తీర్థంబుల నోలలాడునో శ్రీనివాసుం గొలుచునో, వాఁడుకుంటివాఁడయ్యుఁ బాదములఁబొంది బాగుగనడువఁ గలవాఁడగును. గ్రుడ్డివాడయ్యేనేని పద్మపత్ర విశాలాక్షుండై బాగుగఁ జూడఁజాలును. మూగయైన వాచస్పతి యట్లుమాటలాడఁగలుగును. చెవిటివాఁడును దూరశబ్దంబులును బాగుగ వినఁగలుగును. గొడ్రాలుమ వలసిన సంతానమును బొందఁగల్గును. ధనహీనుఁడు ధనవంతుడగును. ఇదియంతయు నాపర్వతమందు, నాపర్వతేశు నందు భక్తిశ్రద్ధలుంచిన మాత్రన, యెడఁద కడిగికొని వడయాడిన మాత్రన, వొడఁగూడఁ గలదు. ఇందున సందియమేమియులేదు.

ఈ శ్రీవేంకటాచలమును సంపూర్ణముగఁ దత్వతః యెఱుంగం గలిగిన వానికెవ్వనికింగాని యాశ్రీనివాసాచలమొకప్పుడు కనకాద్రిగ మఱియొకప్పుడు జ్ఞాన రూపమున, రత్నమయా కారమున, వేరొకప్పుడు భూషణోజ్వలమై సాక్షాత్ శ్రీనివాసుని వలెనే ప్రకాశించుచుమండును. ఈ యదియే కాలభేదంబున, వ్యక్తిభేదంబున నొక్కనికి సామాన్యశైలమట్టులవే తోచుచుండెను. ఇట్టి యీభూధరరాజము యొక్కపుణ్యమును మాహాత్మ్యమును నెవ్వండెఱుంగ నోపును? ఇఁకనేనన్ననో, చూచినది, విన్నది, గ్రహించినది కొంతకొంతగ మీకు వచింపఁ గలిగినాఁడను. విన్నదియు, గన్నదియుఁ బూర్తిగవివరింప నే సమర్థుడనే? అనుచున్న నాతని విని యామునులిట్లనిరి.

ఓ ఋషివరా! ఈ తీర్థములమునకలిడినఁ బాపములు తొలఁగును. అదినిక్కము కాని మఱిమఱి పాపములొనరించుచు మఱల మఱల మునుగుచుఁబోయిన వారిపాపములు తొలంగుచునే పోవునందురు? అట్లయిన వారి పాపములు మితిమీఱి ప్రపంచమునే నరకకూపమొనరింపవా? ఇకసాధు సజ్జనులకును దుర్బలులకును బ్రతుకులే లేకపోవుమగదా? అన్నవిని రోమహర్షణి మోమునఁ జిఱునవ్వొలయ వారలకిట్లనె. పూజ్యముని

నొసంగునదై కాశ్యపాశ్రమమాదిగ నర్థయోజనము మేరవరకుంగల యాతావృస కొండనెత్తమ్మునఁ గుమారధారికకుం బశ్చిమంబునఁ గలవు.

ముల్లోకములందునను ముప్పదికోట్లయేబది లక్షల పుణ్యతీర్థంబులు గలవు. అందెల్లఁ బ్రకృతి జన్యములయి సహజ పావనములగు తీర్థమ్ములీ శ్రీనివాస శైలరాజమ్మునఁ కలవు. ఓమునిసత్తములారా! భూప్రదక్షణ మాచరింపఁగోరిక కల మానవుఁడు సర్వతీర్థమయంబును సకల పుణ్యక్షేత్ర సంయుతంబునునగు నీపవిత్ర వేంకటాచలమును బ్రదక్షణంబుగఁ జుట్టి వచ్చిన భూమియందలి యెల్లపుణ్యక్షేత్రంబులు సేవించిన బొందఁగలుగు ఫలంబును బొందఁగలఁడు. తొల్లిద్వాపరయుగంబున హలాయుఁధుఁడగు బలరాముఁడు వేంకటాచల శృంగాగ్రమును గాంచినంత మాత్రమున నె సంపూర్ణముగా తీర్థయాత్రాఫలమును బొందెనని వినబడుచున్నది.

ఎదహత్తినబత్తి నెవ్వఁడీ సిరిమలననెక్కి తీర్థంబుల నోలలాడునో శ్రీనివాసుం గొలుచునో, వాఁడుకుంటివాఁడయ్యుఁ బాదములఁబొంది బాగుగనడువఁ గలవాఁడగును. గ్రుడ్డివాడయ్యేనేని పద్మపత్ర విశాలాక్షుండై బాగుగఁ జూడఁజాలును. మూగయైన వాచస్పతి యట్లుమాటలాడఁగలుగును. చెవిటివాఁడును దూరశబ్దంబులును బాగుగ వినఁగలుగును. గొడ్రాలుమ వలసిన సంతానమును బొందఁగల్గును. ధనహీనుఁడు ధనవంతుడగును. ఇదియంతయు నాపర్వతమందు, నాపర్వతేశు నందు భక్తిశ్రద్ధలుంచిన మాత్రన, యెడఁద కడిగికొని వడయాడిన మాత్రన, నొడఁగూడఁ గలదు. ఇందున సందియమేమియులేదు.

ఈ శ్రీవేంకటాచలమును సంపూర్ణముగఁ దత్వతః యెఱుంగం గలిగిన వానికెవ్వనికింగాని యాశ్రీనివాసాచలమొకప్పుడు కనకాద్రిగ మఱియొకప్పుడు జ్ఞాన రూపమున, రత్నమయా కారమున, వేరొకప్పుడు భూషణోజ్వలమై సాక్షాత్ శ్రీనివాసుని వలెనే ప్రకాశించుచునుండును. ఈ యదియే కాలభేదంబున, వ్యక్తిభేదంబున నొక్కనికి సామాన్యశైలమట్లులనే తోచుచుండెను. ఇట్టి యాభూధరరాజము యొక్కపుణ్యమును మాహాత్మ్యమును నెవ్వండెఱుంగ నోపును? ఇకనేనెన్నన్నో, చూచినది, విన్నది, గ్రహించినది కొంతకొంతగ మీకు వచింపఁ గలిగినాఁడను. విన్నదియు, గన్నదియుఁ బూర్తిగవివరింప నే నసమర్థుడనే? అనుచున్న నాతని విని యామునులిట్లనిరి.

ఓ ఋషివరా! ఈ తీర్థములమునకలిడినఁ బాపములు తొలఁగును. అదినిక్కము కాని మఱిమఱి పాపములొనరించుచు మఱల మఱల మునుగుచుఁబోయిన వారిపాపములు తొలంగుచునే పోవునందురు? అట్లయిన వారి పాపములు మితిమీఱి ప్రపంచమునే వరకుపాపమొనరింపవా? ఇకసాధు సజ్జనులకును దుర్బలులకును బ్రతుకులే లేకపోవునుగదా? అన్నవివి రోమహర్షణి మోమునఁ జిఱునవ్వొలయ వారలకిట్లనె. పూజ్యముని

# తృతీయాధ్యాయము

## భూమింగల గిరివరములు - వాని మహిమ

భూమింగల గిరివరములను వాని మాహాత్మ్యమును వినగోరి శౌనకాదులడుగ సర్వజ్ఞుఁడును బురాణార్థవిశారదుడును, మహాభాగుఁడునగు రోమహర్షణుడు సూతమహాముని యిట్లని చెప్పందొడంగెను. ఓ మునివరులారా! తొల్లిగంగా తటమున నొకప్పుడు మేమునిట్లే ప్రశ్నింప ఋషిశ్రేష్ఠుఁడు పరమోత్తమగురుఁడు వ్యాసమునీంద్రుఁడిచ్చిన యుత్తరమునే మీకునేఁజెప్పఁబోవుచున్నాను. ఆలకింపుడు.

ప్రాచీనకాలమున దేవయుగమున నొకప్పుడు మునిసత్తముఁడు నారదుఁడు నానారత్న సుశోభితమగు సుమేరు శిఖరోపరి భాగమునకుం బోయి తన్మధ్యమున నత్యంతము తేజఃపూర్ణమగు పురోధసుని దివ్య విమానముంగాంచెను. దానికుత్తర భాగమున నాలుగు చతురస్రయోజనముల తలమున వ్యాపించి యోజనోన్నతమగు నశ్వత్థవృక్షమొండుకలదు. ఆ వృక్షమూలమున నానారత్నజటితములగు పద్మరాగ వినిర్మితములగు వేలకొలఁది స్తంభములచే సంశోభితమై వైడూర్య ముక్తామణులచే సమలంకృతమును, నవరత్న సమాకీర్ణము స్వస్తికమాలలచే నలంకృతమునగు దివ్యతోరణములచే శోభితమగు, హృదయంగములగు, మృగపక్షులచే నాకీర్ణమగు, పుష్యరాగమణి నిర్మిత కవాటములను, వజ్రనిర్మిత ద్వారబంధములను, నొప్పు ద్వారములు కలిగి, ఏడంతస్థులు గల్గి ప్రకాశించు దివ్యమంటపమును గని యందునఁ బ్రవేశించి తొలుదొల్త ముక్తాఫలమయ వితానమును, తన్మధ్యమున వైడూర్యోద్భాసితోన్నత వేదికను, గనినారద మునితద్వేదిక నధిరోహించెను.

తద్వేదికా మధ్యమున నెన్మిది పాదములనొప్పు ముత్తెముల సరముల నలంకృతమై యున్నతోన్నతమగు కాంతులనీను సింహాసన మొండాతనికిం గానవాయెను. ఆ సింహపీఠికా మధ్యమున సహస్రదళ సుశోభితమును, సహస్ర చంద్రాభమును గర్ణికాకేసరోజ్జ్వలమునగు నందాల పొందమ్మి దృగ్గోచరమాయెను. తన్మధ్యమునఁ బూర్ణచంద్రోజ్జ్వల మూర్తి; కైలాస పర్వతోపముఁడు, సుందరపురుషాకారుఁడునగు పురుషోత్తముఁడు వరాహమూర్తి యాసీనుఁడై యుండెను. ఆదేవుఁడు నలుభుజంబుల, నభయదాయకములు శంఖచక్రములు కౌమోదకీ నందకములు పట్టియుండెను. పీతాంబరధారియై వికసిత విశాల పుండరీకనయనంబుల సుందర వదనారవిందమున నయనాభిరాముఁడై యుండెను. సామద్వని సమాయుక్తుని యజ్ఞమూర్తిని స్రువసమాన నాసికాశోభితుని నలలనందగించు సాలసంద్రముట్టుల నొప్పుతమవు గలిగి అందమగు కిరీటమున నొప్పువాని, శ్రీవత్సలాంచన

# తృతీయాధ్యాయము

## భూమింగల గిరివరములు - వాని మహిమ

భూమింగల గిరివరములను వాని మాహాత్మ్యమును వినగోరి శౌనకాదులడుగ సర్వజ్ఞుఁడును బురాణార్థవిశారదుడును, మహాభాగుఁడునగు రోహర్షణుడు సూతమహాముని యిట్లని చెప్పందొడంగెను. ఓ మునివరులారా! తొల్లిగంగా తటమున నొకప్పుడు మేమునిట్లే ప్రశ్నింప ఋషిశ్రేష్ఠుఁడు పరమోత్తమగురుఁడు వ్యాసమునీంద్రుఁడిచ్చిన యుత్తరమునే మీకునేఁజెప్పఁబోవుచున్నాను. ఆలకింపుడు.

ప్రాచీనకాలమున దేవయుగమున నొకప్పుడు మునిసత్తముఁడు నారదుఁడు నానారత్న సుశోభితమగు సుమేరు శిఖరోపరి భాగమునకుం బోయి తన్మధ్యమున నత్యంతము తేజఃపూర్ణమగు పురోధసుని దివ్య విమానముంగాంచెను. దానికుత్తర భాగమున నాలుగు చతురపుయోజనముల తలమున వ్యాపించి యోజనోన్నతమగు నశ్వత్థవృక్షమొండుకలదు. ఆ వృక్షమూలమున నానారత్నజటితములగు పద్మరాగ వినిర్మితములగు వేలకొలఁది స్తంభములచే సంశోభితమై వైడూర్య ముక్తామణులచే నమలంకృతమును, నవరత్న సమాకీర్ణము స్వస్తికమాలలచే నలంకృతమునగు దివ్యతోరణములచే శోభితమగు, హృదయంగములగు, మృగపక్షులచే నాకీర్ణమగు, పుష్యరాగమణి నిర్మిత కవాటములను, వజ్రనిర్మిత ద్వారబంధములను, నొప్పు ద్వారములు కలిగి, ఏడంతస్థులు గల్గి ప్రకాశించు దివ్యమంటపమును గని యందునఁ బ్రవేశించి తొలుదొల్త ముక్తాఫలమయ వితానమును, తన్మధ్యమున వైడూర్యోద్భాసితోన్నత వేదికను, గనినారద మునితద్వేదిక నధిరోహించెను.

తద్వేదికా మధ్యమున నెన్మిది పాదములనొప్పు ముత్తెముల సరముల నలంకృతమై యున్నతోన్నతమగు కాంతులనీను సింహాసన మొండాతనికిం గాననాయెను. ఆ సింహపీఠికా మధ్యమున సహస్రదళ సుశోభితమును, సహస్ర చంద్రాభమును గర్ణికాకేసరోజ్జ్వలమునగు నందాల పొందమ్మి దృగ్గోచరమాయెను. తన్మధ్యమునఁ బూర్ణచంద్రోజ్జ్వల మూర్తి; కైలాస పర్వతోపముఁడు, సుందరపురుషాకారుఁడునగు పురుషోత్తముఁడు వరాహమూర్తి యాసీనుఁడై యుండెను. ఆదేవుఁడు నలుభుజంబుల, నభయదాయకములు శంఖచక్రములు కౌమోదకీ నందకములు పట్టియుండెను. పీతాంబరధారియై వికసిత విశాల పుండరీకనయనంబుల సుందర వదనారవిందమున నయనాభిరాముఁడై యుండెను. సామధ్వని సమాయుక్తుని యజ్ఞమూర్తిని స్రువసమాన నాసికాశోభితుని నలలనందగించు సాలపంద్రమట్టుల నొప్పుతమవు గలిగి అందమగు కిరీటమున నొప్పువాని, శ్రీవత్సలాంచన

హస్తిశైలము, గృధ్రాద్రి, ఘటికాచలము నుత్తమములు. అవ్వియాక్షీర నదీసమీపము
నొప్పియున్నవి. ఆ హస్తిశైలమున కుత్తరమున నైదుయోజనముల దూరము
సువర్ణముఖరియను నొకనదీమతల్లి కలదు. దానికుత్తర తీరమునఁ దటాకంబొం
కమలాఖ్యనొప్పును. ఆ తటాకతీరమున శుకముని వరవరదుఁడు, భక్తజనార్తిహరుఁ
శ్రీహరి, కృష్ణభగవానుఁడు బలభద్రునితోఁ గూడి వైఖానసాది మునిగణ నిత్యసంసేవితుఁ
విరాజిల్లుచుండును. ఆకమలా సరోవరమున కుత్తరమునఁ గల వనరాజమున రెండు
కోసులదూరమున హరిచందనాది తరుసంశోభితమగు వేంకటాచలమున వా
దేవాలయము దనరారుచుండును. ఆనగోత్తమము సప్తయోజన విస్తీర్ణంబును యో
నోన్నతంబునునై యలరారును.

అది స్వర్ణమయ శిఖరములతో, రత్నమయసానువులతోఁ దనరుచుఁ
విరతులగు నింద్రాదిదేవతలకు, వసిష్ఠాది మునివరులకు సిద్ధసాధ్యమరుద్గణంబుల
దైత్యదానవజనములకు, రంభాద్యప్సరసలకుఁ గిన్నరకింపురుష గంధర్వాదుల
గరుడులకు, నాగులకు నిత్యావాసమై యొప్పుచుండును. ఓమాధవీ! వసుంధరే! ఎల్లవిధము
నొప్పారు నాపర్వతరాజమునఁ బుణ్యసలిలపూరమ్ములు, పవిత్రంబులు, దివ్యదర్శనంబు
వగుపెక్కులు నదులు, పుష్కరిణులు, విరాజితములైయుండును. అందు
సువిరాజితములగు తీర్థముల, నుత్తమములగు వాని వివరించెదనాలింపుము. అవేవందువా?
చక్రతీర్థము, దైవతీర్థము, ఆకాశగంగ, కుమారధారిక, పాపనాశనము, పాండవతీర్థము
స్వామిపుష్కరిణి యివ్వియేడును నారాయణగిరింగలవిగ యెంతయు నుత్తమములు
ఉత్తమోత్తమమగు నాస్వామి పుష్కరిణికి పశ్చిమతీరముననే కదా మనము వసించుచున్న
అద్దాని దక్షిణతీరంబుననే జగన్నాథుఁడు శ్రీనివాసుఁడలరారుచున్నవాఁడు. అయ్యది
గంగాది పవిత్రతీర్థములకెల్ల సమానము. ముల్లోకమ్ములంగల పవిత్రనదీనదముల
సరోవరములకు తటాకములకు నెల్లతీర్థములకు నదిస్వామిత్వముం బొందియుం
స్వామిపుష్కరిణి యనవొప్పుచున్నది. అసంఖ్యాకములగు పుణ్యతీర్థంబులెల్లఁ బరమపుణ్య
పవిత్ర స్వామిపుష్కరిణిని సేవింపవచ్చి యంద తనరారుచున్నవి. ఆభూధరోత్తమమున
దెన్నెన్నియో పవిత్రతీర్థములలరారును. అందున ముఖ్యతమములు షట్తీర్థంబులు
అవ్వితమయందువ తానములాడిన యంతనమటిగర్భవాస భయమును బోఁదోలును
ఓ వసుంధరే! తొలుతనారాయణగిరి మాహాత్మ్యమును వచింతునాలింపుము. దేవవరులు
ఋషితల్లజులు, పండితవర్యులు, సనకాదియోగివర్యులు నెల్లరును బరమాత్మునివ
నివాసమగు నాపర్వతరాజమును కృతయుగంబున నారాయణాద్రి యనియు, ద్వాపరమున
సింహాశైలమనియు, గలియుగమున వేంకటాచలమనియు, బ్రస్తుతులనందించిరి.

హస్తిశైలము, గృధ్రాద్రి, ఘటికాచలము నుత్తమములు. అవ్వియాక్షీర నదీసమీపము వొప్పియున్నవి. ఆ హస్తిశైలమున కుత్తరమున నైదుయోజనముల దూరము సువర్ణముఖరియను నొకనదీమతల్లి కలదు. దానికుత్తర తీరమునఁ దటాకంబొండు కమలాఖ్యనొప్పును. ఆ తటాకతీరమున శుకముని వరవరదుఁడు, భక్తజనార్తిహరుఁడు శ్రీహరి, కృష్ణభగవానుఁడు బలభద్రునితోఁ గూడి వైఖానసాది మునిగణ నిత్యసంసేవితుఁడై విరాజిల్లుచుండును. ఆకమలా సరోవరమున కుత్తరమునఁ గల వనరాజమున రెండున్నర కోసులదూరమున హరిచందనాది తరుసంశోభితమగు వేంకటాచలమున వాసు దేవాలయము దనరారుచుండును. ఆనగోత్తమము సప్తయోజన విస్తీర్ణంబును యోజ నోన్నతంబునునై యలరారును.

అది స్వర్ణమయ శిఖరములతో, రత్నమయసానువులతోఁ దనరుచుఁ దపో నిరతులగు నింద్రాదిదేవతలకు, వసిష్ఠాది మునివరులకు సిద్ధసాధ్యమరుద్గణంబులకు దైత్యదానవజనములకు, రంభాద్యప్సరసలకుఁ గిన్నరకింపురుష గంధర్వాదులకు గరుడులకు, నాగులకు నిత్యావాసమై యొప్పుచుండును. ఓమాధవీ! వసుంధరే! ఎల్లవిధముల నొప్పారు నాపర్వతరాజమునఁ బుణ్యసలిలపూరమ్ములు, పవిత్రంబులు, దివ్యదర్శనంబులు వగుపెక్కులు నదులు, పుష్కరిణులు, విరాజితములైయుండును. అందు సువిరాజితములగు తీర్థముల, నుత్తమములగు వాని వివరించెదనాలింపుము. అవేవందువా! చక్రతీర్థము, దైవతీర్థము, ఆకాశగంగ, కుమారధారిక, పాపనాశనము, పాండవతీర్థము స్వామిపుష్కరిణి యివ్వియేఁడును నారాయణగిరింగలవిగ యెంతయు నుత్తమములు ఉత్తమోత్తమమగు నాస్వామి పుష్కరిణికి పశ్చిమతీరముననే కదా మనము వసించుచున్నది. అద్దాని దక్షిణతీరంబుననే జగన్నాథుఁడు శ్రీనివాసుఁడలరారుచున్నవాఁడు. అయ్యది గంగాది పవిత్రతీర్థములకెల్ల సమానము. ముల్లోకమ్ములంగల పవిత్రనదీనదములకు సరోవరములకు తటాకములకు నెల్లతీర్థములకు నదిస్వామిత్వముం బొందియుంట స్వామిపుష్కరిణి యనవొప్పుచున్నది. అసంఖ్యాకములగు పుణ్యతీర్థంబులెల్లఁ బరమపుణ్య పవిత్ర స్వామిపుష్కరిణిని సేవింపవచ్చి యంద తనరారుచున్నవి. ఆభూధరోత్తమమున దెవ్వెన్నియో పవిత్రతీర్థములలరారును. అందున ముఖ్యతమములు షట్తీర్థంబులు అవ్వితమయందువ తానములాడిన యంతనమటిగర్భవాస భయమును బోఁదోలును. ఓ వసుంధరే! తొలుతనారాయణగిరి మాహాత్మ్యమును వచింతునాలింపుము. దేవవరులు ఋషితల్లజులు, పండితవర్యులు, సనకాదియోగివర్యులు నెల్లరును బరమాత్ము నివాసమగు నాపర్వతరాజమును గృతయుగంబున నారాయణాద్రి యనియు, ద్వాపరమున సింహాశైలమనియు, గలియుగమున వేంకటాచలమనియు, బ్రస్తుతులనందించిరి.

యిట్లనియడిగెను. ఓదేవదేవా! నీవేమంత్రముచే నారాధితుఁడవై ప్రసన్నుఁడవగుదువు? నీకిష్టమగు మంత్రరాజమదియేది? ఏమంత్రజపముచే భక్తునకు, నియతారాధకునకు నెల్లపుడు నెల్లసంపదలు, పుత్రపౌత్రాభివృద్ధికలుగును? కోరినకోర్కులుతీరి కడపటనీ పరమపదము చేకూరఁగలదు? ఓమాధవా! వరాహదేవా! నాయందునఁ బ్రసన్నుండవై యదియెల్లవచియింపుము. ఇట్లనియడుగఁబడిన దేవుఁడు ప్రసన్నుఁడై చిఱునగవున భూమాతతో నిట్లనియెను. ఓదేవీ! వినుము. పరమగోప్యమును, వెనువెంటనే యెల్లసంపదలు, ధనధాన్యములు, భూకాంచనములు, పుత్రాదులునొసంగునదియు, గానియెల్లరకు నెల్లడింపరానిదియు, నియతాత్ములకుఁ బరమభక్తులకు మాత్రమే చెప్పఁదగినదియునగు మంత్రరాజమును జెప్పుచున్నాడను మనసుంచి యాలింపుము -

ఓమ్నమః శ్రీవరాహాయ. ధరణ్యుద్ధరణాయ స్వాహా.

స్వాహాయుక్తమగు నీమంత్రరాజమునకు, సంకర్షణుడు ఋషి. భూవరాహమూర్తియే దేవత; పంక్తిశ్ఛందము; శ్రీబీజము -

ఈమంత్రరాజమును సద్గురుమండిపొంది, మోక్షకాములగు వారు నియమమున, నిశ్చల నిర్మల హృదయమున, నాలుగులక్షలు జపింపఁదగును. మధుఘృత సమన్వితముగ పాయసాన్నము హోమముచేయవలెను. ఈమంత్రరాజమో వసుంధరారమణీ! యెల్లసిద్ధులనొసంగునదియేసుమా.

ఓమునివరులారా! ఇకనాచెప్పునది వినుడు. మనసును బవిత్రముంజేయు ధ్యానక్రమమును జెప్పుచున్నాను. శుద్ధస్ఫటికమట్టులు స్వచ్ఛశరీరకాంతి గలవాని, రక్తవర్ణాభశోభితాక్షు వరాహవదనుని సౌమ్యుని జతుర్భుజుని, కిరీటధారిని, శ్రీవత్సాంకితుని, శంఖచక్రధరుని అభయహస్తుని, పుడమినడతిచే నొప్పునెడమతొడగలవాని రక్తపీతాం బరధరుని, రక్తాభరణ భూషితుని శ్రీకూర్మరాజు వెన్నుననున్న యాదిశేషుమూర్ధమున నలరుచున్న యాయాదిదేవుని మూర్తినెడఁదనుంచి తలంచుచుఁ బైనఁజెప్పిన మంత్రరాజము, నేమానవుఁడు దినదినము మానక నియమమున నూటయెనిమిది మారులు జపమొనర్చునో యాతనికోరికలెల్లనుదీరును; కడపట వాతడవశ్యము మోక్షగామియగును. ఇదియంతయుఁ బృథ్వీమాతకాదేవుఁడు నచించినదియ గురువనుగ్రహమున నిదినేనెఱిఁగి మీకు వచించినాడను. ఇంకను నేమివినఁగోరెదరో చెప్పుడని వారియడిగిన మీదటఁదరువాతి కథయిట్లని చెప్పందొడంగెను. ఓమునివరులారా! ఆధరణీమాత వరాహదేవుంగాంచి, యోదేవా! తొలుతనీమంత్రము నెవరనుష్ఠించిరి? వారేమిఫలితములంగాంచిరి? అనఁ బ్రభుండిట్లని చెప్పందొడఁగెను.

ఓదేవీ! పూర్వకాలమునఁగృతయుగమున ధర్ముఁడను నొకమహామనువు బ్రహ్మచే నీమంత్రవరముం బొంది యీగిరివరమున జపమొనరించెను. తత్ఫలితముగ నన్నుందర్శించి వరములఁబొంది చిరకాలము మను పదవినుండి కడపట మదీయ సాయుజ్యముం బొంది తరించెను. ఒకప్పుడింద్రుఁడు దూర్వాసుశాపమున స్వర్గభ్రష్టుఁడు, సర్వైశ్వర్య భ్రష్టుఁడునై యీమంత్రరాజముచేత నీశైలమున నన్నారాధించి తిరిగి తనయింద్రపదవినంది త్రివిష్టపమున సుఖోపవిష్టుఁడాయెను. భూనివాసులెందఱెందఱో మునివరులును నీమంత్రజపమునఁ బరాగతినొందియున్నారు. తొల్లికశ్యపముని వలన నీమంత్రమును బొంది శ్వేతద్వీపమునకుంబోయి యటజపమొనరించి పన్నగాధీశుఁడనంతుఁడు ధరణీధరుఁడు కాగలిగెను. కావున భూమ్యాదులనేమి కోరినను మానవులీమంత్రజపము నియమనిష్ఠల పవిత్రమానసమున నొనరించి పొందఁగలరు. అనని దియంతయువిన్న పుడమిపొలతి మిగుల సంతుష్టాంతరంగ యయ్యెనన మునులు సూతునిగాంచి, వేంకటాచలమునకు, జగత్పతిదేవదేవుఁడు శ్రీనివాసభగవానుఁడు భూమిదేవితోఁగూడి యెప్పుడు వేంచేసెను? కల్పాంతము వరకాదేవుఁడట నెట్లెట్లు వర్తించుచుండెను? తమరిదియంతయు వివరింపుఁడన నామునివరుడిట్లనెను.

ప్రాతకాలపునాటికతలు, పవిత్రములు చెప్పుచున్నాఁడనాలింపుడు. వైవస్వత మన్వంతరమునఁ గృతయుగమున నొకప్పుడు వాయుదేవుడు స్వామిపుష్కరిణీ తటముననుండి ఘోరతపమాచరింపఁ దొడంగెను. ఆతనియామేటి తపమునకు శ్రీభూసహితుండై శ్రీనివాసభగవానుఁడటకుఁ బుష్కరిణీతీరంబునకుంబోయి యావాయు దేవునకనుగ్రహించి యతనికి సంతసముఁ గొల్పనటనే దక్షిణతటమున నందనామక విమానమున నుండసాగెను. అటగార్తికేయుండును జేరి దేవు నారాధింపసాగెను. అట్లాయాది మధ్యాంతరహితుఁడాదిదేవుఁడు దేవదేవుఁడనిలదేవుచేఁ, గార్తికేయుచే నారాధితుం డగుచునటనా పార్వతీయ విమానమున నదృశ్యరూపముననుండసాగెను. ఇట్లుకతిపయ వత్సరములు కడచినంతఁ దొలుదొల్తనట నగస్త్యమహర్షిచేరి పండ్రెండేండ్లెడ తెగక భక్తిశ్రద్ధల సుదృఢవ్రతనియమముల కఠినతపశ్చర్యల నాదేవునారాధించెను. అంతఁ బ్రసన్నుండై తోచినదేవు నామునివరు డనుకంపనెల్లరకు దృశ్యమానుఁడుగఁ బ్రసన్నుఁడుగఁ బ్రజల, దీనజనుల ననుగ్రహింపఁగోరెను. దానికా దేవుఁడట్లనయగుగాక యెడఁ దలనమ్మించికొనిన సద్వర్తనులగు వారలకెల్లరకే నిటనుండి ప్రసన్నతం దోచుచుందును. కాని యీవిమానము మాత్రమెల్లరకు దృశ్యమానము కాఁబోదనుచు నేనవశ్యమిందుఁ గల్పాంతముదనుకనుండి మానవులకు సహృదయులకు దృశ్యమానుఁడ నగుచునుందును. ఇందువ నందియములేదని పలికెను. అదివిని యానందోత్ఫుల్ల హృదయుఁడై మునితనిసెను. దేవుఁడదృశ్యుడాయెను. ఆవాటినుండి యటనాదేవుఁడు స్కంద

వాయువులచేఁ జింతవీయుండగుచు, వారాధితుండగుచు మునివరులచే పూజితుఁడగుచు వావిమానమునుండి యారాధితుండై మానవులకుం బ్రసన్నుఁడై తోచుచు ననుగ్రహించు చుండెను.

## కలియుగమున వేంకటాద్రీశుని లీలలు

ఆశౌనకాది మహామునులు సూతముని వరుంగాంచియిట్లనిరి. ఓమునివరా ప్రతికలియుగమునను శ్రీవేంకటాధీశుఁడెట్లుండును? ఎట్లువర్తించును? ఆప్రభుని పూజలెట్లులెవ్వరిచే జరుగును? వారి నాదేవుఁడెట్లనుగ్రహించి వరంబులొసంగును? ఈ విషయములెల్ల మాకు వివిచివీనులవిందొనర్పుడు. అనువారికా సూతతపోధనుఁడిట్లని చెప్పందొడంగెను.

మునితల్లజులారా! కలియుగమున సంధికాలమువరకును భగవంతునిప్రవృత్తియిట్లే ప్రవర్తిలంగలదు. కాని యటుపిమ్మటను నాదేవుని యునికియట్లేయుండును. కాని మౌనధారణమున నొప్పియుండును. మాంసచక్షువులగు నామానవులకుఁగేవలము నర్చావతారముగనే, విగ్రహమటులనే యాదేవుఁడు తోచుచుండును. వైకుంఠపురమున నుండి వచ్చిన యాదివ్య విమానమంతర్హితమై వైకుంఠమునకుంబోవును. ఆయా కలియుగములఁ బుణ్యశీలురు మానవులాదేవతా మూర్తికి క్షేత్రసమ్మతముగ విమానమొండు నిర్మింపంజేయుదురు. అప్పుడప్పుడు బ్రాహ్మణులును మఱియితరులును భ్రాంతులై భగవంతుని వేంకటనగాధినాథుని రాతిబొమ్మయనిపలుకుచు నవమానముగ నుడువుదురు.

కలియుగమున మానవులకు దైవము మఱవునఁబడును. ధనమునే దైవమనియెంతురు. ధనకామములకులోనై యెన్నేనియకృత్యములకుఁ గడంగుదురు. పక్షములట్లపైకి వేషభాషలదోచుచు దుశ్చింతల, దుశ్చేష్టలవర్తింతురు. అట్టివారికిఁ తరుణోపాయమేమి? కరుణామయుఁడగు భగవానుఁడు వారలనుద్ధరించుట యెట్లాయని యనవరతము చింతించుచునేయుండును. వారిదుశ్చేష్టితములఁ జూచుచుండియుఁ జూడనట్లుండును. భగవంతునకు కనుమఱగితిమనుకొనరాదు. ప్రత్యక్షముగఁదోచి సంభాషింపఁబడుట తప్ప విగ్రహానుగ్రహము లధికముగఁ గలిగియుండును. కోరికోలిచిన వారికి వరముల నమితముగ నొసంగుచుండును. మనసుమార్చికొని నిర్మలచిత్తమున దైవతమూర్తిని దర్శించిన మాత్రననే, ప్రసన్నుఁడై పాపములహరించును. భక్తిలేని పూజనరాత్రిచేటనునట్లుగ మనుమంచని పెద్దపెద్దపూజలకంటె హృదయపూర్వకముగ నర్పించు చిన్నపూజయు మహత్ఫలము నొసంగును. భక్తిశ్రద్ధలతోడి పత్రపుష్ప ఫలతోయములయుఁ బూజను దేవుఁడు ప్రేమను గ్రహించును. ఒక్కొక తఱినాభక్తులకుఁ బ్రత్యక్షమైతోచును.

ఒక్కొకతటి కావరాకయునుండును. లక్ష్మీసమేతుఁడై యాదేవుఁడు కలినివిచిత్రలీలలు ప్రకాశింపఁజేయుచునట విహరించుచుండును.

కొర్దియాచరణముననె, కొర్దిదానముననె, యించుకపూజచేతనే, స్మరణము మాత్రముననే యాశ్రీహరిప్రసన్నుఁడగును. ఆశ్రీపతి కేశవదేవుఁడు కాంచునది కొర్దియా, గొప్పయాయనునదికాదు. అందున డెందమెంతయనునదియు పవిత్రమానసముతో వేంకటాద్రింగూర్చి పయనించిన మాత్రన యాదేవుఁడను గ్రహించి వారికోర్కులుతీర్చును. అప్రాకృతుఁడయ్యును బ్రాకృతునట్టులఁదోచుచు జనుల సమ్మోహితుల నొనర్చుచు వారిచ్చుభోగములను భోగించి పరితృప్తింబొంది యనుగ్రహించును.

మానవుల వలన నాదేవునకుఁ బలుతెఱఁగుల ననేకములుత్సవములు జరుపఁ బడుచుండును. ఆయుత్సవములఁ బాల్గొనియానందింప నమరులును నాకలియుగమునఁ బలుతెఱగుల వచ్చి మానవులతోఁగనుమరగియే కలసిమెలసి యుందురు. స్వామి పుష్కరిణిని స్నానములొనర్చి దేవునర్చించి నైవేద్యములొసంగి తనియుదురు. వారు మానవులకుఁ గానరాకయు వారలర్పించు నైవేద్యములను సాదరమున స్వయముగ గ్రహించి తృప్తినంది తనియింతురు. ఆవిబుధులాదేవుని విమానముం దర్శించి పూజలవొనరించి తాముసు మానవులుగ నుండి యాపరాత్పరుని సన్నిధింబొందఁ గోరుదురు. భగవంతుడును వారిననుగ్రహించి కోర్కులుదీర్చును.

ఆదరమున గురుజనుల సేవలొనరించుచు భక్తియుక్తులగు వారియందు భగవంతుఁడు ప్రసన్నుఁడగును. వారొనర్చు స్వల్పధర్మముననే పరితృప్తినంది సత్సంతానమును, ననుకూల దాంపత్యమును పరివారమును క్షేత్రారామముల నొసంగును. దుర్లభములగు దీర్ఘాయువు నారోగ్యభాగ్యములు, సంపదలు నొసంగును. రాజ్యాది విభూతులు సేకూర్చును. స్వర్గలోకాదిప్రాప్తియుం జేకూర్చును.

ఆహా ! ఏమావేంకటాద్రిని విష్ణుచరిత్ర మెంతచిత్రము! చిత్రమువిచిత్రముననని మోయపిం బ్రహ్మాదిదేవతలును నబ్బురమునఁ బల్కుచు విమానములం బోవుచుందురు. ఆచింతచరితలు దాని యబ్బురపు కతలెన్నెన్నియో! కొన్నికొన్ని మీకుఁగీర్తించి చెప్పితిని. ఓమునివరులారా! కలియుగమే తెంచినంత నావేంకటాద్రి యీధరాతలమున నెంతయో విఖ్యాతి నందియుండును. అటనా రమాపతి యత్యంతము సన్నికటుఁడైయుండును. స్త్రీలు, పురుషులు, పండితులు, పామరులు, పవిత్రులు, పాపులు, కలవారు, లేనివారు, మ్లేచ్ఛులు, సంకరులు శ్వపాకులు, కిరాతులు, చిన్నలు, పెద్దలు, నింకను నధమజీవితము నడుపువారును మిగులభక్తి తాత్పర్యములు కలిగినవారై, మానసములు మార్చికొని,

తమప్రవర్తనలు దిద్దికొని, పవిత్రులై తరింతురు. హృదయ పూర్వకమగు భక్తిని జూపువారిఎల్ల గతమున వారెట్టివారైన నెవ్వరైన వారియెడరమాపతి ప్రసన్నుడై యపుడెవారికి నభీప్సితములనొసంగి సంతృప్తిం గలిగించును. ఆ భగవానుఁడు శ్రీనివాసుఁడా భక్తుల నడుమన యెల్లపుడు నప్రత్యక్షమునఁ జేరియుండును. ఆదేవదేవుడు భక్తజనవసుఁడు, నాధీనుడు భక్తిచేఁగొనఁబడినవాఁడునుగదా.

ఆర్యులు, ననార్యులు, మ్లేచ్ఛులు, దస్యులు, నంగవంగకళింగాంధ్రవాసులు, గౌడమాలవ కర్ణాటకోసల దేశీయులు, చోళపాండ్యాది నానాదేశవాసులు, ద్వీప ద్వీపాంతరులుం గోట్లకొలఁదిగ, మహద్భక్తి సంయుక్తులై శ్రీవేంకటేశ్వర మహోత్సవములను బోయిచేరి తన్మయులై మాధవుసేవించి కోరినకోర్కులు దీర నానందాన్వితులగుచుందురు. బంగారుపానువుల నొప్పిన యావేంకటాద్రి దివ్యము, నప్రాకృతమునయ్యుఁ గలియుగమున సామాన్య పర్వతమట్ల యాభూమినొప్పియుండును. సర్వాత్మకుఁడును బరమాత్మయును, రమాధినాధుఁడునగు నావేంకట శైలాధీశునందున, నన్యమతాను యాయులకును నమితమగు భక్తిశ్రద్ధలు కలిగించుచుండును. ఇత్తెఱంగున మానవులు పరాభక్తిసమాచరితులై పావనులై యొప్పుదురు. కొందఱు తమ యనన్యావ్యాజభక్తి యుక్తులంగొలిచి యాదేవేశు కేశవునెడ నమరక్తులై తరింతురు. మఱికొందఱు ఫలార్థులై సాదరమున, భక్తినిగొల్చి యిచ్ఛాప్రాప్తింబొందిన వారింగాంచి యనురక్తినంది శ్రీనివాసు సేవించి కోర్కులు తీర్చి కొందురు. ఇట్లైహిక, పారలౌకిక ఫలంబులనొంద నాదేవుని భక్తిని గొల్చి, సఫలులై నానావిధములగు వరదానముల నందుదురు. మునులును, దేవతలును ముక్తకంఠమున నాదేవు విట్లని వినుతించుచుఁ బలుకుచుందురు. ఆహా! వైకుంఠవాసియగు నాదిదేవుఁడు శ్రీహరి శ్రీనివాసుఁడు కలియుగమున నీ పర్వతరాజమున విహరించుట, వింతలవింతగదా. కావునవే కలియుగము సర్వోత్కృష్టము. ఆదేవునందు భక్తిశ్రద్ధలనుంచు నామానవులు, స్త్రీలు పురుషులు నాబాలగోపాలము ధన్యులు, విశేషించిచెప్పునదేమన, వేంకటేశారాధనమే, సేవాసక్తియే, సాధుసజ్జనుల కాభూషణము, కలియుగమునందలి, పాపకర్మలచేఁ జుట్టుముట్టఁబడి తెన్నుకానకయున్న మానవుల కీభూమిని శ్రీవేంకటగిరిపతి తప్ప వేరుశరణములేదు. ఈధరాతలమున నాసిరిమలపతికి సమానుఁడు దేవుఁడు వేరొకడులేడూ లేడూ లేడు. ఆతఁడే దేవుఁడు. స్వామిపుష్కరిణికిఁ దుల్యమగు తీర్థమును గనరాదు గనరాదు.

విశేషములఁ జిత్రము మఱియొకటి. ద్రవ్యార్జనమునందే తత్పరులగు మానవులకా ద్రవ్యమునఁ గోర్కెనడలింప దివ్యలీలల వినోదించును. నీగడనయందలి యింతయో యింతయో ధనమును నాకు భక్తిశ్రద్ధలతో నిమ్ము అప్పుడేనేను నీకోర్కులం దీర్తును.

ద్రవ్యమందలి యాకాంక్షను నాకైవీడుము. నీకగు కోర్కులు నేదీర్తునను. ఇట్లాదేవుఁడు కలియుగమున నిత్యమును ద్రవ్యోపార్జనా సక్తిసంసక్తునట్లుతోచుచు నెల్లమానవులతో వినోదించును. కలియుగమందలి యాతని దివ్యలీలలును, మంగళమయ వినోద చరిత్రమును లేశమునేని వర్ణింపఁ గల్ప శతములకును వశముకాదు.

## ఆచార్యమహిమ - పురుషార్ధప్రాప్తి

సర్వశాస్త్రార్థపారగా! వేదవేదాంతపారంగతా! సూతభగవానుఁడా! గురువరాశ్రయమున మునుజుఁడు పరాగతిని బొందునంటిరిగదా. ఆగురుగౌరవము, ధన్యమగు వైష్ణవధర్మ ప్రాశస్త్యము, మాకుసవిస్తరముగాఁ దెలియఁ జెప్పుండని శౌనకాదులడుగ నాసూతముని వరుండిట్లనియె. ఓ మునిసత్తములారా! మనసుంచియాలింపుడు. ఆదివరాహమూర్తి రసాతలమునుండి, భూమినుద్ధరించిన పిమ్మట వేంకటనగరాజమున నెలవుకొనియెంగదా. అత్తరి ధరణీమాతచే నడుగంబడి శ్వేతవరాహమూర్తి హృదయంగమములగు వైష్ణవ ధర్మములు ద్బోధించెను. అవియెల్ల వ్యాసముని సత్తముని ప్రసాదమున నేనెఱుంగంగాంచితిని. ఓ తపోధనులారా! గోప్యాతిగోప్యములగు నాధర్మములన్నియు మీకునే సంగ్రహించి చెప్పెదను. శ్రద్ధతోనాకర్ణింపుడు. ఆవైష్ణవధర్మము లందలి చలింపని విశ్వాసమే పరమగతి విశ్వాసానుసారిణియగు నాచరణము ఆచరణానుసారియగు విశ్వాసము అదియెంతయున్న నంతంత సిద్ధియుఁ జేకూరును. కేవల బోధలుగాదు, తాను అట్టిపవిత్రాచరణ కలవాడై బోధించునాతడే గురుడు భగవత్స్వరూపుడు పరమధర్మమును, బరాగతిని, నిస్వార్థబుద్ధి నుద్బోధించు నాతఁడే పరమగురుఁడు. అట్టిగురుసత్తముఁడే పరమధర్మము, పరాగతి. ధర్మప్రవృత్తిని గల్గించి యాత్మోద్బోధన మొనరించి యాగురువరుండంతలోనన పాపములన్నియు నాశమొనరించును. కావున నెల్ల విధముల యత్నించి పరమగురుఁ దెలిసి యాశ్రయించునది. నిండువిశ్వాసముంచి తరించునది. యాతని పవిత్రబోధలవిని యాచరించి తరించునది. నీపాపములు నీగురుఁడు, వాగురునిపాపములాతని గురుఁడు, నాతనిపాపము లాతనిగురుఁడు నిట్లు పరంపరాగతముగఁ బాపములు హరించుచుందురు. గురులకెల్ల గురుఁడు పరాత్పరుఁడెల్లరి పాపములు హరించును. ఆజగద్గురునందు నిండు విశ్వాసముంచి యాప్రభునాజ్ఞలు తూచా తప్పక పాలించుటయే యుత్తమమార్గము, తరుణోపాయము. దయామయుఁడగు శ్రీవిష్ణుభగవానుఁడే సద్గురురూపమున శాస్త్రహస్తములు సాచి సంసారసాగరమగ్నులగు జనులనుద్ధరించును. భగవంతునందియిచ్చు నాచేయూత నందికొను మానవుఁడే ధన్యతముఁడు. న్యాయమామూల మెఱిఁగి ధర్మాధర్మ వివేకముంచి, శాస్త్రార్థములనెల్ల,

దెలిపి, తపోనిష్ఠుఁడు వేదనిష్ఠుఁడునై, తపోనిరతుఁడు, స్వాధ్యాయ నిరతుఁడునై, యహంకారమమకారములకు దూరుఁడై, మత్సరహీనుఁడై, శాంతిదాంతులఁ బరోపకారమే పరమ ప్రయోజనముగఁ గలుగునాతఁడే నిజమగు గురుఁడు; సర్వజనసంపూజ్యుడు. అట్టిగురునాశ్రయించియెల్లరకుఁ దరింపనగును. సంసారదావాగ్నిని బరితప్తులై భీతమనస్కులగువారు సర్వేంద్రియములను, వశమున నుంచికొని, పవిత్రులై, బుద్ధినొంది, సంసారమునందుఁ దగులముమాని, ప్రేమతో మనమునఁ బ్రాణిమాత్రుల విరోధమువీడి పూర్ణవిశ్వాసమున, భక్తియుక్తులై గురుని సమాశ్రయింపవలెను. ఆయాచార్యుని శ్రీపాదపద్మములందే భారమంతయు నుంపవలెను. ఆశ్రీహరిని మనంబున నుంచి దృఢమతిఁ జెడుగులయెడఁ బోక, నిత్యనైమిత్తికముల శక్తికొలఁదిగ నాచరించునది. పరధర్మాచరణానురక్తి మాని స్వధర్మతత్పరత నొప్పి యన్యమంత్రముల యన్యసాధనల పొంతఁబోక నిశ్చింతులై మోక్షమునందే మనసంతయు లగ్నమొనర్చి, దానికైయే తపించుచు శ్రీహరియందుననే భారమంతయునిడి మంచిగ వర్తింపవలయును. శ్రీగురుచరణ సరోజముల విశ్వాసము, భారమునుంపవలెను. గురువులకెల్ల గురువు భగవానుడు శ్రీహరి ఆగురునియొక్క ఓం నమోనారాయణాయ. ఓం, నమః శ్రీవేంకటేశాయ. అను అష్టాక్షరీమంత్రము కంటెమంత్రములేదు. శ్రీమన్నారాయణుఁడు గాక వేరుదైవములేదు. కర్మయోగమునకు మించినయోగములేదు. అనిశ్రుతిస్మృతులెల్ల వచించుచున్నవి. ఇదియెఱింగి యాచరణమున నుంచినడుచుకొను వానికి దేహాంతముననే పరమపదము చేకూరఁగలదు. అన్న మునులాకర్మయోగమెట్టిదో దానిఫలమేమియో యెఱుఁగఁ జెప్పుండన సూతుండిట్లనియె.

## కర్మయోగము

ఓమువిప్రకాండులారా! దయామయుఁడు భగవానుఁడు దీని వచించెను. అర్థిదెలిసి గురువరుండు నాకుంజెప్పెను. నాయోపినకొలందిగ నది నేనిపుడు చెప్పెదను.

జీవితసంగ్రామమును నరుఁడు కొనసాగింపనేవలయును. కర్తవ్యకర్మను జేయనేవలయును. కాని యాకర్మనుజేసియు దానిచే బంధితుఁడు కాకుండుటకును, బంధచ్యుతుఁడై పరమపదముం బడయుటకును, భగవంతుడుపాయమును నాచరణయోగ్యముమ జెప్పెను. అదియే కర్మయోగము. ఈయోగమునెంతయాచరించిన, విందెంతముందునకేగిన నంతయుమేలే. దానికి భంగమునులేదు, వ్యతిరేకమునులేదు. చేసినది కొద్దియైనను మహద్భయమునే తొలఁగించి రక్షించునని, మహత్ఫలము నొసంగునని దృఢముగ నభయమీయఁబడినది. త్రైగుణ్యవిషయములగు వేదకర్మలు కామ్యములై

కర్తను బందితుని జేయునవి యేయయ్యును, గుణాతీతుఁడై కర్తృతాహంకృతిని ఫలవాంఛను విడిచి చేయువాని కవియే బంధమోక్షముంగూర్చును, బరముంజేకూర్చును. అవ్వికర్తవ్యములు వానిని గర్తవ్యములుగనే చేయువలయును. కర్మమువిడిచి సోమరియగుటకంటెఁ గర్మాచరణ మెంతయుమేలు. కర్మచేయకున్న శరీరయంత్రమే సాగదుకదా. అట్టిచోఁగర్మవీడితినను వృధా హంకృతియేల?

ఇకఁజెప్పునదేమనఁ గర్మలనుగాదు విడువవలసినది; ఆకర్మఫలవాంఛను, కర్తృతాహంకారమును సిద్ధించినను గార్యము సిద్ధింపకున్నను సమభావమున స్థిరమతి నుంటయే యోగము. కష్టము సుఖమున కర్తవ్యకర్మను యోగయుక్తుఁడై చేయవలయును. కర్మఫలత్యాగము కర్మయోగమున నుత్కృష్టవిషయము కోరుటలేదని ఫలము కలుగకపోదు. ఫలత్యాగికిఁగోరకయెయుత్కృష్ట ఫలము పెక్కుమడుగులు చేపడును. చేపడకున్నను గర్తవ్యమును గర్తవ్యముగనే చేయువలెను. అదియేయోగము. కోర్కెను వీడి బుద్ధియోగమునఁజేయు కర్మలెంతయు శ్రేష్ఠములు. ఫలవాంఛతోఁ జేయుకర్మలు హీనములు. కర్మ భగవంతుని దిగ, ఫలమును భగవంతుని దిగనెంచి మమకార అహంకారముల వీడి కర్తవ్యము పవిత్రముగ దృఢమతి నొనరించుటయే యోగము. అదియే కర్మచేయునేర్పు అట్టియోగబుద్ధినిచేయు కర్మ కర్తను బంధితుని చేయఁజాలదు. అట్టిసమబుద్ధియగు కర్తకుఁ బుణ్యాపాపములంట నేరవు. అతఁడు బంధవిముక్తుఁడైయే దుఃఖమును నుపద్రవమును లేనియవ్యయమగు పరమపదమును బొందఁగాంచును.

పరమార్థము నెఱిఁగి న్యాసవిద్యాతత్పరుఁడై ధ్యాననిష్ఠను మితాహార నిద్రలఁబూని వైరాగ్యము నాశ్రయింపవలెను. అహంకార రహితుఁడై మనోవాక్కాయములు వశమున మంచికొని యనగాఁ త్రికరణశుద్ధిగఁ గర్మలదృఢమతి నాచరించుచు సర్వేంద్రియముల విగ్రహించి సంయమియై యేకాంతస్థానము నొంది శాంతచిత్తమున నుండి, బలదర్పములు, కామక్రోధములు లేనివాడై, యహంకార మమకారములు పొందక సంగరహితుఁడగువాఁడే బ్రహ్మధ్యానమును బొందును. తత్ప్రభావమున బ్రహ్మభావము నొందుటకును నధికారియగును. బ్రహ్మభావమునొందినవాఁడు ప్రసన్నచిత్తుఁడగును. ప్రసన్నచిత్తునకు వాంఛాశోకమోహములంటవు. సర్వభూతసముఁడు కాగావానికిఁ బరమోన్నత హరిభక్తియుం గలుగును. అట్టిభక్తి తత్పరతచే నాతఁడు పరమాత్మ శ్రీహరిని గేశవు నెఱుంగఁగలుగును. భగవత్తత్వముందెలిసి యాత డటుపిమ్మట, నిర్మలబుద్ధి సంపన్నుఁడగును. నిర్మలబుద్ధి బొందినవానికి నిర్మలభక్తియుఁ దానభగవత్ప్రాప్తియు గలుగును. భగత్ప్రాప్తి కలిగినివానికి విష్ణుసాయుజ్యము ముక్తిభాగ్యము నొదవును. న్యాసవిద్యానిష్ఠితులగు మానవులు కర్మత్యాగముం జేయుదుమందురు. కాని నిజమునకా కర్మల పూర్తిత్యాగమనునది

యగునదికాదు. అదియసంభవమేయగును. నియతనిత్యకర్మల విడనాడుట కడుంగడు మోహమూలకము. ఎవ్వడును గర్మను విడిచినంతమాత్రమున నిష్కర్మతనొందఁడు. కర్తవ్యకర్మను జేయమానినంతనె జ్ఞానసిద్ధియు నొందఁడు. ఏవ్యక్తియు నేకర్మమును జేయక యొక్కక్షణమేనియు నుంట యసంభవము. మనుజులచే నెల్లవేళల ననుక్షణ మేదేనొక కర్మయాచరింపఁబడుచునే యుండును. వివశులు ప్రకృతివశులునగు వారిచే, మానవులచే గర్మయనారతము చేయఁబడుచునే యుండును. కాని పరమార్థమునెఱిఁగి చేయువాని, యోగివరుని కర్మ, యాత్మ వికాసము కలిగించును. వాంఛలఁగొట్టుమిట్టాడు వానికర్మ యాత్మను స్థిరముగ బంధించును.

కర్మత్యాగమనునది విడంబనమేయగును. తిండితింటయు, నిదురించుటయుఁ, గర్మలేయగును. తిండికై సేద్యమెంతకర్మయో, ఆతిండికై బిచ్చమెత్తుటయునంతయే కర్మ. పైగా నితరుని కర్మఫలమును, తానన్యాయముగ గొనియనుభవించుట మహాదోషము. బిచ్చమెత్తుటయుఁగర్మమే. అదికాక కర్మసన్యాసమే ముక్తియన్న బిచ్చమిడు వానింగూడ, కర్మమవీడు మనవలెమగదా వాడును గర్మను వీడిన తనకు బిచ్చమేది. తనముక్తికై వేరొకనిచే కర్మచేయించి వాని విముక్తి హీనునిం జేయవలెనా? ఇదియెక్కడి ధర్మము? సన్యాస మనునదిపట్టి దబ్బర. పొట్టకై చెట్టునఁగల కాయఁ గోయుటయుఁ, గ్రిందఁబడిన ఫలమేరుటయుఁ, గర్మలేయగును. కావునఁగర్మల విడనాడిన మానవునకు దేహధారణమే కష్టమగును. బ్రతుకే యసంభవము. కావుననే సేవాత్యాగాది నియతకర్మలు సేయనే వలయును. వాని కర్తృత్వభావమును నహంకారమును, ఫలవాంఛను మమకారమును వీడవలయును. ఆకర్మభగవానునిదే యని పవిత్ర కర్తవ్యబుద్ధిని నిస్సంగతనొనర్పవలెను. త్యాగమొనర్పునది కర్మనుగాదు; కర్మఫలత్యాగ మొనర్పవలెను. ఫలమున కాశింపరాదు. ఫలకాంక్షలేనియెడ పాపమునకందు స్థానములేదు. మనసుచెడుగునకుం జారదు. దేవునిదనియు, గర్తవ్యమనియు ,నెఱుంగుట నాచరణమునఁ గొఱంత గోరంతయురాదు. శ్రద్ధాసక్తులు తక్కువకావు. చెడుగునకు, బాపాచరణమునకు నందునఁ జోటేలేదు. కావున నదిసమ్యగాచరితమగును. అట్టి సమ్యగాచరిత పవిత్ర కర్తవ్యకర్మలే యజ్ఞములగును. వానివే తాను పూజగ్రహింతునని భగవంతుడు చెప్పియున్నాఁడు.

కర్మేంద్రియములను బలవంతమున నణఁచి పట్టియుంచి మనసునందెల్ల వేళల నింద్రియార్థముల, భోగములఁ దలపోయుచు నుండునాతఁడు వట్టిదాంభికుడు, మూఢుఁడు. కావున నింద్రియములను మనమునకు వశముగనొనర్చుకొని మనసును నాత్మవశముగ స్థిరముగ నొనర్చికొని నిగ్రహమునఁ గర్మఫలమున కాశగొనక కర్తవ్యములను జేయుచు యోగబుద్ధిని గర్మేంద్రియములచేఁ బనిగొనునాతఁడే శ్రేష్ఠుఁడు. యోగి.

ఇక చెప్పునదేమన స్వార్థమును వీడి, ఫలాసక్తిని మానిచేయుకర్మ యజ్ఞకర్మ. అట్టియజ్ఞ కర్మవలన బంధములు కలుగవు. స్వార్థప్రేరితములగు నితరకర్మలు మనుజుని బంధించును. కావున ముక్తసంగుఁడై ఫలాసక్తిమాని భగవంతుని కొఱకై బాగుగ కర్మనాచరింపవలెను. ఆఫలము భగవంతునకే సమర్పితము కావలెను. కర్మతోడనే మానవుడు పుట్టెను. కావుననే మనుజులు కర్మజేయక యుండరాదు. ఉండలేరు. కర్మహీనుడగువానికిఁ బాపము చుట్టుకొనును. ముమ్మాటికి నిక్కము.

భగవంతుఁడే "నాకుఁ జేయవలసినదియులేదు, కోరఁదగినదియులేదు, పొందరానిదియులేదు. కాని నేను లోకహితార్థము కర్మలను జేయుచున్నాఁడను. కాని నన్నాకర్మలంటవు. నాకాకర్మల ఫలమందునఁ గోరికియే లేదుగద" అనిపలికియున్నాడు. భగవంతుఁడే యట్లుచేయుచున్నాడనఁ గర్మాచరణ మెంతయుక్తమో యెఱింగి యాచరించి తరించవలెఁగదా. పవిత్రమగు యోగయుక్తమగు కర్మచే చిత్తశుద్ధి చేకూరును. యోగయుక్తమగు పవిత్రకర్మయే చిత్తశుద్ధికి సాధనము. ఇది నిక్కము. స్వార్థవాసనలేనిదయ, దానము, నెల్లమానవులఁ బ్రాణులఁగల పరమాత్మ నెఱింగి నిష్కామమునఁ జేయుసేవయు వాదిగఁగల కర్మలన్నియు యజ్ఞములె. కర్మమునకు, యోగమునకు జ్ఞానముచేతనే పూర్ణతసిద్ధించును. అట్లే జ్ఞానమునకును గర్మయోగమువలననే పూర్ణత చేకూరును. అవ్వియన్యోన్యపూరకములే కాని వ్యతిరేకములుకావు. పవిత్రయజ్ఞాచరణ మెల్లయ భావములఁదీర్చు కామధేనువు. కావున యహంకారములేని త్యాగయుక్తమగు కర్తవ్యాచరణమే, యజ్ఞాచరణమే పరమధర్మము; పరమగతి. కోరికలతోడి కర్మఫలము పరిమితమేయగును. కర్తృతాహంకృతి మానిచేయు కర్తవ్య కృతిని ఫలమును నాదనుటకు గొర్కికిం, దావులేదు. చేయునది చేయించునది యాతఁడే కావున దానిఫలమును నాపరాత్పరునిదే. కావున కర్మఫలమును నాతనికే వీడుచు గర్తవ్యకర్మల నిరంతరముగ నాచరించునది. నిస్సంగుఁడై ఫలాపేక్షవీడి చేసిన యజ్ఞములచే శ్రీహరి పరంధాముఁడు ప్రసన్నుఁడై యెల్లయభీష్టములుం దీర్చును. అట్టియజ్ఞ కర్మలిహమునఁ బరమున వాని బంధించునవి కావు బంధింపఁజాలవు; ముక్తునొనర్చి సాయుజ్యమునకుం గొనిపోవును. ఇకను జాలునని తృప్తినొంది కర్తవ్యముల నిజకర్మల వీడరాదు. ఆ యజ్ఞకర్మల నాసక్తికొనక చేయుచునే యుండవలయును. వానివీడిన వాడు దొంగయేయగును. కర్మవిరహితుని, కర్మచేయకయే తినువాని, తింటయుఁ దిరుగుటయు దొంగతనమే యగును. అవికర్మలు కావా? వానినేల చేయవలెను? ఇతరుని కర్మఫలమును దాను గుడుచుచున్నాడుకదా! కావునవాఁడే మహాచోరుఁడు. కావున ప్రతియొక్కరుఁడును స్వధర్మము నాచరింపనేవలయును. అట్టి ధర్మాచరణమే భగవదాజ్ఞాపాలనమే, సత్యము,

సర్వసమత, పవిత్రప్రేమ, దయ, సేవ, సదాచరణము నాదిగ నాచరణనుంచి యాత్మవి యాజ్ఞల పాలించుటయే మానవకర్తవ్యము.

ఉత్తముండేదిచేసిన నదియెచేయఁదగిన కార్యముగ జనులెంతురు. వారాతనివే ప్రమాణముగ నాదర్శముగ గ్రహింతురు. కావున యోగి తనకు నవసరము లేకపోయినను, సామాన్య నట్లకర్మల, పవిత్రకర్తవ్య కర్మల యోగయుక్తిని జేయనేవలయును. లేకున్న నెల్లజనులును నకర్మణ్యులగుదురు. వారిని భ్రష్టులుగఁజేసినవాడు తానేయగును. కావున నెంతటి వాఁడయ్యును గర్మను. విధ్యుక్తమును, గర్తవ్యమును మానకచేయనే వలయును. ఇటఁబరిణితునియు, నపరిణితునియుఁ గర్మాచరణమున మనఃప్రవృత్తియే భేదము; స్థూలదృష్టికి భేదమేకానరాదు. కావుననే లోకసంగ్రహార్థమైయే కర్మను దాను జేయుచున్నానని శ్రీకృష్ణ భగవానుఁడు పలికెను. యోగయుక్తుఁడు తానొకపవిత్రా దర్శమును బొంది తోడివారల, తనతరువాతి వారల నాదర్శవంతులుగఁ జేసి యుద్ధరింపవలెను. ఇదియేకర్తవ్యము. కర్మయోగము.

యోగిజనులహంకార మమకారములంటని మనసునఁ గర్తవ్యము నొనరింతురు; అందువాత్మవర్తించుట లేదవియెఱుంగుదురు. భగవంతుఁడు శ్రీకృష్ణపరమాత్మ మాటిమాటికి నొక్కి చెప్పినది. ఆశామమకారములను, నహంకారమును వీడి యాధ్యాత్మ చింతను, యోగబుద్ధిని నెల్ల కర్తవ్యకర్మలను, ఆచరించుచు కర్మఫలమును భగవంతునకే యర్పించి విచారమును మాని జీవితసంగ్రామమును విజయవంతముగఁ గొనసాగింప వలెను. ఇదియే దేవదేవుని మతము, నభిమతము. దీనినెవ్వరు శ్రద్ధావంతులై, యసూయ రహితులై యనుసరింతురో వారలాకర్మబంధములంబాసి ముక్తులగుదురు. కర్మఫలమును కేవలముకాదని విడుచుట కంటె దానిపరమేశ్వరునకే, పరంధామునకై, విడుచుటలో మహద్విశేషము కలదు. ద్వేషబుద్ధిని మూర్ఖులై భగవంతుఁడు స్వయముగఁ జూపిన యాదివ్యమగు మార్గమునుబట్టి నడువనివారిని, కర్తవ్యపరుల నిందించువారిని, నెల్లవిధములఁ బతితులుగా, భ్రష్టులైనశించువారినిగా, శుభవిదూరులుగా నెఱుంగనగును.

జ్ఞానులకు రాగద్వేషములు ప్రబలశత్రువులు అవ్వి జ్ఞానము నణఁచివేయఁజూచును. వానికిందావు లింద్రియములును, వింద్రియార్థములును. కావున యోగిగానుండు వాఁడింద్రియముల, వింద్రియార్థముల వశమున నుంచికొని, రాగద్వేషములను దరిమి, దరిఁజేరనీయఁడు. వానివెతింగి తొలగించును. వానిందొలఁగించుటకుఁ బ్రధానసహాకారము సహజస్వధర్మాచరణమే. పరధర్మమువందాశఁగొని పరుగులిడు వానికి నాత్మనిగ్రహము, సమబుద్ధి, కలుగుటయు, మమకారాహంకారములు మాయుటయుఁ గలలోని వార్తలే. ఎట్టిదైనను స్వధర్మమే యన్నివిధములఁ బరధర్మమునకంటె నెంతయుమేలు.

పరధర్మమెంత ఘనముగ, సుగమముగ, దోచినను స్వధర్మమే మేలు. స్వధర్మమున మరణమేయైనను మేలేయగును. స్వధర్మమే సుఖావహము. పరధర్మము భయావహము. స్వధర్మాచరణమున వాంఛా మమకారములంటక యుండనగును. పరధర్మాచరణమున వాంఛామమకారములంటును. కావుననే భయావహము. కోరిక (కామము) రజోగుణోద్భవము. ఆకామమె క్రోధముగఁ బరిణమించును. కావున జ్ఞానులకుఁ ప్రబల శత్రువగు కామమగ్నివంటిది. అద్దియెవ్వరిని జేరిన వారినే కాల్చినాశముచేయును. ఆకామమునకుఁ బట్టుకొమ్మ లింద్రియములును, మనసును. కావున యోగి తొలుదొల్త నింద్రియముల నధీనమున నుంచుకొనవలయును. ఆమీఁదట జ్ఞానవిజ్ఞానముల నశింపఁజేసెడి పాపస్వరూపమగు కామమును దృఢనిశ్చయంబునఁ బాఱఁదోలవలయును. ఇంద్రియములు బలవంతములు. ఇంద్రియములకంటెను మనసు శ్రేష్ఠమును, బలవంతమును. ఆమనసునకంటెను బుద్ధియును, నాబుద్ధికంటెను నాత్మయును శ్రేష్ఠములు; బలవంతములగును. అట్టి సర్వోత్తమమును, బలవంతమునునగు నాత్మనెఱింగి, యాత్మవశమగు బుద్ధిచే మనసునునదుపున వశమున నుంచికొని దుర్జయమగు కామమను బరమశత్రువును జయింపవలయును, దరుమవలయును. ఇంద్రియముల నదుపున వశమున నుంచవలెను. యోగియగు వానికియ్యదియ తొలుతొల్తటికార్యము. అట్టులెఱింగి కార్యాచరణమొనర్చి కడచిగట్టెక్కిన వాఁడె యోగివరుడు, యుక్తతముఁడు.

పరమాత్మ తానీయోగమును దొలుదొల్త వివస్వంతునకుం జెప్పెను. వివస్వంతుండు మనువునకును, మనువిక్ష్వాకునకును బోధించిరి. అట్లు పరంపరగ రాజర్షులందు వచ్చుచునేయుండి, కాలగర్భమున మాటువడెను. ఆయోగమునే శ్రీకృష్ణపరమాత్మ ప్రాణసఖుండవి భక్తుండవని పార్థునకుంజెప్పెను. దానినెఱింగి వ్యాసభగవానుఁడు కనికరించి యాపక్తులగు దీనులగు మానవులకు నెల్లరకందింపగోరెను. ఆగురువరు ప్రసాదితమే, ఇదిమీకు నేఁజెప్పితిని.

ఆనాఁడు భగవంతునెఱింగి యాతఁడందించి యిచ్చిన యోగమవలంబించి పాలకు లిక్ష్వాకాదులు రాజయోగులై, కర్మపరులై, ప్రజలందునం బరమేశ్వరుంగాంచుచుఁ బరమేశ్వరకార్యముగ పరిపాలన సాగించి ప్రజలను సుఖపెట్టితాము తరించిరి. సూర్యభగవానుఁడన కేవలమునొక గ్రహమనుకొనరాదు. ఆగ్రహాధిపతియే సూర్యుడు. ఆతవి నియుక్తినే యాగ్రహమునడచుచున్నది. యాతఁడేతదాచరణకర్త, కారకుఁడు. నిత్యకర్మశీలుఁడు, కర్మయోగి, సూర్యభగవానుఁడు. ఆతఁడు కర్మచేయుచున్నదే యెఱుఁగఁడు. ఆకర్మసహజముగనే యాతనిచే జరిగిపోవుచున్నది. కావుననే యాతఁడు

కర్మచేయుచునే చేసినవాఁడుకాఁడు. ఆతని యుదయముతోనే లోకము కర్మ ప్రవృత్త మగుచున్నది. లోకమున ననంతమగు కర్మజరిగిపోవుచున్నది. ఇదియంతయు నాతని ప్రేరణము. కావుననే యాతఁడేమియుఁ జేయకయేయంతయుఁ జేసినవాఁడగుచున్నాఁడు. అనంతకర్మ నాచరించుచున్నవాఁడగుచున్నాఁడు. ఇట్లుగ సూర్యునట్లు అవిచ్ఛిన్న కర్మపరుఁడగు వాఁడేయోగి, కర్మయోగి; తరించువాడు.

మమకారాహంకారములకు దూరుఁడై భగవద్భక్తుఁ డెల్ల ప్రాణుల, దీనమానవులఁ గల భగవంతు గుర్తించి, యెవ్వరిని హింసింపక వారివలన నేమియుఁ బ్రతిఫలమును వాంఛింపక వారిసేవలఁజేయును. అదియే భగవత్సేవ. మానవారాధనయే మాధవారాధనము. ఆభక్తుఁడే మానవమాత్రారాధకుఁడే భూతదయాపరుఁడే యోగవిత్తముఁడు. ఆతఁడు నిత్యతృప్తుఁడై, సుఖదుఃఖములను, మానావమానములను, హానిలాభములను, శీతోష్ణములను, జయపరాజయములను, సమముగనెంచి యెందుననురాగ ద్వేషములు మాని, అవ్వానిమనమున నంటనీక, సర్వవ్యాపియగు నాపరాత్పరుఁడనయందును ఎల్లెడనెల్లర నెల్లయెడదనును, దనయందున నెల్లరను గనుంగొని డెందమున నాసర్వాత్ముని నిరంతరము విల్పిధ్యానించుచుఁదనియును. ఆతడెయోగి, భక్తుఁడు.

ఆయాకాలములందు స్వాధ్యాయమును, యోగమును నాచరింపనేవలయును, మానరాదు. నిత్యనైమిత్తిక కర్మలశక్తికొలందిగ యోగయుక్తిని సమాచరింపనేవలయును.

వేంకటాచలమునను, ఇతరదేవాలయ ప్రాంతములను బృందావనముల నాటి పెంచి తులసిమాలల దేవునారాధించుట, ఆలయములఁ దత్పరిసరములనూడ్చియు, వలికిశుభ్రపఱచియు, ముగ్గులిడుటయు, దేవునుత్సవములఁ జరిపించుటయు, నందునఁబాల్గొనుటయు, దేవునకు నివేదించి జలాన్నఫల పుష్పములు వస్త్రాభూషణములు, దేవునకర్పించి తత్ప్రసాదమంది, ప్రాణిమాత్రముల దీనజనముల విద్వేషరహితుఁడై యారాధించి యన్నపానములిడి, సంతృప్తులం జేయుటయు,దేవునారాధించుటయేయగును; దైవాజ్ఞాపాలనమేయగును. దైవప్రసాదమును దీనజనులకిడి వారియందలి దేవుందని యింపంజేసి పిదప వాప్రసాదశేషమును దానుదిని శరీరపోషణము నొనర్చికొనదగును. అట్టిపురుషుఁడు పరాగతిని బొందితరించును.

కావునబుధుఁడగువాఁడు నిత్యనైమిత్తిక కర్మలను దైవార్పితముగఁ దప్పక చేయవలెను. మఱియు శాస్త్రవిరుద్ధములును నిందితములును గాని పవిత్రసేవాకర్మల నితరము [illegible] జేయుచుండవలెను. శరీరధారణము, భోగభాగ్యములు జ్ఞానవిజ్ఞానములు, బలసామర్థ్యములు క్షేత్రగృహారామములు, ధనధాన్యములు మొదలగునింకను దాను

చేకూర్చుకొనిన యెన్నెన్నిసాధన సంపత్తులు కలవో వానినెల్ల మానవుఁడు వినశ్వరములని యెంచి యెఱిఁగి, భగవదర్పితము గావించి, ప్రాణిసేవ మానవసేవల పొనరించుచు బుద్ధిమంతుఁడు జీవితముం బవిత్రముగఁ గొనసాగింపవలెను. పాపాత్ముఁడు తప్పక నరకమునఁ గూలియాతనలంబడును; నీచాతినీచములగు జన్మలనంది పరితపించును. సుకృతాత్ముఁడవశ్యము సుఖములనందును. యోగయుక్తుఁడు సుఖదుఃఖములకుఁ బుణ్యాపాపములకు నతీతమగు పరమపదమును బొంది తరించును. ఇదియెఱిఁగి బుద్ధిమంతుఁడు యోగియై నెమ్మనమున వేంకటాద్రీశుని సతతము సంస్మరించు చుండవలయును. గురుశుశ్రూషారతుఁడై సదాధర్మశాస్త్రము లెఱింగి యాచరింపవలెను. గృహస్థుఁడై యుండినచో జితేంద్రియుఁడై నిజభార్యానురక్తుఁడై చరించుచు నతిధ్యభ్యాగతుల నాదరించుచు సాధుసజ్జనుల సేవించుచు వారల నాత్మహితము నడిగి గ్రహించి సత్కృతుల నాదరింపవలెను. వేదార్థముల, వేదాంతార్థముల విచారించి యభ్యసింపవలెను. మిక్కిలిగఁజెప్పుట యెందులకు విధివిహితములగు కర్తవ్యములనెన్నడును విడువరాదు. నిషిద్ధకర్మలనెన్నడును నాచరింపరాదు. ఇదియే కర్మసంగ్రహము. తత్వసారము.

## శ్రీ వేంకటేశ్వరాష్టోత్తర శతనామావళి

ఆపవిత్రనైమిషారణ్యమున దీర్ఘసత్రయాగకాలమున శౌనకాది మహామునులు సూతముని వరుంగాంచి యిట్లనిరి. ఓ సర్వార్థతత్వజ్ఞా సర్వవేదార్థపారగా, రౌమహర్షణి మునితల్లజా, ఎట్టిపూజలచే, నేవిధినారాధించిన శేషశైలవాసి వేంకటవల్లభుడు తొందరగ నప్పటికప్పుడె ప్రసన్నుఁడై కోరినకోర్కులెల్లఁదీర్పగలఁడు? ఇట్లడుగఁబడిన సూతముని వరుఁడు కొంతతడవాలోచించి, మునితిలకులతో నిట్లనెను.

ఓమునితల్లజులారా! మీరందఱు ధ్యానముంచి యాలింపుడు. భగవంతున కత్యంత ప్రియమును నత్యంతగోప్యమును నగునొకవృత్తము గలదు.

పూర్వకాలమున కపిలమునివరునిచే నడుగఁబడిన శేషభగవానుఁడీ మహత్వంపన్న మగు, దేవదేవునకమిత ప్రీతికారకమగు, పవిత్రమును, బుణ్యప్రదమును బాపనాశనమునగు శ్రీనివాసభగవంతుని యష్టోత్తరం శతనామావళిని వినిపించెను. తొల్లి నలువ స్వర్ణదీ సంభవముల బంగరుతమ్మిపూలం గొనివచ్చి వానితో నీనూటయెన్మిది దివ్యనామములతో నాదిదేవునర్చించి తనయిష్టావాప్తినందెను. సర్వలోక పితామహుఁ డొనర్చిన గతినే యెవ్వరేనిపూజించి తరింతురు. ఇదో యాలింపుడు. ఆశేషశైలాధీశుని వేంకటేశ భగవానుని మనసును సంతుష్టినొందించునట్టి, మానవులకు నాయురారోగ్యములు, ధనధాన్యములు, సుఖసంపదలు నొసఁగునట్టి, మహదైశ్వర్యకరమగు, విశేషించి జ్ఞానప్రదమగు అష్టోత్తర

శతనామముల వచియించెదను. మునివరపూజితములగు నాదివ్యనామములతో నిండు పవిత్రమానసమును భగవంతునందుననె యుంచి యాదిదేవుదివ్యపాదముల వర్ణించు టెంతయునొప్పును.

ఈయష్టోత్తరశతనామములకు ఋషిప్రజాపతి బ్రహ్మయ, అనుష్టుప్ఛందము, వేంకటేశుఁడు, శ్రీనివాసుడేదేవత, వానిబీజము నీలగోక్షీరసంభూతముగా విబుధవరులు వచించిరి. శ్రీనివాసులే వీనికిశక్తి, వేంకటాధిపుడె వానికి హృదయము. వానివినియోగము అభీష్టసిద్ధ్యర్థముగ వచింపఁబడినది.

ఓం శ్రీ వేంకటేశాయనమః ఓం నమో వేంకటేశాయ
ఓం శేషాద్రినిలయాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీ వృషదృగ్గోచరాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీవిష్ణవే శ్రీ వేంకటేశాయ నమః
ఓం ఓం శ్రీసదంజనాగిరీశాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీమేరుపుత్ర గిరీశాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీ వృషాద్రిపతయే శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీసరః స్వామితటీజుషే శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీవజ్ర దృగ్విషయాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీకుమారాకల్ప సేవ్యాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీ సువర్చలాసుతన్యస్త సైనాపత్య భరాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీరామాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీపద్మనాభాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీ వాయున్తుతాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీత్యక్త వైకుంఠలోకాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీగిరికుంజ విహారిణే శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీహరిచందన గోత్రేంద్రస్వామినే శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీ శంఖరాజన్య నేత్రాబ్జవిషయాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీవసూపరి చరత్రాత్రే శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీకృష్ణాయ శ్రీవేంకటేశాయ నమః
ఓం శ్రీ అబ్ధికన్యా పరిష్వక్త వక్షసే శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీ భక్తజనానురక్త హృదయాయ శ్రీ వేంకటేశాయ నమః
ఓం శ్రీ సనకాది మహాయోగిపూజితాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ దేవజిత్ప్రముఖానంత
దైత్యసంఘ ప్రణాశినే — శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ శ్వేతద్వీప వసన్ముక్త
పూజితాంఘ్రి యుగాయ — శ్రీవేంకటేశాయ నమః

ఓం శ్రీ శేషపర్వతరూపత్వ ప్రకాశనపరాయ — శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ సానుస్థాపిత తార్క్ష్యాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ తార్క్ష్యాచల నివాసినే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ మాయాగూఢ విమానాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ గరుడస్కంధవాసినే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ అనంతశిరసే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ అనంతాక్షాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ అనంతచరణాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీశైలనిలయాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ దామోదరాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ నీలమేఘనిభాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ బ్రహ్మాదిదేవదుర్దర్శ విశ్వరూపాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ వైకుంఠాగత సద్హేమ విమానాంతర్గతాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ అగస్త్యాభ్యర్థితా శేషజనదృగ్గోచరాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ వేంకటగిరీశాయ వాసుదేవాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ హరయే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీతీర్థపంచకవాసినే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీవామదేవప్రియాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ జనకేష్టప్రదాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ మార్కండేయ మహాతీర్థజాతపుణ్యప్రదాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ వాక్పతిబ్రహ్మదాత్రే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ చంద్రలావణ్యదాయినే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ నారాయణనగేశాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ బ్రహ్మక్లుప్తోత్సవాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ శంఖచక్రవరానమ్రలసత్కరతలాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీద్రవన్మృగ మదాసక్త విగ్రహాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీకేశవాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీనిత్యయౌవన మూర్తయే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ అర్థితార్థప్రదాత్రే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ విశ్వతీర్థాఘహారిణే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ తీర్థస్వామిసరస్స్నాత జనాభీష్టప్రదాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ కుమారధారికావాస స్కందాభీష్టప్రదాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ జానుదఘ్న సముద్భూతపోత్రిణే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీకూర్మమూర్తయే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీకిన్నర ద్వంద్వశాపాంత ప్రదాత్రే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ విభవే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ వైఖానసముని శ్రేష్ఠపూజితాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ సింహాచలనివాసాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీమన్నారాయణాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ సద్భక్తనీలకంఠార్చ్యనృసింహాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ కుముదాక్షగణశ్రేష్ఠసేనాపత్యప్రదాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ దుర్మేధఃప్రాణహర్త్రే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీధరాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీక్షత్రియాంతకరామాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీమత్స్యరూపాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ పాండవారిప్రహర్త్రే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీకరాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ ఉపత్యకాప్రదేశస్థ శంకరధ్యాతమూర్తయే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీరుక్మాబ్జసరసీకూల లక్ష్మీకృత తపస్వినే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీలసల్లక్ష్మీ కరాంభోజదత్తకల్హారకస్రజే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీశాలగ్రామనివాసాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీశుకదృగ్గోచరాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీనారాయణార్థితాశేషజనదృగ్విషయాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ మృగయారసికాయ — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ వృషభాసురహారిణే — శ్రీ వేంకటేశాయనమః

ఓం శ్రీ అంజనాగోత్రపతయే — శ్రీ వేంకటేశాయనమః

| | |
|---|---|
| ఓం శ్రీ వృషభాచలవాసినే | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ అంజనాసుతదాత్రే | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ మాధవీయాఘహారిణే | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ ప్రియంగుప్రియభక్షాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ శ్వేతకోలవరాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ నీలధేనుపయోధారాసేక దేహోద్భవాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ శంకరప్రియమిత్రాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీచోళపుత్రప్రియాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ సుధర్మిణీ సుచైతన్యప్రదాత్రే | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీమధుఘాతినే | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ కృష్ణాఖ్య విప్రవేదాంతదేశికత్వప్రదాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ వరాహాచలనాథాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ బలభద్రాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ త్రివిక్రమాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీమహతే | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీహృషీకేశాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ అచ్యుతాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ నీలాద్రినిలయాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ క్షీరాబ్ధినాథాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ వైకుంఠాచలవాసినే | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ ముకుందాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ అనంతాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ విరించాభ్యర్థితానీతసౌమ్యరూపాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ సువర్ణముఖరీస్నాతమనుజాభీష్టప్రదాయినే | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ హలాయుధ జగత్తీర్థసమస్త ఫలదాయినే | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ గోవిందాయ | శ్రీ వేంకటేశాయనమః |
| ఓం శ్రీ శ్రీనివాసాయ | శ్రీ వేంకటేశాయనమః |

ఈ శ్రీ వేంకటేశ్వరాష్టోత్తర శతనామములను ఎవరు భక్తిశ్రద్ధలతో పఠింతురో, వినెదరో వారియందు శ్రీ వేంకటేశభగవానుడనుగ్రహము ప్రసన్నుడగును. సత్యము. [illegible]

చేయవలెను. వేంకటాద్రీశు పరాత్పరు నీఅష్టోత్తర శతనామములతో నిత్యము పూజ భక్తిశ్రద్ధలఁ జరుపువారు ముక్తిఫల మవశ్యముపొందుదురు. ఈ యష్టోత్తర శతనామస్తోత్రము గోప్యముగ నుంపఁదగినది. భక్తిశ్రద్ధలు కలవారికే తెలుపఁదగును; మనసులగ్నముచేసి పఠింపఁదగును. హృదయమున దేవునుంపక యొనర్చు పఠనపాఠనములు, ప్రార్థనములు వ్యర్థము. ఈ నామస్తోత్రమునే శేషమూర్తి కపిల మునిసత్తమున కుపదేశించెను. ఆకపిలమునివరుఁడు కరుణను నాకుందెలిపెను. భగవంతునకుం బ్రీతికారకమగు నీస్తోత్రమిపుడు నేను మీకెల్లరకును దెలియఁజెప్పితిని.

ఆ॥ భక్తియందులేదు స్వార్థంబునకుఁదావు.
స్వార్థముడుగు సేవ భక్తియెయగు
వేషభాషలందు వెల్లడించుట కాదు
నీతిచేతలందు నియతిఁజూపు.

ఓ ఋషిమునివరులారా! ఇంకను మీరేమి వినఁగోరెదరు? వచింపుడు. నాతెలిసినంతవరకు నేనియుఁగొంతనుంపక చెప్పుదును. సందియమునకు నెడలేదని రౌమహర్షణియన శౌనకాదులిట్లనిరి.

ఓ భగవద్భక్తినయః పారావారరాకామృతకరా! నీవచింపఁబడిన శ్రీ వేంకటేశ మహాత్మ్యంబు మహాద్భుతంబు ప్రభుని యాసాటిలేని చరితయెంతయు నుదారము. రహస్యభూతమగు ప్రభునామావళి, సుకృత కథామృతము వీనులవిందుగఁ గ్రోలితిమి. పరాత్పరుని దివ్యరూప సందర్శనోత్కంఠనను మానేత్రములు తహతహలాడుచున్నవి. ఇప్పుడపోయి యాదేవుని దర్శించి పూజింపఁగోరికగనున్నది. స్వామిపుష్కరిణిని తానములాడ మనములువ్విళ్లూరుచున్నవి. కావున శ్రీ వేంకటేశు సేవలకు, బోవమాకనుమతినీయఁ గోరెదమన రౌమహర్షణముని యిట్లనెను. అయ్యలారా మునిసత్తములారా! మీరెఱుంగని దేమున్నది. ఇటమీరిపుడుపొనరించుచున్న సత్రయాగమును పరిసమాప్తిచేయుడు. కర్తవ్యాచరణమదేవు నభీష్టము. ఆమీద మీరునయనమ్మై మెలమెల్లన వేంకటాచలమును జేరుఁడు. ఆపవిత్ర పుణ్యభూధరమును బ్రదక్షిణించి, పరిపరములఁ దీర్థముల స్నానము లొనరించి యందలిదేవతల నారాధింపుఁడు. శుకపికశారికాది శకుంతసంతాన కల కూజితముల మనోహరమగు నారత్నసానువు నద్రిరాజ మధిరోహించి పద్మవన రంజితము స్వామి పుష్కరిణిని బ్రదక్షిణములతో స్నానమొనరింపుఁడు. దర్శనమాత్రముననే పాపముల నెల్లఁగడిగినైచు, హృదయానందదాయకమ్మై రోమాంచములఁ గలిగించు దివ్యవిమానమును గాంచి ప్రదక్షిణపూర్వకముగనందుఁ బ్రవేశించి భూవరాహమూర్తికి భక్తిని బ్రణమిల్లి పోయి యానందమున శ్రీపద్మావతీ శ్రీదేవులతోఁ గూడియున్న శంఖచక్రగదాధారియగు

బుండరీకాక్షుఁడును దరంగిత దయాసముద్రుఁడునునగు శ్రీవేంకటేశుని గనులార దర్శించి శిరసాభివందనమొనరింపుడు. మనసారఁ బ్రార్థనములొనర్చి యష్టోత్తర శతనామావళితోఁ బద్మరాజితోఁ బూజించి తనియుఁడు. దుర్లభాభీష్టములఁ బడసి ప్రమోదమునఁ గృతకృత్యులై మఱలుఁడు అనుచున్న సూతముని నాలించి తదనుమతి నాయాగమ్ముం గొన్ని దినంబులలో పూర్తిగావింపఁబూనిరి. పిమ్మట నానందకందళిత హృదయములనట నుండి పయనమును సాగించిరి.

## శ్రీ వేంకటాద్రికి మునుల పయనము, వారటఁ జేరుట

మహర్షులు, భరద్వాజ కౌశికులు, క్రతుకశ్యప జాబాలులు, శౌనక పులహపులస్త్య గౌతమాంగిరసులు, దక్షదేవల, శతానందులు, కణ్వకౌత్సమృకండ మైత్రేయ దేవదర్శనులు మొదలుగ నెందఱెందఱో తపోధనులు, మహర్షివరులు బయల్వెడలి కలిసిపోయిరి. పోవుచువారు తన్మయత నందరేక కంఠమున నుచ్చైస్స్వరమున గోవింద, గోవిందా, వేంకటగిరివాసా శ్రీనివాసా, దేవదేవా! యని మాటిమాటికిఁ బలుకుచు సాగిపోవుచుండిరి. వారు భాగీరథిని స్నానమాడి, తరించి గౌతమింగాంచి, మ్రొక్కి మునుకలిడి, పోయి కృష్ణవేణిని స్నానమొనరించి తనిసిరి. అటులు పోవుచు నాతపోధనులందందు నెదురైన పుణ్యక్షేత్రముల దీర్థంబులాడి ప్రమోదమునందిరి. తప్తజాంబూనదమయమును, పవిత్రానేక పుణ్యతీర్థయుతంబును, సర్వసిద్ధసంసేవితంబును, మదమంజుల మయూరకేకాస్వన మనోహరంబును, దివ్యనిర్ఝర సమన్వితంబును, పుష్పఫలపూర్ణమనోహర దివ్యద్రుమ సంశోభితమును నగు వేంకటాద్రిని జేరి దాని ప్రదక్షిణమొనర్చి యధిరోహించి యేమియుఁ గొఱవడకుండఁ బూజాకార్యములెల్లఁ గ్రమమున నెఱవేర్చి వేంకటేశుం జేరి పరమపావన కైంకర్యపూజలఁ బొనరింపఁ బూనిరి.

శేషగిరిని జేరిన యామునులు నియమమున మంత్రములంబఠించుచు, సెలయేళ్లను సరోవరముల స్నానములాచరించుచు, మున్నతశిఖర రమ్యముల మణిమయ పర్వతముల గనుంగొనుచు, శ్రోత్రపేయములగు పక్షుల కలకలారావముల నాకర్ణించుచు సామగానములుచేయుచు, సంస్తుతులొనరించుచు, సంభ్రమోత్సాహము లతిశయింప నృత్యములొనర్చుచు గోవిందాది హరినామములు బొబ్బలిడుచు బడుచులేచుచు నేలంబొర్లాడుచు నాతపోధనులు భక్తిపారవశ్యమున నానందమున నొడలుమఱచి పవిత్ర పర్వతరాజమునకుఁ గ్రమమునఁ బ్రదక్షిణమొనరించుచుం జేరి కపిలతీర్థమున స్నానమొనరించి శివగిరింగాంచి మ్రొక్కిరి. సిద్ధగంధర్వామర సంసేవితంబునుఁ మేరు శైలాభమునగు నాతిరుమల నధిరోహించి, యత్యద్భుతంబును, రత్నసానువుల హేమాద్రి కధికంబును, నభూతపూర్వము నగు వేంకట భూధరరాజమిదే యనుకొనుచుంబోయి,

మనోహరాతి మనోహరమును, దివ్యాతిదివ్యమును, పరమోత్తమమునగు దేవదర్శనము గనుంగొనిరి. స్వామితీర్థమునఁ దీర్థములాడి వరాహదేవు దర్శించి నర్చించి కోటిమన్మథ లావణ్య, కిరీటముకుటోజ్జ్వలు, రమాకాంతామణి సంశోభిత విశాలవక్షు, ముక్తాహార విరాజితుఁ జతుర్భుజు శంఖచక్రగదాధరు, నీలమేఘాభశ్యామల దేహు, పీతాంబరధరు, శ్రీనీలా పద్మావతీ సహితు దేవదేవువిష్ణుని పద్మార్చిత పదాబ్జుని భగవంతుని శ్రీనివాసుని గన్నులంతలుగఁ జూచి, హర్షోత్ఫుల్లనయనులై పడిపడి దండములు పెట్టిరి. వేదసమ్మతములగు మంత్రములతో, స్తోత్రములతో నాదేవునెంతయు వినుతించియుఁ దనివినందఁ జాలకుండిరి.

## మహర్షులు దేవు స్తుతించుట

అనంతభూరజః కణముల లెక్కింపఁ గలవాఁడెవ్వఁడో యాతఁడే ఓభగవంత, శ్రీహరీ, నీగుణముల లీలల లెక్కింపఁగలఁడు. భూమండలమంతయు భూనభోంతరములు మూఁడడుగుల నాక్రమించిన, ధర్మసంస్థాపన మొనర్చిన త్రివిక్రమునకు వందనములు. ఈ భూమినంతను దన పదియంగుళముల ప్రమాణముననే వ్యాపించియున్నవానికి, భూతభవిష్యద్వర్తమాన కాలములందంత వ్యాపించి యున్నవానికి విష్ణునకు నమోవాకములు. ఎవ్వనియేక పాదమున నీవిశ్వమంతయును పాదద్వయమున వ్యోమమంతయును పొంగి మణఁగి యుండెనో వానికి నాదిదేవునకు నమస్కరింతుము. ఋగ్యజుస్సామము లెవ్వనివలనఁ గలిగెనో, యావేదమయుమును గోవిందునకుఁ గమవిందునకు వందనములు. ఎవనినుండి తురగాది జంతుసంతతులు, జడాజడములు కలిగెనో, ఎవని ముఖమున నుండి విప్రులు మునులు, బాహువులనుండి క్షత్రియులును, ఊరువులనుండి వైశ్యులును, పదపద్మముల నుండి శూద్రులును బుట్టిరో యాజగత్కారణునకు హృషీకేశునకు నమోవాకములు. ఎవ్వాని నాభికమలమున చతుర్భుజుడు బ్రహ్మయు ముఖమున వహ్నియును నింద్రుఁడు, నేత్రముల సూర్యచంద్రులు నుద్భవించిరో యాసృష్టికర్తకు ప్రజాపతికిఁ బుండరీకాక్షునకు నమస్కృతులు. మానవులు నీగుణములపారము గానలేక దూరముననే యుండిపోవుచున్నారు. మానవులేమి, వేదములే నీగుణములపారము గానఁ జాలక నలుకఁజాలక తొలఁగుచున్నవి. ఇట్లని శ్రావ్యములును మనోహరములును నగు స్తోత్రములచే ననేక విధముల స్తుతించి మునిపతి సుందరరాజీవములు గొనివచ్చి వేదములు మునిసత్తములు చెప్పిన తెఱంగునఁ దొట్రుపాటునందక నామావళితో శ్రీనివాసునర్చించిరి.

కం॥ శ్రీవేంకటగిరివాసా!
దేవేశా! శ్రీనివాస! దీనార్తి హరా!
సేవించెదఁ గీర్తించెద
భావించెద నెడఁద విడని భక్తినియుక్తిన్

మగంధి:-
కొన్నవడ్డికాసులెల్ల కోటిరెట్లు లెక్కగా
నెన్ని, మించికామితార్థమిత్తు భక్తకోటి కా
పన్నరక్షకుండ వీవ; పాలితామరాధిపా!
విన్ను వడ్డికాసులయ్య విచ్చలున్ భజించెదన్

పంచచామరము
ధరాధరంబులేడు దాటిదంటవైవసించుచున్
పరాకులేక, మామొఱల్గుబాలువం జెవింబడన్
బరాబరి న్బరుంగువెట్టి వచ్చి యందుకొందువో
వరాలతండ్రి యేడుకొండలయ్య వందనాలివే

చ॥ ఇడుమలు వాపుకర్తలు మఱెవ్వరులేరని వమ్మియెవ్వరేన్
ముడుపులుకట్టి భక్తిఁగడు మ్రొక్కులు మ్రొక్కిన వారి కోరికల్
కడవడనీక కూర్తువటకామిత వత్సలదాత వేంకటే
శుఁడ కనకాద్రి వాసమముఁజూడుము కన్నులనొప్పు ప్రేమతోన్

తే॥ వేంకటేశుండె దేవుండు వేరొకండు
లేడు లేడెందు, తేఁడుల తేఁడతండు
అతని శేషాద్రివాసున నారతంబు
భక్తిమనసారఁ గొల్తుము బ్రస్తుతింతు.

కం॥ ఎవరేరూపునఁ గొలిచిన
నెవరేపేరునను బిలిచి యెంచిన భక్తిన్
అవియెల్లనుగైకొని కృప
దివిచి దరికి నేలెడు ప్రభు! దేవరమ్రొక్కుల్

తే॥ పతులమోమున నెడదదండునగము మేన
దాల్చిజగములఁ బుట్టించి, దయను బెంచి
కాలముంబొందఁ జేసెడి ఘనులు మువ్వురు
మూర్తులకు మూలమూర్తికి మ్రొక్కుదెవుడు.

సీ॥ తారలేమణులుగాఁ దగఁగూర్చి తీర్చిన
యవరంజి బొమిడికయలరఁదలను.
రేబవళ్లను జేయు రేరాజు దినరాజు
కనుదమ్ములను, మొగమ్మున నవలము
భుజముల వేల్పులు పొలుపొందుచుండంగఁ
పెన్నురంబునలచ్చి చెన్నుమీఱ
బొడ్డుతమ్మివి బమ్మ బొజ్జనులోకాలు
జడముల జడములు తొడలనొప్ప

గీ॥ పాదపద్మంబె వ్యోమమై పరిడవిల్ల
రోదసీమండలమున నీరూపమొప్ప
నీవకాకొండు లేదంట నిజముకాదె
దేవదేవ నమస్కృతుల్దీనశరణ.

వ॥ దేవదేవా! జగత్పితా! దీనరక్షకా శరణు శరణు; రక్షింపుము; మనమున శాంతము సుస్థిరము నొసర్పుము; చంచలేంద్రియమ్ముల నదుపున నుండ ననుగ్రహింపుము. నామనంబెప్పుడు నీయందె నిశ్చలముగ నుండ సదాచరణుడనుగ ననుగ్రహింపుము. ద్వంద్వాతీతబుద్ధి సర్వసమభావము నొసంగుము.

ఓం శ్రీ వేంకటేశాయ నమః ఓం నమః శ్రీ వేంకటేశాయ,
ఓం నమో భగవతే వేంకటేశాయ.

అంతట జగద్దాత శ్రీ వేంకటాద్రి నాధుడు ప్రసన్నుఁడై వారికిట్లనియెను. ఓ తపోధనులారా! మీయునికిఁ జేతకు, భక్తిశ్రద్ధలకు నేనెంతయుఁ బ్రీతుఁడనైతిని. ఓ బుధసత్తములారా! శ్రీ వేంకటాచల మాహాత్మ్యశ్రవణము వలననే మీకునేను చిరకాలతపశ్చర్యవలనఁ గలుగుఫలము నొసంగుచున్నాను. మునివరులారా! మీకు నలయునభీష్టము లెల్లనొసంగితిని. కడుంగడు దూరమున నున్నవారైనను నీవేంకటాచల మాహాత్మ్యమును, విశేషించి కన్యామాసమున శ్రద్ధాభక్తులతో వినువారికిని,

వినుపించువారికిని, జదువువారికిని, జదివించువారికిని నేను సులభుఁడను; వారికి ధనధాన్యములును, భూగృహములును పుత్రపౌత్రులు మొదలుగ నభీష్టములెల్ల నొసంగుదును. దేహాంతమున వారికి మదీయపుణ్యధామమునే యొసంగెదను.

ఈరీతిని వరములుపొందియు నాతపోధనులైదు వత్సరములాదేవు చెంగటన యాపవిత్రపర్వతరాజముననే యుండిపోయిరి. అచటి పుణ్యతీర్థములందెల్ల స్నానములాచరించుచు నందందలి వింతలనేకములు గనుగొనుచు మాధవుఁదృప్తిగ నారాధించి మఱలి తమతమ తపోనిలయమునకు నెల్లరు వచ్చిచేరిరి.

## మునులు రౌమహర్షుణు బ్రస్తుతించుట.

ఆమునులెల్లరును మఱలి మునిసంఘసేవితమగు నైమిశారణ్యమును జేరితిరిగి సూతమునిని దరిసియిట్లని ప్రస్తుతించిరి. ఓహో మునివరా! నీసామర్థ్యమేమి? యెంతయుధన్యము. నీవిజ్ఞానమును నెంతయు ధన్యము. తమరు వేంకటాద్రినివాసుని భగవానుని శ్రీనివాసుని రూపౌదార్యములును గిరిస్వరూపమునెట్లెట్లు వచించిరోయన్ని విధములనట్లే యలరారుచుండెను. ఆయద్రివైభవమును, దేవునిదివ్యప్రభావమును గాంచియానందించుటకు మాయీనేత్రములు, హృదయములు సాలవు. వచించుటకు వాక్కులు పరిపోవు. ఓతపోధనా! మీయనుగ్రహ ప్రసాదములచే మేమెల్లరమెంతయు ధన్యులమైతిమి; కృతార్థులమైతిమి. ఓరౌమహర్షణీ! మీరావేంకటేశుని, ఆపర్వతరాజము యొక్కయెల్లవిధముల నొప్పునస్థితిని గనులారఁగఁ గాంచినారలా? మనసార నాలించినారలా? అనియడుగు వారినెంతయు నాకర్ణించి సూతముని వరుండిట్లునియెను.

ఓతాపసవరులారా! వ్యాసమునివరునను గ్రహమున నేనెఱిఁగినయంత వఱకును, మీకుందెలుపఁ గలిగితిని. నిజమునకు వేంకటాచల మాహాత్మ్యమును శతకోటి కల్పముల కేనియు, వేలకొలదిగ శేషనాగులకైనను నించుకేనియుఁ దెలియుటకును, దెలియఁ జెప్పుటకును వర్ణించుటకును, వశముగాదు. పరమపవిత్రమును, బుణ్యప్రదమును, నాయుర్వర్ధకమునునగు నామాహాత్మ్యముత్త మోత్తమము నెవ్వరు భక్తిభావమునఁ బఠింతురో, వింధురో వ్రాయుదురో వారెల్లకోర్కులఁబడసి శుభములు పొందుదురు. వారెధన్యులు, తరింతురు.

ఓం శ్రీ శాలగ్రామ నివాసాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ శుకదృగ్గోచరాయ శ్రీ వేంకటేశాయ నమః

# వేంకటాచల మాహాత్మ్యము
# చతుర్థాధ్యాయము
## రాక్షసబాధలు పడలేక దేవాదులు శ్రీహరిని వేడ వైకుంఠమునకుంబోవుట

నైమిశారణ్యమున దీర్ఘసత్రయాగమును గొనసాగించు శౌనకాది మహామునులు సూతమునివర్యునిం గాంచి యిట్లనిరి. లోకవిశ్రుతకీర్తీ! లోకరహస్యముల నెల్ల నెఱింగి బాగుగఁ దెలియఁజెప్పనేర్చిన యో సూతమహర్షీ! మాయడుగువర్థంబును గనికరమూని వివరముగ జెప్పఁదగుదురు. ఈ కాలమున వేంకటాద్రిని వెలసియుండి భక్తజనులకు ప్రత్యక్ష గోచరుండగుచుఁ గోరినకోర్కులఁ దీర్చునాదేవదేవుండు తనయాదివ్య స్వరూపమును వింతకుమున్నే పుణ్యశీలురకుఁ జూపి యనుగ్రహించెనో కదా! చిత్తమును జిగురింపఁజేయు శ్రీనివాసదేవుని యాకతను వీనులవిందుగ వినఁగోరెదము. అనుమునులకుసూతముని వరుండిట్లని చెప్పసాగెను. పూజ్యులారా! పరమాద్భుతంబును, బరమపుణ్యప్రదంబునునైన శ్రీ వేంకటేశ్వర చరితంబును జెప్పెదను, మనసుంచి యాలింపుఁడు. శ్రీనివాస భగవానుడు, వేంకటాద్రీశుఁడు తొలుతొల్తఁదన యా దివ్యదర్శనమును బ్రహ్మకొసంగెను. పిమ్మట నాదేవుఁడు పెక్కురకుం దన దర్శన భాగ్యంబిచ్చి యనుగ్రహించి తనియించెను. అయ్యది యాదినుండి యంతముదనక వివరింతును సావధానత విందురుగాత.

ఒకప్పుడు దైత్యదానవ మూకలు, గుములుగట్టి మానవుల, మునుల, యోగుల దేవతలఁగడుంగడుగ నిడుమలు పెట్టసాగిరి. వారు పెట్టుపాటులు పడలేక కశ్యపుడు, గౌతముఁడు, జాబాలీ, యగస్త్యుఁడు, వామదేవుఁడు, శతానందుఁడు మొదలుగ మునివరులు సనకాదియోగులు, నింద్రాది దేవతలు నొకటిగాఁజేరి, విష్ణుభగవానునకుం దమగోడును వినుపింపనుకట్టి, వారిని వెదకికొనుచుఁ బాలసంద్రపుటుత్తరపుం దరింజేరి యెలుంగులెత్తి స్తోత్రంబుల వినుతింపసాగిరి.

క్షీరసాగరశయనా! కారణకారణా! జడాజడములనన్నిట, సర్వాంతర్యామివై యొప్పు ప్రకృతి కతీతుఁడవగు వో పరమపురుషా! సృష్టికాదినీవకలవు. నీవుకాక మఱేదియులేదు. చరాచరరూపమగు నీజగత్తునంతను బుట్టించునది నీవ. ఈ జగత్తంతయు నీరూపమె. అట్టినీకివే నమస్కృతులు. ఈ జగత్తునంతను రక్షించువాఁడవై పాలకడలిని వేయిపడగలవానిం బాన్పుగఁ జేసికొని చల్లనితల్లి కడలి కూతురు లచ్చి చెంతనుండ విశ్రాంతుఁడవై నరుండియుండి జగద్రక్షణమున నేమఱుపాటులేక యుండునీకివే

వేవేలునమోవాకములు. ఓమధుసూదనా! ధర్మరక్షణ దక్షా! నీవు మాయెడనేల నుపేక్ష వందియుంటివి? ఇటు ప్రసన్నుండవుకమ్ము. నీ ప్రేమదృక్కుల నిటు ద్రిప్పుము. ఓ కరుణాసాగరా! వరదా! భక్తపాలకా! అశరణశరణ్యా! అనిచిత్తంబులు హత్తించి ఏమేమియో సన్నుతులును, సన్నతులును గావింపసాగిరి. అంతలోనన యచ్చటన యాకాశంబున శంఖచక్రగదాధారియై చతుర్భుజుండగు పరమేశ్వర పార్షదుండొక్కండుదోఁచి యాదేవమునులం జూచి సంబోధించి యిట్లనిపలికెను. ఓమహానుభావులారా! మీరిచ్చటికేల దయచేసితిరి. ఎఱుఁగనలవిగాని వింతచేతల నొప్పు నామాయలాడు రమాధవుడు భగవానుఁడిప్పుడిచ్చట లేడు. భూమండలము నేదేని పావన పర్వతంబున నొక్కెడ వసించుచున్నవాఁడు. అదియెఱింగి మీరటకుంబోయిన నెంతయు మేలగునని, యటనుండి వెడలిపోయెను. అదివిన్న వారెల్లరు వెనుదిరిగిపోవుచుఁ దమలోఁదామిట్లని యోచింపసాగిరి. కమలాపతి పురుషోత్తముఁడు క్షీరసాగర నివాసము మాని పృథివికింబోయి యేలనుండెనో? మనమిప్పుడాదేవు దర్శింపఁబుడమి నెక్కడికిఁ బోవువారము? వైకుంఠమునకుం బోదము. అట నావేలుపు దొరకకుండడు. అనియోచించుకొనుచుఁ గొంతదవ్వేగుసరికి స్ఫటికమట్లు వెలుగులీనుచు మాహతీవీణను వాయించికొనుచు కర్పూరధూళి ధూసరితమట్టులొప్పు నొడలితో నారదుఁడా వైకుంఠమునుండియే తిరిగివచ్చుచు నెదురాయెను. ఎదురైన నారదమునీంద్రునిం గనుగొని వారెల్లరిట్లని పలుకరించిరి. ఓమునివర్యా! పుణ్యమూర్తీ! మీరు ముల్లోకముల విషయముల నెఱింగినవారలు. ఏలోకమునను మీరేగరాని మీయెఱుంగని తావేలేదుకదా. కావున దయయుంచి యిందిరానాధుఁడిప్పుడెందున్న వాఁడో మాకెఱుంగంజెప్పుడు. ఓదేవర్షీ! అటభూ మండలమున నెక్కుడు మాయావులు దుష్టులునగునసురులు మొత్తంబులై తిరిగుచు మునుల, యోగులఁ, దపస్వుల, మానవులఁగడింది యిడుమలఁ బెట్టుచుఁ దిరుగుచునున్నవారు. అందునను శ్రీశైలప్రాంతమున వారిబెడంద మఱియు మిక్కుటముగ నున్నది. వారికిందోడు బలగర్వితుఁడగు రావణుఁడు రాక్షసమూకలతో వచ్చియెల్లర నిష్టుర కష్టంబులఁ బాల్పరచుచుండెను. వారిని నిగ్రహించి ప్రజల కడగండ్లఁ బాప భగవంతుఁడు విష్ణుండొక్కరుఁడె సమర్థుండు. మేమెల్లర మాతనిరణమ్ము వేడఁ బోవుచున్నారము. ఆదేవుఁడివుడెందున్నవాఁడోకదా? అనవిని వారికెల్లరకు నభివందనము లొనరించుచు నారదమౌనీంద్రుండిట్లని పలికెను. ఓమహామభావులారా! నేనిప్పుడా పరంధాముని బరమానందకరుని దివ్యకళ్యాణ స్వరూపుని నారాయణుని సందర్శింపఁ బరమధామమగు వైకుంఠమునకుం బోయియుంటిని. అటనొక దివ్యపురుషుఁడు నాకుంగనపడి "భగవంతుండిట వైకుంఠంబునలేడు.భూతలమున నొకచోనొకకొండపై రమాదేవితో వినోదంబుల నానందమున విహరించుచున్నవాఁడు"అనిచెప్పెను. అదివిన్న

నేనును మఱలివచ్చుచు మిమ్ములనిటఁ గలిసికొంటిని. మనమందఱ మిపుడు కలిసి బ్రహ్మలోకమునకుం బోదుము. ఆపితామహుండు బమ్మదేవుండు సర్వమెఱుంగును; గర్తవ్యమును దెలుపఁగలఁడు. అన దానికెల్లరును నౌనౌనని యాకలహభోజుని ముందిడికొని సత్యలోకంబునకు విరించిని దర్శింపనేగిరి. తేజోధికులగు వారెల్లరపుడె బ్రహ్మలోకమును జేరి, చతుర్ముఖుండును జతుర్భుజుండును, నుజ్జ్వలాగ్నింబోలెఁ బ్రకాశించువాఁడును, మూర్తీభవించిన వేదాది శాస్త్రంబులై యున్నవాఁడును, గాయత్రీ, సావిత్రీ సరస్వతులచే సేవింపఁబడుచున్నవాఁడును, దిక్పాలసేవితుండునునై, యున్నతోన్నత పీఠంబున విరాజిల్లుచున్న విధాతనుగాంచిరి. ఆదేవునిసిద్ధ, నాగ, కిన్నరగంధర్వులు చేరి సేవించు చుండిరి. ఆపరమేష్టిం గదిసి నమ్రులై నమస్కరించి యాదేవముని యోగిగణంబులు లోకేశు నిర్దేశంబున నాసనంబుల నధిష్టించిరి. ఆదరసత్కారములయిన పిమ్మటఁ గుశలంబులడుగ వారెల్లరాతనికిఁ దమయప్పటి యిడుమలు,(దమరాకకుఁ గారణము విట్లనిక్రమముగ నెఱింగించిరి.

ఓ ప్రభూ దేవదేవా! తమ యనుగ్రహమున మాకింతదనుక నే కష్టంబులు లేక సుఖమ్ముగఁ గడచిపోయెను. అన్నివిధముల మాకు మేలే యగుచుండెను. కానియేమి చెప్పము. ఇప్పుడు రావణుని దౌష్ట్యము పట్టుతప్పినది. వాఁడు పెట్టుబాధలకొకమితియే లేదు. వానికిందోడై క్రుక్కడి రక్కసులు శ్రీశైలప్రాంతమ్ములఁ జెలరేగి కర్మానుష్ఠాన పరులను, దపస్వులను, దీనమానవులనుబెట్టు నిక్కటులు బెట్టిదములు. వానిందట్టు కొనుటయే యచటివారికి వెక్కసమైయుండెను. అగునగు నాతపోధనులెంతకైనను సమర్థులే కాని వారు రక్కసులకు మారుగఁ దాముగ నేమేనిచేసిన నింతవరకు మునివృత్తిని దాముపొందిన తపఃఫలితమంతయు వ్యర్థముగ వ్యయమగుననియుఁ, దపోవృత్తికే భంగమగుననియు వెనుదీయుచుండిరి. కావుననే యింతవరకు వారుపెట్టుబాధలు కలిగించు నుపద్రవములు నోర్చుచు వచ్చిరి. మేమెల్లరమునునోర్చితిమి. కాని యిప్పుడు రావణుఁడు లోకవిద్రావణుఁడై యొనరించు చెడుగులు, పెట్టుకడగండ్లే మాత్రమును వింతయునోర్వనలవి కాకపోగా నామాయలమారుల మాయలెల్ల మాయించు మేటిమాయకాఁడా. గోవిందుఁడొక్కడే, యాఖలుల దుర్మార్గచేష్టల నణగించి వారిందునిమి లోకములకు మేలుచేయుంగలవాఁడని యాదేవు శరణముంగోర వెడలితిమి. కాని యాపరమాత్మునాదిదేవు నూర్ధ్వలోకంబులనెందును మేముకనఁజాలక నిరాశులమైతిమి. ఓదేవా! ఇఁక నీవ మాకుంగతి మమ్మెల్లర నీయుత్కటభయంబున నుండి తప్పింపుము. అని పలువిధముల దీనులై ప్రార్థించుచున్న యాదేవర్షి వర్యులఁ గాంచి యాతమ్మిచూలి పలుమొగంబుల వేలుపుకొండొక తడవు చింతించి వారినెల్ల సంబోధించి యిట్లనుపలికెను.

సాధుసజ్జనులారా! మహానుభావులారా! ప్రాచీనకాలంబున నీరావణుండు ఘోరంబును గడు నుగ్రంబును నగు తపస్సునొనరించి దేవదానవులందెవ్వరిచేతను తనకు మరణంబు లేకుండునట్లు వరంబును గోరిపొందెను. కానిదైవయోగంబున మానవులచేఁ దనకు వధ కలుగ రాదనియాతఁడు కోరియుండలేదు. కావున దీనికుపాయమునేఁజెప్పున దేమన మనమెల్లరముంబోయి యానారాయణునాశ్రయింతము. అతఁడే మనకుంగతి. అతఁడే దీనికిందగు మార్గమునాలోచించి మనల నుద్ధరింపగలవాఁడు. అతడిప్పుడు పృథ్వీతలముననే వేంకటగిరియందున్నవాడు. ఇప్పుడెపోయి మనమాశ్రీహరి నసురుల నెల్లఁదునుమాడఁ బ్రార్థింపందగు. నేనును మీతోడన వచ్చుచున్నవాఁడను. మీరందఱిపుడె కదలిరండు. కానియాదేవుదర్శన మింతంతలఁ దొందరగనగునదికాదు. కాననటకుం బోయి ఆతనికై బాగుగ నన్వేషింపవలయును. మీరెల్లరు నట ముఖ్యముగ నేఱులు, కోడులు, కొండలు చరియలు లోయలు , గుహలు, చెట్టులు పుట్టలు ననక వెదుకవలెను. ఆదేవుడటఁదనకు మిక్కిలియుఁ బ్రియమైన యావేంకటాచలమునఁ జిలుకయో కోకిలయో యేవింతపిట్టయో లేడియో హరియో కరియో యేజంతువోయై యేవింతరూపమో పొంది వినోదంబున నంచరించుచు జ్ఞానిజనులచే సేవింపఁబడుచుఁ బద్మాలయతోఁగూడి క్రీడలు జరుపుచుండును. ఆ నగోత్తమమునకుఁ బ్రదక్షిణములొనరించుట యాదేవునకెంతయుం బ్రియము. కావున మనము ప్రదక్షిణంబులు చేయుచునే యటఁ బర్వతంబున వైకుంఠుని వెదుకవలయును.

## బ్రహ్మాదులు శేషశైలమున వేంకటేశుం దర్శింపవేగుట

ఇట్లని బయల్వెడలిన యాసురజ్యేష్ఠునితో మునులు, ఋషులు, యోగులు, దేవతలు, మహాత్ములు నెల్లరు నాబ్రహ్మలోకమునుండి కదలిచని యాశేషశైలముంజేరి కమలపండువుగఁ గాంచిరి. అటనానావిధ వృక్షలతాలలితంబును, వివిధ మృగసంతాన సంచార హృదయంగమంబును బలుజాతుల ఖగకుల కలకలంబునునైన యావేంకటా చలము వైకుంఠమేయై పొరలకుందోచెను. అందాకసముతో మంతనము లాడుచున్నవా యనునట్లున్న రావి, జువ్వి, మఱ్ఱిమొదలగు మహావృక్షములు, పండ్లబరువునఁ గొమ్మలునేలను ముద్దిడుచున్న తీయమామిళ్లు, జీడిమామిళ్ల, నేరేడులు, మారేడులు, పనసలు, వెలగలు, రేగులు, రేలచెట్లు, నిమ్మ, నారింజ, బత్తాయి, కిచ్చిలిపండ్ల చెట్లు, చింత, పాల, యుసిరిక, చెట్టులు, మాధీఫలవృక్షములు, మద్ది, గార, కడిమి, లొద్దుగ, దిరిసిన, తాంద్రకరక, దేవదారు,వేప, జమ్మి,టేకు,చంద్ర,తుమ్మి, చీకటిచెట్లు, ఈత,తాడి, కొబ్బరి ఖర్జూర, యిప్ప,పొన్న, సురపొన్నలు, గన్నేరు, పొగడ, తిలక, మల్లికా గిరిమల్లి,కాశోక, మరువకములు, మొల్లమంకెన, సంపంగిలును, నందివర్ధనములును గురువింద, జాజి,

పారుజాత, మా(మ్రాతము, వావిలియును, అత్తి, కాంచన, యేడాకులరటి, యరటి, ద్రాక్ష కలిగొట్టు, తుమికి, గోరంట, యెఱ్ఱకాంచనము, గుగ్గిలపు చెట్లుంగలవు. ఇవియు యననేల నింకను నెన్నెన్నియో జాతులు తరులతావితానములు, ఫలపుష్పభరితములై సంశోభించుచుండెను. తుమ్మెదల ఝుంకారమ్ములఁ దేనెలసోనల నానందదాయకమై యదియెల్ల ఋతువుల నెల్లవేళలఁ జిగుళ్ళ, మొగ్గలఁబూవులఁబండ్ల నిండి కన్నులపండువు చేయుచుండెను. మదమత్తగజగవయ ఖడ్గమ్ములు మనుబోతులు, సింహ,శరభ శార్దూలములు, చెంగుచెంగున దుముకులాడు లేళ్లు, చెట్లకొమ్మలుపట్టి యుయ్యేలలూగుచు బండ్లిగిలించుచు నీకొమ్మవిడిచి యాకొమ్మకు నదియూగించి వేరొకదానికిం దుమికిపోవు కోతులు, నొడలెల్ల నల్లనిబొచ్చుతో, ముట్టితెలుపుతో బోకురుబోకురుమను నెలుగుగొడ్డులు, మరుకులం, దుముకుల నందగించు కుందేళ్లు నింకను వనికందమిచ్చు పలుతెగల మెకముల మందలతో నావనములు మనముల నలరించుచుండెను. శుకపికశారికా పారావత హంసకారండవాది పక్షికుల కలకల శ్రావ్యనినద వినోదంబై; మయూరాదుల నృత్యసంభరిత మా నగరాజము రాలనడుమ నుండిపైకి లేచి, చిమ్మన(గ్రోవు లట్లాకసమున కెగురు నీటిబుగ్గలు, జలజలవంకర నడకల ముందునకు సాగు సెలయేళ్లు, హోరారు మహా మలిపులతోఁ బైనుండి (క్రిందిరాలనుగ్గుచేయుచు నుఱుకుజలపాతములు నటనొప్పు చుండెను. ఆకొండ నెత్తమ్ములు, చరియలు, లోయలు, నెందుబోయిన వినోదంబులు, ప్రమోదంబులు గూర్చునవై యలరారుచుండెను. అమ్మలంగాంచినం తన వారెల్లరును దుమదుఃఖముల మఱచిమైమఱపున వచ్చినపనియే మఱచినవారైరి. బమ్మదేవరయుఁ గొంతవడికిఁదేఱికొని వారలనెల్లర హెచ్చరికలఁ దెలివికిం దెచ్చెను. ఆకొండంగాంచిన వారికావైకుంఠుని కాంచినట్లులె యాయెను.

వారు మెలమెల్లన నొకశిఖరము నుండి యొకశిఖరమునకు, నొకయడివినుండి వేరొకయడివికి నరుగుచు నొక్కొకయేటం దానములాడుచు, జలపాతముల నిలిచి కులుకుచుఁ బుష్కరిణుల మునకలిడుచుఁ బోయిపోయి, యొకపవిత్ర స్థానంబున నిలిచి భగవంతుని వినమ్రులై పత్రపుష్పములఁ బూజించి యమృతతుల్యంబులగు ఫలంబుల నైవేద్యంబుల నర్పించిరి. కాని వారికెందును నొకగుడి కాని గోపురముకాని కానరాలేదు; దేవునిదర్శనమునుగాలేదు. కానియొకచోట వారికి యోగనిష్ఠలనున్న కొందఱు మునులు కానవచ్చిరి. అదియే మహాభాగ్యమని వారిని కనువింతగఁ జూచుచుండ వారికవ్వల నొకగంధర్వుఁడు కృష్ణాజినాసీనుఁడై కననయ్యెను. వానికిఱువైపుల నొకయందాల యుఱ్ఱియు పాగసులపిట్టయునుండెను. ఆదివ్యపురుషుండె భగవంతుండని తలపోసి యద్భుతానందముల నిండినడెందములతో వారొప్పిరి. వింతవింత దృశ్యములంగాంచుచు లోకోత్తర సౌందర్యమున నొప్పుదేవినిగన్న నదియెల్ల భగవంతుని దివ్యరూపమేయని

తలంచితమ్మయులగుచు నారాయణుదర్శింప నుత్కంఠయినుమిడి, ముమ్మడియగుచుండ నాకొండయందంతటఁ గ్రుమ్మరుచుఁ బోయిపోయి యొకానొకచో నతిమనోహరంబును, పావనంబును, నగుస్వామి పుష్కరిణీతటమ్మునఁ గూరుచుండి తపమ్మును సాగింపసాగిరి.

## రామాయణగాధ - దశరథ చరితము

ఆదివమ్ములఁ గడుంగడు ధర్మమూర్తియు గీర్తిధనుఁడునునగు దశరథభూరమణు డయోధ్యరాజధానిగ భూమండలమునెల్ల న్యాయ్యంబుగఁ బరిపాలించుచుండెను. ఆ మహాశయుని పాలనమునఁ బ్రజలెల్ల ధర్మముందప్పకయుండిరి. అన్యోన్య ప్రేమల దేశమంతయు నొకకుటుంబముగ నొప్పుచుండెను. వర్ణాశ్రమ ధర్మములు క్రమముగ నడుచుచుండెను. కాని యాధరాకాంతుఁడు సంతానము లేక సంతాపమందుచుండెను. నవ్వుమోముల నిండు వెన్నెలంగురియు చిన్నిబిడ్డలంజూచి యానందించు భాగ్యము లేదయ్యెనేయని వగచి వగచి కులగురువును సమయజ్ఞుని దేజోధికుని, వసిష్ఠముని పరుంగముంగొని యాధీరవరుం డంజలించి తనయెదఁగల సంతాపమెఱింగించుచు నిట్లనెను. ఓదయానిధీ! మీరో యినవంశమునకుం కులగురువులు. ఎంతకాలము నుండియో నిరీక్షించుచుండియు వంశరక్షకుఁడగు నొక్కచిఱుతంగానక తీరని యాశలదురపిల్లుచుంటిని. నేనేమి పాపిని? ఏ మహాపాపములొనర్చితిని? ఆపాపములకు నిష్కృతియేమి? వంశాంకురము పుట్టునుపాయమేమి? యని మాటిమాటికిఁ గడునాతురత నడుగుచుండ భగవంతుండగు నాబ్రహ్మర్షివర్యుఁడును నొకింత తడవాలోచించి ప్రసన్నచిత్తంబున నిట్లనియెను. ఓపుణ్యశ్లోకా! నీవలనఁ బాపంబెట్లు కలుగును? ఐనను పుత్రప్రాప్తి విరోధకంబగు దుష్కృతంబొండు నీయెడఁ గానవచ్చుచున్నది. ఆపాపనిష్కృతికిని, ముద్దులబిడ్డ మొగముగాంచను, నామంగళదేవతా మనోహరుని వేంకటాధీశుని శ్రీనివాసుని సేవింపుము. అనినంతనాతఁడు గురువరు గనుంగొని, యోమహాభాగా ఆపాల్కడలి పట్టింజేపట్టిన యా యయ్య యిపుడెందున్నవాఁడు? ఆదైవము దర్శనము నాకెట్లు కలుగఁగలదు? అనినంత వసిష్ఠుండిట్లనెను.

రాజేంద్రా నాచెప్పునదాలింపుము. పుణ్యభాగీరధికి దక్షిణంబున రెండువందల యోజనంబులదూరంబున, సువర్ణముఖరీ నదికుత్తరంబున నొక కోశంబున వేంకటశైలంబు విరాజిల్లు. అందుఁ బుణ్యతోయంబులఁ బొలుపొందు వాగులు మడుగులు, నీటిబుడగలు జలపాతంబులు నెన్నియోకలవు. అప్రాకృతంబగు నాదివ్యశైలస్వరూపంబు నెఱుంగ మానవులెవ్వరుంజాలరు. ఆవేంకటాచలము వైకుంఠునకు నాదినారాయణునకు నాకమునకంటెను, మర్త్యలోకముకంటెను, వైకుంఠమునకంటెను బ్రియతమంబై

యుండును. ఆశ్రీనివాసుండిందిరా సహితుండై యందెల్లవేళల వినోదించుచుండును. ఆశ్రీహరిని దర్శింపఁగోరి మునులు యోగులు, దేవతలునందఱునటఁ జేరి సంతతము దపంబులు సేయుచుందురు. ఆభగవానుఁడు స్వయంభువు బ్రహ్మయు లోకము ననుగ్రహింపంగోరి యాపర్వతరాజమందుననే మహాతపం బాచరించుచున్నవాడు. కేశవుడు తప్పకాచతురాననునకుఁ దనదివ్య దర్శనంబీయఁగలఁడు. ఆయవసరంబున నారమాధవుం డందున్న వారలనెల్లరఁ దనదివ్యదర్శనంబిచ్చి యనుగ్రహింపంగలండు. ఆ మహెూదారుండును ననుపమ దయామయుండును నగు నాదామోదరుండు గోవిందుండు నీమనోభీష్టమును దీర్పంగలండు. ఇందేమియు సందియములేదు. అనెను.

వసిష్ఠముని వరుండిట్లు పలికినంతన సద్గుణ సంపన్నుఁడు పంక్తిరథ ధరణిపాలుఁడానందోత్ఫుల్ల హృదయాబ్జుండై ముఖమింతకాగా గురువరునితోఁ గూడి వేంకటనగముంగూర్చి పోఁ బయనమాయెను. జాహ్నవీనదీమతల్లి నుత్తరించి, పవిత్రగోదావరి స్నానంబాచరించి, యద్దరికింజేరి, కృష్ణవేణీనదిని, భవనాశినీ తరింగిణిని దానంబులాడి, తుంగభద్రను, బంపానదిని మునుకలిడి ముందునకుపాగి, సువర్ణముఖరీనదిని స్నానంబు లొనరించి పోయి మనోహరవృక్షలతా గుల్మంబుల నందనోద్యానంబును, జైత్రరథంబును నధిగమించిన యందంబుల నందగించు వనంబులనొప్పు మహామేరువుం బలె నయనా నందమును గూర్చుదాని, నంజనాద్రి నాజనపాలుండు సందర్శించి హ్రదంబుల, జల పాతంబులఁ బుష్కరిణుల మునిగిమునిగి నిర్మల తనుండును బవిత్రాత్ముండును నయియమృతపానంబు సేసినవాని యట్ల సంతృప్తుండాయెను. పుత్రముఖ సందర్శన లాలసుండై యానందోత్ఫుల్లముఖనయనుండాయెను.

వీరాసన, పద్మాసన, శీర్షాసన, సర్వాంగాసన, భద్రాసన, స్వస్తికాసన, సిద్ధాసనాది వివిధాసనంబుల నుపవిష్టులయ్యు, నొంటికాలిపై, బొటనవ్రేలిపై నిలిచియు, వాయుభక్షులు, పర్ణభక్షులు, ఫలమూలభక్షులునై, సూర్యోన్ముఖులు, పంచాగ్నిమధ్యస్థితులు, జలమధ్య స్థితులునై కుంభకపూరక రేచకాదులఁ బ్రాణాయామమున నుండియుఁ బెక్కువిధంబుల ఘోరతపంబులాచరించుచున్న వారిని వ్యాఘ్రమృగ చర్మములు, వల్కలములు, దాల్చిన వారిఁ గాషాయాంబరధరులైనవారి, జలతర్పణంబులఁ బూవుల, ఫలపత్రముల, నక్షతాదుల, నంబుజాక్షుఁ బూజించుచున్నవారి, హృదయమున హృషీకేశు నారాధించువారి, వివిధహోమముల నగ్నులవ్రేల్చువారి నారాజవల్లభుఁడు వసిష్ఠమునివరుతోఁ బోయి కాంచెను.

కొందఱు సౌమ్యరూపుదామోదరుని, గొందఱు సూర్యస్థనారాయణుని, గొందఱు జలమధ్యశాయి జగన్నాథుని, గొందఱు త్రివిక్రముని, గొందఱుగ్రస్వరూపు నారసింహుని

నర్చించుచుండిరి. కొందఱు తపోధనులు నృసింహానుష్టుభమును, గొందఱు ప్రణవయుత తారకబ్రహ్మమంత్రమును, గొందఱు భుక్తిముక్తి ప్రదాతయగు గోపాలబీజమును జపించుచుండిరి. కొందఱు వరాహమంత్రంబును, గొందఱు ఓమ్ నమో భగవతే వాసుదేవాయ, వాద్వాదశాక్షరిని, మఱికొందఱష్టాక్షరిని, ఓమ్ నమోనారాయణాయ, ఓం నమో వేంకటేశాయ యనియు భక్తియుక్తిని జపించుచుండిరి. జ్ఞానధనులు కొందఱు మునివరులు ద్వాదశన్యాస మొనర్చుచు నీలమేఘశ్యాముఁ బీతాంబరుఁ జతుర్భుజు, భూమిపతిని ధ్యానించుచుండిరి. తేజస్వులగు వారు మంత్రసిద్ధికై యేకాగ్రచిత్తులై యవిరళజపతప ధ్యానములు సాగించుచుండిరి. వారికి మధ్యఁ గమలాసన స్థితుండును, జతుర్భుజుఁడును, దేజోయుతుండును, నగుపితామహుని, స్ఫటికాక్షమాలంబూని నాసాగ్రమున దృష్టులు నిల్పి మనమ్మున శ్రీపతిని సుస్థితునొనర్చి వ్యాఘ్రచర్మంబున సమాసీనుఁడైనవాని, నిర్వాతస్థలంబున దీపమట్టులు నిశ్చలుఁడైనవానిఁ జతురానను గాంచెను. అటఁగల మునులకు, ఋషులకు, యోగులకు, సిద్ధులకు, దేవతలకుఁ దగురీతుల నమస్కరించి విస్మయానందములఁ గన్నులింతలుగ నా దశరథజనపాలుఁడు గనుచుఁ గూరుచుండెను.

## దశరథునకు దేవుదర్శన భాగ్యము

అదియెల్లంగాంచిన తేజోనిధియగు నావసిష్ఠమునివరుండు దశరథ మహారాజుం గాంచి యిట్లుపలికెను. ఓభూపాలవరా! ఇటఁ బరమేష్ఠిమునివరులను గూడి యుగ్రముగఁ బరమతపంబు నొనరించుచున్నవాఁడు. విష్ణుభగవానుఁడు శ్రీఘ్రంబున యిటకుం దయ చేయఁగలఁడు; ప్రజాపతికిందర్శన మీయగలఁడు. కావున నీవును నీపుష్కరిణీ పావన జలంబుల స్నానంబాచరించి పరిపూతుఁడవైయిచ్చటన యుండి భగవంతు నారాధింపుము. అనవిని రాజవరుఁడు మునివర్యా! దయయుంచి తగుమంత్రమును నుపదేశింపుఁడు అన నాఋషితల్లజుఁడు పరమోత్తమమగు నష్టాక్షరీ మంత్రము నుద్బోధించెను. వెంకటేశునందు భక్తియు నాసక్తియుఁ గలిగిన యాధరణిపాలుఁడు మంత్రయుక్తముగ, విధివిహితముగ స్వామిపుష్కరిణిని మునుకలిడుచు నాతలమునసె సమభూమిని ధ్యానయుక్తుఁడై సంకల్పయుక్తముగ నామంత్రరాజమును విలిఖించి, శ్రీనివాసుండును, జగత్పతియునగు నావిష్ణుని పూజలఁజరుపుచు నామంత్రము నెదుటనె జపము నొనరించుచుండెను. వసిష్ఠమునివరుండును, నచటనే కుశాస్తరణము పఱచికొని యందుపవసించి దేవదేవు నర్చింపసాగెను. ఇంతలోనేదియో మహాశబ్దము కలిగెను. అదేమా యని యచటంగల మునితల్లజులెల్లరుఁ గలకలపాటంది యిటువటుచూచుచు వినసాగిరి. అంతట వారికి దుర్నిరీక్ష్యమగు మహాతేజః పుంజము దృగ్గోచరమాయెను.

ఆయచలరాజమంతయు, విద్యున్మయమా యనఁదోచెను. జ్యోతిర్గణములెల్ల నేకమైయుదు మదయించినట్లు కోటిసూర్యులు మగణిత పూర్ణచంద్ర మండలములు నొక్కమారుగఁ యుదయించినట్లుగనాయెను. ఆకస్మికముగ నాకాంతిరాశి యెచ్చటినుండి వచ్చె యెఱుఁగరాక యాదేవమునివరులెల్లఁ గనులు మిఱుమిట్లుకాగా మూయుచుఁదెఱుచుచు భయ విహ్వలులై యొక్కెడఁజేరి మిగులభక్తిశ్రద్ధలఁ బలుమంత్రంబులు పఠింపసాగిరి.

ఆవింత తేజమ్మున లోకంబంతయుఁ బ్రదీప్తమాయెను. ఆవెలుగునడుమ వెలుగులకెల్ల వెలుఁగైవెలుగొందుచున్న మహాద్భుతమగు దివ్యదేవాయ తనమొండు కానవచ్చెను. అందెన్నియో గోపురములు, చుట్టుప్రాకారములు వెలుగొందుచుండెను. ప్రకాశవంతములగు బంగరుతలుపులు విరాజిల్లుచుండెను. నీలమణులు, మరకతమణులు, మాణిక్యములు, నెన్నెన్నియో రతనములు, తోరణములుగఁగట్టి యలంకరింపఁబడెను. పలురంగుల పతాకలు రెపరెపలాడుచు నెగురుచుండెను. శిఖరములఁ గనకకలశలు కలకలలాడుచుండెను. రంగురంగుల ముత్తెపుసరుల జాలరుల నలంకృతములయి, జాతిమల్లి, మల్లికాది కుసుమములచేఁ గూర్పఁబడిన క్రీడామంటపములచేతను, మణిమయ సభామంటపములచేతను నొప్పుచుండెను. నలువైపుల ద్వారములకడ, ద్వారపాలురు, రథగజాశ్వాది వాహనంబులు నలరారుచుండెను. నవరత్నమయ స్తంభముల శిల్పసౌందర్యమనల్పమై యుండెను. సుగంధిత ధూపములు, దీపములు, తావులు చిమ్ముచుండెను. శుకపికశారికా పారావతమ్ముల కలకూజితమ్ముల ప్రతిశబ్దములు వీనులవిందు కొలుపుచుండెను.

అప్సరాంగనలాడుచుండ, కిన్నరీగంధర్వ గజయానలు పాడుచుండిరి. భేరీమృదంగపణవమురజాదివాద్యములు శ్రావ్యముగ మ్రోగుచుండెను. నవయౌవన సంపన్నలు సుందరనారీమణులు కరకంకణ కింకిణీరవములు చెలంగఛత్రముం బట్టి చామరవ్యజనమ్ముల వీచుచుండిరి. కర్పూరనీరాజనము లొసంగుచుండిరి.

కడుంగడు నబ్బురంబగు నావిమానముం గాంచి లోకేశుండగు నాకమలాసనుండు పరమానందభరిత హృదయుండును, వికసితముఖారవిందుండునునై వసిష్ఠాగస్త్య వామదేవులను, గణ్వకశ్యప దేవలజాబాలులను, నిజనందను నారదుని, శుకవ్యాస పరాశరులను, గార్గ్యభార్గవ, చ్యవనులను, నింకను గలవారిని, ఋషిమునులను నింద్రాది దేవసత్తములను, సనకాదియోగిపుంగవులను జేరఁబిలిచి యిట్లుపలికెను. ఈకనఁబడు దేవముని సంసేవితము, లోకాతిసుందరమువగు నద్భుత దివ్యమందిరము పరంధాముని. విష్ణుదేవుని దివ్యసదనము. ఇట్లనుచు నబ్జయోనివిరించి యాగృహంబునఁ బ్రవేశించెను. ఆవెనుకన యెల్లదేవతలు, తపోధనులు, ఋషిమునులును, యోగివర్యులు నెల్లరునందు ఁబవేశించిరి. రత్నతోరణ భూషితంబులును, దప్తకాంచనమయములునగు కవాటములతో

వొప్పు తొలిప్రాకారమును దాటిగుమ్మముల కడఁ గావలిగనున్న శంఖచక్రగదాధారులనుఁ జండప్రచండులం గాంచి నమస్కృతులొనరించిరి. అట్లే యొక్కటొక్కటిగ నేడు ప్రాకారములను, నేడు ద్వారములను, వారెల్లరును దశరథ ధరణీధవునితోఁ గూడి దాటిపోయి, యతివిశాలమును రమ్యాతిరమ్యమునునగు నంతర్భాగంబున సిద్ధచారణ సంసేవితుండగు లక్ష్మీమనోహరుని శ్రీహరిని వానందోత్ఫుల్ల హృదయపద్మములతోఁ గనుంగొనిరి. అప్పుడ పూలవానలు గురిసెను. దేవదుందుభులు మొరసెను. మనోహర మంగళధ్వనులు రోదసినంతనిండెను. దేవగంధర్వులు, ప్రస్తుతులొనరించుచుండ నచ్చరమచ్చెకంటులాడిరి. వాద్యనాదంబులు, సంగీతధ్వనులు, హృదయంగమములై మొలసియుండెను. ఆయానందోత్సాహము లన్నిలోకముల నలుముకొనియెను. అంతవంతన యెల్లలోకపాలురు, నష్టవసువులు, దేవయక్షగంధర్వసిద్ధులు ఋషి మునులును గ్రహములు రుద్రులు మొదలుగ సాత్త్వికగుణసముద్భాసితులగు వారెల్లరు వాయాదిదేవునచ్యుతుఁ బరమాత్ముదర్శించి, తరింపనేతెంచి ప్రజాపతి నజుముందిడుకొని యానీలమాణిక్యదేహు నీలమేఘాభు, శ్యామసుందరుం గనుంగొనిరి.

ఆదేవదేవు వామ పార్శ్వమున నుండి యాశ్రీవత్సలాంఛనునే మాటిమాటికిఁ దవక్రీఁగంటి చూపులంగనుచున్న, పుటమిడిన పదునారు వన్నెబంగరుకాంతిని, విరిసిన సంపంగి విరులరంగును, చాయపసుపు పసిమిని, బరిహసించు నొడలివిగ్గులతోఁ, దమ్మిపూరేకులట్లు లావణ్యమై సుకుమార సుందరంబగు మేనుతో శరదిందు మండలముతోఁ బుట్టువై యొప్పుమోముగోముతోఁ దేటికూటువవీటుచాటు ముంగురుల మురువుతోఁ బండువెన్నెలను వెలిజిమ్ము చిఱునవ్వులొలుకు కులుకుసొంపుతో కనికరంపు కడలిపొంగుల కనీనికలతో నొప్పుచుఁ గుంకుమరంగు లీనుచీరగట్టి, కిరీటహార, కేయూరాంగద శోభితయై యెడమచేత సుందరసువర్ణ లీలాంబుజమును బట్టి కనకకలశ సంశోభితలంబ మానదక్షిణకరకమలయై పద్మాసనస్థితయగు పద్మను గన్నులపండువుగ పెడఁదలఁ గ్రందుకొన్న శాంతితోఁ గనుఁగొనిరి. అంతియకాదు; తులసియట్టులఁ దులకించు నొడలి కాంతితో, సర్వాభరణభూషితయై యుజ్జ్వలజ్యోత్స్నయట్టు మందస్మితంబులు వెలుజిమ్ముచు మదమత్త చకోరాక్షియగు, సంపుల్లాబ్జాననయగు ననుపమ శ్యామాంగిని సువర్ణపద్మాసన స్థితను దక్షిణకరాంబుజమున నీలనీరజ మొనరఁబట్టిన సాటిలేని సహనశీలను గటాక్షవీక్షణముల లోకేశుపైఁ బఱపుచుఁ గరుణామృతమును గురియించుచు జనములఁ దనియించుచున్న పద్మావను కమలాలయను రమాదేవింగనుగొనిరి. మన్మునివరులతోఁ గూడి యాదశరథ భూరమణుఁడును నాదేవదేవు శ్రీమాతం గనుంగొని తనువుప్పొంగఁ దన్నుదానమఱచెను.

లోకనాథుఁడగు నాజగత్ప్రితశిరమున నానారత్న జటితోజ్వల కిరీటము సంశోభిల్లి యుండెను. విరిదమ్మింబురుడించు మోమునఁ జిఱునవ్వుకాంతులు విఱఁజిమ్ముచుండెను. వంపుల్లాబ్జనయనాపాంగముల దయారసము వెల్లివిరియుచుఁ బాఱుచుండెను. కోటేఱుదిగిచినట్లున్న ముక్కుచక్కనైయుండెను. రెండు చెవుల బంగరుమకర కుండలము లల్లలనాడుచుఁ జెక్కిళ్లపై మెఱుపురేఖలు మెఱయించుచుండెను. కంఠమున గంఠమాల, యురమున శ్రీవత్సముఁ గరమునరుదగు మెఱంగులీనుచుండెను. కనుమిఱుమిట్లు కొలుపువేయిధారల సుదర్శనచక్రంబొకచేతను శరశ్చంద్ర ధవళంబగు పాంచజన్య శంఖంబొకచేతను, బట్టియుండెను. దక్షిణకరంబెత్తి తన్నుఁజేరు వారికభయంబొసంగుచు నొకకరంబు కటినిడికొని నిలిచియుండెను. బంగరుచేలముఁగట్టి చిలుకపచ్చ కండువా వలెవాటుగ నైచికొని, విశాలశాఖా విరాజిత పారుజాత తరుతలమున సహస్రదళయుత కమలకర్ణికపై నొయ్యారంబుగ నిలిచియుండెను. అందచందములకు మూలకందమగు నాకందర్పు కన్నయ్య సౌందర్యముం గన్నుల కఱవుదీరఁ గనియానందింపవలసినదే కాని యిట్టట్టని వర్ణించి చెప్పనెవరికగును? క్షమాకరుణామూర్తి మహౌదార్యగుణోదారు నాసౌమ్యతేజోమయు నాదిమధ్యాంతరహితుఁ బురుషోత్తమునచ్యుతు, నవ్యయు, నారాయణు నెదుట వారికెల్లరికేమయ్యెనో వారికేతెలియదయ్యెను. ఆనందామృతమున మునిగి యుక్కిరిబిక్కిరియై నట్లాయెను. ఎవ్వానిఁగన ఋషులు మునులు ఘోరతపంబు లాచరించుచుందురో, దేవతలకుఁ గూడ నెవ్వని నిజరూపంబును గనశక్యము కాదో యాదేవదేవుఁ బరంధాముఁ దమకన్నులయెదుటఁ గాంచిన వారేమోయై పసిపాపలట్లతేఱిచూచువారు, గంతులిడువారు, పాడువారు, నాడువారు, దరింజేరి చేతులనంటఁ బోవువారు నైయేమిచేయుచుండిరో వారికే తెలియకయుండిరి. కొంతతడవునకుం దేఱికొని యామహదానందమునఁ బుండరీకాక్షు వర్ధవంతంబులగు వాక్యముల నిట్లని పాడిపాడి వినుతింపసాగిరి.

## అగస్త్యాదులు దేవుం బ్రస్తుతించుట

ఓ యజ్ఞపురుషా! యజ్ఞస్వరూపా! యజ్ఞకర్తా యజ్ఞపాలకా, యజ్ఞరక్షకా! యజ్ఞభోక్తా యజ్ఞఫలదాతా, నీకివేవందనములు. ప్రపంచమున నెల్లజనులు పావరించు దానాదిసత్కర్మలెన్ని కలవన్నింటిని రక్షించువాఁడవు, ఫలదాతవునీవ నీకైచేయు కర్మలకేకాదు, ఏదేవతలపేరునానే సత్కర్మచేసినను నన్నియునీకే చెందును. వానెల్ల రక్షించువాఁడవు. ఫలదాతవునీవె. అట్టినీకు నో దేవదేవ నమస్కృతులు. నీకైయుద్దేశింపని కర్మ కర్మయేకాదు. నీకై చేయఁబడిన కర్మపూర్తికాకున్నను నీయనుగ్రహమున

సఫలమైపూర్ణఫలదంబగును. కర్మశీలురే నీదయకుఁ బాత్రులు. వారొనరించు కర్మలకుఁ బ్రసన్నుఁడవై ధర్మార్థకామమోక్షములు నీవ యొసంగెదవు. వేదంబులెక్కుడుగఁ గర్మలనే బోధించుచున్నవి. కర్మణ్యులే నీయనుగ్రహపాత్రులు. కర్మలచేతనె నీవు ప్రసన్నుండ వగుదువు. వేదోక్తంతబులగు నాకర్మలనెల్లఁ బండితులును సక్రమంబుగ నెఱవేర్పంజాలరస మాచేతలనెన్నియో లోపములుండును. ఎన్నియో యసంపూర్ణములుగనుండును. తెలిసియో తెలియకయో మాయొనర్చిన కొఱంతలెన్నియో! విడిచినవెన్నియో! ఓయజ్ఞమూర్తీ వానినెల్ల క్షమింపుము. నీకువేవేలు వందనములు.

ఇంద్రాది దేవతలాదేవు నిట్లని వినుతింపదొడంగిరి. ఓవేంకటేశా వందనములు. ఓశేషశైల నివాసా నమస్కృతులు. ఓసింహాచల నివాసా కేశవాయ నీకానేక వందనములు. వాసుదేవా, వామనా! అనవరతమ్మును నమోవాకములు. ఓహృషీకేశా! సర్వేశా! సదయ హృదయా! వందనములు. నీయవ్యాజకరుణ నేమనిపలుకఁగలము? ఎల్లమానవుల యునికిని నమకూలముగ నీయవనిని బాతాళంబుననుండి యెత్తి పట్టితివి. అంతతో నూరకుండక యీకొండనుండి దర్శనంబులొసంగి యెల్లరఁ దనియించుచుంటివి. మా దేవతల యెడఁ జాలిగొని యానాఁడు కూర్మంబవై మంథరకుధరంబును సంద్రమున నెత్తిపట్టి పడమినయమృతమును మోహినీరూపమున దుష్టదానవుల నుండి లాగికొని మాకొసంగితివి. ఓ కరుణామయా! నీకివే మా నమస్కృతులు. నీచేతలెల్ల కరుణామయములు, దీనజనుల మర్దరింపనే, సాధుసజ్జనుల సాకుటకొఱకేగదా. ప్రభో! పరోపకారమే నీప్రవృత్తి. నీ విశ్వరూపంబు నెఱుంగనెవ్వరికగును? ఒక్కొక్క తఱివేవేల తలలు, చేతులు, పదములు కలిగి యంతట నీవయైయుందువు. ఒక్కొక్కమారే కమూర్తంబుతోఁ జతుర్భుజుండవై సౌమ్యుండవై కను విందొనర్తువు. మఱియొక యెడ విరుభుజంబుల మాలో నొకండవై తెలియరాకయుందువు. అవునవు నొక్కొకతఱి రూపమే లేక యవాఙ్మానస గోచరుండవుగనుందువు. నీయనుగ్రహముననే కడుపరిశ్రమచేతనే జ్ఞానకాంతుల విన్నెఱుంగనగును. నీవు నిర్వికల్పుఁడవును, నిర్వికారుఁడవును. కొందఱునిను నిర్గుణుఁడవనఁగొందఱు సగుణుఁడవందురు. నినుసత్స్వరూపుఁడవని, చిన్మయుండవని యందురు. దేవా నీవెట్టివాఁడవైనను, దివ్యశరీరముతో, దివ్యాభరణభూషితుఁడవై తోచు నీమంజుల మనోహరరూపమే మేముకోరునది. మాకుంగావలసినది మాకియ్యదియ యుత్తమోత్తమము. హృదయగమ్యుండవగు నో జగద్గురూ నీకివే చేమోడ్పులు.

సనకాది యోగివర్యులాయనంతునవ్వయి నిట్లని ప్రార్థింపదొరకొనిరి. ఓవైకుంఠవాసా! శ్రీనివాసా! విష్ణుదేవా! లక్ష్మీమనోహరా! ఈజగత్తునకంతకు నీవయాదికారణుండవు. ఈ జగత్తువందంతట నీవుందువు. ఈ జగత్తెల్ల నీయందిమిడియున్నది. కాని నీవునంగరహితుఁడవు. నీకివే వందనములు.

ఆధారకమలముననుు, హృదయకమలముననుు, భ్రూమధ్యముననుు మస్తకంబునను సహస్రదళకమలమున సర్వతోముఖమై పీతవర్ణమగు యవాగ్రభాగంబువలె సూక్ష్మరూపంబున నుండు సుషుమ్నానాడి మధ్యమునఁ గమలతంతువట్ల వ్యాపించి జ్ఞానస్వరూపుండవును, మనోగమ్యుండవును, రూపహీనుండవును, ప్రళయస్వరూపుండవును, సమాధియందు స్వయంప్రకాశుండవునై జ్యోతిస్స్వరూపుండవగు నీకుకైమోడ్పులు. యోగేశ్వరేశ్వరా! యోగదాతా! యోగులకెల్లఁ బరమాధారా! జగద్గురూ; యోగిజనులకును నగమ్యుండవగు నోనారాయణా నమస్కారములు. కమలదళ మధ్యంబున నిల్చిశంఖచక్రగదాధారివై, పీతాంబరధారివై యొప్పు నో నీలమేఘశ్యామా! వందనశతమ్ములు. వేదంబులకును నందనినీకు నమోవాకములు. సర్వవిధముల నీపదపద్మముల శరణాగతులము; శరణు, శరణు. శరణు అని యిట్లు భగవదనురక్తులెల్లరుఁ బ్రార్థనలుసలిపి నిలుచుండిరి. అంతట దశరథభూపాలుం డిట్లు ప్రార్థింపసాగెను.

ఆ॥వె॥ పాపవాది సురలు బ్రహ్మయునెవ్వని
దయమగోరి సతము తపమొనర్తు
రెవనిప్రేమగోరు నిందిరారమణియు
వానికనవరతము వందనములు

ఆ॥వె॥ త్రిపురములను గాల్చి త్రిపురాసురులఁగూల్చె
శంకరుండు తాను బింకముగను
వారిఁగాల్చి కూల్చు బాణమీవేగద
వందనములు నీకుఁబరమపురుష

ఆ॥వె॥ ఈశ్వరుండు బ్రహ్మయెల్ల దేవతలును
నీదునాజ్ఞ శక్తినెగడుచుంద్రు
కదలదాకుఁ గూడఁ బొదలకనీయాజ్ఞ
వరదవాసుదేవ వందనములు

ఆ॥వె॥ లేరు సములు నీకు శ్రీపతి భగవంత
నిర్వికల్ప నిత్య నిర్వికార
పరమధామ వరద వైకుంఠపురవాస
పరమసౌఖ్యదాత వందనములు

అని ధరణీధవుడు పంక్తిరథుఁడు పరిపరి తెఱంగుల వేడుచుండ నాయెడకుఁ దనజాలిచూపులు పారించి, రాజా! చాలాకాలముగాఁ దపించుచుంటివి. నీవచ్చిన కార్యమేమి?

నీకోరికయేమి? యనిపలికిన కేశవునెదుట ముకుళితహస్తుఁడై నిలిచియా పంక్తిరథ భూమిధవుండిట్లని పలికెను.

ఓస్వామీ పురుషోత్తమా! అచ్యుతా! మీయనుగ్రహంబున నింతదనుక చిరకాలము మహారాజ్యభోగముల ననుభవించితిని. బ్రాహ్మణాదులకును, దీనజనులకును ధనాదులు వాంఛితార్థములు నొసంగి తనియించితిని, సుఖంబు లనుభవించితిని. శత్రువులెల్లరు నాచేఁబరాజితులే. కాని పుత్రముఖ సందర్శనసుఖముగాంచని నాకీ సుఖములన్నియు సుఖములేకాకున్నవి. ఓయచ్యుతా! యనంతానందప్రదాతా! పుత్రహీననునకు లోకములే లేవని బుధజనులు వచించుచుందురు. ఓయవ్యాజ కరుణానిధీ! తేజోవిరాజితుండును, జగద్విఖ్యాత పరాక్రముండును సుగుణగణ పరిపూర్ణుండును నగు పుత్రునొసంగవేడెద. అనుచుండ నావేంకటాధీశుం డిట్లనియెను. ఓరాజా! పురాజన్మంబున నీవుపొనరించిన పాపఫలితమే నీపుత్రప్రాప్తిసుఖంబునకు నడ్డుతగులుచున్నది అనెను. అంతనారాజవరుఁడు శిరమునఁ గరములు గీలించిమటిమటి నమస్కృతులు పొనరించుచు "నోదేవా! దివ్యస్వరూపా! సూర్యోదయమయిన పిమ్మటఁ జీకటులెక్కడమండును? మీ సందర్శనమునఁ బాపంబులెల్లఁ బటాపంచలగునని విందుము. శ్రుతులును నిం వచించుచున్నవి. గోవిందా! మిమ్ములఁ గన్నులారఁగవఁ గన్ననాకింకను బాపంబులేమి? పాపహరా! వందనములు. దీనరక్షకా! కైమోడ్పులు. భక్తవరదా! పాలింపుము. అనుచుఁ దన్మయత మాటరాక దేవునిఁ దేటి చూచుచునట్లే నిలిచియుండెను. అంతనవ్యాజకరుణా శీలుండగు నాయవ్యయానందమూర్తి శ్రీనివాసుండిట్లనియెను.

ఓరాజా! నీభక్తివిశ్వాసములకు నేనెంతయుఁ దనిసినవాఁడనైతిని. నీకీర్తించిన నాలుగుగీతంబులనెంతయు నానందమయ్యెను. నీకోరినకోరిక లెల్లఁదీరును. నాలుగు గీతంబుల నన్నుంబ్రసన్నచిత్తుం జేసితివి. కావున నీకుఁ బుత్రులును నలుపురు కలుగంగలరు. వారు ప్రభావశీలురు, మేటిబలవంతులు, గుణవంతులు, విఖ్యాతయశులు, నన్నుంబోలిన పరాక్రమశీలురు, తేజోవంతులుగనుందురు. ఇక నీవయోధ్యకుం బొమ్ము. అట శ్రద్ధాయుక్తుండవై నియమపూర్వకంబుగ యజ్ఞమును బుత్రకామేష్టిని పొనరింపుము. అనినంత రాజాపులకితతనుఁడై యవ్యయానందమున నైమఱపువంది, యప్పుడయా దేవదేవునకుఁ బ్రదక్షిణము లొనరించి మాటిమాటికి దండప్రణామంబులాచరించుచు స్తుతులొనరించెను. పిమ్మట నాగోవిందు శేషశైలవాసు ననుమతింగొని బ్రహ్మాది దేవవరులకుం భక్తిని వినమ్రుఁడై నమస్కృతులు పొనరించి పోయినత్తునని గురువరులు పెద్దలతోఁ గూడి ప్రమోదంబున నయోధ్యకుం బోయి చేరెను.

## విధాత శ్రీనివాసుం బ్రార్థించుట

ఓ మహర్షివరులారా! కోసలాధిపతి యయోధ్యకుం బోయిన పిమ్మట పద్మసంభవుడు బ్రహ్మ పెక్కు విధంబుల నావిశ్వంభరు విష్ణుదేవునిట్లని వినుతింపం దొడంగెను.

ప్రభో! నేనేమని వినుతింతును? ఈ సృష్టికెల్లఁ బూర్వంబున నొక్కసద్రూపుండు సత్యనారాయణుండుండెను. తదీయ సంకల్పమున జలంబులు, కలిగింపఁబడెను. అందునారాయణ తేజంబుంచఁబడెను. అదియ మహాంబుధిగనాయెను. ఆ నారాయణుండవు నీవ. తరువాత దేవదేవునీయభిమతముననె నాపుట్టువాయెను. తదనంతరమ్మున దేవదేవు నీయనుగ్రహంబున ననుమతంబున, జడాజడంబుల మానవుల సృష్టినాచేఁ బ్రవర్తిల్లెను. ఈసర్వంబునకును మూలాధారంబు మూలకారణ మానారాయణ స్వరూపులు మీరలేకదా! నేనకాదు నావంటి బ్రహ్మలు పెక్కుర మీచేఁబుట్టింపఁబడి పెక్కు బ్రహ్మాండములు వెలయించి వెలుగొంద చేయుచున్నారు. సూక్ష్మాతి సూక్ష్మాణువుల నుండి మహదతి మహత్తువరకును, నీసృష్టికంతకును నెల్లజీవరాసులకును గర్తవీవ, సర్వభూతాత్ముండవీవ. నీవయీప్రపంచ స్వరూపుండవని వేదంబులు పలుకుచున్నవి.

ఓదేవదేవా! యీప్రకృతి మహావృక్షమున రెండుపక్షులు జీవుఁడును, బరమాత్మయును జేరికూర్చుండియుండెను. ఆమొదటి పక్షి జీవుఁడు ఎల్లప్పుడును దనజేసినకర్మ ఫలంబుల ననుభవించుచుఁ బొడముచు మడియుచునుండును. ఆరెండవపక్షి భోగగంధమంటక సూర్యునట్ల ప్రకాశించుచుండును. ఆ పరమాత్మ మీరలేకదా? ఎల్లజీవులనియామకులు, ప్రేరకులు, ననుమోదకులు, మీరసత్యము, ననంతజ్ఞానము, మీస్వరూపము. ఓశ్రీపతీ! ఓభగవానుఁడా! ఈమానవులకుం గలుగు నానందంబదియెంత? దానికి శతగుణంబులుగ, ననంతముగ మీయనుగ్రహమున, మిమ్ముంబొందఁగలిగిన గల్గుమగదా. అదియేసుఖము; అదియేయానందము. ఓ కమలాపతీ! మిమ్ముం వినుతింపంబూని మీయనంత గుణగణ పారావారము నంతమును, లోతును గనజాలక యాయెడ, నసంఖ్యములగు వేదములును మూకత్వమునందియున్నవన మీనాభి కమలమున మధ్యస్థమైన నేనెంత? మీగుణసముద్రము నెట్లుతరింపంగలను? మిమ్మేమని నేస్తుతియింపనేర్తును? తమ కరుణా కలితప్రసన్న ముఖంబును గాంచి మేమెల్లరమును మీయెదుటనిట్లు కీర్తింపసాహసించితిమి. అక్కటికనూని క్షమింతురుగాక. ఓ దయాసముద్రా! శ్రీకాంతా! మాయెడఁ బ్రసన్నుండవుకమ్ము. పరమానంద స్వరూపా! మందరోజ్వల ముఖపద్మా! మాయెడల నెల్లవేళల నవ్యాజ కరుణ కలితులవని మేమెఱుంగుదుము. అనుచునింకను బలురీతుల నేమేమియో యాప్రసన్నహృదయు

గ్రకీర్తించుచు నుండెను. వారెల్లరట్లు తన్నునినుతించుచుండ వినుచున్నవాఁడై యాపరమేశ్వరుండు. భగవంతుండు వేంకటాధీశుండు, ఎంతయుఁ బ్రసన్నతతో వారలం గరుణార్ద్రక్కులం గమంగొనుచు నమృతధారలంబోలు పలుకుల వీనులవిందుగ మేఘగంభీర స్వనంబున నిట్లని పలికెను. ఓ కమలాసనా! దేవమునివరులారా! భక్తియుతంబులగు మీ మీస్తుతులకు నేనెంతయుఁ బ్రీతమానసుండనైతిని. ఈ తపోధనులతో సురవరులతో ఓ చతుర్ముఖా! నీవచ్చిన కార్యమేమి? అనియడిగినఁ బరమేష్ఠి పితామహుం డరవిందలోచను గోవిందుం గనుంగొని యిట్లనుడువసాగెను. సర్వజ్ఞతంద్రీ మాయెఱుంగని దేమున్నది. అయినను మీ యాన నేవచించునది వినుడు. పూర్వంబున విశ్రవసు కుమారుఁడు రావణుడను రక్కసుఁడు ఘోరమగు తపంబొనర్చి మనుజాలందలి నిర్లక్ష్యముచే వారినివిడిచి, దేవదానవదైత్యులచే రాక్షసులచేఁ దనకు మరణము కలుగకుండునట్లుగ వరంబును బొందెను. వరగర్వంబున వాఁడు కన్నుగానక బలదర్పంబుల విజృంభించి యెల్లలోకంబులఁ దపోధనులనెంతయు బాధించు చుండెను. వానిబలంబున శ్రీశైల సమీపంబునఁ గొందఱు మ్రుక్కడులు దైత్యులెల్లవేళలం బలోద్ధతులై యెల్లమానవుల మహావేగులై పలుతెఱంగులగు నాయుధంబులతో, పలుతెఱంగుల నెన్నెన్నియో హింసలఁబాల్పరచుచున్నారు. ఓదీనరక్షకా! అనాధనాథా! వారు పెట్టుబాధలం బడఁజాలక వైకుంఠధామమునకుఁ బాలసంద్రమునకుఁ బరుగు లిడిపోతిమి. రమాహృదయవల్లభా! అటమిమ్ములఁ గానఁజాలక, యాతురత నిటకుంబాఱి వచ్చి మిమ్ములం దర్శింపఁగల్గితిమి. ఓరిపుసూదనా! శరణు శరణు! నీపాదములం బట్టుచున్నాము. నీవే మాకుంగతి. జగద్రక్షకా యీదీనులఁ గాపాడమతెవ్వరు గలరు? ఆవైకుంఠధామముం గూడ విడిచి క్రీడావినోదంబుల నాసక్తులై చైత్రరథము కంటెను మిన్నయగు నీవృషపర్వతముం జేరియిటవసించుచు మీరు వేడుకలఁ బుచ్చుచున్నారు. ఇట మాకు వేరుగతియేమి? ప్రభూ! మీరే వచించునది. ఓవేంకటనాయకా! పాహిపాహి! యనునంతనది వినుచున్న యావిష్ణుభగవానుఁడు దయాసముద్రుడు వారింగాంచి జాలిమెత్తపడిన చిత్తమున నాబ్రహ్మాదులతో నిట్లనెను.

ఓ సురజ్యేష్ఠా! పరమేష్ఠీ! ఓప్రజాపతీ! మీరెల్లరిక నారావణునకు తదనుచరులగు రక్కసులకు వెఱువంబనిలేదు. నేను మీకండగ నున్నవాఁడను. నేవెల్లవిధంబుల మీకభయంబొసంగుచున్నాడను. తొందరలోనె నేనాలోక కంటకు దుష్టరావణు సబంధుపరివారముగఁ దప్పక దునుమాడంగలను. ఇందేమియు సందియములేదు. ఇట్లని కమలాసను సమాధానమొనర్చి తపోధను నగస్త్యముని నైపునకు మోముద్రిప్పి యోతపోధనా! అగస్త్యమునిసత్తమా! ఇదేస్వాగతము. నీవచ్చిన కార్యమేమి? పలుకఁదగునని

విని యా పవిత్రమూర్తి కుంభసంభవుఁడు విష్ణుభగవానునితో నిట్లుపలుకసాగెను. ఓకరుణాసాగరా! వేంకటేశా! చిఱునవ్వులు తొలకరించుచు మనోహరమై యెడందల దావమెల్లఁ జల్లార్చుచు హృదయానందముం గూర్చు మీమోముదమ్మిం జూచు మేమెట్లోర్పున నిలువంగలవారము? ముఖ్యముగ మీపుణ్యదర్శనమె మాప్రధానవాంఛితము. అయినను నేనొకింత మీయెదుట మనవిచేసికొనుచున్నాడను. దయదలకొన వినవలె.

ఈ పితామహుండిప్పుడ మీతో నెల్లరిపడుపాట్లును మనవిచేసికొనియున్నాడు. ఈదేశంబెల్ల మీయధీనము. మీరిచ్చట నధివసించియుండగనే దుష్టులు పెచ్చుపెరిగి యిటఁ బ్రజల నానావిధముల నిడుమలఁబాల్పఱచుచున్నారు. మీరిట్లుపేక్షించి చూచుచు మిన్నకుంటయేమియో యర్థముకాకున్నది. ఇఁకఁ దడయుటకవకాశము లేదు. వేవేగ దుష్టుల, దోపిడిగాండ్ర, శిక్షించి సజ్జనుల రక్షించెదరుగాత. మీయనుగ్రహంబున నీవిషయంబునఁ గలయెల్ల జనంబులు ధనధాన్య సంపన్నులై పుత్రపౌత్రాదులతోఁ బెంపొంది బంధుమిత్రులతో, ధర్మవర్తనులై, ఆయురారోగ్యములు పొంది, కలతలు కలహంబులు లేనివారై తనివితో జీవితంబుల నెళ్లఁబుత్తురుగాక. ఓశ్రీపతీ! ఆనందసంధాతా! ధర్మరక్షకా! మేము మిమ్ములఁ గోరునదిదియ. అనినంత నా రమా కాంతుఁడు పెదవులఁ జిఱునవ్వుతొలకాడవల్లన నిట్లనియెను. అగునగు నేను మీకెల్ల విధంబుల నీవరంబొసంగితి, నొసంగుచున్నాఁడను. నాయనుగ్రహంబునఁ బ్రజలీతిబాధలెల్లఁ బాసి పుత్రపౌత్రాభివృద్ధిఁ నాయురారోగ్యంబుల, ధనధాన్యంబులఁ దనియఁగలరు. దుష్టులను వేమత్వరలో నష్టులను మాడంగలవాఁడను. అని పలికి యటుమొగంబు త్రిప్పి సనకాదులం గమంగొని కుశలంబడిగిన వారయోగధనులు ఋషివరులు నాసనాతను పచ్చిదానందుం గాంచి యిట్లనిరి. ఓదామోదరా! ధర్మరక్షకా! ఈయదియెంతయుఁ బుణ్యభూమి. ఇందున దపమాచరించిన శీఘ్రముగ సిద్ధిచేకూరంగలదు. కాని స్వామీ! ఏమిప్రయోజనము? కష్టచరితులు, దుష్టవర్తనులు, కఠినాత్ములు, కలహప్రియులు, స్వార్థులునగు పలుజనులిడు బాధలు మితిమీరి సహింపరానివిగ నున్నవి. ఓశేషగిరివాసా! ఈ యెడలంగల దుష్టజనులిచ్చు బాధలు తొందరలోఁ దొలగింపుము. ప్రభూ! మీరు ఆ వైకుంఠపుణ్యధామము విడిచివచ్చి, ఈపర్వతోత్తమంబున నెలకొనియున్నవారు గదా. అయ్యునిట నేరికిం గానరాక యుంటిరి. ఇఁక నిచటి మీయునికిచే నిందలి ప్రాణులకొనఁగూడు మేలేమిగలదు? వరదా! వేంకట నగాధివాసా! పావనహృదయులు, భక్తితత్పరులునగు వారికిటఁ బ్రత్యక్షంబున దర్శనంబిచ్చుచు నెల్లరననుగ్రహింపం గోరెదము. ఇయ్యదియే మేమెల్లరముం గోరు హృదయపూర్వకమగు ప్రయోజనము అని వారుకోరుచుండ నాశ్రీపతి సనకాదులంగని ప్రసన్నదృక్కుల నట్ల కాఁగలదని పలికె

వారికిఁ బ్రమోదముం గూర్చి, సురపతి యింద్రుదెసకుం గన్నుమలపి ఓపాకశాసనా! క్షేమందువు? నీవచ్చినపనియేమి? యనినంత నాదేవేంద్రుండా యఖిలేశునకవ్యయునకు చేమోడ్చియిట్లనియెను.

ఓయచ్యుతా! యనంతా! యాదుష్టరావణుచే మేరలేని యిడుమలనందుచు పోరువంజాలక మేమమరుల మందఱము నింటిపట్టెఱుంగక గట్టుల పుట్టలపాలై తిరుగుచున్నారము. మీరు మాకుఁబట్టుకొమ్మని యిటకుం బాఱివచ్చితిమి. అనఁ గోవిందుండా మఘవుతో నిట్లనియెను. ఓపాకశాసనా! మీరెల్లరు నిర్భయులై శాంతంబున నుండుఁడు. ఆఖలునకు రావణునకు రోజులు దగ్గఱపడినవి. ఇకవాఁడు చచ్చినవాఁడెయని తలంపుఁడు. అచిరకాలంబుననె వానిని దునుమాడంగలను. ఇది నిక్కమని తలంచి ధైర్యమును బొందుఁడు అనెను.

అటుపిమ్మట నాకమలానాధుఁడీశాను వంకమొగంబై సుచిస్మితంబున నోశంకరా! భక్తవశంకరా! నీవేమిటికి వచ్చితివి? వచ్చినపని తొందరగ వచింపుము. అనియడిగిన వాగిరీశుఁడు హృషీకేశునితో నిట్లనియెను. ఓవృషశైలవాసా! శ్రీనివాసా! నీవెక్కడనుందువో యక్కడనే నేమమండఁగోరెదను. ఇదియ నాయేకైకవాంఛ. అనుచున్న యాయభవు పలుకులనాలించి యా నీలమేఘాభుఁడు మేఘగంభీర వాక్కులనిట్లు పలికెను. ఓమృడాభూతేశా! మహేశా! యీశా! నీవననేనన భేదంబుగలదె! నేనీవేంకట భూధరో పరితలంబునఁ గల్పాంతము వరకు నుందును. ఓమహాదేవా! నీవును నిందే యీకుధరమున కీశానభాగంబున నెలకొనియుండునది. అనియాదేశించెను. ఇట్లందఱికిఁ బ్రమోద ధైర్యంబులు గలిగించియా దైత్యారి యట్లేయుండెను.

## బ్రహ్మకోరినంత దేవుండుకొండ నుండ వరమిచ్చుట

తదనంతర వృత్తాంతమేమని శౌనకాదులడిగినంత సూతముని వరుండిట్లని పలుకసాగెను. అయ్యలారా! ఆలకింపుడు. అట్లుతన్నుఁజేరి, వినతులు, వినుతులు, పొనర్చుచున్న వారినెల్లరఁ దగురీతుల ననుగ్రహించి యాభగవంతుండు శ్రీనివాసుండు తమ్మిచూలింబిలిచి యిట్లనియెను. ఓవిధాతా! మీరువచ్చి చాలాసేపాయెను. మీరింతవరకింకను వేలనిలిచియున్నారు. మీయభిలాషయేమి? వచింపుడు. తప్పక దానినెఱవేర్తును. అనిన యా కమలాపతి పలుకులాలించి ముదంబంది యావేల్పు పెద్దయల్లన నిట్లనిపలికెను. ఓ విశ్వేశా! రమానాధా! తమరు నాయభీష్టముల నెఱవేర్చువారేని వాకోర్కులివియ నీవిమన్నింతురుగాక!

ఓదేవదేవా! మీరీకొండ నెత్తమ్మున విచ్చటనె యీవిధమువనే నిలిచియుండి లోకంబున నెల్లమానవుల హితంబు మనంబున మంచి సద్గుణశోభితులు, సద్భక్తి

యుతులువగు నెల్లవారికిం దర్శనభాగ్యం బొసంగుచు వారివారి మనోరథంబు లీడేర్చెదరు గాత. ఓనారాయణా! యాకలికాలమ్మున మానవులల్పజీవులు, ఇంద్రియలోలురు, పొట్టయే సర్వస్వమనుకొను నల్పబుద్ధులు, స్వార్థాంధులు వారికి ధర్మాధర్మ వివేకము తక్కువ, కర్తవ్యమునే మఱచి తిరుగువారే. తిన్ననగు తెన్నుంబట్టిపోవుటెఱుఁగరు. వారలు రోగపీడితులు, దుర్బలకాయులును, గామపీడితులునైయుందురు. వారు పశువులట్ల ప్రవర్తించుచుఁ దమహితాహితములనేని యెఱుంగనేరరు. ప్రభూ! మీరే వారినుపేక్షించిన వారెల్ల నరకకూపమునం గూలవలసినవారే. వారికై నరకంబును విస్తృతమొనర్చి యింకను రౌరవాదినరకమ్ములఁ బెంపానర్పవలసి యుండును. వేలకొలది నరకమ్ముల నూతనమ్ముల సృష్టింపవలసియుండును. అట్లుకాకుండ వారల నుద్ధరింపుడు, సత్పథమున నుడుపుడు కరుణార్ద్రహృదయా! వేంకటాధీశా! ఆదీన మానవుల హితమునెంచి యీశైలరాజమును నివాసముగఁ జేసికొనుఁడు. వారలనుద్ధరింపుడు అయ్యదియ నామనోవాంఛితము. ఆ నలు మొగంబులవేలు పిట్లుకోరిన నాలించి యాకరుణానిధానుఁడు కమలాపతి కమలా సమంగనుంగొని యిట్లనియెను. ఓ తమ్మిచూలీ! నీయాకోర్కి సర్వోత్తమము; మిగుల నుదారము. దీన మానవుల యెడనీకుంగల యనుకంపయెంతయు ధన్యమైనది. దానికి నేనెంతయు సంతసించితిని. నీకీ వరదానంబునను గ్రహించుచున్నాను. నీయభిలాష ననుసరించి నేనీకొండయందున గరుడుడును, శేషుఁడును, సేవింప విష్వక్సేనాది పరివారముతో నివసింతును. శ్రీభూనీళలతోఁగూడి యెల్ల వేళల దర్శనంబొసంగుచుఁ బ్రత్యక్షరూపంబున నెలవుకొనియుందును.

ఈ పర్వతరాజమ్మునఁ జేరి తపమొనర్చు వారితపస్సును, ఇటఁజేయఁబడు యజ్ఞాది సత్కర్మలును, నెల్లయోగంబులును నతితొందరలో ననుకూలంబుగ సిద్ధిబొందును. ఓలోకపితామహా! ఇటఁ గల యీస్వామిపుష్కరిణి యెల్లతీర్థములకు నేలికయైనది. యిందు స్నానమొనర్చినవారి, యెరిగియొ యెరుగకయో, చేసిన పాపములు నశించుమగాక.

## రాక్షస సంహారార్థము సుదర్శనచక్రముం బంపుట

ఇట్లు హిరణ్యగర్భునాశ్వాసించి లోకంబుల యార్తిందీర్ప నాయుధరాజంబును సుదర్శన చక్రముం జూచి యద్దానితో నిట్లనియెను. వెగ్గలంబగు నగ్గిమంటల వెలిగ్రక్కు వేయంచుల వెలుగొందు నో సుదర్శనచక్రమా! ఆయుధరాజమా! ధన్యప్రతాపమా! నాయాజ్ఞగావిప్పుడ ముసలముద్గర ఖడ్గతోమరాదుల వెంటనిడికొని పోయి, బలవంతులు పాపులునగు దైత్యదానవులను, సాధుసజ్జనుల, గోబ్రాహ్మణుల హింసించి సిలుగులఁబెట్టు దేశప్రజలకుం బీడవొనర్చి యాతనలం బాల్పఱచు; దుష్టులగు వారి - దేవయక్షరాక్షసుల

వాగుల మానవుల నెవ్వరినైనను నెల్లర దొంగలదోపిడిగాండ్ర, ధనదానుల, వనితామానాపహరుల నెందున్నను బట్టి పల్లార్చుము. వారడవులఁ నద్రిగుహాంతరములఁ బురములఁ బల్లెలనెందున్నను, వెదకివెదకి సంహరింపుము. దేశము నలుమూలల నుపద్రవములణంచి నిష్కంటక మొనర్పుము. ఎల్లపాపుల భస్మమొనరించి, యెల్లప్రాణుల సుఖజీవనమునకుందగు వ్యవస్థ గల్పించిరమ్ము పొమ్ము. అనిముదలయిడినంత నాగుడు సుకైదువా పర్వతరాజము నుండి బయలువెడలిపోయి దుర్జేయులగు నాదుష్టులనందఱి నెందున్నను, వారినెవ్వరిం గానివిడువక యందఱిం భస్మమొనరించి దేశమును నిష్కంటక మొనరించి చూచుచు చూచుచునుండఁగనె తిరిగివచ్చెను. వచ్చిప్రభునెదుట నిలిచి హేదేవా! తమ ప్రతాపమ్మున నెల్లరుదైత్యులు, దుష్టజనులు వినష్టముం బొందిరి. అనినివేదించెను. వేయంచులకైదువిత్తెఱఁగునఁ జెప్పిన పనిచేసికొని వచ్చినిలిచిన; నాపచ్చపట్టు బట్టయయ్యె; బమ్మదేవరం గాంచి వింటిరిగదా! సుదర్శనకృతము. మఱేమికావలయును? మీయభిలాషయేమి? యెఱింగింపుఁడనియెను.

## బ్రహ్మాదులు వేంకటాద్రీశునకు మహోత్సవంబులొనరించుట

శేషశయనుఁడు పలికిన పలుకులకా చతురాననుఁ డానందంబున మనసు తబ్బిబ్బు కాగా, దేవదేవా! ప్రసన్నచేతసా! మఱలమిమ్మేమని యడుగుటకు హృదయము వెనుకాడుచున్నది అనియెను. అదివిన్న కమలాక్షుఁడా కమలాసనుంగనుంగొని యెడందకు మాఱటఁ గలిగించుచు నిందు వెనుకాడవలసినదేమున్నది? మనసునఁ గల యభీష్టము వెఱిగింపవచ్చును. నేనదితీర్ప సంసిద్ధుఁడనైయున్నాడను. అనియెను. వైకుంఠుండాడిన పలుకులకు డెందంబునఁ బురికొను నుత్సాహముతో సమయజ్ఞుండా యజుడిట్లని వివేదించెను. ఓ మహాప్రభూ! ఇప్పుడీయెడ విన్నారాధించుచు నీకైధ్వజారోహణ మాదిగ మహోత్సవము నొనరింప స్వాంతమ్మున నభిలాషముప్పిరికొనుచున్నది. దానికిమీరును, మాకన్నతల్లి లోకమాతయు నంగీకరింపవలయు ననునదియే మామనోవాంఛితమని పలికి నిలుచున్న నాయిందిరారమణుఁడు ప్రసన్నముఖంబున నల్లే"యన వాదేవదేవుననుమతినందిన యాపరమేష్ఠి ముదంబంది, సూర్యుండు కన్యారాశిని గాలిడినవేళన యెల్లదేవతల, మునుల వైఖానసులం గూడి ధ్వజారోహణంబు పొనర్చి మహోత్సవము నొనర్చుటకుం దొరకొనెను.

ఆదివ్యోత్సవమునకుం బిలువఁబడినవారై యెల్లదిక్కులనుండి, విబుధులు, పవిత్రహృదయులు రాజచంద్రులు, బ్రహ్మక్షత్రియ వైశ్యులు, శూద్రులు, పంచములు, వారువీరేమి, ధర్మాత్ములగు నెల్లజాతులవారలు, పల్లెలఁబురముల, గొండల, వనముల

నెందున్నవారును, ఆంధ్రాంగవంగ కళింగకాశ్మీర కేరళగౌడచోళమాళవ పాండ్య కోసలాది యెల్లదేశములవారు కుటుంబములతోఁ బరివారములతో నాబాలగోపాలము ముమ్మరించిన సమ్మదముతో, గుంపులుగుంపులుగ నడుగడుగున గోవింద గోవింద యనుచు నినాదంబులుసేయుచు నుత్సవంబునం బాల్గొనవచ్చుచుండిరి.

అమ్మహోత్సవంబున శ్రీనివాసుని శ్రీమహావిష్ణుని దర్శనంబెంతయుఁ బుణ్యప్రదంబు, నానందంబు, ననితలపోయుచు నసంఖ్యాక భక్తవరులు సాధుసజ్జనులు, వచ్చుచుండిరి. వారిని సేవించి తనియించుట దేవుని సేవలఁ దనియించుటేయని, ముక్తిప్రదంబని తలపోయుచు మార్గంబుల నన్నసత్రంబులను, జలివేంద్రలను, జలువ పందిళ్లను నప్పటికప్పుడె, యక్కడికక్కడె కట్టించువారును, దృప్తిగ భోజనంబులిడువారును, గొడుగుల వస్త్రముల, వాహనముల నొడఁగూరిచి యిచ్చువారును, బాదుకల నొసంగువారునునై మానవసేవల శక్తికొలందిగ నొనర్చుచు, దేవునర్చించి నట్ల తనియువారగుచుండిరి. ఆడుచుఁ బాడుచు, సంగీతమ్ముల, రాగతాలమ్ములఁ గేరుచు, భగవాముని కథలంజెప్పికొనుచుఁ బ్రశ్నించికొనుచు నొండొరులకు సాయంబులు పొనరించుకొనుచు నందరేకకంఠంబున మాటిమాటికి నాదేవుగొంతెత్తి పాడుకొనుచు మహరాత్సాహంబున నాయుత్సవంబునకు వేంకటాద్రికిం బోవు నాజనంబులఁ గన్నులపండువుగఁ జూడనేవలెను.

హిరణ్యాగర్భుండప్పుడె శిల్పులందెల్ల మేటియగు దేవశిల్పిని విశ్వకర్మను బిలిచి యుత్సవాగత జనంబున కెల్లరకు సౌకర్యంబుగఁ దగు కట్టడములు నిర్మింపుమనిపంచెను. ఆతండును నగరాజమున నలువైపుల, నాలుగుత్తమనగరంబుల నిర్మించెను. విశాలంబులై తిన్ననగు వీధులును, వీధుల కిరువైపుల నెల్లవసతులు గలిగి యందంబులఁ బెంపొందిన మేడలును, మిద్దెలును, సుందరభవనంబులు నిర్మించెను. విశాలమగు విపణివీధులు, మనోహర కళామందిరములు, విరాజిల్లుచుండెను. అందందుఁ బెక్కులన్నశాలలు, విశ్రాంతిగృహములు, చల్లని పానీయశాలలు, వినోదభవనములు, ననుకూలంబులై యందగించెను. అప్పట్టణంబుల నావిశ్వకర్మతన నేర్పెల్లఁ బ్రకటించెనోయననుండెను. విశాలోన్నత భవనంబులు శిల్పసుందరస్తంభంబులు, మనోహర చిత్రవిచిత్రిత విశాలభిత్తికలు నొప్పియుండెను. చంద్రకాంత శిలావేదికలు సూర్యకాంతసుశోభితంబులు కాగా, నవరత్నఖచితంబులై యలరారుచుండెను. తప్తకాంచన వినిర్మిత కవాటంబులు, గవాక్షంబులునై నొప్పెను. అందందు పుష్పఫల సంభరిత సుందరోద్యానంబులతో, వాపీకూపతటాకంబులతో, గంధర్వనగరంబాయన నొప్పు చుండెను. అట పణ్యవీధుల నంగళ్లఁ జిక్కని వస్తువేలేకుండెను. ఆహార వస్తువులు, వినోదసామాగ్రి, నవరత్నములు, వెండి బంగారములు, జూడవింపగు వందమగు నగలు కొల్లలుగ నొప్పుచుండెను. ఆ యా

త్రోవలఁ దెన్నుల నాయాపట్టణవాసులు గ్రామస్థులు నెల్లరును, ధర్మైకజీవులై దేవుదర్శనాగత జనంబుల సేవలనొనర్చుట కొఱకే యటనున్నట్లు తోచుచుండిరి. అడిగి భోజనములు పెట్టువారు, పిలిచి చల్లనిపానీయములఁ ద్రావ నిచ్చు వారు, నాదరించి విశ్రాంతి విడుదుల నొసంగువారు, (బలుతెఱఁగుల వస్త్రముల నిచ్చువారలునైయుండిరి. ఆపరమేష్ఠియు నామమహోత్సవకాలంబున, ననేకవిధంబులగు వంటకంబులం జేయించెను. రకరకములకూరలు, పలుతెఱఁగుల పచ్చళ్లు, నెన్నఁజాలని పిండివంటలు, పానకమ్ములు, పప్పులు శర్కరతో, నేతితో, ముంచియెత్తినవి. పాలు మీగడలు, పెరుగు వెన్నలు, ననేకభాండములతో నించియున్నవి. పాయసాన్నములు, శర్కరపొంగలి, దధ్యోదనము, మిరియన్నము, గోధుమాన్నము, తీయతీయని, కమ్మకమ్మని రొట్టెలు ఏమని చెప్పునది. ముగ్గిమోదముం గూర్చు పెక్కుతెఱఁగుల ఫలములు నెన్నెన్నియో యాయుత్సవముంజూడ నేతెంచిన భక్తజనంబులఁ దనియింప సమకూర్పఁబడినవి.

## మహోత్సవ వైభవము

అశ్వరాజమగు నుచ్చైశ్శ్రవసము, గజశిరోరత్నమగు నైరావతము, అనంతుండగు నాగరాజు, వేదస్వరూపుండగు గరుడుండు వాహనంబులుగా నాయావేళలనుపయోగించుచు, జగన్మాతయగు లక్ష్మినంకమున నిడికొని యమూల్యవస్త్రరత్నాభరణాద్యలంకృతుఁడై దర్శింపవచ్చిన భక్తజనంబులు, గంధర్వాదిదేవతలు, కవి గాయక పాటకులు, వెంటరా, వేదస్తుతులు నుతులు, చెలంగుచుండ ననేక విధములగు, మంగళవాద్యములు మ్రోయుచుండ సుందర నరనారీజన నృత్యగీతము లలరుచుండ, రథగజతురగ శకటంబులతో, జిత్రవిచిత్ర పతాకలతో వరుసలు దీరి, వీధివీధుల నాదేవుండు పలుమారు లూరేగి యెల్లరకనుల పండువ పొనరించి యనుగ్రహించెను.

దేవవర్గంబులాదేవు ప్రాతస్సాయంబుల ననేకంబులగు బుచంబులఁ బూజించిరి. పవిత్రులగు యోగివర్యులు బాగుగ హోమంబులు వేల్చిరి. మనోహర పూర్ణకుంభంబులు ననుకూలంబుగ నలంకరింపఁబడినవి. తపస్వులగు వైఖానసులు విధియుక్తముగ దిక్పతులకు బలులర్పించిరి. ఇట్లా నలుమొగంబుల వేలుపెల్లలోకంబుల కుపకారంబుగఁ గల్పించిన యామహోత్సవము సుసంపన్నమాయెను. ఆశ్రీనివాసోత్సవ దినంబులెంతయుఁ బుణ్యదివసమ్ములు, సర్వపాపనాశములువని తలంచి యందు వచ్చిన కలవారలు తమకలుములు కొలందిగ భగవదర్పితంబుగఁ బాత్రులకు నిండ్లు, భూములు, ధనమ్ములు, నన్నవస్త్రములు నెన్నియోవిధములగు దానములొనరించి తనియపొగిరి. దారుశిలా నిర్మితములువగు, సర్వాలంకృతంబులు, సౌకర్యవర్ధితములునగు భవనంబు లెన్నెన్నియొ

నిర్మించి సంపన్నులౌనఁగనాయెడ నాదేవుని సన్నిధి నివాసమెంతయు నొప్పునవి యెల్లజాతులవారు నెల్లకులములవారు వచ్చి కాపురములు సేయుచు సోదరులట్లు మెలగసాగిరి. కలుములు కొఱవడినవారును నుత్సాహమునఁ గొఱంతలేనివారై, వచ్చిన యాత్రికులకు, భక్తవరులకు, దైవోత్సవ దర్శనాకాంక్షులకు నాగంతుకులకు శక్తి కొలందిగ సేవలుచేసి తనియించి తనియుచుండిరి. వలసినయెడలకు, దిన్నని తెన్నులఁ జూపువారు, పెద్దలకుఁ జేయూతయిచ్చి నడుపువారు మార్గాయాసంబులుపాయ, విజనంబులు వీచువారు, పలుకరించి కుశలంబులడుగువారు, వారికివలయు విషయంబుల నడిగినవారిం దెలియఁ జెప్పువారు, వారిననుకూలంబులగు తావులకుంగొనిపోయి విడియించువారు, త్రాగ శీతల జలంబులందిచ్చి యిచ్చువారు, మృష్టాన్నములం గొనితెచ్చియిచ్చువారునై వలసిన వస్తులనెమకి తెచ్చియిచ్చువారునై, యింకనునిట్టి వెన్నెన్నియో యుపచారములవారికి ముదంబుగూరిచి తాముసు ముదమందుచుండిరి. అదియెల్ల వారికిం దేవునిసేవయేయై తనివిం గూర్చుచుండెను.

ఇట్టులాయుత్సవములు దినదినంబు నొక కొత్తతీరు నలవరించుకొనుచు సాగుచుండ నొకనాడూరేగింపు టుత్సవంబున నున్నతంబులగు పైడిదండంబుల కొనల రంగురంగుల క్రొంబట్టుపతాకలు రెపరెపలాడుచుండ, నెత్తావుల మొత్తంబుల విరజిమ్ముమందాల పూలమాలల, రత్నహారంబుల నలంకృతంబై బంగరు జరీబట్టలు జుట్టి, కన్నులకింపొనర్చుచు, సిద్ధగంధర్వాది జనసంసేవితంబగు దివ్యవిమానము బుష్పకంబును దలంపునకుం దెచ్చు మనోహరంబగు దివ్యరథంబును శ్రీభూదేవులతో నెక్కికూర్చుండి యాశ్రీనివాసుండు బ్రహ్మాదిదేవతలు బలిసికొలువ శోభాయమానంబులగు, రాజవీధుల నెల్లనూరేగి తిరిగివచ్చి, దివ్యవితానశోభితమ్మును శతాధిక రత్నజటిత సువర్ణస్తంభ విరాజితంబును నగు నాస్థానమండప మధ్యంబున, దివ్యసింహాసనంబున నధిష్టించి, పరమపావనుఁడగు స్వయంభువు నాబ్రహ్మను జెంతకు రాబిలిచి మృదుమధురములగు వాక్కులనిట్లనియెను.

ఓ చతురాననా! నీయనన్యభక్తికి నాసక్తిని నీయొనర్చిన యాయుత్సవంబునకు నెంతయు ముదమందితిమి. ఓదేవతలారా! యోగులారా! మునివరులారా! రాజవరులారా! భక్తజనులారా! మనమునుంచియాలింపుడు. ప్రతి వత్సరమునందీమాసంబున కన్యారాశిని సూర్యుండు చేరునప్పుడీట నెవ్వరీబ్రహ్మకృతంబగు నీయుత్సవమును జేతురో వారీ భూమిని నెల్లకోర్కులనంది యానందించి విరించిలోకంబునుం బొంది సుఖింతురు. ఈయుత్సవమునుం గూర్చి తలపోసి తలపోసి యిటసేవలం జేయ నెవరుకోరికపడి, యీశేషగిరికిం బయలుదేరుదురో వారాపయనంబున ముందునకు సాగించిన

యడుగడుగునకుం బున్నెంబు ఫలంబుగా నా సాయుజ్యముం బొందుదురు. వారికీ లోకంబున, ధనధాన్యంబులు, పాడిపంటలు, పుత్రపౌత్రులు మొదలుగ నెల్లసుఖములు వానికవియే చేకూరఁగలవు. ఇట్టి యీ బ్రహ్మకల్పిత బ్రహ్మోత్సవంబుల నన్నునెవరు భక్తియుక్తులై సేవింతురో వారిని దేవపాలకులును సేవించి, వలయుకోరికలిచ్చి యాదరించి తనియింతురు. ఈతావున వచ్చిన యాత్రికులకు, భక్తులకు, దనివిగా, సుఖముగా శీతలజలపాన శాలలను, చల్లని చలివేంద్రలను, మృష్టాన్న భోజనశాలలను నిర్మించి యన్నపానములు కూర్చువారిచే, నిలువనీడనిచ్చు వారిచే నామనస్సే శీతలమై తనియునన్ననిక వారికేమికొదువ? ఈ మహోత్సవకాలమున నన్నదానమెంతయు విశేష ప్రశస్తమైనదియగు. అన్నదాన మొనర్చు నాసుజనులకు నిట నట నేడేడు తరములవరకు నేకొఱంతయు లేకుండగ సుఖసమృద్ధిని గలిగింతును. వారును నాయిచ్చిన భోగభాగ్యముల ననుభవించి, కోరిన కోర్కులెల్లందీర స్వర్గసుఖములం బొంది తుదకు మత్పదమునంది తరింపఁగలరు. గ్రుడ్డి కుంటి మూగ మొదలగు నవయవహీనులకు నన్నముపెట్టి కట్టబట్టలిచ్చి, ధనమిచ్చి, యాదరించువారికి ననాయాసంబున నెల్ల భాగ్యంబులు, నఖిలసౌఖ్యంబులు నాయనుగ్రహంబున నొడఁగూడఁగలవు. ఈతావున నుండఁగోరు మానవులకు ధనధాన్యసమృద్ధియుఁ బుత్రపౌత్రాభివృద్ధియుఁ గలిగింతును. కాని వారివారి భక్తిశ్రద్ధల ననుసరించి వారికీ కోర్కులు చేకురుచుండును. ఈకొండయందువ నిటనపుట్టి పెరిగి చనిపోయినవారికి జ్ఞానైకసాధ్యమగు ముక్తియు సులభప్రాప్తమగును. ఎన్నెన్ని తెఱఁగుల దానంబులు, శాస్త్రములం బేర్కొనంబడి, యనుభవమునందెలియఁ బడుచుండె నవియెల్లనిట నొసంగినవారికి నైహికంబులగు నెల్లకోర్కులు దీర, స్వర్గ సుఖములొసఁగి కడపట మోక్షపదవియును జేకూరుతును. ఇందువందియ మావంతయు లేదు. ఏ కుల జాతుల వారుగాని యీపర్వత రాజమునకు నలువైపులఁ గ్రామములుగాని పురములుగాని నెలకొలుపు వారలు, పవిత్రహృదయులై యటవసించు వారలు, నిటరాజ భోగములనుభవించి యటన్వర్గభోగములంది, తుదిని నాసాయుజ్యమంది ముక్తిపొందుదురు. ఇందు సందియమింతయులేదు. ఇది పుణ్యక్షేత్రమని యెఱిఁగి యిందేకాపురంబుండఁగోరు పాత్రులకు నుండ నిండ్లిచ్చి యాదరించు వారెల్ల తీర్థముల సేవించినఫలంబును బొంది తుది నాలోకము వవశ్యముం బొందఁగలరు. ఇందు నివసించువారి కుత్తమవిద్యాదాన మొసంగు పండితులకు ముల్లోకముల యశోలాభము కలుగును. వారును వారివారును వారివారునుం గూడ దానిఫలముం బొంది దేవత్వమువంది చిరకాలము స్వర్గమున సౌఖ్యానందముల నోలలాడుదురు.

# పుణ్యోద్యాన నిర్మాణాది దేవకైంకర్యముల ఫలము

సూతముని వరుండు శౌనకాది మునితల్లజులంగాంచి భగవద్వచనంబుల మఱియునిట్లని చెప్పఁదొడఁగెను. విబుధులారా నాచెప్పుదాని మనసుంచి యాలకింపుడు. భగవానుఁడు శ్రీనివాసుఁడు మఱియునిట్లనెను.

ఈ క్షేత్రమున బృందావనమును నందముగఁబెంచియు, వివిధములగు ఫలపుష్పవాటికల నాటియు వానిఫలపుష్పపత్రములచే నన్నుబూజించి తనియింపఁ జేయువారు పూవుపూవునకు ఫలమునకుఁ బత్రమునకు ననేకవేల దివ్యవర్షంబులు స్వర్గసుఖములను భవించి కడపట మత్పదంబును బొంది తరింతురు. ఈ లోకమునఁ గోర్కులన్నియు వారికిఁ గోరకయే సిద్ధించును. ఆ పుణ్యజనుల వంశములీలోకమున విచ్ఛేదమే లేక సుఖానుభవములనందును, నాకుఁబ్రత్యహమును శ్రద్ధను బవిత్ర వంటకములతో మృష్టాన్నంబుల నెవ్వరు నైవేద్యంబుల నర్పించుచుందురో, వానిచే దీనజనులక్షుత్పిపాసలం దీర్చుదురో; వారికెనవచ్చు పుణ్యాత్ములీ భువిని గలుగఁబోరు. వారు బ్రహ్మేంద్రాది దివ్యలోకంబుల ననంతకాలంబు పొంది సుఖింతురు. ఆ పుణ్యుల దర్శించువారును బాపములు తొలంగి పవిత్రులయి మహిమాన్వితులై సుఖింతురు. వారి భాగ్యభోగ్యములం గూర్చి వేరెపలుకనేల! కడకు వారు జన్మరాహిత్యముం బొంది పరమధామముంజెందుదురు. ఈ భూమండలంబున నెవ్వరు నాకు వజ్రమాణిక్యాది రత్నజటిత సువర్ణాభూషణమ్ము లొసంగుదురో యాపుణ్యులు, పరమపుణ్యులు ధార్మికులు పండితులు దీర్ఘాయువులునగు సుపుత్రులంబొంది నాయాశీర్వాదంబున ననంత సంపదలందు తులదూగుదురు. నాపూజల కొఱకెవ్వరు దినదినము భక్తిశ్రద్ధలతోఁ బద్మములను కల్హారములను, జంపకములను, దులసిదళములను మాలలం గట్టుదురో వారలగేహములు లచ్చితోనే నెల్లకాలము వాసముచేయుదును. అట్టిపుణ్యజీవులకుం దోడ్పడు వారికిని నే నమితములగు ధనధాన్య సంపత్తుల నొసంగి సుఖసమృద్ధిం గూర్తును.

ఇచ్చటం జేరిన యోదేవ వరులారా! యోగిపుంగవులారా! మనుజశ్రేష్ఠులారా! మీమీ సదభీష్టముల నెల్ల మీకునేనొసంగువాఁడను. పుత్రపౌత్రాదులును, ధన ధాన్యములును, భోగభాగ్యములును, ఆయురారోగ్యములును, గీర్తిప్రాభవములును నివియు నవియునన నేల నేవికోరిన నన్నియుఁ గొఱలేక యవస్యము మీకుం జేకురంగలవు. ఇందిసుమంతయు సందియములేదు. ఇంతగఁ బలుకుటెందులకు? ఇందునను నెందునను నాపేర నమద్భక్తులకు సజ్జనులకు సద్భావసహకారంబుల నుపకారము లొనర్చువారెంతయు నాకుంబ్రేమపాత్రులు కాగలరు. మానవుఁడే గాని వేలుపుగాని, యక్షరాక్షసాదుల

వెవ్వఁడుగాని, ఎవ్వరికింగాని, ద్రోహమొనరించువాఁడు, కష్టములంగూర్చువాఁడు మహాపాపియగును.

ఎట్టివాఁడైనను, పాపికాని, కపటిగాని, ద్రోహిగాని గతమునకు వగచి, పశ్చాత్తప్తుఁడై భక్తిశ్రద్ధలతో నిటఁజేరి స్వామిపుష్కరిణిని మునిగి నన్నుసేవించువాఁడు పవిత్రుఁడగును సఫలమనోరథుఁడగును. మఱిపాపకార్యముల పొంతకాతఁడు చేరరాదు; చేరనేచేరడు. పాపములం గడ్డుకొని పవిత్రుఁడగు నాధన్యుఁడు మఱల, పాపపంకిలము నెట్లు పులుము కొనఁగలఁడు? ఔదార్యగుణసముద్రుఁడు, కరుణానిధి యావేంకటాధీశుఁడచటి భక్తులకెల్ల నిట్లు వరములొసఁగి తనియించి భేరీమృదంగములు, పణవాణక గోముఖంబులాదిగా మంగళవాద్యములు మ్రోయుచుండ నింగినుండి పూలజల్లులు గురియుచుండ శ్రీభూదేవులతో గూడి మహాదివ్యరత్న తోరణ యుతంబగు దివ్యవిమానంబును బ్రవేశించెను.

బ్రహ్మాది దేవతలు, మునివరులు, ప్రేమపూర్ణ మనంబులతో నెల్లజనంబులు చేరి జయజయధ్వనులతో, లోకంబులు ప్రతిధ్వనింప సంస్తుతులొనరించిరి. ప్రత్యేకించి యాపితామహుండు ఋషులతో మునులతో, యోగివరులతో, నింకను దపసులతోఁ గూడి శాస్త్రవిధిని శ్రీవేంకటేశుని దివ్యమంగళోత్సవమును సమారోహంబున సుసంపన్న మొనర్చెను.

పిమ్మట నాప్రభుని దేవదేవుని భగవంతుని యుత్సవకార్యంబులొనర్చిన యాబ్రహ్మాది దేవతలును, యోగులును, బ్రాహ్మణులును, క్షత్రియులును వైశ్యశూద్రులును నెల్లమానవులును శ్రవణ నక్షత్రమునఁ బవిత్రమును, బాపనాశనమును, బుణ్యప్రదమును, లోకపూజితమునగు నాస్వామి పుష్కరిణీ జలంబుల నవభృత స్నానమొనరించిరి. స్నానానంతరమునఁ దపోధనుఁడా సనకమహర్షి వర్యుఁడు సర్వజ్ఞుఁడెల్లముని మానవుల నంబోధించి యిట్లనియెను. ఓ మహాపుణ్యభాగులారా! మీరెల్లరు నాచెప్పుదాని ధ్యానముంచి యాలింపుఁడు. యోగబలమునను, ధ్యానబలమునను నేనెఱింగినదాని, నెల్లశాస్త్రముల మననమొనర్చి గ్రహించిన దానింజెప్పుచున్నాడను. చక్రధారి శ్రీనివాస భగవంతుని యీపుణ్యమయ మహోత్సవానంతరమున నవభృత స్నాన మొనర్చువారి జన్మజన్మముల యనంత ఘోరపాపములును నా క్షణముననే నశించిపోవును. పాపములం దొలంగి వారు ముందుముందు పవిత్రజీవితమును సాగింతురుగాక.

తపోధనుఁడగు నా సనకమునివరుం డిట్లుపల్కినంత యాలించి మహాదేవుండును అదియంతయు నిక్కమె యనెను. అప్పు డందలి దేవాదు లెల్లరు స్వామిపుష్కరిణి నెంతయుఁ బొగడి వినుతించిరి. అటుపిమ్మట శ్రుతిశ్రావ్యములగు వేదధ్వనులతో, మంగళవాద్యములతో, నృత్యగీతములతో నానావిధములగు దివ్యసుగంధితపుష్పరాశులతోఁ

బ్రసూనయజ్ఞము నొనరించి భగవంతుని సంతుష్టుని గావించి కడపట నెల్లదేవవరులతో నరవరులతో విరించియానల్లనయ్యకు వెన్నునకుఁ గై మోడ్పు లొనరించి నిలిచెను.

తమ్మిచూలిచే బాగుగ నడుపఁబడి నెఱవేరిన యాయుత్సవముచే నెంతయుఁ బ్రసన్నుండై యాహృషీకేశుఁడు శ్రీనివాసుఁడిట్లని పలికెను. ఓ తమ్మిచూలీ! నేనిప్పుడెంతయు సంతుష్టుండనైతిని. నాయీసంతృప్తికిం దగునట్లుగానే మీకేమొసంగునది? దానికిందగిన దేమియుఁ గానరాకున్నది. సృష్టికార్యదురంధరా! పరమేష్ఠీ! అతిశయించి నేనిచ్చునదేమున్నది? నేనేనీవు నీవేనేనుగద. నేనెవండను? నీవెవండవు? నేనేమొసంగవలయునో! యేమొసంగఁ దగునో, నీవేవచింపుము. ఇట్టులనుచున్న యాజాలి చూపుల వానిగలుములచెలి చెలికానింగాంచి, నలుమొగంబుల వేలుపిట్టులనియెను. ఓస్వామీ! దేవదేవా! ఇది యంతయు మీయనుగ్రహమ్మె! నేనెంతయు ధన్యుండను. ప్రభూ! ప్రపంచకళ్యాణ మొక్కండుదక్క నాకువేరొండు కోరికియేమియులేదు. కావున నోకరుణాసింధో! నామనోభీష్టము నాకర్ణించి సుసంపన్న మొనర్పందగును. ఈనగరాజమ్మునఁ నెల్ల కాలమిట్లే యర్థిజనమ్ముల మనోరథమ్ములఁ దీర్చుచు, దీనజన కల్పకంబుగ దయారసమ్ము చిమ్ముచు, మీరిందున నుండుట యే నాయభీప్సితము. అనిచేతులు మోడ్చి నిలుచున్నంత వా రమాకాంతుఁడు "అదియెల్లయునట్లకాఁగలదు." అనియనుగ్రహించి యందలి వారలనుద్దేశించి యిట్లనియెను. ఓవేల్పుపెద్దా! సంతృప్త హృదయుండవై నీలోకంబునకుం బోయి నీసృష్టికార్యములందుఁ బూర్వమట్ల మనసుంచి కర్తవ్యమును నెఱవేర్పుము. పొమ్ము సుఖముండుము. ఓ మహాదేవా! పినాకపాణీ మీరును మీస్థానంబున కేగి భక్తజనపాలనం బొనరించుచు గిరికన్యకతో నిచ్చా విహారంబుల సఫలమనోరథులు కండు. అగస్త్యమునివరా! మీరును మీశిష్యులతో మీ యాశ్రమమున కరిగి మీమీ నిత్యనైమిత్తిక కర్మల సదానుష్ఠానంబుల సుప్రవృత్తులు కండు. ఓ యోగివరులారా మునితల్లజులారా! మీరును మీమీ పవిత్రాశ్రమములకుం దయజేయుఁడు. మీ మీకర్తవ్యంబులఁ దపస్సాధనల నవిచ్ఛిన్నముగఁ గొనసాగింపుడు. ధ్యానామృత రసపానంబునఁ దనివిచెందుఁడు. అన్యోన్య సహకారంబులఁ దనిసి తనియింపుడు. ఓవేలుపు దొరలారా మీమీనెలవులకు జేజే గములతోఁ బోయి నిశ్చింత నుండుడు. ప్రముక్కడి రక్కసులెల్లరుం జక్కాడఁ బడినవారే. మనుజవరులారా! భక్త తల్లజులారా! మీమీనిలయమ్ములకు శాంతి సుఖానందములతోఁ బొండు. నీతి నియమముల, దయాధర్మముల నెల్లరకాదర్శులై తగుమార్గములం ద్రిప్పి మీరుతరించి వారిందరింపఁ జేయుఁడు. ఇట్లని యా వేంకటేశభగవానుఁ డుత్సవంబునకు వచ్చిన యెల్లరఁ బ్రీతిపూర్వకమ్ముగ వీడ్కొలిచ్చి వారి వారి స్థానంబుల కనిపి తానును నట దివ్యవిమానంబున శ్రీదేవితో భూదేవితోఁ జేరినిలిచెను.

# ప్రసూన యజ్ఞ వివరణ

అంతఁ బ్రసూనయజ్ఞమన నేమని శౌనకాదు లడుఁగ సూతుండిట్లనియెను. ఓ మునివరులారా! ప్రతిగురువారమునఁ బవలు మూడుగంటలకు గతదినంబుల దేవునికిం ధరింపంజేసిన వస్త్రాభరణములను దొలగించి సాయంసమయమునఁ గేవలము పుష్పాభరణములతో నావేంకటగిరీశు నలంకరింతురు. ఈ యలంకరణమునే ప్రసూనయజ్ఞమనియందురు. మఱల శుక్రవారమున మధ్యాహ్నమున నాపుష్పాభరణములఁ దీసివైచి మహాభిషేకమొనరింపఁ బడును. ఆనాఁడు ధరింపఁజేసిన వస్త్రాభరణములు మఱలవచ్చు గురువారము దనుక నుండును. ఆనాటి ప్రసూనయజ్ఞమున నవి తొలగింపఁ బడును. ఆనాడు జరుగు ప్రసూనయజ్ఞ దర్శన మత్యధిక పుణ్యప్రదమై తనరారుచుండును.

అంత శౌనకాది మహామునులు రౌమహర్షణిం గాంచి యిట్లనిరి. ఓ సూతభగవానుఁడా! ఎల్లవేద శాస్త్రతత్వ జ్ఞాన సంపన్నా! నానాపురాణాఖ్యా నిష్ణాతా! నీయనుగ్రహంబున నుత్తమోత్తమంబును బరమాశ్చర్యంబునునగు వేంకటగిరి యాఖ్యానంబును నపార ప్రభావాన్వితంబును బరమ పవిత్రంబును బాపనాశంబును నగుదాని నాలింపంగంటిమి. భగవంతునకును నా యద్రిరాజముపై నమితమగు నెనలేని ప్రీతియొప్పి యుండెనుగదా శ్రీ వేంకటేశుఁడును మహాశ్చర్యకరంబులును దివ్యంబులునగు చరిత్రలచే నొప్పువాఁడు. పరమాద్భుతంబు లాతని చరితలు. అట్టివి జగతీతలమున మఱెచ్చటను గన్నవియు విన్నవియుంగావు. ఆ ప్రభుని వింతకథలు విన్నకొలందియు విననుత్సాహమేకాని తనివియే లేకున్నది. ఓ తపోధనా! దేవాదులనెల్ల వీడ్కొల్పి రమాపతి పిదపనేమేమి యొనర్చెను? అట నుండి వెడలి యాదేవాదులు నేమేమిచేసిరి? అనియడిగినంత నాసూతవరుండా మునివరులంగాంచి యాదరంబున నిట్లనెను. ఓ మునితల్లజులారా! దేవదేవుని తరువాతి దివ్యచరిత్రము నాలింపుడు. ఎల్లలోకములకుఁ బితామహుండా బ్రహ్మదేవుఁడు హంసవాహన మధిరోహించి దేవాదులెల్లరుఁ బలువిధములఁ బ్రస్తుతులొనరించుచుండఁ దనసత్యలోకముం గూర్చి వెంటనే బయలుదేరి వెడలిపోయెను. దివ్య విమానంబు నెక్కి గంధర్వాదులు కీర్తించుచుండ సహస్రాక్షుండు పురంధరుఁడు పోయి యమరావతిం జేరెను. ప్రమథగణములతో నందికేశునితోఁ బార్వతీపతి మహాదేవుఁడు వేంకటాద్రికిం బ్రదక్షిణంబు నొనరించుచుఁ దనయునికికిం దగిన పవిత్రోత్తమ స్థానంబునకై నెమకుచు నెమకుచు నావేంకట పర్వతమ్మున కాగ్నేయమునఁ బరమమంగళంబును, లోకపావనంబునునగు పవిత్ర కపిలతీర్థముం గాంచి యదియ తనవాసమునకు రమణీయంబని తలపోసి యందే యుమా రమణితో నెలకొనియుండ నెంచి యప్పటికిఁ దన రజతాచలమునకుం బోయెను.

# పంచమాధ్యాయము

## సుదర్శన పరాక్రమవర్ణనము

శౌనకాది మునివరులు సూతముని తల్లజుంగాంచి యిట్లనిరి. ఓ మునితల్లజా! భగవంతుని యాజ్ఞచే నాచతుర్భుజుని చక్రాయుధము పోయి దుష్టులగు వారినెల్లం జోరుల, దుండుగుల, పాపిజనంబులఁ నాశమొనరించెనని మీరింతకుమున్ను వచించి యుంటిరిగదా. ఆకథయంతయు వివరముగ వినఁ గోరికపడుచున్నారము. అక్కటికపూని యదియంతయుఁ దేటతెల్లముగఁ దెలియంజెప్పుడు.

వారల విన్నయా రౌమహర్షణి వారింగాంచి యిట్లనియెను. ఓ తపోధనులారా! ఆచక్రరాజము యొక్క పరమాద్భుత పరాక్రమ వృత్తాంతమును సంగ్రహముగ వచించుచున్నాడను. మీరెల్లరును సావధానచిత్తులై యాలకింపుడు. ఆ సుదర్శన చక్రము యొక్క యుత్కట పరాక్రమ చరిత్రను వివరముగ వర్ణింపనేరికిని నసంభవము. నేననెంత. ఓ చక్రరాజమా ! నీవు పోయి యాదుష్టులనెల్ల నాశమొనరించిరమ్ము అని మహావీరరూపము నొసంగి పొమ్మన, వేంకటనాథుని, వెన్నుని యాన తలఁదాల్చి మహాద్యుతి సంపన్నమగు నా సుదర్శన రాజము గంధర్వగణసేవితమై బయలుదేరి యా పర్వతశిఖరము నుండి దిగి ముందునకు సాగిపోయెను. ఉద్యతసకలాయుధపాణులై మహాయోధవరు లెందఱో వెంటనంటి పోవుచుండిరి. ముసలముద్గర తోమరములఁబట్టి వీరాలాపంబుల విక్రమించువారును, ప్రాసశూలఖడ్గహస్తులై సింహనాదంబులఁ జెంగలించువారును, పట్టిస ధనుర్బాణంబులఁ బూనివిజృంభించు వారును నింకను నెందఱెందఱో మహావీరులు నాదైత్యారి యాయుధరాజమును సుదర్శనరాజమును వెంటవంటిపోయిరి. రథగజతురఁగ పదాతులు వేలాదిగ బలిసికొలిచిపోవుచుండిరి. భేరీ మృదంగ పటహఢక్కాది వివిధ జయవ్యంజక యుద్ధవాద్యంబులు దిక్కులు ప్రతిధ్వనింప మ్రోగుచుండెను. ఆ వేయంచుల వాలపుడు వీరరాజపురుష రూపముం దాల్చి పలువిధాయుధ సంశోభిత సహస్రబాహులు కలిగియుండెను. ఆ రాజపుడు శిరమునఁ గిరీటము, నురమున హారములు, కరమునఁ గంకణములు, వెలయనొప్పెను. నవరత్న మండిత కేయూర కటకాంగదాది సకలాభరణ భూషితుండై యొప్పియుండెను. వదనము దంష్ట్రాకరాళము, జ్వలదగ్ని సన్నిభప్రభమునైయుండెను. ఏబదిబాహులఁ బ్రవర్తకాస్త్రములు, నేబది బాహులనివర్తకాస్త్రములు, ధరించి యింకను నున్నకరముల భీకరాయుధములు పూని శత్రుభీకరుండై పద్మరాగమణిరంజిత వస్త్రములు ధరించి యనేకానేక తురంగంబులు

పూన్చినరథం బెక్కి తూరుపుదిక్కునకు జయవిజయ ధ్వనులతోఁ బ్రస్థానమొనర్చెను. అప్పుడాద వినయా మహాధ్వనికిఁ బ్రపంచమందలి చరాచరములు భయభీతములై తల్లడిల్లిపోయెను. ఆకాశము పగిలిపోయెనా? పర్వతములు బ్రద్దలాయెనా? యను ననుమాన బాధితులై లోకమున వారెల్లరు హాహాకారములొనర్పసాగిరి.

## సుదర్శను తూరుపుదెస రణ విక్రమము

వేంకటాచలమునకుఁ దూరుపుదిక్కున నెన్నెన్నియో పెద్దపెద్దకొండలు కలవు. ఆ పర్వతారణ్యములందుఁ బెక్కురు బలవంతులు మోసగాండ్రు హింసకులునగు దుష్టులు నివసించుచుండిరి. అసురాంశ సంభూతులై జనపదంబులఁ బెక్కురు మిక్కిలి భయంకరులు, వంచకులునై యెల్లపుడు మారణాయుధములు ధరించి యెల్ల ప్రాణులకు హానికలిగించుచుండిరి. వేదకర్మలవీడి తోడివారింగూడ వేదబాహ్యుల నొనర్చుచు ధనమునే దేవతగ నారాధించుచు ధర్మబాహ్యులై సత్యాహింసలకు దూరులై ప్రవర్తించుచుండిరి. వారికెల్లవిధములఁ దోడ్పడుచు రాక్షసాంశులు నితరజాతులఁ బుట్టిన వారెందఱో నిరంకుశులై యుండిరి. వారెల్ల మానవులకు ధన,మాన,ప్రాణ భంగములొనరించుచు నిరంకుశులై, పాలకులను, వీరులను గూడ లక్ష్యపెట్టక, దొంగలు, దోపిడిగాండ్రునై, హంతకులై తిరుగుచుండిరి. ముఖ్యముగ వారు సాధుసజ్జనుల వెదకి వెదకి పీడించి పీల్చికొని తినుచుండిరి. కాటుకకొండల వలె భయంకరోన్నత దేహములతో, వికృతాకారములతో మేఘగర్జనలఁ బోలు నెలుఁగులతో జనులకు వెఱపు గలిగించుచు నాదుష్టరాక్షసు లాదుర్గమ ఘోరారణ్యముల నెలవుకొనియుండిరి. మఱికొందఱు జనపదముల నుండినవారై మోసంపువృత్తుల జనుల వంచించుచు నాఖిలులకు నెల్లవిధములఁ దోడ్పడుచుండిరి. అడవులనుండి కొండలనుండి జనపదముల నుండి వందలకొలదిగ, వేలకొలఁదిగ దస్యులు వెలువడి గుంపులు గుంపులుగ వచ్చి బయటఁ బల్లెలపై, పత్తనములపైఁ బడి కొల్లగొట్టుచు జనులఁ గ్రూరహింసలఁ బాలు పఱుచుచుండిరి.

ఇట సుదర్శన వీరుని సేనలనుండియుఁ గొందఱు కొందఱు విడివడిపోయి వారలనెదిరించుచుండిరి. అక్కడక్కడ వారికి వీరికి సంకులసమరములు జరుగుచుండెను. అగ్గిని బడు మిడుతలవలె నాదుష్టాసురులు సుదర్శనప్రభుని యుజ్జ్వల సేనాప్రతాపాగ్నులం బడి బూడిదయగుచుండిరి. క్రమక్రమముగ నాదుష్టవవచరులెల్లరు భస్మమైపోయిరి. జనపదములఁ గలిగిన దుష్టులును, దుండుగులును రూపుమాసిరి. వారి వారి వంశముల వారగునెల్ల మాయావులును సమూలముగ నశించిరి. ఆ పర్వతారణ్యములు జన పదములునన్నియు నిష్కంటకములాయెను. పశుపక్షులతోఁ బ్రకృతిశోభనంది విరాజిల్లెను.

వేంకటాచలమునుండి పూర్వసముద్రము దనుక మధ్యనుగల కొండలు పిండిచేయఁబడి సపాటచేయఁబడెను. గ్రామములు, పట్టణములు జనపదములు, నిష్కంటకములై, యెల్లి భయములు, బాధలు, తొలఁగి, సుఖసంపత్తితో నిర్మలానందము నందెను. సాదుసజ్జనులు, మునులు, నెల్లజాతులవారు ముదమున నాప్రభుని సదయుని సంస్తుతించిరి.

అది మొదలుగ నాదేశమున నెల్లప్రజలు సుఖనివాసములు చేయుచుండిరి. ఆసుదర్శన శాసనమునఁ బర్జన్యుఁడు కాలానుకూలముగ సమృద్ధముగ వర్షములు కురియుచుండెను. సశ్యశ్యామలమై భూమి పెక్కురెట్లు ఫలించెను. ఫలవృక్షము లమితముగ ఫలింపసాగెను. గోవులు మహిషములు మధురక్షీరములు కడవలకొలందిగఁ గురియసాగెను. ఎల్లజనులు కృతయుగమునందునట్ల ధర్మవర్తనులై నీరోగులై యాయురారోగ్యముల నొప్పియుండిరి. ఎల్లరును వారివారివృత్తుల సక్రమముగ నాచరించుచుండిరి. వేదవిద్యలు విస్తరించెను. దేశమున దేవబ్రాహ్మణ భక్తి, ప్రజానురక్తి, సేవాసక్తి తిరముకొనెను. క్షాత్రతేజము సంవ్యాప్తమాయెను. వణిగ్జనులు దానధర్మము లొనరించుచు ధర్మచింతనులై వ్యాపారములు సాగించుచుండిరి. కృషకుల కృషిఫలించినది. యోగులు యోగాభ్యాస పరితృప్తులైరి. తపసులు తపోనిరతులైరి. ఇట్లెల్లరు తమతమ ధర్మములఁ దవిలి శాంత జీవితములు నడుపుచుండిరి. దేశమంతయు రాహుముక్తచంద్రునట్లు శోభించుచుండెను. అప్పుడు సుదర్శన ప్రభువు తానొకరమణీ యోన్నత ప్రదేశంబునఁ గొలువుండి ప్రజలనెల్లరఁ జీరి "మీకై నేవింకను నేమిచేయవలసియున్నది? ఉన్నఁజెప్పుడు" అనియడిగెను. అదివిన్న ప్రజలిట్లనిరి. ప్రభూ! ఇంతకుమున్ను మేము దొంగలచేతను, దోపిడిగాండ్రచేతను, మోసగాండ్రచే, దుష్టులగు పాలకులచే నత్యంతము పీడితులమై వెతలందితిమి. ఓ స్వామీ! నేఁడు మీయనుగ్రహమున మాబాధలన్నియుఁ దీరెను. మేమెల్లరముఁ గృతార్థులమైతిమి. ఇట్లనుచున్న వారిని విని సుదర్శన విభుఁడు ఆదేశమునకు, నొకధర్మాత్ముఁడగు పాలకుని నియమించి యాతని నీతినియమ రక్షకుఁడుగాఁ బ్రజా రంజకుఁడుగా నుండుమని, యెల్లర ధర్మమార్గము విడకనడుచుకొనవలసినదని నియమించెను. సుఖసంపదలతోఁ దులదూగుచుఁ బ్రమోదము నందుచుండునదిగ సెలవిచ్చి యాదేశము సురక్షితమొనర్చెను.

## ఆగ్నేయ దిశను సుదర్శనుచే వసురవధ

శేషాద్రికాగ్నేయదిశయందెందటో రాక్షసాంశోద్భవులు క్షత్రియ వంశజులు, దుష్టులును, మాయావులునునై సాధుసజ్జనులను బ్రాహ్మణులను నెల్లమానవులను బలువిధముల బాధించుచుండిరి. దానవాంశలఁ బుట్టినవర్తకజాతుల వారు కచ్చితమనమున నమితముగ లాభములుగుంజుచు నవసర వస్తువులఁ దిండిగింజలఁ గొట్లకెక్కించి

సామాన్య జనులనాకలి చావుల కగ్గమొనరించుచుండిరి. మాటలను బైకేమేమి వెల్లడించినను నిజమునకు వారికిదేవునందు నమ్మకములేదు, పుణ్యమునందాసక్తియు లేదు. ప్రజలం గల భగవంతుని వారు గుర్తింపరు. ధనమే వారికి దైవము, పావనము. వారెల్లం దమకనుకూలముగ దుర్గము లొనరించికొని, తమదుర్వృత్తుల సాగించుచుండిరి. సుదర్శన రాజు సైన్యములతో నేతెంచుట విని యాపాపులు దండులై వివిధశస్త్రాస్త్రములతో వచ్చి యెదిరించిరి. వారికిని వీరికిని దుముల యుద్ధము ఘోరమై జరిగెను. తొండములు తెగిన యేనుగులు, మూపులుతెగిన యొంటెలు, కాళ్లు తునిసిన తురంగములు, తలలువేరైన యోధులునుగలిగి, తునియలైన కాలుసేతులు, చెక్కలైన డొక్కలు, వ్రేలాడుప్రేవులు, పైకివచ్చిన కనుగ్రుడ్లు వెలుపలకు వ్రేలునాలుకలు గలిగి హాహా కారములతో, మూల్గులతో వేదనలతోడి వికటపు టరుపులతో నోడికలు కట్టిన రక్తముతో మాంసఖండములతో నాయుద్ధభూమి భూతప్రేతముల మహానసగృహము వలె నసహ్యమై, బీభత్సమైయుండెను. త్రిపురములం గాల్చుతతి ముక్కంటియట్టుల దుష్టుల దుండగముల విని,కని, కోపోద్రిక్తుండై గడుసుకైదువు జోదు ఒక్కుమ్మడి విజృంభించి సేనలతో నాదుష్టులం గసిమసంగసాగెను. ఇప్పుడె సైన్యముగం బోయి, నిశ్శేషముగ దుష్టరాజుల, సేనలతో, బరివారముతో నాశముచేయుము. జనపదములకుం బురములకుం బోయి వంచక వర్తకజాతులం బరిమార్చుమని ససైన్యుండగు జ్వాలాముఖునకు, సేనానాయకునకు నాజ్ఞ యిడెను.

చక్రరాజముచే నట్లాజ్ఞనందిన యాసేనాపతి మహాబలుండు, జ్వాలాముఖుండు, పగతురనెదిర్చి ఘోరసమరమొనరించి దుష్టశాత్రవ నివహంబుల భిన్నాభిన్నమొనర్చి చెల్లాచెదరొనర్చెను. వనచరుల, చోరుల, దండులు చావగ మిగిలినవారు భయభీతులై యాయుధములు విడిచి యడవులకుం బాఱిపోయి, కొండలకేగి శిఖరంబుల జేరిదాగిరి. కాని యాయడవులం గొండలనెంతవెదకినను నందొక్కడును గానరాలేదు. సుదర్శన సైనికులు ధైర్యసాహసములతో దస్యుమూకలంగనుంగొని పరిమార్చనడవుల, గొండలనెల్లెడల విడివడి వెదుకసాగిరి. వనదుర్గములలోం కొండగుహల, కందరములం, జెట్లపైం బొదలలో నెల్లెడల నంగుళమంగుళముగా వెదకి వెదకి విసిగివేసారిరి. ఎందువను దస్యుమూకల నొక్కనినైనం గనుగొనజాలకపోయిరి. వారి జాడలేమియు వీరి కెఱుకరాలేదు. వారందఱు వచ్చి తమ యసఫలతను, దమసేనానితో మనవి చేసికొనిరి. దుర్జయుండగు నాసేనాని జ్వాలాముఖుం డదియంతయు విని యచ్చెరువంది యిది యాదుష్టుల మాయయని తలంచెను.

అప్పుడ యాతండా దేశమందలి జనసమూహముల, సాధుపక్షములం బిలిచి వారలం దక్షణమె యాతావువీడి వేరొకయెడకేగి యుండంగోరెను. వారును గుటుంబములతో వేరొండు తావునకుం బోయిరి. జ్వాలాముఖుండును భయంకరాగ్నేయాస్త్రము

సమంత్రకముగ దుష్టదానవుల, దస్యులఁ బ్రజాద్రోహుల నెందున్నను వెదకి వెదకి దహింపసంకల్పించి ప్రయోగించెను. తేజోమయమగు నాదివ్యాస్త్రమెంతయుఁ బ్రజ్వరిల్ల మాయెను. అందుండి యగ్నికణములు భగభగమండుచు లేచి నలుదెసలఁ దావరింపసాగెను. ఆతేజమును భరింప రోదసికిని వెక్కసమాయెను. భూతములు తల్లడిల్లి యాక్రోశించెను. అంతలో నామంటలు మాటుమణగి యామాయావులు మాయలంబ్రుంగి యణంగి యున్న తావులందెల్లఁ గొండగుహల, వన, దుర్గముల, వనపదముల, బోయి వ్యాపించి వారలం జుట్టుముట్టి, వారి మాయలమటుమాయు మొనరించి యామాయాతావుల నెల్లవారలతోఁ బాటుగ నీఱుగావించెను. వారలను, వారింజేరియున్న వారలను, నచ్చటి చెట్టుచేమల, జీవజంతువుల నెల్లమండించి బూడిద చేయసాగెను. ఆపాపులు మేనులు వణఁక మనసు మనసునలేకఁ ఆలుబిడ్డలతోఁ బరివారములతో దామున్నతావులు వీడి మాయలు మఱచి వఱచి ప్రాణములందక్కించుకొన జతనము లొనరించిరి. ఎందుఁ బోయినను వీడక వారి నాయస్త్రజ్వాలలు బూడిద బుగ్గి యొనరించెను. అందఱిం గాల్చి యాయస్త్ర రాజము మఱలివచ్చి యమ్ముల పొదివి జేరియుండెను.

అసుర గణదంబు లెల్ల భస్మమైపోగా నాదేశ మందెల్లెడల మేఘములావరించి నిండువర్షములు కురిసిచల్లఁబడెను. నదీనదములు వాపీకూపతటాకములు జలపూర్ణములాయెను. అందుండిపోయిన జనంబులెల్ల సాధుసజ్జనులు, నెల్లజాతుల వారు వచ్చి వారివారి తావులం జేరిరి. మునులు దపసులు వనములఁ జేరి భద్రముగనుండిరి. సేనాపతియుఁ దనవవి నెఱవేర్చి వచ్చి మీ ప్రతాపము వలన దుష్టులెల్లనశించిరి. అంతయు భద్రము అనవిని సుదర్శనుండు నానందించి యాదేశమునకుం బోయి యెల్ల తావులసాధుసజ్జనుల యునికికిఁ దగునట్టు లొనరించి, పురములు, గ్రామములు, రాజమార్గములు బాగుగ నిర్మించి యదియొక సత్యలోకంబ నఁ జేసెను. అందు ధర్మాధ్యక్షుప్రజాను మోదకుఁడొకని పాలకునిగ నొనర్చి ప్రజలనెల్లర ధర్మము తప్పక పాలించి సుఖులనొనర్పఁ గట్టడఁజేసి, సత్యముం ధర్మమున్వీడక ప్రేమైకజీవులుగఁ గలిసి మెలసియుండఁ బ్రజలకెల్ల రకానతిచ్చెను. అటనెల మూఁడువానలు, ననుకూలముగఁ గురియఫలపుష్పములతోఁ బాడిపంటలతో జనులెల్లరు సుఖులైయుండిరి. దేశమంతయు నిత్యకళ్యాణముపచ్చతోరణముగ నుండెను.చతుర్భుజుని చక్రాయుధమైన సుదర్శనుడు ఈ ప్రకారము మరియు దక్షిణదిగ్భాగమును, పశ్చిమ దిశను, ఉత్తర భూభాగమును గలదైత్యులను వారి పంగడి మూకలను దునుమాడి దేశ మకంటక మొనర్చెను.

## జనక నృపవరుడు జానకింగనుట

తొల్లి విదేహదేశమును నిమియనురాజు పాలించెను. ఆతనికుమారుఁడు మిథి. అతనికి విదేహుఁడనియుంబేరు. అతనిపేరుననే యావిషయమునకు విదేహ యనియు, నాతనిపట్టణమునకు మిథియనియుఁ బేరులయ్యెను. దానింబరిపాలించు వారు వైదేహులనియు, మైధిలులనియు బిలువబడుచుండిరి. మిథికి నిరువదొకటవ తరమువాఁడు హ్రస్వరోముఁడు నాబడు రాజచంద్రుడు. అతనికిం గుమారులిరువురు; జనకుఁడు, కుశధ్వజుడనువారు. జనకుఁడు రాజై, ప్రజారంజకుఁడై ప్రజలఁ బాలించుచుండెను. అతఁడు పరమధార్మికుడు, సత్యనిరతుఁడు; సర్వశాస్త్రార్థవేది; కోపవర్జితుడు, నిర్మముఁడు, నిత్యతృప్తుఁడు, నిరహంకారుఁడు, నాత్మజ్ఞానియునై యుండెను.

ఆతఁడొకపుడు దైవత ప్రీతికై జన్న మొండు పొనరింప సంకల్పించి యజ్ఞార్థమై యొకయెడఁ బవిత్రభూమిని నిర్ణయించి దాని తాన సువర్ణమయహలమున దున్నుచుండెను. అంతనొకచోనా నాగేటి కఱ్ఱున వెలువరింపఁబడి, నాగటిచాలుననొక ముద్దులమూటకట్టు పసికందుతోచెను. దానింగన్న యంతన యారాజా చిన్నారిపాపను బట్టి యెత్తి యొడినిడికొని బిడ్డలులేని వాడగుట నీనిసువు నాబిడ్డయని పలికెను. నాగేటిచాలున నుదయించిన దగుట సీత యని పేరుంచెను. జనకునిబిడ్డయగుట జానకియనియుఁ బిలువం బడుచుండెను. ఆమె నానాటికిం బెద్దయై యాయింట బంగరుబొమ్మయై తిరుగుచుండెను. ఆమెకు బిమ్మట నారాజవరునకు నూర్మిళయను నొకకూతురును నల్వురు కుమరులును జనించిరి. ఆతని సోదరుఁడు కుశధ్వజునకు, మాండవి, శ్రుతకీర్తియను నిర్వురుకూతులును ముప్వురుకుమారులుం గలిగిరి.

### శివధనస్సుకథ

ఒకప్పుడు శివునిమామ దక్షుఁడు యజ్ఞంబు నొనరించుచు నల్లునందలిక్రోధమున నారుంబిలువకయుఁ దండ్రియని వచ్చిన శివునర్ధాంగిని, తనతనయను సతి నవమానించుటయ కాక మహేశ్వరుని నిందావాక్యముల నవమానించెను. దాని కామె క్రోధ దుఃఖములు ముప్పిరి గొన నప్పుడ యాజన్నంపు వాటికనే యోగాగ్నిని తనువుం బాసెను. అదివిన్న భూతేశుఁడు ప్రమథులతో వచ్చి యజ్ఞభంగమొనర్చి యందువచ్చిన దేవతలఁ దనచేతి ధనువున బాగుగమర్దించెను. వారును దేవునసేక విధములఁ బ్రార్థించిరి. దానికాదేవుఁడు వారియెడఁ గడుఁ బ్రసన్నుఁడై యాధనువును వారికిచ్చి వెడలిపోయెను. వారును నాధనువును ధర్మాత్ముండును, సజ్జనుండునగు, మిథి కైదవ తరమువాఁడగు

దేవరాతునకిచ్చిరి. నాటినుండియు నాతని వంశమువారావింటిని బూజాగృహమునయుంచి పూజించుచుండిరి. ఆతని వంశమువాఁడగు జనకునింట నాధనువు పూజలనందుచుండెను. లెక్కకు మించిన పెక్కురు బలవంతులు గాని దానిఁగదలింపలేకుండిరి. అది పూజాగృహమున నెచ్చటఁ బెట్టిన దచ్చటనేయుండెను. దానినిటునటు కదల్చువారేలేరై. ఒకనాఁడు బాలికయుగు సీత దేవునింటిని శుభ్రమొనరింపంగోరి తానేతుడుచుచు నెడమ చేత నావింటిం బట్టియెత్తి, దానిక్రిందం దుడిచి శుభ్రమొనర్చి మఱల నాశరాసనము నెప్పటియట్ల యుంచెను. అదికన్న తలిదండ్రులు సంతసము పొందయాయెను. అంతేకాదు, ఆవింటి నెక్కిడువానికి సీతనిచ్చి పెండ్లిచేతునని యాజనక మహారాజు నిశ్చయమొనర్చెను. సీతామతల్లిక యందచందములు, శీలసంపదలు, విన్నరాజకుమారకు లెందఱెందఱో వచ్చి ధనస్సు నెక్కిడంబోయి తమవశముకాక సిగ్గున వెడలిపోయిరి. పెక్కురు రాజులు వింటినెక్కిడఁజాలక జానకినిచ్చి పెండ్లిచేయుమని [illegible] జనకునితో సమరమునకు దిగిరి. జనకభూపాలుఁ డానరపతుల నెల్లగెలిచి తరిమివైచెను. ఒకప్పుడు సాంకాశ్య దేశాధిపుఁడు సుధన్వుఁడనువాఁడు జనకునితో గదనమొనర్చి యోడిపోయెను. జనకుడు తన సోదరు, కుశకేతు నాసాంకాశ్య దేశమునకుం బ్రభువుగ నొనర్చెను. ఇటుల వా సోదరులిరువురు విరుదేశములఁ బ్రజారంజకముగాఁ బాలించుచుండిరి. దేశము లీల శూన్యమాయెనే, సీతకుం బెండ్లియెట్లగునాయని రాజు పరిపరివిధముల దుఃఖింపసాగెను.

ఒకప్పుడు జనక భూపాలుడు అహల్యాగౌతమిపుత్రు, తనకులగురు శతానందుం గాంచి యిట్లనెను. ఓ మహాభాగా, గురువరా! సర్వతత్వ దర్శనా! కుమరితను సీతమగాంచినఁ దలంచిన నెంతయు విచారమగుచున్నది. నేనెవ్వనిసేవింతు? నాయీ పావముంబాపు పావనుండు మహాత్ముండెవ్వండు?ఓ మహాభాగా మహామునివరా! కుమారికిం దగువరుని, సమానోత్తమ వంశోద్భవు నల్లుని కులశీలరూపగుణధను నెట్లు పొందఁగలను? ఎవ్వని, నేదేవు నేపుణ్యచరితు సేవించి కృతార్థుఁడ నగాగలను? నాయాత్మజయూర్మిళ మఱియొకతెకలదు. మఱియు నాతమ్ముడు కుశధ్వజు కుమరితలు మాండవీ శ్రుతకీర్తులుగలరు. ఎల్లరు రూపగుణశీలలు. వివాహ యోగ్యవయస్కలు, సుమనోహరలు. వీరందఱికిం దగువరుల నెమకి పెండ్లిండ్లు చేయవలయుంగదా. విప్రవరా! ఈ చింత చేతనే నామనంబుత్తలమగుచున్నది. ఓ తపోధనా! యోగిపుంగవా! బ్రహ్మసత్తమా! ఆధ్యాత్మవిదులు, లోకముయొక్క పూర్వాపర పరిస్థితులు బాగుగనెఱింగినవారు, మా కులపురోహితులు మీరెల్లవిధముల, నాకిపుడు శరణ్యులు. మీరెల్ల వేదశాస్త్రపురాణజ్ఞులు, మీరు ధర్మవిదులు, దుఃఖితుల దుఃఖమును, సుఖానందధనులయభిమానమును దూరమొనరింపంగల సమర్థులు. సంసార తాపముం బాపంగల మీరె నాకిత్తరింగతి.

మఱియు దేశమునఁ బెక్కురు రాకుమారులు కలరు; సుందర కన్యలం బరిణయమాడ వత్తురు. వారినెల్లనేవిధమున నేకాదని వెడలింతును ? నేనేకాకిని; వృద్ధుఁడను. కుమారులు నల్వురు, అజుఁడు, వివిక్తుడు, వివలుడు, విష్ణు భక్తుఁడుననువారు కలరు. కానివారలు కడుపిన్నలు ; యుద్ధవిద్య యందారితేరినవారుకారు. అట వాతమ్మునికిని విచికిత్సుఁడు, వికర్తనుఁడు ప్రతుర్ధనుఁడు నాముగ్వురు కుమారులు ; చెలుతలు, బాలకులు గలరు. నేనింత వఱకు రాజ్యమును సుఖపాలనమొనరించితిని ప్రజాను మోదన మొనరించితిని. ఇప్పుడొ కాని వంత పొంతచేరినది. మేమా పెద్దల మైతిమి. పుత్రకులా బాలకులు, ఇంట యుక్తవయస్కలు కుమార్తెలు. ఏమిచేయను దోచకున్నది. అన్నిటికిని మీరెగాగిం బోవఁగల సమర్థులు. ఏదేని యుపాయమును యోచింపుడు ; ఈ సంసారసముద్రము నుత్తరింపంగల యుపాయముంగూడ చెప్పి తరింపంజేయుఁడు. మన్వాది నృపసత్తము లేయుపాయమున నీ సంసార సముద్రము తరించిరో, నాకుంజెప్పి తరింపంచేయుఁడు. మనుజుండెవ్వని ధ్యానించి, భక్తిని, ముక్తిని, బొందఁగలఁడో ఆపదల నుత్తరింపఁగలఁడొ యా పరమాత్మునెఱుంగం జెప్పుడు. అనుచున్న జనకనరపాలుంగని శతానందతపోధనుం డిట్లులనియె.

## జనకనృప పరితాపము - శతానందుడు చెప్పిన పురాణేతిహాసము

ఓరాజవరా! మనుజుఁడెవ్వాని శరణముంబొంది భవతాపముల నెల్లందరించి సుఖింపంగలఁడొ, ఆ వరదాయకు, లక్ష్మీమనోనాయకు భగవానుంజెప్పెదనాలింపుము. అద్దేవుంబొందినీవు భవబంధములు పాపి బ్రహ్మానందము నొందితరింపంగలవు.

మున్నునేనొకపతి చంపకారణ్యము నుండి మునిశ్రేష్ఠు వాల్మీకిం దపోధనుం దర్శింపఁ దమసానదీ పవిత్రతటమ్మునకుంబోతిని. ఓరాజవరా ! నారాకకెంతయుం దవి సివవాఁడైయాముని తల్లజుఁడు నాకెదురుగవచ్చెను. ఆశ్రమంబునకుంగొనిపోయి యటనర్ఘ్యపాద్యము లొసంగి యోగ్యంబగు నతిథిపూజలు పొనరించెను. నేవా మునివరునకుఁ బ్రణామంబులొనరించితిని. అచ్చటియామునిశిష్యులు నాకు నమస్కృతు లొనరింపనందికొంటిని. పిమ్మట మాధ్యాహ్నిక క్రియలు సమాప్తిగొనరించి వాల్మీకి మునివరుతోడం భుజియించి యట భరద్వాజాది యితర మునితల్లజులతో, వాల్మీకి మునివరులతోఁజేరికూర్చుండి ముదమందితిని. అటుదేశకాలోచితమ్ములు పెక్కులు సల్లాపములు నడిచెను. పెక్కు తెఱంగులగు ప్రాచీనంపు కథలు పలుకఁబడెను. అన్యోన్య సహవాసముచే, ప్రేమానుభూతిచే మాకెల్లరకు నెంతయు ముదమాయెను.

అంతలో నటకు స్వర్గముననుండి శుద్ధస్ఫటికమట్టి, యొప్పుతనువుతో నారదుండు మహాత్ముండు చేతమహతీవీణను బట్టి మీటుచు హరింగీర్తించుచువచ్చెను. వచ్చిన దేవర్షి వర్యుంజూచి నాతో శిష్యవర్గముతో వాల్మీకిముని యట్టె తనయాసనమున నుండిలేచి ప్రత్యుత్థానం బొనరించెను. నమస్కృతు లొనరించి యెంతయుఁ బ్రీతసంహృష్టమాన సుండాయెను. యథోచితమ్ముగ నతిథిపూజలు కొనసాగించెను. ఓముని దేవా! ఇదే పాద్యము. ఇదేయర్ఘ్య మిదోయాసనము. అనుగ్రహింపుఁడు. భగవాన్ ఇవేరుచ్యములు కందమూలములు, ఫలములు. ప్రతిగ్రహించి యారగింపుఁడు. ఓతపోధనా! చాల దినమ్ములకు మీరిటకు వేంచేసితిరి. ఎంతయు సంతసము. మీకిదే స్వాగతము.

ఇట్లెంతయు సత్కృతుండైనారదుండు సంతుష్టుండై మృగాజినమున సుఖాసీనుం డాయెను. ఫలములనారగించి, శ్రమను బాసినవాఁడాయెను. తదుపరి వాల్మీకిని గని యిట్టులు కుశలములడిగెను. ఓ మునిపుంగవా! త్రివిధమగునీతపమిట నిర్విఘ్నముగఁ గొనసాగుచున్నదికదా! ఈ యాశ్రమమందలి తరులతాకుంజములు సకాలమున సమృద్ధిగఁ బుష్పించి ఫలించుచున్నవే. తపఃక్రియార్థములు కుశలు సమిధలు సులభంబులైయున్నవే? అనవిని వాల్మీకి మునిప్రీతుండై నారదున కిట్లుత్తరమిచ్చెను. ఓముని శ్రేష్ఠా! మీయనుగ్రహమున నంతయుఁ గుశలమే. ఓ కాలవిత్తమా! మా తపమ్ములు త్రివిధమ్ములు నెల్లనిర్విఘ్నముగ నిర్విరామముగ సాగుచునేయున్నవి. మా యాశ్రమమందలి తరు లతాదులు వాసవు నాజ్ఞచే నెల్లవేళల ఫలపుష్పభరితములై యొప్పుచున్నవి. అనవిని నారదుండెంతయుఁ బ్రముదితుఁడాయెను. అంతలో నారదు వాగమనముచేఁ బ్రసన్నచిత్తులగు వనవాసులందలి వారెల్లరునట కుంజేరి నారదు నలుమైపుల మూగి చేతులు మొగిచి నమస్కరించి కూరుచుండిరి.

అంత నారదుననుమతిచే వాల్మీకి బ్రహ్మర్షియట వేరొక మృగాజినముపైఁ గూర్చుండి చేతులు జోడించి, దేవర్షి నారదుంగాంచి యిట్టులడిగెను. ఓ దేవర్షివరా! నారదా! ముల్లోకముల నడువ భూలోకమున సర్వశ్రేష్ఠమగు వైష్ణవ క్షేత్రమెద్ది? బ్రహ్మాది సర్వలోకములనీవు స్వేచ్ఛగఁ దిరుగుచుందువు గదా! ఏ తీర్థమున నెల్ల తీర్థములు సన్నిధానముంబొందియున్నవి? ఏ క్షేత్రవాసుల పుణ్యమనంతము ? శ్రీ భూసహితుండై పురుషోత్తముఁడు విష్ణుభగవానుఁడెటనుండి వినోదించును? త్రైలోక్యపావనమగు నాక్షేత్రమహిమనోదేవమునితిలకా! మాకుంజెప్పంగదే. అన్న వాల్మీకిని విని నారదుం డిట్టులనియెను. బాగుబాగు, ఓముని బ్రహ్మ! నీవెంతయు మేలుగనడిగితివి? ఇది యెల్లరకు నెంతయు హితము కోరియె నీవిట్టులడిగితివి? అది యెంతయు బాగుగనే వచింతును. సమాహిత చిత్తులరై యాలింపుడు. తొల్లి హిమగిరియందుఁ గుమారుచే నిట్టులెయడుగంబడి మహేశ్వరుండెఱింగించె నెయ్యదయ్యదియే నేనిపుడు వచింతును.

తొల్లి స్కందుం డాతురతను దండ్రినిజేరి యిట్లనివచించెను. పితృదేవా! శంకరా, భక్తవశంకరా! నేను దేవాసురసమరంబునఁ దారకాసురు సంహరించి విజయుండనైతిని. కానదాన బ్రహ్మహత్యాపాతకమున నెంతయుఁ బరితప్తుఁ డనగుచున్నాను. ఓతండ్రీ! మీపాదములా శ్రయించితిని. ఏ పవిత్ర పుణ్యతీర్థమున స్నానమొనర్చిన నాకా పాపతాపంబులారునో, తద్దోషజనితము బుబుక్ష తీరునో, పాపపంకిలమ్ము తొలంగునో పెలవిండు. పితృదేవా! దయదలంపుఁడు. ఇవేకై మోడ్పులు. అని దైన్యమునఁబలికి నిలిచిన పుత్రుని ప్రేమాదరంబులం జెంతంగూరు చుండంజేసికొని మృదువాక్కుల నిట్టులనియెను. కుమారా! కార్తికేయా కుతిలపడకుము. నిశ్చలమనమ్మున శ్రీనారాయణ నామమంత్రమును జపింపుము. ఎల్ల తీర్థ స్నానఫలంబు సేకూరి యెల్ల పాపములు నశించును. పవిత్రుఁడవు కాఁగలవు. అది విన్నషడాననుఁడు సుస్థిరమనమ్మున శ్రీమన్నారాయణ మంత్రమును జపియించి, పాపమ్ము తొలంగి, పావనస్నానమ్ము నొనరించి మాతాపితల సాపంక్తింగూరుచుండి, భుజించి సంతృప్తుండాయెను. అంతనాతండు తండ్రిని లోకకళ్యాణకరుం గాంచి యిట్లనెను. తాత! మహాదేవ! తమరునాకు సర్వాఘనాశనము నారాయణ మంత్రము నొసంగితిరి. ఆదేవుండు ఎట్టికర్మాచరణంబుల, నెట్టి పూజల మానవులకుం జేపడును? ఆదేవునెక్కడ నెట్టులు పూజించిన ననుగ్రహించి కానంబడును? దరిసెనంబులఁ దనియించును? ఆ దేవునకుం బ్రియంబులెవ్వి?

అన్నకుమారుంగాంచి, శంకరభగవానుఁడ ష్టమూర్తియిట్టులనెను. ఓ పుత్రకా ! జ్యోతిర్మయు నెవ్వని నిరతము తపోధనులు ఋషిముని తల్లజాలు ధ్యానించి తరింతురో, అపుణ్యస్వరూపు, నచింత్యరూపు నాదిమధ్యాంతరహితు, నాదిదేవు, నతమాదిత్య మండలమున సదన మొనరించికొని యుండు నేకైకరూపు సర్వమున కాదికారణుండు నగు నా దేవుంగూర్చి చెప్పెద నాలింపుము.

పూర్వకాలమున దక్షప్రజాపతి యజ్ఞమొనరించు తఱి నాతనినే సంహరించితిని. తద్దోషమ్మున నాతనిశిరమ్ము నాహస్తతలమున నంటి కొనిపోయెను. నేనును బ్రహ్మహత్యా పాతకమ్మున నలుమంబడితిని. నేనా కపాలము నట్టె పట్టికొని జితేంద్రియుండనై స్వర్గమున నియతమతి భిక్షనుగొనుచుఁ దిరుగులాడితిని. కాని వాకట నాపాపము మండి యేమియు విముక్తి చేపడదాయెను. దాననే మేరుగిరికింబోయియట బ్రహ్మసరస్తీరమ్మున నాబ్రహ్మహత్యాపాపమును బాపికొన నియమనిష్ఠల నుగ్రతపం బాచరింప సాగితిని. అట బ్రహ్మసరమ్మునఁదానమాడ వచ్చిన బ్రహ్మనన్నుంగాంచెను. నేమ నాచతురావమంగాంచి

నమస్కరించి, యాతని యెదుటనట్టె నిలిచితిని. కపాలహస్తునన్నుంగనుగొని యాతండీ యేమని నన్నుంబ్రశ్నించెను. దానికి నేను తొల్లిటి నాకత యంతము వాతనికి నివేదించితిని. ఓ పరమేష్ఠీ నేనేమి చెప్పుదును? నేనాదక్షుశిరమును ఖండించితిని కావున ప్రజాపతి దక్షుండు నాకిట్టి శాపంబునొసంగెను. నాకాబ్రహ్మహత్యాదోషంబంటుకొని వెన్నాడు చున్నది. ఎట్టి కర్మల నేనీపాపముంబాయుదు నో యవ్వియేమియు నాకుం గానరాకున్నవి. దైవవశమున నేడిట నాకు మీదర్శన మాయెను. ఓ తాతా! నేనాశాపమునుండి విముక్తుఁడను గాగలయుపాయమును వచింపుడు. ఇట్లు నేవడిగిన నాలించి పితామహుం డల్లన ననుం గనుంగొని యిట్లనియెను. ఓమహాదేవా! దానికై మీరేమియుఁ బరితపింపకుఁడు. ఆపాపమునుండి విముక్తినొందంగ యుపాయము నేను మీకు వచింపంగలను. సావధానులై యాలింపుఁడు.

సాంబశివా! తొల్లి గంగాయమునా సంగమస్థానమ్మున మూఁడు వందల ధనువుల విస్తీర్ణముగల "మాధవము" అను పేరుగల పుణ్యస్థలమున నేను రమాధవుని ప్రీతి కొఱకై పెక్కులు జన్నంబులు పొనరించితిని. అంత భక్తవత్సలుఁడు, దామోదరుఁడు, భగవానుడు పుండరీకాక్షుఁడు నలుబుజముల శంఖచక్రగదా పద్మమ్ములంబూని యురమున శ్రీవత్సమొప్పుచుండ యజ్ఞవేదికను కనువిందుగ దరిసెనంబిచ్చెను. దేవుం గాంచినంతన ప్రణామమొనరించి ప్రస్తుతులు, నుతులు, నతులు నొనరించి, దేవ! ప్రసన్నుండవు కమ్మని యెఱిగితిని. నావినతులాలించి ప్రసన్నుండై యంబుజాక్షుం డిట్లులనియెను. కమలాసనా! నీ యొనర్చిన యీక్రతువులచే నేనెంతయుఁ బ్రసన్నుఁడ నైతిని. నీ వెంతయు నుత్తమోత్తమంబులగు సవనమ్ములొనర్చితివి. నీయందు నాకెంతయుననుగ్రహమాయెను. నీవిటనొనర్చిన పవిత్రయాగముల కారణమున నీక్షేత్ర మింతటి నుండి ప్రయాగ మనఁబడును. నేనీ పవిత్ర వేదికయందు దెల్లవేళలఁ జేరి యుందును. ఇంతటి నుండి యెల్లమానవులు నెవ్వరుగాని పురుషులుగాని యిటకు వచ్చినన్ను భక్తియుక్తుల దర్శించువారు, తమపూర్వకృత పాపములన్నింటింబాసి పవిత్రులు కాఁగలరు. ఇట్లు శ్రీనివాసుఁడు భగవానుఁడు, నాకభీష్టవరంబులొసంగి, లక్ష్మీసహితుండై యట నివాసము పొనరించుచుండెను. మీరా పుణ్యక్షేత్రమునకుంబొండు. అచ్చటకుం బోయినంతనె మీరీ హత్యాదోషముంబాసి పవిత్రులుకాఁగలరు. నాతోనిట్లుపలికి బమ్మదేవర సత్యలోకమునకుంజనియెను. నేనును పితామహుచే వరముంబొంది ప్రసన్నచిత్తమున నాపవిత్ర ప్రయాగ క్షేత్రమునకుం బోయితిని. దానిం బ్రవేశించినంతనే నాపాపమునన్ను వీడి దూరమైపోయెను. నేఁ బ్రయాగక్షేత్రమున కింకను నైదుక్రోసుల దూరమున నుండగనే నాపాపంబు పాపి పోయెను. చేతినుండి కపాలమట్టె భూమింబడెను.

అత్యతిశాయనంబెంతయుఁ బ్రసన్నమాయెను. అటు పిమ్మటఁ బ్రయాగ కుంజని స్నానంబులొనరించి, కమలాపతిందర్శించితిని. దేవుంగాంచి, భగవంతుఁడా! నేఁడు నీక్షేత్రమును నాకొసంగుమాయని యర్థించితిని. అంతభగవానుడును నట్లనె యని యాక్షేత్రమును నాకొసఁగి యాదరభావమునఁగనుచు "నీవిచటం దప మొనరింపుము" అనుచు నిందిరాయుతుఁడై భగవానుఁడు తనలోకమునకు వెడలిపోయెను. ఓ పుత్రవరా! కుమారా! అచ్చట నేనెంతయుఁదపమొనర్చి, బ్రహ్మహత్యాదోషము నుండి పరిపూర్తిగ విముక్తి నందియానందమందితిని. అచ్చటనె విహరించుచు నేను పద్మాలయా సహాయు, సర్వాతిశయ సుందరు, పీతాంబరధరు, పద్మహస్తు, పద్మపాదు, పద్మాసను, పద్మనేత్రు. దేవదేవునసంతు, బూజించుచు నివసించుచున్నవాఁడను.

## శంకర భగవానుడు కుమారునకుం జెప్పిన వృషశైల గాథ

శ్రీశంకరభగవాను నియాతత్వదర్శీ, పాపహారీ, మంగళకారీ వచనములు విని స్కందుఁడు మిగుల ప్రసన్నచిత్తుడై, తండ్రితో నిట్లులనియెను. ఓపితృదేవా! మీరు వాయందను గ్రహించి నాతపంబొనరించుటకు ననుకూలంబగు స్థానమును, ఎచ్చట నాతపమున కేవిధమగు, విఘ్నబాధయుఁ గలుగఁబోదో యట్టి దాని వచింపుడు. భవదుఃఖ వినాశకా! శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వముల నెల్లపుడొక రీతిగనుండు నానందస్వరూపా! యోగీంద్రవంద్య చరణా! సర్వలోక దుఃఖాపహా! యను గ్రహించుము. మీయాన నెల్ల విధములఁ బావింతును. నాతపంబునకు సర్వశ్రేష్ఠ వైష్ణవక్షేత్రమును పెలవిండు. అన్నపుత్రునిస్కందుంగనుంగొని శంకరభగవానుఁడు ప్రసన్నమతియటు పర్వత సుతనుగాంచి యంతన సుతుంగనుంగొని యిట్లులనియెను. పుత్రకా! దేవతలయు దుఃఖనాశముంపొనరించు నోకార్తికేయా! ఎక్కడ నీతపమునకేవిధమగు విఘ్నములుం గలుగవో యట్టి పవిత్రస్థానమును బలుకుచున్నాఁడను మననుంచి యాలింపుము. సావధానుఁడవుకమ్ము. తనయా! వృషపర్వత నామంబొండుమహోన్నతము కలదు. అచ్చటఁ దొల్లివృషనాముండు ఘోరతపమ్మొనరించి దేవుంబరితృప్తుంజేసెను. దాన నేయది వృషశైలంబనఁబరఁగెను. అటఁ దపమ్మొనరింపఁ బొమ్ము నీతపమున కేవిధవిధమగు వంకట మటఁ గలుగదు. శీఘ్రముగ నటకు నీ మయూర వాహనమునెక్కి పొమ్ము తపమ్మొనరింపుము.

అట్లన్న పితృదేవు నాలించిన కార్తికేయుఁడు పితృదేవుంగాంచి మఱలనిట్లనియెను. మమ్ముకన్నయ్యా! మీరానతిచ్చిన యావృషపర్వతమెచ్చట? అదేమేనికుల శైలమా? మహాతపస్వి వృషుండెవ్వండు? అతఁడట నెందులకై యట్టి యుగ్రతపం బొనర్చెను?

వృషరూపునొందిన ధర్మదేవతమా? కాకయట్టి నామంబుననెవ్వండేనిమనువా? ఓ నీలలోహితా పుత్రవత్సలా! ఆతండెవ్వఁడో నాకుఁబాగుగఁ దెలియఁజెప్పుడు. అన్న సురసేనానింగని వృషధ్వజుండు శంకరభగవానుం డిట్లనియెను. నాయనా! కుమారా అద్ది కులాచలముకాదు; మేరునగతనయుండు. ఆవృషశైలము అంజనాద్రియను పేరునముల్లోకముల నెంతయుఁ బ్రసిద్ధమైయుండెను. అద్ది బంగరుగని అందలి శిఖరమ్ములు పలుతెఱంగుల రతనములతో నిండి యున్నవి. వాయువునకును ననంతునకును వాదవివాదమ్ములు పెంపొందిన తఱి విష్ణు భగవానుఁడు దానిని దేశముల దక్షిణదిశ నుండఁ జేయుటకుం దొలుత నాయానందాద్రి స్వర్గమున నుండెను. అద్దియెల్ల తీర్థములకును స్థానమై పవిత్రము, పావనము, పుణ్యపరిపూర్ణమునై మనుజులకు నత్యంతము దుర్లభమునైయుండెను. భగవంతుఁడు మనుజుల ననుగ్రహించి యాగిరివరమును నటభువిని దక్షిణమునకుంబోయి యుండుమని యాదేశించెను. దేవునాజ్ఞవిని యది వల్లెయనియు. బిత్రుదేవుని మేరుగిరివరు ననుమతికై ప్రతీక్షించుచుఁ దండ్రి యందలి ప్రేమకతమున నట్టెవిడువఁజాలక కొన్ని దినమ్ములచటనెయుండి పోయెను. అటుపిమ్మట ప్రపంచమును దద్దరిల్లఁజేయు నాశేషవాయుల, సంవాదమున, బెనుగులాట యందాశైలరాజము తండ్రియగు మేరునగము ననుమతింగొనగా దక్షిణదిశకుంజేర్పంబడెను. బిడ్డా! ఆ శైలము పూర్వాబ్ధికింబడమటిదెస నైదుయోజనముల దూరముననను, దక్షిణ సముద్రమునకుత్తరంపు దెసను ముప్పది యోజనముల దూరమువను, సుందర సురమ్య సువర్ణ నదీతీరమునకు రెండున్నర కోసుల దూరమున, నుత్తరపు దిక్కునను, హరిచందనాది వనమండితము, రమ్యతమము, నానాపాదప మండితము, నైయలరారుచుండెను.

అట నిరంతరము సిద్ధులు, మునివరులు, తపము లొనరించుచుందురు. శుకదేవాదిమునివరులు, భృగ్వాది తపోధనులు, ప్రహ్లాద ప్రముఖులు పుణ్యధనులు, వంబరీషాదులు పాలకోత్తములు, నాపర్వతరాజమును, విష్ణుదేవుని మఱియొక రూపముగ నెన్నువారై దానిం బాదములంద్రొక్కి యెక్కుటకు నిచ్ఛగించనివారై దానికిం బరిసర ప్రాంతమ్ములనె వసించుచు ఆకొండ నుండి వెలువడుచున్న, వెల్లువల, వాగుల స్నానమ్ము లొనరించి, తర్పణంబులొసంగుచు, దేవునర్చించుచుఁ దపములొనరించుచు దేవదేవు సాక్షాత్కారమునుబొంద నభిలషించుచుందురు. ఇట్టిదా పవిత్ర పర్వతరాజము.

ఆ పర్వత శిఖరముంగాంచినంతనె యెల్ల పాపములుతొలంగి, మానవులు పావనులగుదురు. అచ్చటనె సనాతనుఁడు భగవానుఁడు వరాహరూపుఁడు నెలవుకొని యున్నవాఁడు. తనచే నుద్ధరింపఁబడిన భూదేవి నొడినుంచికొని లాలించుటకు నెల్లకాలము ఋషిముని తల్లజాలచే శ్రద్ధాభక్తులఁ బూజింపఁబడు చుండును. అదికారణముగ నది

పుణ్యవరాహక్షేత్రమనియుఁ బేరందియున్నది. ఆ పవిత్ర వరాహక్షేత్రమున నాభూవరాహ దేవు సన్నిధిని శాస్త్రోక్తరీతిని, శ్రద్ధా భక్తులతో జితాత్ములు, నియతాత్ములునై, యుత్తమ వరాహ మంత్రమును నిరంతరము లేక నలుబదిరోజులు విడువక జపించు వారలెల్లకోర్కులు పొంది సంసిద్ధి నంది ప్రమోదింతురు. నిర్మలమతి భగవంతునాది వరాహుం దలంచుచు నెల్లరందున భగవానుం గాంచుచు షోడశదానంబులొసంగుచో వారికి భక్తవత్సలుఁడు భగవానుఁడు చిరకాలము భోగములనొసంగి తనియించును. ఏకోర్కులు లేక యెల్ల ఫలములా భగవంతునివిగా నెంచుచు దేవదేవు నాదివరాహుం దలంచుచు నెల్ల కర్తవ్య కర్మలు భగవత్కార్యములుగా నియమ నిష్ఠల పొనర్చువారికి ఇహ సుఖములు కలుగుటయేకాక పరమ పదము, మోక్ష సంప్రాప్తి కలుగంగలదు.

ఆదేవాదిదేవు నాదివరాహదేవు నిలయమ్మున కెట్టయెదుటఁ ద్రిలోకములను బవిత్ర మొనరింపంగల స్వామిపుష్కరిణి యుత్తమ సరోవరముకలదు. ముల్లోకములం గల పాపములు హరింపంగల పుణ్యతీర్థములెల్లఁ దమ పాపములంబాపి కొననట కరుదెంచి యాపుణ్యపుష్కరిణిని స్నానమ్మొనరించి పావనమ్ములగును. అట్టి యా స్వామి పుష్కరిణి మునుకలిడిన యెవ్వారుగాని పావనులైముక్తి నందఁగలరు.

వైవస్వతమనువు రాజ్యపాలన మొనరించు నాకాలమున ధర్ముండను వాతఁడీగిరి వరమ్మున నియమనిష్ఠల ఘోరతపమ్మొనరించెను. ఆతండు వృషుండనియుఁ బిలువఁ బడుచుండు. ఆధర్ముండు తపమ్మొనరించు నాకాలమ్మున లోకమ్మున ధర్మంబెంతయుఁ బెంపొందెను. కారణమాతఁడు కోరికలులేక, స్వార్థము వీడిలోక కళ్యాణమునకై యాతపము కొనసాగించెను. దానెంతయుఁ బ్రసన్నుండై భగవంతుఁ డాదివరాహమూర్తి భూమాతాయుతుండై ధర్మునియెదుటకు వచ్చి శరదభ్రమట్లు తోచుచు నిట్లులనియెను. ఓయీధర్మా! నీవిటనెంతయు మహోద్భుత తపంబొనరించితివి. దానలోకమునందును ధర్మాభివృద్ధియు నెంతయు నాయెను. కావున నీగనరాజము వృషశైలంబని నీపేరం బిలువంబడును. యమునకుం బిమ్మట నీవులోకపాలకుండవు, ధర్మరక్షకుఁడవు కాఁగలవు. అనుచు నావరాహదేవుం డంతర్ధాన మొందెను. వృషుండును వరముంబొంది తన స్థానంబునకుంబోయి యోగియై నియతజీవనుడాయెను.

ఓ మహాభాగా! మయూరవాహనా! అత్తఱి నాయద్రి రాజమున శ్రీభూసహితు, నీలకమలాభు దేవాధిదేవు, చతుర్భుజు, శార్ఙనందకధరు భగవంతు జగన్నాథుం బ్రత్యక్షుంజేసికొన దివ్య దర్శనముంబొంద, సర్వ ప్రాణాధారుఁడు, సమీరుఁడు, వాయుదేవుఁ డక్షమాలను బూని తారక మంత్రము జపించుచుఁ దపంబొనరించు చుండెను. విధి విధానమ్మున భక్తి యుక్తులై బ్రహ్మాదులును నెవ్వని దర్శింపఁ దపింతురో

యా సర్వాంతర్యామిని, పరమాత్మను, పరంధాము దర్శింపంగోరి, పూజించి తనియుచు నాప్రాణుడు వాయుదేవుఁడు తప మ్మొనరించుచుండెను.

తండ్రిగారిచే నిట్టులు చెప్పంబడిన పిమ్మట కార్తికేయుఁడు పితృదేవునింగాంచి మఱియు నిట్టులనియెను. ఓ పితృదేవరా ! వైష్ణవ మంత్రంబుల నుత్తమోత్తమమును, శ్రేష్ఠవరదాయకమును, భగవద్దర్శనము నొసంగుదాని నొసంగి దీక్షితు నొనర్పుఁడు అని తన్నడుగుచున్న పుత్రవరుంగాంచి యాశుండు, శంకరభగవానుఁడు విధి పూర్వకముగ తారకమంత్రము నుపదేశించి కుమారును దీక్షితునొనరించెను.

పితృవరుచే మహాదేవునిచే నట్లు తారకమంత్రమును బొంది కార్తికేయుఁ డెంతయుఁ [illegible]న్నుండాయెను. వినమ్రభావమునఁ దండ్రికిం దల్లికిన్నమస్కరించి ప్రదక్షిణ లొనరించెను. అప్పుడెవారి యనుమతింబొంది శిఖివాహనము నధిష్ఠించి దేవసేనాపతి వేంకటాచలమునకు వెడలెను. అమరనాయకుడు మహాత్ముఁడు స్వామి ఆంబికేయుడు వేంకట నగమ్మునకుం బయనమై పోవుచుంట కాంచి యింద్రాది దేవతలును ఆ వెను వెనుకనే పోసాగిరి. తొందర తొందరగఁ బోవు నెమలి వాహనముతో, వెంటవచ్చు, సురగణమ్ములతో బోవుచునాకార్తికేయుఁడు పెక్కులు నదులతో, ఝుష్కరిణులతోఁగూడి యున్న యాపర్వతరాజమును జేరి కాంచెను. మార్గాయాసమునెల్ల దూరమొనర్చుచున్న యానగవరమున దేవవరులతోఁ గూడ నొకింత విశ్రాంతిగ నువవశించెను. తలిదండ్రుల విడిచి వచ్చిన యాశరజన్ముఁడు మదినెంతయు విషణ్ణుఁడాయెను. అదిగన్న దేవగురుఁడతనితో నిట్లు చెప్పఁదొడఁగెను.

## సుదర్శన చక్రాంశోద్భవ కాలచక్ర చరితము

విల్లమ్ములు ధరించి శక్తిధరుఁడై బంగారు వర్ణమునఁదేజోవంతుఁడై యొప్పు స్కందుండు తపమొనరింప వృషభాచలమునకు దేవసేనతోఁ గూడిపోయిన పిమ్మట, భక్తి వినమ్రయుఁ బుత్రప్రేమచేఁ బ్రేరితయున్నై పార్వతి భవానీదేవి చంద్రరేఖా ధరుని శంకరునిగాంచి యిట్టులడిగెను. ఓ ముక్కంటిదేవరా! నాబాలకుఁడు చిఱుత; యక్కడ కుంబోయెఁ గదా! అటనేమిచేయంగలవాఁడు? బమ్మకుంగూడఁ గానరాని యా పరబ్రహ్మను బరమాత్మును వాచిన్నారి కుమరుండెట్టులు కాంచంగలాడు ? ఇట్టులంబిక, మంచుకొండరాచూలి తన్నడిగినంత నాతోలు తాలుపు మిత్తిగొంగ పరిహసించుచు నాయమ్మ కిట్టులనియెను. ఓదేవీ! ఇదియెంతయు గోప్యమే యైనను నీకునేఁ జెప్పుచున్నాను. ఆ కొండనెత్తమ్మున, పావన స్థానమ్మున నెల్ల బ్రహ్మర్షులును బరబ్రహ్మను గాంచను, బరమపదమునొందను నుత్తమతపమొనరింపను బోయియుందురు.

అంతియకాదు. దేవవరులు, ఋషివరులు, నరులు యక్షరాక్షస గంధర్వ కిన్నరులు సిద్ధసాధ్య గరుడోరగులు నాదిగనెల్లరును సనాతన నఖిలేశు నఖిల బ్రహ్మాండనాయకు బరమాత్ముఁ బ్రత్యక్షముగఁ గాంచను బరమ పదమునందను నటకుంబోయి తపమ్ము నాచరింతురు. అందుఁ గొందఱు నన్నర్చింతురు. మఱికొందఱు మహాత్ముని స్కందుని బూజింప నొకకొందఱింద్రు నర్చింతురు. అట్టువారలకెల్లరకును మేమెంత సులభ్యుల మయ్యే యుందుము. ఇదియంతయు నాదివ్య భూధర వృషభాచల మాహాత్మ్యమేయని యెఱుంగుము.

వేంకటాచలమ్మను నాపుణ్యపర్వతమ్మున బ్రహ్మతత్త్వము శ్రీమన్నారాయణుఁడు ప్రకటితమై యెప్పియుండెను. అట్లా బ్రహ్మతత్త్వమట నావిర్భవింపంగోరి పెక్కురు దేవతలు మహర్షులు, నట్లనె మేమును నటకుంబోయి మించిన నిష్ఠ నుద్ధరమగు తపము నొనరించితిమి. ఆ కాలముననె నా నియోగమునకుం గడుంగడు దుఃఖించి కాల నామక చక్రము నన్నుంబొంద మహత్తర తపము నొనరించెను.

ఆ చక్రము విష్ణుదేవు నాజ్ఞచేఁబోయి చక్రతీర్థమున వసించెను. అను శంకరు పల్కులాలించినంతనె వింత నొందిన మనమ్మున నీశ్వరి మహేశ్వరుంగనియిట్లనెను. ఓ భూతేశ్వరా! మీరు విష్ణు చక్రముంగూర్చి యెంతయు వింతలగు పలుకులు పలికియున్నారు. ఆ పవిత్ర చక్రమెప్పుడా విష్ణుదేవుకరంబుననె యుండు నదికదా? అద్దిమిమ్ము నెడఁబాయుట యేమి? మిమ్ముంబొందఁ దపమాచరించుటయేమి? అద్దానికిని మీకును, మీయిర్వురంగలుగు గాఢ స్నేహమ్మది యెట్టిది. ఈ వింతలవింత విషయమును నాకు విశదముగఁ దెలియంబలుకుఁడు అనునంబిక నాలించి, లోక శంకరుడు, భక్తవశంకరుఁడు శంభుఁ డాజగదంబిక కిట్లనియెను. ఓమృడానీ, చండికా! నీవన్నపలుకులునిక్కమే. అద్ది సుదర్శనాఖ్యము చక్రమనాదినిధనము, దివ్య మప్రమేయ పరాక్రమము, కోటి సూర్య సమప్రభము, వేవేలుధారలు గలయద్ది విష్ణుదేవునిదే. ఆసుదర్శన చక్రమును ధరింపఁ బుండరీకాక్షుండు పురుషోత్తముండె సమర్థుండు. అద్ది యాతనికే కాక మఱెవ్వరికి నేమియు వశముకాదు. ఓశర్వాణీ! ఒకప్పుడా దివ్య చక్రము అభిచారిక కృత్యను నాశమొనరించుటకొఱకున్నె, ఆకృత్య తావుచేపికొని యుంట దివ్యపురివి వారణాసిని కాశికానగరమును ఆ యభిచారిక కృత్యతోగూడ దగ్ధమొనరించెను. తదనంతరము, కొంత కాలము గడచిన పిమ్మటఁ దన్నుందరిసిన నన్నుంగాంచి, జనార్దనుఁడు పురుషోత్తముండెంతయు ననుగ్రహించి, నీవేమి కోరిక నడుమంటివి? నీకోరికయేమి? చెప్పుము నేనిప్పుడె నీకోరిన దాన నీ కొసంగెదనెను. ఆ దేవుడట్లు పలికినంత నాహృషీకేశుంగని నేనీ యుత్తమవరముం గోరితిని. ఓహరీ, మురహరీ,

అత్యుత్తమ వారణాసీ నగరమును సుదర్శనచక్రము కాల్చి బుగ్గియొనర్చెను. కావున నో చక్రధరా! వైకుంఠవాసా! శ్రీనివాసా! నాయందనుగ్రహముంబొందిన వాఁడనైతి యాచక్రమును నాయధీనమొనర్పుము. నాకు మీరిచ్చు వరమియ్యదియె, అన్యంబులే వరదానమ్ములనే కోరునవిలేవు. అనుచునిట్లు నే కోరినంతమధుసూదనుం డింతఁ నవ్వి తనచేత నాచేతి నట్టె పట్టిని మురుచువల్లన నిట్లనియెను. ఓ పశుపతీ! సిరియును, కౌస్తుభంబును, చక్రమును కౌమోదకీశార్ఙ్గాదులివి నన్నునెట్లు వీడియుండఁగలవు? అవి నిత్య సిద్ధములు, ననాద్యంతములు. అవ్వి మఱియేరివద్దను, నేరియాశ్రయమునను మనజాల లేనివి, ఓ ప్రమథాధిపా! యత్యంతము నశక్యమును, వరమును నీవు కోరినాడవు. కాని నాచనమెన్నడు నబద్ధము కాఁజాలదు. కావున నీకోరిన వరమది యట్టులె నీకుంబ్రాప్తమగుగావుత. కారణాంతరమున ముందు ముందీచక్రాంశమొండు బ్రహ్మనిర్మితమై యవతరింపంగలదు. అది యట్టులె చేరి నీవద్దనె వేయిదివ్య వర్షములుండఁగలదు. ఆ మీదనది నిన్ను విడిచి వచ్చి తన పూర్ణరూపమునం గలియఁ గలదు. ఇట్టులాదేవుండు నన్ననుగ్రహించెను. ఓ దేవీ వేవేలు సూర్యులకాంతుల మొత్తమట్టికాంతులు గల్గిన యాసుదర్శన చక్రాంశము బ్రహ్మచేఁ గైకొనంబడి వినిర్మితమై విష్ణు భగవానుని వరదానకారణమున నన్నుంజేరినది. అద్ది చిరకాలము కాల చక్రమను పేర పొప్పుచునాచే ధరింపంబడినది. ఆ మీఁదట దేవతల రక్షణకొఱకుఁదొల్లిటి కాలమున నత్రిపురాసుర సంహార సమయమున దానిచే నసురనాశన మొనర్పంబడినది. ఓ పార్వతీ ఆమీఁదటను చాలకాలము నాచేధరింపఁబడిన దైమంత్రోపదిష్టమయిన దాని విష్ణుభగవానునకొసంగి వేసితిని, కావున నానుండి వేరుచేయఁబడిన యాకాలచక్రము నాకై, నన్నెడఁబాయంజాలక యట వేంకటగిరిని హరింగూర్చి చిరకాలము ఘోరమగుతపమ్ము నాచరించెను. భగవానుఁడు శ్రీహరి ప్రసన్నమూర్తి దానింగాంచి యనుగ్రహించి చక్రతీర్థంబునంజేరి వసింపుమనియు, భక్తవరుల ననుగ్రహింపుమనియు నాదేశించెను.

## చక్రతీర్థచరిత్రము

ఇంతయు విన్నవిమ్మట గౌరీమతల్లి ప్రసన్నమతి శంకరు భక్తవశంకరుంగాంచి యిట్టులనియెను. నాథా! లోకాధినాథా! మీరలిప్పుడే చక్రతీర్థముంగూర్చి పల్కితిరే. అద్దియెట్టిది; ఎచ్చటనున్నది? దాని మాహాత్మ్యమెట్టిది? నాకుంగనికరించి విస్తార పూర్వకముగ వివరింపరేయన్న నాయంబం గాంచి సాంబుడిట్టులనియెను.

అగునగు నోదేవీ! సావధానమ్మున నాలింపుము. ఆటవృషపర్వతమ్మున దక్షిణ భాగమ్మున పెక్కు సెలయేళ్లు ప్రవహించుచున్నవి. అందచ్చటచ్చట మహాత్ములిమ్మగ

వొనర్చికొని తపమ్ము లాచరించుకొనుచున్న నా(శమములునున్నవి. ఆయా(శమముల వంటియె కొన్ని కొన్ని పవిత్ర పుణ్యతీర్థములున్నవి. అందునఁబవిత్ర వజ్రతీర్థమునకుం గ్రిందుగ బిమ్మటఁగపిలముని వరునిర్గమద్వారబిలంబున నుండి వెలువడిన పవిత్ర చక్రతీర్థము దనరారును. తత్తీరమునసే కాలచక్రము తపమ్మొనర్చినది. అందున స్నానమొనర్చిన మానవుల యెల్ల పాపములు మొదలంట నాశమొందంగలవు. అద్దియె పరమ పవిత్ర విష్ణు క్షేత్రము, పుణ్యప్రదము. అన్నపతి దేవుంగాంచి భక్తిశీల పార్వతీమాత మఱల నిట్టులడిగెను. ఓనామనోనాథా! పశుపతీ మీరలు చక్రతీర్థంబున కుంబైన వజ్రతీర్థము వెలయుచున్నదని వచించి యున్నారు. ఆపుణ్యసరోవరమునకు వజ్ర తీర్థంబను నాపేరెట్టులొదవినది? తన్మాహాత్మ్యంబేమి? అన్న నాజగన్మాతకు హైమవతి కుమకు మహేశ్వరుండిట్టులని చెప్పందొడంగెను.

## ఇంద్రుండు సహస్రాక్షుండగుట

తొల్లి స్వర్గాధిపుఁ డమరేంద్రుఁడింద్రుఁడు గౌతము నిల్లాలిని, పవిత్రను పుణ్యమతిని నహల్యంగాంచి కామపీడితుఁడై గౌతమ మహర్షి యా(శమంబునలేని తరుణమున గౌతము రూపముంబూని యాయమను మోసమ్మొనరించి యుపభోగింపం బోయెను. అదియెఱింగిన గౌతముఁడా దుష్టమతింగాంచి, కోపించి, పాపీ! యోనికై యాశించి ధర్మముంబాసి చరించిన పాపివి కాన నీవొడలెల్లనిండుగ వేయి యోనులు గలవాఁడవు కమ్ము, పొమ్ము, అని శపించెను. మునివరునోట నాపలుకులు వెలువడినంతనె యామఘవు నొడలియందంతట యోనులుత్పన్నములై యసహ్యములై తోచెను. అదిగని తనరూపునకుందానే యేవగించుకొని యాయహల్యాజారుఁడు దుఃఖపరితప్తుఁడై యేనెంతయు మహాపాపమొనర్చితిని. దానికిదియ ఫలము. నేనిప్పుడీరూపున నెక్కడికెట్టులు పోఁగలాడను? అనుచు వగచివగచి యప్పుడెయట నుండి బ్రహ్మ సరమ్మున కుందొందరగఁ బోయి యటజలములఁ బద్మనాళములకునడుమనక్కి, యణఁగి మణఁగి పడియుండెను.

నామేఢ్రముల బాధనానాటికి క్షణక్షణము నెక్కుడగుచుమండఁ దట్టుకొనఁ జాలక, నావింభరింపలేని వాడాయెను. వానిందొలగించు కొన, నాశము పొనరింప, మపాయము వెదుకసాగెను. ఈలింగబాధనుండి తప్పించుకొనుట కుపాయమేమాయని, పరిపరి విధములఁ జింతింపసాగెను. కడకుఁదపమొనరించి యాబాధనుండి ముక్తుఁడఁగాగలనని తలంచి, గురువనుమతింబొంది, యింద్రాణిని శచీదేవిని వెంటంగొని పోయి విష్వక్సేన సరోవరము దరికిఁదపమొనరింపం బోయెను. అట విష్వక్సేన సరస్సునకుందిగువ

వజ్రాయుధముచే నటనాకొండం జీల్చి, స్నానపానములకు, దేవపూజలకు ననువగునట్లు బావనజలంబులఁ బాతాళంబున నుండి కొండపైకి వెలువరించెను. అయ్యదియు వజ్రతీర్థమనాఁబడును.

ఇంద్రుఁడట కేవలము పాలనె యాహారముగఁగొనుచుఁ గామక్రోధముల నణఁచి, జితేంద్రియుఁడై పాదాంగుష్ఠముపై నిలిచి వేదమాతను, గాయత్రిని జపించుచుఁ బెక్కువత్సరములు తపమొనరించుచు నుండెను. అంత భగవానుఁడాదివరాహ రూపుడు పృథ్వీమాతతోఁ గూడ నా పర్వతమున నాతని యెదుటఁదోచెను, ప్రసన్నమతి నింద్రునితో నిట్టులనియెను. ఓయీ దేవేంద్రా! నీకు వరమీయ నేనిటఁదోచినాఁడను. నీకు కావలసినదేమి? కోరికొనుము. నీకోర్కిందీర్పనే సంసిద్ధుఁడను. అనియాది వరాహ దేవుండు పలికినంత ధరణీధరు వరాహదేవునకుంబ్రణమిల్లి పాకశాసనుఁడి ట్లనియెను. దేవదేవా, దయానిధీ! నాయందు ననుగ్రహముంబొందిన నిన్నేమని కోరునది? నాకీ శరీరముననివేవేయి శిశినములు వట్టి పెరిగి పీడించుచున్నవి. కరుణానిధావా! నాదేహమునందొక్కదాని మిగిల్చి తక్కిన యాజననేంద్రియములనెల్లఁ దొలగింపుము. అదియనాకుంబది వేలు. నాకు వేరుకోర్కులులేవు. అనినంత నట్టులె యగుగాత యని యావేలుపుల రేని కావరమొసంగియంతన నావరాహమూర్తి యంతర్ధానుఁడాయెను. ఆదివరాహదేవుండంతర్ధానుఁడై నంత నింద్రుని శరీరము నుండి యన్ని శిశినములు మాడిపడిపోయెను! ఒక్కటి మాత్రము మిగిలియుండెను. కానిపడినవాని స్థానంబులం దెల్లఁ బుండ్లుపడి యొకవిధముగ బాధనొసంగసాగెను. వానిచే దేహమొక వికృత రూపముంబొందితోచెను. అంతనా యెదుటనొక బ్రాహ్మణరూపుండు ప్రత్యక్షంబై, తెలుగంటి దేవరా! నీపాపంబునకుం ఫలంబు ననుభవించితివి. నీయనుతాపమునకు ముదమాయెను. ఇకముందట నట్టిచెడుగు లొనరింపఁ గడంగవను నిశ్చయమునవే నీకు నేనొక వరమునొసంగుచున్నాను. అదో నీయొడలున గల యాపుండ్లన్నియు మానిపోయి యాయా యెడల నవియెల్ల నేత్రరూపం బునఁదోపంగలవు. అవి నీతనువున కొకయందము నొసంగంగలవు. నేటి నుండి యునీవు సహస్రాక్షుఁడవునాఁ బేరంది వెలయుదువు. అనిపలికి యావిప్రరూపుండం తర్ధానుండాయెను. మునాసీరుండుమ ప్రమోదము వొందిన వాఁడై సుందర విశాలనేత్రములు కనువారల కనులకు విందొనర్పు చుండ వింద్రాణితోఁ గూడి, పురమెల్ల దివ్యమంగల వాద్యములు నినదించుచుండ, నమరగానంబుల వడుమ, వచ్చరలేమలాడుచుండ నమరావతిం, బ్రవేశించి యమరుల కెల్లరకు నెల్లలోకమ్ములకు నమందానందమిచ్చెను. సుందరరూపమ్మున నెల్లరకు నేత్రానందముంగలిగించుచుఁ దనదివ్యమందిరమునఁ బ్రవేశించి సమ్ముదమందెను.

## విష్వక్సేన వృత్తాంతము

వింతయగునాకథ యంతయు నాలించి మిగుల సంతుష్టమానసయై భవానీ దేవిపతిదేవు శంకరుని గాంచి యిట్టులనియెను. ఓతత్త్వదర్శనా! ముక్కంటిదేవరా! యావిష్వక్సేనుండెవ్వరు? ఆతండెందులకై తపమాచరించెను? దానినాతండేమి పొందెను? ఆతండిపుడెట్టు లెందున్నవాఁడు? ఈ విషయములన్నియు వివరముగ నాకుందెలియఁ జెప్పవే యన్న, దేవిపలుకులాలించి మిత్తిగొంగ మినుసిగదయ్యంబు ప్రసన్నమతినామె కిట్టులనియెను. ఓదేవీ! ప్రియా! తొల్లికృతయుగంబున దూర్వాసుండు తన యాశ్రమంబున విశ్చలమతి నుగ్రతపమొనరించుచు నుండ, స్వార్థాంధుఁడు, నధికారప్రియుండు, నితరుల తపముల యజ్ఞములఁబాడు చేయనే బుద్ధి కలిగిన యాయింద్రుడు వికలమతింబనుప వాతని యానంగొని కుంతలయను నొకయచ్చర మచ్చెకంటి యారమణీ యాశ్రమమున కుంచేరి వినోదమున నట నృత్యగానములు పొనరింపసాగెను. అదియెల్లం గాంచిన మునివరుఁడు కడుంగడు కోపమందినవాఁడై ఓసీ! దుష్టమతీ నీయాచెడుగు చేతకు ఫలముగఁ గిరాత వనితవై పుట్టుము పొమ్మనియామెను శపించెను. అది విన్నయా యంగన యెంతయు, భీతయు, బరితప్తయు నైయానీల కుంతల కుంతల దూర్వాసముని వరునకు వంజలించి ప్రణమిల్లి వినయ వినమితయై మ్రొక్కుచుఁ బాదంబులు పట్టి యిట్టు లనియెను. మునివారా! దయచూడుము. ఇందునా దోసమేమియు లేదు. నేను పరాధీనను, ప్రభునాజ్ఞలఁ బాలింపవలసినదానను. నాతప్పును మన్నింపుము, క్షమింపుము. అనుచు నిలిచినయామెను, భక్తి వినమ్రమను, బాదములంబడిన దానినిగాంచి యాతపోధనుఁ డిట్టులనియెను. ఓ బాలా! నాయాడిన మాట యెన్నడును దబ్బరకాఁజాలదు. అయినను నీకాశాపమునుండి విముక్తి నొందుటకు నుపాయమును వచించెదను. ఓ భీరూ! నీవు కిరాతాంగనివై పుట్టియు నాపుట్టువునఁ బుత్రుమోముఁగాంచిన దానవై శాపమోక్షమును బొందెదవు. అప్పుడు నీవు స్వర్గమునకుం బోఁగలవు. అనుచున్న ఋషింగని యాయమ మఱల నిట్టులనియెను. ఓ మహాత్మా! తపోనిధానా! నాకొదవునా పుత్రుఁడు, విష్ణుపరాక్రముడు, దీర్ఘాయుష్మంతుఁడు, తపోనిరతుఁడు నగునట్టులుగ ననుగ్రహింపుము. అనుచున్న, భక్తి వినయముల, బ్రణమిల్లియున్న యామెం గని యమకంపనామునివరుండు నట్లెయౌగాత మనియెను.

అటుపిమ్మట నాకుంతలయట నాకాంతారమున వీరబాహుఁడను నాతవి కాతవి భార్యయందునఁ బుత్రియై పుట్టినువర్ణలయను పేరువఁదలిదండ్రుల కెంతయు సంతసమును బెంపొందించుచు నందాల బొమ్మయై దినదిన ప్రవర్ధమానయై జవ్వని యాయెను. తలిదండ్రులామెను సుగుణముల రాశిని ధర్మువికుమరునకు భద్రువకిచ్చి పెండిలిచేసిరి. ఆలుమగలు వారానందమున దినములుపుచ్చుచుండిరి. అంత నొక దినమున నర్మదానదిని ఋతుస్నాతయై పవిత్రయై ఫాల్గున మాసమున, శుక్లపక్షమున

శుభదినమున, శ్యామయైన తమ మధ్య యాసువర్చల ఋక్షపర్వత తటమ్మున ముదమ్మున వినోద విహారలీలల నుండఁ గాంచిన వరుణుండనురాగ బద్ధుండై యెట్టులెట్టులో యామెనొప్పించి కూడి, సంప్రీతుండై, హేశుభగే! నీవలన నేనెంతయు ప్రసన్నుండనైతిని. నీకభీష్టమగు వరమును గోరికొమ్ము. ఈయఁగల వాడనన్న. అంతనాపె - నాయందనుగ్రహంబు కలవాఁడవైతేని యోవరుణదేవా! సర్వశ్రేష్ఠుం బుత్రుం బ్రసాదింపుము అనెను. ఆతండును నీకట్టి యుత్తమోత్తముండు కుమరుండు, దీర్ఘాయురుపేతుఁడు కలుగఁ గలండని పలికి వెడలిపోయెను. వరుణుఁ డొసంగిన యా వరదానంబున సువర్చల యెంతయు ప్రముదిత మానసయాయెను. అటుపిమ్మట నామెగర్భవతియై దినదినాభివృద్ధిగఁ దగుకాలమ్మున బంగరు మేనిచాయవాని, నిండు చందురుందెగడు మోముసొబగువాని, కమలములట్టి కనులువాని బుత్రునిం గనియెను. ఆ పసిపాపండు, శంఖాసి బాణాసనకుంభాది శుభరేఖల సముజ్జ్వలములగు కరచరణంబుల నొప్పుచు నందంబులొలికించుచుండెను. ఆ శుభ ముహూర్తమున, పుష్యమాసమున, మీన నక్షత్రమున, కర్కాటలగ్నమున శిశూదయ మయినంత దేవదుందుభులు మొఱసెను. ఆకసమ్మునుండి పూల జల్లులు పడెను. శుక్లపక్షమున, జంద్రునట్టులా పసికందు దినదిన ప్రవర్ధమానుండాయెను. అల్లారు ముద్దుగఁ బెరిగి పదివత్సరముల వయసువాఁడైన యాబాలుంగాంచి యాతల్లి సువర్చలకు స్వర్గవాసము కలిగెను. పుత్రుంబాసి తల్లి స్వర్గమునకుంబోయిన, వాని తండ్రియు బిడ్డను విడిచిపోయెను. తలిదండ్రులనెడబాసిన యాచిన్నబిడ్డడు కశ్యప మున్యా శ్రమమునకుం బోయెను. వచ్చినయా బాలుని జూచి మునితల్లజుఁడు వరుణా పత్యముగ నెఱింగి, రూపలావణ్య సంయుతు నాతనిం బ్రమోద మానసుండై శిష్యునిగ గ్రహించి మంత్రాది దీక్షనొసంగెను. అట్లు దీక్షనంది మునివరుచే సాంగవేదంబుల నధ్యయనం బొనర్చి బాగుగ నేర్చి గురు నాజ్ఞనంది తపము నొనర్ప వృషభా చలమునకుం బోయి యటనియమ పూర్వకముగఁదపము నొనర్ప సాగెను. తప మొనరించుచు నొనరించుచు బదునైదు వత్సరముల వయసు వాఁడాయెను. అంత నాశ్వయుజ మాసమునఁ బూర్వాషాఢ నక్షత్రమున శుభసమయమున విష్ణుదేవు పురుషోత్తము దివ్య దర్శనము నొంది, భగవాను విష్ణు సారూప్యమును, తద్దేవుసేనాధి పత్యమును బొందెను. చేతుల శంఖచక్ర గదాయుధములను ధరించి వైకుంఠ వాజ్ఞాపాలకుండై తన యాయాశ్రమమునుండి గంధర్వులతోఁ గూడినవాఁడై నారాయణ పర్వత తటమునకుంబోయి పంచాయు ధాశ్రమములకుం దిగువను నాశ్రమము నొనర్చుకొని యట వసించెను. మిగుల పరాక్రమవంతులు, గంభీరులు, పదునాలుగులో కములగట్టి పట్టు గలవారునగు, భూతముల కధీశ్వరుండై వారిచేఁ గొలువంబడుచుండెను. ఓ పర్వతరాజ తనయా! ఆశ్రమకథా ప్రసంగమున నేను నీకీ విష్వక్సేన జన్మ వృత్తాంతముం జెప్పితిని. వాని జన్మయే కర్మఫలమునమగాదు. దేవతల ప్రార్థనలచే, భగవాను విష్ణుదేవు నాజ్ఞచే విష్ణుసమానపరాక్రమ వంతుఁడా విష్వక్సేనుఁడు దయించెను.

# షష్ఠాధ్యాయము

## చక్రాది తీర్థముల మాహాత్మ్యము

విష్వక్సేనాశ్రమమునకుం బై భాగమున భగవానుని పంచాయుధములు శంఖచక్ర గదాఖడ్గధనురాయుధములకు స్థానములై వెలయు పంచసరములు దనరారును. అందా పంచాయుధాధినేతలధి వసింతురు. ఓదేవీ నేడును నాగిరి నాసరస్సులాయా యుధరూపములనే వెలయుచుఁ గానవచ్చుచున్నవి. ఆసరములకూర్ధ్వమున నొక సరోవరముకలదు. అందగ్ని దేవుండు నిలిచియుగ్రతపమ్మాచరించెను. అద్ది తీర్థంబు లందుత్తమోత్తమము, అగాధమ్ము, దురవగాహంబు, పాపనాశకము. ఆ యాగ్నేయ తీర్థంబునాఁబడును. ఆయాగ్నేయ తీర్థమునకుత్తరమునఁబరమ పవిత్రము, బ్రహ్మ సరోవరమొప్పును. ఆ బ్రహ్మ సరోవరమున కుత్తరమున సప్తమహర్షులను బుణ్య తీర్థములును గలవు. ఈ పదునేడు తీర్థముల నొక్కొక్కడును దర్శన కీర్తనములచే స్నానపానములచే నెల్ల పాపములను మొదలంట నాశమొనర్చునవై యున్నవి. అన్న వాలించిన హైమవతి పతిదేవుంగని భక్తవత్సలా ప్రాణనాధా ! కరుణించి లోకోద్ధరణార్థ మీయెల్ల తీర్థముల మాహాత్మ్యమును, సర్వపాపహరమును పుణ్యావర్ధకమును, సర్వహిత కరమునాది నుండియు విశదముగఁ జెప్పవే! యన శంకరుండు దయానిధి యిట్లు చెప్పందొడగెను.

### కపిలతీర్థము - కపిలలింగము - కపిలేశ్వరము

ఓహిమగిరితనయా! సావధానవై నాచెప్పుదాని నాలింపుము. తొల్లిదూర్వాస మహర్షి కోరినమీఁదటఁ జతుర్ముఖుడు బమ్మదేవరవానికి నుత్తమోత్తమము కపిలేశ్వర లింగమును జూపిచెప్పెను. దానింబాతాళమునఁ మునివరుండు కపిలుండు పూజించెను. ఆకపిలలింగ మొకప్పుడు, కామధేనువుచే తత్క్షీరముల నభిషిక్తమై పాతాళమునమండి యెదిగియెదిగి భూమినంటి దానింజీల్చికొని వచ్చియు నెదుగుచున్నదాని, నాలింగముంగని కామధేనువు మిగులఁ గోపముకలదియై తనకాలిగిట్ట నా లింగముపై నుంచి యదిమి, చాలు చాలు నికనెదుగుట చాలింపుము అనెను. అట్లు వేలుపులగిడ్డివలికినంత నాలింగమెదుగుట మానెను. ఆదిని రజతవర్ణము, మధ్యమున, సువర్ణకాంతులు, నగ్రమున వెఱ్ఱివి వెలుగు రంగులు గలిగి యొప్పునైదు మోములు, మూడు కనులు, నైదురంగులు కలిగికడు భయమును గొల్పునదై యెల్లపుడు పాతాళములమండు నాలింగము భూమి దనుకనెదిగి యంతతో నాగెను. దాని తలం పుడుకు దొడుకు వెలిమొదవు కాలిడెక్కగురుతట్టివిలిచి యున్నది.

కృతయుగమున దానిఁగపిలమహర్షి పూజించును. దానవది యప్పుడు కపిలేశ్వరుండనఁబడుచు వచ్చెను. మఱిత్రేతాయుగమున నద్ది యగ్ని పూజితమై యాగ్నేయమని కీర్తింపంబడెను. ఆద్యంతములు లేనియామహాలింగము ద్వాపరమున చక్ర సంపూజితమై యొప్పెను. కలియుగమునా లింగమును కపిలగోవు పూజిం దనిసెను. ఆ కపిల లింగమునకు నెదుటగ నుత్తమ సరోవరము కలదు. అది పాతాళమున నుండి భూమికిఁ గపిల మహర్షి వచ్చిపోవుచుండు మార్గమె. ఆ గుప్తబిలము కపిలబిలము నాఁబడునది జలప్రపూర్ణమై యుత్తమ సరోవరమాయెను. కావుననే యదియగాధము.

దర్శన మాత్రముననే యాపవిత్ర తీర్థము స్త్రీపురుషులకెల్లరకుఁ బాపసమూహముల మొదలంట నాశమొనర్చి స్వర్గాది భోగములొసంగును. స్నానపానములొనర్చిన వారికి జరామరణ భయనాశకమై ముక్తిదాయక మగును. అందొక్కమారు తానమాడిన మాత్రముననే పెక్కువాజపేయములు, నశ్వమేధములు, నొనర్చిన పుణ్యఫలము కలుగును. ఐన వాజపేయాశ్వమేధములు పొనర్చిన పుణ్యఫలప్రాప్త్యనంతరమున మఱలఁబుట్టువు కలుగఁగలదు. కానియిందున స్నానమాడిన వారికి మరలపుట్టువే కలుగదు; ముక్తియే సంప్రాప్తము. పరమపదమొచేపడును.

ఈకపిలతీర్థమునకుంబై భాగమునఁగల యావజ్రతీర్థమున స్నానమొనర్చిన దీనికింబదిరెట్లు పుణ్యఫలము నందఁగలరు. ఇంద్రలోకమున స్వర్గభోగములందఁగలరు. ఆవజ్రతీర్థములకూర్ధ్వము నంగల విష్వక్సేన సరోవరమును తానమాడిన వారికా కపిల తీర్థ స్నానమునకు నూరురెట్లు ఫలము సంప్రాప్తము కాఁగలదు. ఈ తీరుననే యటఁగల పదునేడు తీర్థములయు స్నానఫలమొకదానికి మించి యొకదానికిఁబదిరెట్లగు చుండును.

కాత్యాయనీ! ముల్లోకములంగలుగు పవిత్ర పుణ్యతీర్థములన్నియుఁగార్తిక మాసమునఁ పర్వదినముల మధ్యాహ్నకాలమున వచ్చి కపిలతీర్థమున సాన్నిధ్యముం బొందును. ప్రాణిరక్షణ కొఱకని యాతీర్థమునఁ జేరి పదిఘడియలట్టె యుండును. ఆనాడందు కపిలతీర్థంబుల మునకలిడు వారెంత పాపులైనను వారి పాపములెల్లఁ బాసి పావనులై బ్రహ్మలోకమునకుంబోదురు. ఆతీర్థముల సమీపమున దానములొనరించు వారి యాదానము బంగారమో, యన్నమో, మఱేదో కొద్దియైనను మేరుపర్వత సమానమగు ఫలము నొసంగును. అన్నదానమింతయొనర్చినను వారు చంద్రలోకమును బొంది సుఖింతురు. అటఁగన్యాదానమొనర్చు వారు స్వర్గమును, గోదానమొనర్చువారు కైలాసమును, భూదానమొనరించువారు వైకుంఠమును, విద్యాదాతలు, మంత్రోపదేశకులు బ్రహ్మలోకమును బొందుదురు. ప్రతి వత్సరమును కార్తికమాసమున పూర్ణిమదినమున, మహాతిథిని, మధ్యాహ్నమున తప్పక సర్వతీర్థములు వచ్చి కపిలతీర్థమునఁజేరియుండును.

ఆసమయమున నెవ్వరాతీర్థమున -

స్నానంతుదుర్లభం తత్ర !
తద్విష్ణోః పరమంపదమ్ ॥

(అవిష్ణుభగవాముని పరమ పదమును, కపిలతీర్థమున స్నానమును మిగులదుర్లభములు) అను నీమంత్రమును జపించుచు స్నానమొనరింతురో వారెల్లరీ చెప్పిన ఫలమును బొందితరింతురు. ఓదేవీ భవానీ నీకు నేనెల్ల తీర్థములయు మాహాత్మ్యమును బరిపూర్ణముగ వచించినాడను ఇఁక నీమీఁద వచనుండొనర్చిన యా మహత్తర తపముంగూర్చి వచింతును. మనసుంచి యాలింపుము.

## శేషశైల వృత్తాంతము

తొల్లియొకప్పుడు వైకుంఠ నగరమున శ్రీమహావిష్ణు వనంతు నాదిశేషుని మందిరద్వారమ్మొకడ నుండనియమించి, శ్రీరమాదేవితోఁ దానభ్యంతరమందిరమున వినోదించుచుండెను. భగవంతు నంతరంగం బెఱింగిన భూమితాలుపు చిలువతేఁడట సావధానుఁడై నిలిచియుండెను. ఆ సమయముననె యటకు మాతరిశ్వుఁడు వేవేగ వచ్చిలోనికింజొరఁబడు చుండఁ గన్నతడవుల నిడుప డడ్డముగవచ్చి తనచేతి బంగరు దండమున నిలువరించెను. దేవుదర్శింపంబోవు తన్నొకఁడట్టులు నిలువరించుట యా యని యా సదాగతి కలుక పొడమెను. దానవాయిరువురి కాయెడ నప్పుడిట్టులు వాగ్వివాదము కలిగి చినికి చినికి గాలివానయన్నట్లాయెను.

తొలగుము, తొలగుము, నీకేమేని తలలేదా? తొందరగనేను కార్యార్థినై దేవుదర్శింపఁ బోవుచుండనన్నడ్డెదవేమి? యని యనిలుఁడన జిలువతేఁడు. అగువగు మెదడులేనివాఁడా! ఆతొందరపాటు తగ్గించుకొనుము. నేనా నారాయణ దేవునాన నిట నిలిచి యున్నవాఁడను. నీవిపుడేమియులోనికిం బోరాదు. ఆగుము అన; వాయువుచాలు చాలు విషధరా! నీవెడఁగు దనమును దగ్గించికొనుము. అనఁజిలువతేఁడు ప్రభువాజ్ఞ లేక యడుగైన నీకులోనిడుటకుఁగాదు. అన అదివిన్న వాయువు, ఎందులకీ దంభోక్తులు? ఎఱుగవా? మఱచితివా? అహంకారమున మునుల నడ్డగించిన జయవిజయుల; యాద్వారపాలకుల గతియేమాయెను? ఆరావణ కుంభ కర్ణుల క్రవ్యాదుల చరిత్ర తలంచికొనుము. దారినిమ్ము. ద్వారముకడనున్న నీకుఁగొంతయుక్తా యుక్త వివేకము యుండవలయును. అది విన్న యావిషధరుడు కోపమినుమడింప బుసలు కొట్టుచు విట్లనెను. ఎందులకిట్లు పెద్ద పెద్దగ మాట్లాడెదవు? బ్రతుకుటకుం గోరికిలేదా?

తలఁచినని న్నొక పిలుపున లోగొనియెదను. అగునగుపోఁగాలము దాపురించినవా నిబుద్ధి పెడదారింబట్టునుగదా! నీప్రతుకును నట్టిదిగనేయున్నది. నిన్నుంబట్టి గట్టిగ దండింపవలసియున్నది. నన్నేమనుకొనుచున్నావో! బలపౌరుషముల జ్ఞానవైరాగ్యముల నన్నుంబోలిన వారు లేరు. విష్ణు దేవుభక్తులందెల్ల నేనమేటిని. ఆమాధవునకు నేనకూర్చువాడను. ఆగోవిందుఁడు నాయందెక్కుడు కూర్మింజూపును. నాయునికి యెల్లపుడా కేశవునంతిపురమునసే. ఆదేవుఁడు నన్నుఁదన తనయుని కంటె మిన్నగఁ బ్రేమించుచును. ఆలక్ష్మీ నారాయణులు పురాణదంపతులు లోకహితంబునకై, తమయిచ్ఛాపూర్తికై నన్నిటు ద్వారపాలకుఁడుగా నియమించినారు. అనవాయువు ; అజ్ఞా! యేమి యీ గర్వోక్తులు. పిల్లి లోపలియింటిలో మండు వదే. అయినను వెలుపలనుండు వేన్నగున్నకుం దీటుగాదు. ప్రభువు రత్నపర్యంకతలమునఁబరుండియుండ నాయధిప నానతిన యాపాన్పుపైనుండి పదము లొత్తు సేవకుఁడు సేవకుఁడే ఆసేవకుని ఘనత యేమియో! క్రిందనే మసలు నాప్రభు పుత్రుని న్యూనతయేమియో! ఓ శేషనాగూ! కొంచెము నాకెఱుఁగజెప్పుము. నన్ను బీల్చి వేయుదువనుచుంటివి. నేను తొలఁగిన నీకుఁ బ్రాణములే లేవు అదెఱుంగుము.

ఈ రీతిగ మహాత్ములగు నాశేషవాయువులందు వాగ్యుద్ధమత్యధికముగ సాగిపోవుచుండ వారొదనాలించిన లోకమాత మంగళ దేవత ప్రభోధింపదేవుఁడటు మనసుత్రిప్పి లేచియావైపునకు నడిచి వారిం దరిసియిట్లనెను.

ఓయనంతా! ఏమియీగడబిడ? ఆవచ్చినయా రెండవ వారెవరు? అనుచున్న గరుడధ్వజిన కాయనంతుఁడిట్లనెను. ఆర్తజనావనా! పుండరీకనయనా! ఆమలయాచల వాసుడు గర్వాంధుఁడు గంధవహుఁడిట కకాలమున వచ్చి యంతఃపురమునఁ బ్రవేశింప నుద్యమించుచున్నవాఁడు. ఇది సమయము కాదన్న నోటికి వచ్చినటులెల్ల బలుకు చున్న వాడు. అనుచు భగవంతు నంతర్భావము నెఱింగిన శేషువా దేవునకుం దెలిపెను. హృషీకేశుఁడును మెల్లన నటకు ద్వారముకడకు వచ్చిచేరెను. అప్పుడ యనిలదేవుఁడా వేదవేద్యునకుఁ బురాణపురుషునకు సాష్టాంగ దండప్రణామం బాచరించి పలు విధములఁ బ్రస్తుతించెను.

అపుడు వారిజాక్షుఁడు వాసుదేవుఁడా జగత్ప్రాణుంగాంచి యిట్లనెను. వాయువా శ్వసనా! ఈ యాదిశేషుఁడెంతయు నభిమానవంతుఁడు. ఆతనితో నీకెందులకీ మాటల పోట్లాటలనుచున్న యాదేవుని వాగమృతము కర్ణపుటమ్ములంబట్టి త్రావి యా మహాభక్తుడు వాయువు మఱిమాటాడక యట్టే నిలిచి యుండెను. అపుడు శేషుఁడు దైత్యారితో

నిటులుపలుక సాగెను. దేవాదిదేవా! దివ్య ప్రభావా! నీకిష్టులగు వారి యందెల్ల నే నెక్కుడిష్టుండను. బలమున, జ్ఞానమున నా కమర్త్యపాతాలములంగాని, బ్రహ్మలోకమునం గాని నాకు సాటియగు వారు లేరుగదా. అనుచుండ విన్నయాది నారాయణుండు మోమునం జిఱునవ్వొలయ బాగుబాగని ప్రశంసించుచు నాదరంబున నిట్లు మెల్లని పలుకుల ననియెను. ఓ సహస్రవదనా లోకభారమంతయు నేనె భరించుచున్నాడనని నీగర్వము. నీమోయుభారముతో నిన్నును మోయువాడు కూర్మనాధుండున్నాడని యెఱుంగుము. ఓ సదాగతీ! మహాబలుండ ననియు జగత్ప్రాణుండనినియు నీగర్వము నీకును బ్రాణదాత యొకండున్నాం డెఱుంగుము. అరసి చూచిననెంత వానినేని మించినవాం డొకండుండును. గర్వమెంత వానికిని దగదు. మాటలంగాదు; పౌరుష ప్రదర్శనము చేతల నొనర్ప వలయును. మీయిర్వురి బలాబలములు నింద్రాది దేవతలు పరీక్షించి నిరూపింతురు. ఇప్పటి కుత్తరమున మేరునగ నందనుండు వేంకట గిరివరమొండుగలదు.. దానినోసర్ప రాజమా! నీబలమంతయుంజూపి పూర్ణభోగరజ్జువు నంజుట్టి కదలక పట్టియుంచుము, విష పూత్కారములందాని స్థిరమొనర్పుము. చూతము. ఓ మాతరిశ్వా! ఆతండు పట్టియుంచిన యాపర్వతము నీబలసామర్థ్యము యెంతకలదో యంతయుంజూపి దూదిపింజయటుల నెగిఱింపుము. చూతము. ఆతండు సుస్థిరముగం గదలకుండం బట్టియుంచునో, నీవు నాతని పట్టిన పట్టు తప్పించియెగురంగొట్టెదవో ఎవరి బలమెంతయో, యిందుంగాన నగును. అనెను. అది విననంతన యాపాపతేండు హృష్టపుష్టాంగుండై యప్పుడపోయి యా యానందనామక నగరాజమును, మంగళమయము, మనోహరము తప్తకాంచన సంశోభితము, రత్నమయశిఖరోద్భాసితము, పుణ్యమయము, నగు, మేరుతనూజు నద్రివరుంగాంచెను. కాంచి తన దీర్ఘశరీరరజ్జు వునంబాగుగం జుట్టి దృఢముగం బట్టియుండెను. అంతియుకాదు పూత్కారముల వాయువును గయ్యమునకుంగాలు ద్రువ్వుచు పిలుచుచున్నట్లుండెను. అదికన్న యనిలుండును నవిమిమలెల్లరుం గనుచుండ దేవదేవు ననుమతింబొంది, యుర్వీధరము నుద్ధాత మొనరింపం గడంగెను. చక్రహస్తు ననుగ్రహమంతయుం దనపైననే కలదని, తానేమహాబలుండనని వాయువు మదోన్మత్తుండై యిది యెంతపనియని కాలిబొటన వ్రేలు మీటబోయెను. అదికదలనందునం గొంతపట్టు పట్టవలెనని, చేతుల మాపులాడించెను. దానను బ్రయోజనము కానరాకపోగా గాలిదేవర గర్వముదిగి యువ్వెత్తుగ వాకొండం బెకలింపంగల బలమంతయు నుపయోగించి యాగిరినెగుర గొట్టంజూచెను. కాని యాభూధర మావంతయుం గదలిన జాడలేదాయెను. అంత బిట్టు పట్టుదలంబూని క్రోధావేశంబులు ముమ్మరింప నామరుత్తికను సత్త్వ నుపయోగించెను. చిలువ తేండును వింకను బిగ్గబట్టియుండెను. ఇట్లాశేషవాయువు లందునం బట్టుదల యంతకంతకు నిమ్మడి, ముమ్మడి కాగావారి పోట్లాటలలో జగత్తే యల్లకల్లోలమై క్రిందు మీదుకాసాగెను.

అది కాంచిన బ్రహ్మేంద్రాదులు లోకశాంతింగోరిన వారై యాసదాగతిని శాంతింప నెంతయుంగోరిరి. ఎంతగ యాచితుఁడయ్యు నామాతరిశ్వుఁ డిసుమంతయు శాంతింపఁడాయెను. ఇదియంతయుంగనుచున్న యనంతుఁడు పరంధాము, నాదిదేవు భావమునెఱింగిన వాఁడై, వేలుపుల కెల్లరకు సంతోషకరముగా లోకకళ్యాణము నెంచి తనవేయి పడగలం దొకపడగ నించుకపట్టు సడలించెను. ఇఁక నేమికావలెను. సందు దొరికిన యాస్పర్శనుంబట్టఁ బగ్గము లెక్కడ? ఆవగింజయంత యవకాశము గల్గిన నాయద్రినే యెగురవైచినాఁడు. చుట్టు పట్టినయనంతుని తోడనే యాయద్రి లక్షలయోజనముల దూరము దూదిపింజయై దక్కినపుదెస కెగిరిపోయినది. అట్లు గాలికి గొట్టికొని పోవుచున్న కొడుకుంగాంచి మేరుగిరిరాజు మారుతుంగని తన కుమరుం గరుణను గనుమని పఱిపఱి తెఱఁగులఁ బ్రస్తుతులొనరించెను. నిన్నెదిరించినది విరోధించినది శేషుడుగాని నాతనయుడు గాదుగదా. మాయెడదయ చూడుము. ధర్మముంగనుము. నాబిడ్డను రక్షింపుము, రక్షింపుము. రక్షింపుమనుచు వినుతించు నాబంగరు కొండ వలవింపులకు నెడఁదనింత కనికరమంది యాపవమాను డాయానందాద్రిని సువర్ణముఖీ నదికిఁ బడమటితీరమునఁ గొంచెముత్తరముగఁ నున్న పవిత్రాచలమునకు మీద బన్నగ రాజుతోఁ గూడ నుంచి సుస్థిరమొనర్చెను. అంతతో జగములకలజిడి యుడుఁగెను. అంతనటకు నమరాధిపులు పరివారములతోనవిలు సమీపించి పాదరభావమున నిట్లు పలికిరి. ఓసదాగతీ! ఈమేరునగజాతుఁ డానందాద్రి శేషాంశ సంభూతుఁడు సుమా. భగవంతునకునికి గానగుటకేయది యుద్భవించెను. మీ యిర్వురకీ కలహముంబుట్టించి, తన్మిషంబున దీనినిటకు, సువర్ణముఖీ దరికిం దెప్పించియుంచనే యామాయలమారి యయ్యయఖిలేశ్వరునఖిలాష. అదియిట్లుగ నెఱవేరెను. ఆదిశేషుడు దానిబెల్లగింపనీ చేనదియిటనుంపఁబడెను. అంతయు బాగుగనే జరిగినది. కాని విష్ణుమోహితుఁడవగునీవు, దేవునంతరంగుడు, భక్తుఁడునగు ననంతు ధిక్కరించి యవమానించితివి. వానింబ్రార్థించి ప్రసన్నుంజేసికొనుట యెంతయు మేలనియు ద్బోధించిరి. ఇట్లులు తనహితకాంక్షులగు విబుధులచే నుద్బోధింపఁబడిన వాయువు గర్వముడిగి, యా శేషు ననేకవిధముల సంస్తుతులొనరించెను. అనంతా! నన్ను క్షమింపుము. దేవుండెపుడు నీయందే నివసించును. నేఁగన్నుగానక నిన్నుందూరితివి. అవి యేమేమో వినమ్రుఁడై పలుకుచుండ నాయనంతుఁడును నణకువతో మిత్రమా ఇందువీతప్పేమున్నది? నే క్షమింపవలసినదేమి? నేనును నీయెడనెంతయో యపరాధ మొనర్చితిని, అవిష్టములు పల్కితిని. మనల నిర్వుర నాదేవుఁడేయను గ్రహించినాఁడు. ఈ లోకహితకార్యమునకు మనల సాధనములుగా నొనర్చినాడు. మనమిర్వురమా భగవానుదయకుఁ దవియుచుఁ బ్రార్థింతమనెను. వారిర్వురాదేవు ననేకవిధముల సంకీర్తించి ప్రసన్నుంజేసికొనిరి. అటుపిమ్మట నా యాదిశేషుఁడ నేకోత్తమ ఫలపుష్ప

భరితలతావృక్ష మండితమ్మును, పవిత్రానేకతీర్థోద్భాసితంబును, బుణ్యక్షేత్ర యుతంబును, మనోహరోన్నత శిఖరాలంకృతమ్మును నగునాపర్వతరాజమును, స్వామి పుష్కరిణికి వాయువ్యదిశను నుత్తమ శిఖరమున, నాగతీర్థమునఁ బెక్కుదివ్య వత్సరమ్ములా భగవంతుంగూర్చి గాఢ తపం బొనరించెను. అంత నాయనంతుని తపమునకుం బ్రసన్నుండైన యాదేవుఁడు ప్రత్యక్షంబై నాగరాజా! ముదంబయ్యె. నీవేమి కోరి యిట్టి తపప్పాచరించుచుంటివి ? కాదనక యిత్తును. కోరికొను మన నెంతయుఁ బ్రమోదమంది యాచిలువఱేడు ఇట్లనియెను. ఓదేవా! నీవు నాయెడఁ బ్రసన్నుండవేని నాయీ చిన్ని కోరిక మన్నింపుము. అటవైకుంఠమున మీరెట్టులు నాభోగంబుల నెలవుకొని యుందురో యట్టులనే నాయాకారమేయగు నీశైలతలమున మీరెల్లపుడు నివాసమొనరింతురుగాక. పన్నమ గ్రహింతురుగాత. అట్టులా శేషునిచేఁగోరఁబడిన యా శ్రీహరి యాతడవుల విడువనింగని యల్లననిట్లనియెను. ఓ నాగరాజా! నీకోరిక యెంతయునుత్తమ మైయున్నది. తొల్లియొకప్పుడేను భూమిని నివసింప విహరింపంగోరి దాని కిందగునట్లుగా నివాసముంజేసి కొనఁదగు వినోద స్థలం బేదియా యనియోచించు చుంటిని. ఆసమయముననె త్రిలోకసంచారి నారదుఁడు నాయెడకువచ్చెను. నేనాతనింగని, నాయెడందంగల కోర్కెను జెప్పితగు స్థానమేదని యడిగితిని. అదియాలించిన యా దేవర్షి సత్తముఁడిట్లనియెను. దేవా! దీనికింత యాలోచనయేల? అన్నివిధముల నందమై యోగ్యమైయానందాద్రి యొప్పును. అద్ది తొంబది యోజనముల విస్తీర్ణముకలిగి యనేకానేక పుణ్యపవిత్ర తీర్థంబుల నొప్పుచు వైకుంఠమున కెందునఁ దీసిపోనిదై, తనరారును. అంతటనటనె నెలవు కొని పృధివీతల విహారమునకుం దలంచితిమి. ఇంతలోనన తలవనితలంపుగ వాయువునకును నీకును, జగడము కల్గుటయుఁ దన్నిమిత్తంబున నానగరాజంబటకుం గొనిరాఁబడుటయు సంభవించినది. ఇటనీకోర్కియు, నా యభిలాషయు నొక్కటియు, నీయభిమతము మేరకు నేనిందున నెలవుకొని యుందువనియెను. అదిమొదలుగ నాదేవునకది కోరిన నెలవైయలరారుచున్నది. అద్దియనుమతీ స్థితవైకుంఠంబై మానవుల పాలిటిం భాగ్యమై యొప్పుచున్నది. ఈ రీతిగ శేషాంశసంభవమును, శేషభోగి భోగపరివేష్టితమునగు, దేవునకావాసమై వెలసిన యానగరాజము, శేషాచలమనియు, శేషశైలమనియు దేవునను గ్రహామునఁ బిలువంబడుచుండెను.

## వాయుదేవుండు తపంబొనర్చుట

అటవాయుదేవుండును నానగోత్తమంబునఁదీక్షను, భక్తి తన్మయతను దేవదేవుంగూర్చి ఘోరముగఁ దపంబొనరింపసాగెను. ఆతండు గ్రీష్మంబునఁ బంచాగ్ని మధ్యంబునను, వర్షకాలమున బయటనేల నిలిచియు, హేమంత శిశిరములఁ జల్లని

స్వామి పుష్కరిణీ జలముల కంఠదఘ్నముగ నిలిచియు నియమ నిష్ఠల నిశ్చలమతి దృఢముగ దపమొనరింపసాగెను. పెక్కువత్సరములు గడచెను. ఆతని దీక్షయు, తపోనిరతియుఁ బెంపొందుచునే యుండెను. అంతనాతని తపమునకెంతయు ముదమంది భగవానుఁడు దేవదేవుడు జనార్దనుఁడాతనిం బ్రీతునొనరింప వానికి నెదుటందోచెను. ఆ సనాతన పరమాత్మ శ్రీ భూదేవులతో గరుడారూఢుండై శంఖ చక్రములు కౌమోదకీ శార్ఙ్గములు ధరించిన వాఁడై యనంత పరివేష్టితుండై తోచెను. ఇట్లుతోచిన యాదేవుందర్శించిన వాయువు విస్మితుండై యంతన తనయాసనమున నుండి లేచి నిలిచి యున్మత్తునివలెఁ దిరుగుచు నవ్యక్తా నందమున బడుచులేచుచు నాడుచుఁబాడుచు, దేవుని చుట్టును దిరుగాడ సాగెను. ఆహో నేనీ వృషభాచలమున నేఁడెట్టి వింతరూపముం బొడఁగాంచఁగల్గితిని? ఎంతయానందము అనితలఁచుచుఁ బలుకుచుఁ గొంతసేపు దనుక యొడలు మఱచిన వానియట్లుండి యంతలోఁ దెలివంది నిలిచి హరిననంతు నవ్యక్తు సకలాత్ము నెదుటంగాంచెను. ఆతఁడు గన్నపరమైశ్వర్యమగు నారూపమును వేదాధ్యయనముల చేతను, దానయజ్ఞములచేతను, దపముచేతను, యోగులును, మునులును గాంచఁగా జాలని భగవంతు సనాతను, పరమాత్ము నవ్యక్తు నవ్యయానందరూపు విశ్వాత్ము విశ్వాంగు విశ్వమయు వాయువపుడచటం గాంచెను. ఓ పార్వతీ! ఆ సమీరుఁడాదేవునకు మాటిమాటికి సాష్టాంగ ప్రణామములొనరించుచు లేచుచు నెట్టకేలకు నిలిచి స్థిరమతి నొంది తత్త్వార్థ యుక్తములగు వాక్కుల నిటులు స్తుతులొనరింపసాగెను.

## వాయువు వొనర్చిన విష్ణుస్తవము

ఓదేవదేవా! పురాణ పురుషోత్తమా! శ్రీధరా, అనంతా గోవిందా మీకివే వందనములు, దేవాధి దేవా! మీ దర్శనముననే ధన్యుండనైతిని. మీయను గ్రహమున నాభాగ్యమును వినుమడించివది ; కృతార్థుండను. మీకివే వందనములు. సర్వాంతర్యామీ, జయశీలా! జగదీశా విష్ణుదేవా! మీ కివే నమస్కృతులు. ఆదికాలమున మాయా సంయుక్తుఁడవై యున్న యేకైక మూర్తివి, పరమాత్మవుమీకివే నమస్కారములు. జలప్రళయమును గల్పించి, సర్వమును జలమయ మొనర్చియందునఁ బవళించియుండు వాడవు నీవే నీకివే నమస్కృతులు. నీ నాభికమలము నుండి యే తత్త్వవేత్తలందెల్ల శ్రేష్ఠుండు బ్రహ్మ, పరమేష్ఠి చరాచరముల తోడి యీ జగత్తునెల్ల సృష్టించినవాఁడు సుర శ్రేష్ఠుండు దయించెను. ఓ పరమపురుషా! కైమోడ్పులు. నీవాదిదేవుఁడవు, పురాణ పురుషుఁడవు. నీవ యీవిశ్వమునకెల్ల పరమనిదానము. శాశ్వతముగ ధర్మమును రక్షించు వాడవు నీకివే చేమోడ్పులు. ఓ ప్రభూ రజోగుణమును బూనినవాఁడవైన నీచేతనే యీ జగత్సృష్టి

జరుగుచున్నది. సత్వగుణముంబూని యీవెయీ సర్వమును బోషించి రక్షించువాఁడవు. ప్రతితమో గుణమును జేఁబట్టి సర్వనాశము నాచరించు వాడవు నీవ. ఓ దేవా! నీవసృష్టి స్థితిలయ కారణుఁడవు. బ్రహ్మస్వరూపుడవగు నీవలననే తొమ్మండుగురు ప్రజాపతులు కలిగిరి. నీవ, దేవమానవ రాక్షసులతోఁ గూడిన యీచరాచర జగత్తునంతను సృష్టించితివి. బ్రహ్మనాక్రమించియాపత్తునం బడఁదోసిన మధుకైట భులను రక్కసులఁదున్మియజుని దన్పినవాడవు నీవ. పిమ్మట మత్స్యరూపుఁడవై సోమాకాసురునిందునుమాడి వాఁడ పహరించిన వేదములంగైకొని బమ్మకిచ్చి రక్షించిన వాఁడవు. ఈ జగత్తునందలి చరాచరములు నిరాలంబము లుకాగా కూర్మరూపుండవై జగత్తునెత్తి పట్టి యుంచిన పురుషోత్తముండవునీవ. వనపర్వతములతో మునిగియున్న యీభూమిని పాతాళమున నుండి యెత్తి పట్టినవాఁడవు, వరాహ రూపుఁడవై హిరణ్యాక్షునిం దునుమాడినవాఁడవు మహాత్ముఁడవు నీవ. మఱియు, కృతయుగమున భక్తవరుబాలుని బ్రహ్లాదుని రక్షింపంబూని నరసింహుడవై లోహస్తంభంబుం జీల్చికొని యుదయించి హిరణ్యకసిపు రక్కసిందునిమి, ముల్లోకములను బ్రోచిన ప్రోడవు పుండరీకాక్షుఁడవు నరసింహుడవీవ. నీకు నిడుదు దండములనేకములివే. ఓదేవా! కాలాంతరమున మాటకారులందెల్ల మాటకారివగు నీవయింద్రునింబ్రోవ వైరోచనుండు, బలి, యొనర్చు మహాద్యజ్ఞతలమునకు వామనుఁడవుగఁబోయి, పరాక్రమవంతుఁడును, దాతలనెల్ల మేటియునగు నాబలిని మూడడుగుల భూమియాచించి పొంది త్రివిక్రముండవై ముల్లోకముల రెండడుగు దమ్ములంగొలిచి కొని యింద్రునకిచ్చి; భక్తవరుండును, దాతయునగు నాబలిని పాతాలమ్మున నిలిపి యేలిన ప్రోడవు ; చంద్రలోకమ్మునఁ జేరి పద్మాసనమున నటమండి ప్రకాశించువాడవు. అందమృతముగ అన్నమున కధిపుఁడవుగనయి లోకమ్ములేలు వాడవు నీవ. నీకివే వందనములు. ఆపిమ్మట దేశపాలకులు దుష్టులు, రక్కసులు కాగా జామదగ్నివి, పరశురాముఁడవై, ఓ మహాబాహూ! యాదుష్టపాలకులనెల్లంజంపి, కుండముల నిండిన యారక్తమునఁ బితృతర్పణము లొనరించి తనియించి యాపైనశ్వమేధమొనరించి యీ జగత్తునెల్లఁ గశ్యపప్రజాపతికి నొసంగియిందుండి వెడలిపోయి మహోదధిందరిపి రమణీయ మహేంద్రియె వాసస్థలముగఁదపశ్చర్య పొగించుచున్న భార్గవునకు నీకు నివెదండము లుద్దండతేజ.

త్రేతాయుగమున లోకకంటకుఁడుగ దేవవైరిగఁబుట్టిన రావణ రాక్షసుడు దుండగములు పొనరించుచో నీవ దాశరథివై పితృాజ్ఞాపాలకుఁడవుగ భార్యతో, సోదరుతో నడవికింబోయి యటనీసతీమణిని సీతామహాలక్ష్మిని హరించిన వాని నారక్కసి తేఁడుమ రావణుని పుత్రపౌత్రమంత్రి బంధు మిత్రులతోఁ దున్మిన మహాతేజస్విని. నీకు నమస్ప్రాపేక నమస్కారములు. ద్వాపరమున నీవ బలరాముఁడవు నవాతవవాసుదేవుండవు

శ్రీకృష్ణుండవు. నైదుష్ట శిక్షణము, శిష్టరక్షణము నొనర్చిన యవతారమూర్తికి నీకు ప్రణతులు. సత్యాహింసలు, సంయమనియమములు, కలిగి ప్రజలహితమును పొసరించు మహాత్ముండవునీవ నీకివేకై మోడ్పులు.

కలియుగమున నీవె తేజోమూర్తివై కలికిమూర్తివిగ జన్మించి, దుష్టుల, ప్రజావిద్రోహుల, స్వార్థులైలోకకంటకులగు వారి, ధనమదాంధుల, కండకావరుల, పాపపంకిలుల, నేరియేరి హతమొనరించి లోకముల రక్షింపంగలవాఁడవు ఓవిష్ణుదేవా! జగద్రక్షకా! యివే కైమోడ్పులు. నీయాదిని, ఉద్భవంబును మహర్షులును దేవవరులు నాదిగనేరును నెఱుంగంజాలరు.ఎల్లకాదియైనవాడవునీవ.సర్వమునీ వలననే కలుగు చున్నది. నీవలననే ప్రవర్తిల్లుచున్నది. ఇదియెటింగి నినునేనిదే కొలిచి సేవించుచున్నాము. ఎల్లభూతముల హృదయాంతస్థిత మహదాత్మవునీవె. వానియాది మధ్యాంతములునీవ.

ఆదిత్యులనీవు విష్ణుండవు, తేజోవంతుల సూర్యుండవు; వసువులనగ్నివి రుద్రుల శంభుఁడవునీవ. యజ్ఞముల జపయజ్ఞము, తాపసులందలి తపస్సు, యక్షులందున గుబేరుండును సంయములందున, యముఁడు, గంధర్వులందున చైత్రరథుఁడు, పితృదేవతలందు నర్యముఁడు మత్స్యములందున మకరము, జలపతులందున వరుణుఁడు, నదులందునఁ బవిత్రగంగానది జాహ్నవి, జలయుతంబుల కుండంబుల సంద్రము, వాయువులందున, బ్రాణవాయువునీవ, నీకివే నమోవాకములు. ప్రజాపతు లందునఁ జతుర్ముఖుండు, హిరణ్యగర్భుండు, వర్ణములయందున బ్రాహ్మణులు (ఇట బ్రాహ్మణులన నామమాత్రులు శమదమాది మహద్గుణములు సత్యశాంతములు, సర్వమునంగల భగవంతునెఱిఁగి భక్తింగల వారెల్లరుం బ్రాహ్మణులే.) అట్టివారలు నీవే దేవా! నీకిదే వందనమ్ములు. ఆశ్రమములందున గృహస్థాశ్రమము, తారలందునఁ జంద్రుండు, నింద్రియములమనస్సు, నెల్ల భూతములఁ జేతనాశక్తియు నీవ నీకివే దండప్రణామములు. మృగముల సింగము, ధేనువులం గామదేనువువయి యొప్పుదేవునకునీకు నమస్కృతులు. మనుజులందున బ్రహ్మజ్ఞానమునొందిన, సర్వసముడు సర్వభూతహితుఁడు నగునాతడు, పక్షులందున గరుడుడు, సర్పములవాసుకి, నాగులందున ననంతుడు శేషుడు, అమృతోద్భవములగు, నుచ్చైశ్రవమశ్వములను, నైరావతము గజములందున నీవ. కులాచలములమేరు నగము; పర్వతముల హిమాద్రి, వేదముల సామవేదము, ఛందమ్ములఁ బవిత్రగాయత్రీ ఛందస్సు మంత్రముల ప్రణవము, ఓంకారమును, యజ్ఞభోక్తల నగ్నియు స్థావరమ్ముల వింధ్యస్థావరమును వృక్షముల నశ్వత్థము (రావిచెట్టు) సేనాపతులందునఁ గార్తికేయుఁడు నీవ. దేవ యివేదండములు. శూరులందలి శౌర్యము, వీరులందలి విక్రమము, బీజములందలి యంకురము, ప్రాణులందలి ప్రాణము నీవ. బ్రహ్మర్షులందున వసిష్ఠుఁడు, పురోధసులందున బృహస్పతి,

నీచరియించు వానియందున వాయువు మహర్షుల భృగుమహర్షి వేదవిదులందు వ్యాసమహర్షి, కవివరుల వాల్మీకి మునివరుండును, గురువరుల శుక్రుండు, నరులందున నత్పాలకుఁడుననగు నోదేవా యివే నమోవాకములు. దేవా! యింత చెప్పుటయెందులకు నీసృష్టియందెల్ల, జగత్తునందంతట తేజోయుతము, బలయుతము, శ్రీయుతమునగు నదెల్ల నీయంశచేఁ గూడిన దేయని బ్రహ్మవిదులుచెప్పుదురు. వరదదేవేశ నీకివే వందనములు.

వేయిశిరములు, వేలుకన్నులు, వేలు పాదములొప్పునీకివే వందనంబులు వేవేలు దేవదేవ వివిధములును దేజోమయములునగు నీ తాల్చినయాయుధము లనేకములు, దశదిశల వెలుగుచు దీప్తులొసంగుచున్నవి. తీవ్ర తీక్షణ తేజోమయములగు బాలసూర్యసమ ప్రభల వెలుగు కుండలములచే నలంకృతములై శ్రవణములు శోభిల్లుచున్నవి. నీపాదపద్మములకివే సాష్టాంగ దండ ప్రణామమ్ములు.

దేవదేవా! నీపాదపద్మములచే నీభూమియెల్లఁబరివ్యాప్తమై విరాజిల్లుచుండ ముఖోద్భాసితార్కమండలముచే నాకాశమునిండి యలరుచున్నది. దిశలెల్ల భుజబాహుల్యముచే వ్యాప్తములై యొప్పుచున్నవి. ఓ మహావిష్ణూ! నీకివే వందనములు. వేదములుఛ్వాస నిశ్వాసములుగ సూర్య చంద్రులు కనుగవలుగ, నక్షత్రములు, తేజః కణములుగ నొప్పివిరాజిల్లునో జగద్రూపా, జగద్రక్షకా! యివే ప్రణతులు ; కళ, కాష్ఠ, ముహూర్తము దినము, రాత్రి మొదలగువానితోఁ గూడిన కాలమే శరీరముగఁగల ఓకాలస్వరూపా! చతుర్యుగరూపా! అనంతా! నీకివే నమస్కృతులు. నీవుత్రికాలదర్శివి; కాలస్వరూపుడవు, కాలాత్ముఁడవు, కాలకారణుఁడవు. కాలజ్ఞులకును నీవెఱుకపడవు. ఓవిశ్వమూర్తీ నీకివే నమస్కారములు. ఓ మధుసూదనా! ఆద్యంతములులేని పంచమహాభూతములు నీ స్వరూపములె. ఓ భూతభావనా! భూతేశా! నీకివే వా సాష్టాంగ నమస్కారములు. ప్రాణాత్మునకు, ప్రాణములు, పూనివట్టియున్నవానికి, గర్మసాక్షికి, నిత్యునకు, సర్వసాక్షికి, సర్వవ్యాపికి, స్థిరునకు, నచలునకు నీకుకైమోడ్పులు.

నీవీయెల్లశరీరములఁ బరివ్యాప్తుండ వయ్యు నీ శరీరములకు, శరీరధారులకుఁ బరుఁడవు. ఈశరీరముల చేనగు కర్మలకుంబరుడవు. విశుద్ధ స్వరూపుండవు. నీకువివే వాచేమోడ్పులు. వేదస్వరూపా! వేదవేత్తా! నీవణువునకును నణువైనవాడవు. మహత్తునకును మహత్తయినవాఁడవు. బృహత్తులకు నెల్ల బృహత్తయినవాఁడవు. ఓ విశ్వమూర్తినీకివేనమస్కృతులు. నీవాకాశస్థితుండ, వాకాశగుణుండవయ్యు నాకాశగుణంబులకు, శబ్దంబులకుఁబరుండ, వతీతుండవు ఓయాకాశస్వరూపా! అయాకాశమునకుంగతి యైనవాడా! తద్గుణాతీతా! ఖగేశ గరుడు వారూఢుండనైన దేవా! నీకిదే నమస్కరించుచున్నాను.

జ్ఞానికి, జ్ఞానాత్మునకు, జ్ఞానరూపునకు, జ్ఞానగమ్యునకు జ్ఞానద్రష్టకు, జ్ఞానులందెల్ల జ్ఞానికి, జ్ఞానులకును నందనివానికి నీకు నిదే నమస్కరించుచున్నాను. నీవ వేదస్వరూపుఁడవు , వేదవేత్తవు ; వేదవేత్తలందెల్ల మేటివి. ఓ వేదాంత వేద్యా వేద స్వరూపా! బ్రహ్మ స్వరూపా! నీకిదే సాష్టాంగ నమస్కార మొనరించుచున్నాఁడను. ఓ పరమాత్మా! నీవక్షరుఁడ వక్షరులకెల్ల నాదియైన వాఁడ వక్షరాకారుఁడవు. క్షరాక్షరముల రెంటికి నతీతుఁడవు, పరుఁడవు నీకిదే నమస్కరించుచున్నాను.

నిరంతరానందమూల కందునకు, జిష్ణునకు, దండములు. అగ్నియంద లియుష్ణతయు, జలములందలి చల్లందనమును, భూమి యందలి సౌగంధము, వాయువందలి స్పర్శత, యాకసమందలి నైర్మల్యమునీవె. నీకిదెయెల్లవేళల మ్రొక్కు లిడుచున్నవాఁడను. ఓపరంధామా! పరమాత్మా! నీకేశములందున మేఘములు, నవయవనందుల నదులు, నుదరమున నెల్లసంద్రములు, విరాజిల్లుచున్నవి. ఓ జలస్వరూపా! నిరాకారా! నీకివే సాష్టాంగ నమస్కారములు సొనరించుచున్నాడను. స్తోత్రములు, స్తోత్రములచే స్తుతులొనరించువాడు, స్తోత్రములచేస్తుతింపంబడు నాతఁడు, స్తుతులును, స్తుతులకు మోదమంది హితమొనరించు నదియు, నాహితమును సర్వమును నీవ, ఓస్తుతి స్వరూపా! నీకివే సంస్తుతులు.

అద్భుతాకారునకు, శార్ఙ్గధరునకు, భక్త ప్రియునకు, శాంతునకు, భక్తవత్సలునకు, భక్తజనపాపహరునకు, భక్తజనవశవర్తునకు, నీకిదే భక్తి వినమ్రుడ రక్కసులను, లోకకంటకులను వధియించి కరుణను జగముల రక్షించు దేవునకు నివేకై మొగుపులు. పెన్నురమున శ్రీవత్సమును, దానిదరిని, లక్ష్మిని ధరించినవానికి, శార్ఙ్గధరునకు సుదర్శన పాణికి నీకు మురహరునకు వందనములు. పద్మదళములట్లు లొప్పు మృదుహస్తముల బద్మములబట్టి దివ్యాభరణభూషితనై శ్రీదేవియు, భూదేవియు నిరుకెలఁకుల నిలిచి సేవలొనరింప నలరుచున్న నీకునో శ్రీనివాసా; ధరణీధవా! వేవేలు వందనములు.

ఓ దేవదేవా! నీయీ మహదైశ్వర్య రూపముంగాంచిన, చరాచరభూత జాలము కడుంగడు భీతిని చలించుచున్నది. భవదీయమాయామోహితమై సుస్థితినందఁజాలకున్నది. ఓభీమరూపా! నమస్కారములు. ప్రసన్నుడవుకమ్ము. ప్రళయ కాలమందలి, కోట్లకొలది గనైనయగ్నుల కాంతుల వంటి దేహకాంతుల దెస లలుముచు లోకములనిండించుచున్న యోదేవా! రత్నాంగదభూషిత భుజా ! సహస్రబాహా! నీకివేవందనములు. ప్రసన్నుఁడవు కమ్ము. ఓజగన్నివాసా! దేవేశా! పరమాత్మా! ప్రాకృతజనములట్టుల దేవతానరులు లోక పాలురు నెల్లదేవతలును విమానముల నంబరమున నుండి, వెరపుగదురు మనమ్ములి, నమస్కృతులొనరించుచు, వినుతించుచున్నారు. పరమాత్మా, పరంధామా, తప:

ప్రభావమున, దమయనుగ్రహాతిశయమున దమమహిమాతిశయమున, దమ శరీరముననే నేనిట నిప్పుడు చరాచరముల, భూతకోటుల నెల్ల నెల్లలోకముల, దేవతల, దేవవరుల, నెల్లరం గాంచఁగనుచున్నాను. వారెల్లరును వచ్చుచుఁబోవుచు, వినతులు, వినుతులు పొనరించుచున్నారు. ఓదేవ! ప్రసన్నుండవుకమ్ము. అనేకానేక రత్నాలంకారకాంతులచే మెఱుపుల మిఱుమిట్లు పొందు మేఘములట్టి దేహకాంతుల నొప్పునోదేవా! జగన్నివాసా! ప్రసన్నుండవుకమ్ము. ప్రళయకాలమందలి సూర్యాగ్నులట్టి కాంతులజల్లు నీముఖముల కాంతులును భయంకర దంతముల. కటకటలును గాంచుచు వినుచు నీలోకము లెంతయు వెఱపందుచున్నవి. ప్రసన్నుండవుకమ్ము. ఓదేవ దేవా! విశ్వమూర్తి! బ్రహ్మ శంకరుండాది దేవుల గంధర్వయక్ష వసురుద్రాదుల నెల్లర తమదేహముననే నేను గాంచుచున్నాడను. నాకేదిక్కును దోచకున్నది. నాకేమి యుందెలియరాకున్నది. ఓ భగవన్ నేనెంతయు వెఱపును దుఃఖమును బొందుచున్నాను. ప్రసన్నుండవుకమ్ము. ఓవిష్ణుదేవా ! భక్తజన సంత్రాణపరా పరమార్థ రూపా ! ప్రసన్నుండవగుము. భక్తానుకంపితా! కృపానిధానా! మనోహరరూపమున దోచి యనుగ్రహింపుము.

## వాయువునకు భగవంతుని వరదానము

అంతశ్రీభూసహితుఁడు, శంఖచక్రగదా ధారి వరదుడు విష్ణు భగవానుడెంతయుఁ బ్రసన్నుండై యెదుటందోచి వాయుదేవుంగని యిట్టులనియెను. ఓసదాగతీ! నీకెంతయు శుభమగుగావుత! నీమనమున గలకోరికేమి? కోరుము. అన్ననాలించిన యనిలుఁడు దేవుంగని మ్రొక్కి యిట్టులనియెను. ఓదేవేశా! పరమేశా! నాకేమియుంగోరికలు లేవు. ఓరమాపతీ! నాకున్నదీ యొక్కకోరికయే. నేనెల్లపుడు తమచెంతనేయుంటి యుండఁగోరికిపడు చుంటిని. అన నాలించిన దేవుండు ప్రసన్నమతినిట్టులనియెను. ఓయీ మాతరిశ్వా! నీతపః ఫలము నీకుం గలుగును, నీకోర్కెసిద్ధించును. ప్రాణులకెల్ల నీవెప్రధానాంగమవు, నాకును ప్రధానాంగమవై వర్తిల్లుము. ఇటనాసాన్నిధ్యమున మేలగుచుఁ బ్రీతినొందుము. ఎల్లప్రాణులనెల్లయెడల నేవ్యాపించియున్నాను. ఎల్లెడలవ్యాపించి నా పాన్నిధ్యమును, సేవను పొందితరింపుము. అందిటి వన్నియెడల నన్నుంగాంచి దరిపి సేవించితరించుము. తారకాసుర వధానంతరము వానింబంపిన పాపపరిహారార్థము దైవత సేనాని షడాననుడిటఁ గుమారతీర్థముననుండి తపమాచరించు చున్నవాఁడు అటుల నెనీవును నుండుము. వేమను నాయద్రిరాజమువవె యావాప మొనరింతుమ. నీవ నగరాజముననెవసించుచు దివ్యసుగంధిత పుష్పముల మాగు లాడించుచు నాయాదివ్యసు గంధముల మమ్మలరింపుము. తత్తద్దివ్యామోదములం గొవి

యా యా యెడలంగల భక్తుల నలరింపుము తరింపుము ; తరింపంజేయుము. ఈ యెడ రాజాలక మమ్ముంగను కోరికింబరితపించు వారింగూడ తరింపంజేయుము, సుగందితామోదితులంజేయుము. ఓయీ జగత్త్రాణా! నీవిపుడొనరించిన యీస్తవ రాజమునిట్లే భక్తియుక్తి, యోగమతి, పఠించుచు, నొనరించుచునుండ వారును మదీయాను గ్రహముంబొంది తరింపంగలరు సుమా యనుచు ననుగ్రహించి యాదేవుండం తర్ధానుండాయెను.

## శివుడు వృషశైలమునకుం బోవుటకు ముందు జరిగినగాథ

ఓ పర్వతరాజతనయా! దేవాదిదేవుడు పర్వతశిఖరమున ననేకానేక వృక్షములచే బరివ్యాప్తమై యెల్ల ఋతువుల మహదానంద గుణములచే నొప్పియున్న యావృషశైలమున, స్వామి పుష్కరిణికి సమీపమున, రూపలావణ్యమూర్తియై నిత్య నూతన యౌవన లావణ్య మూర్తులగు శ్రీ భూదేవులతో వినోద విహారములొనరించుచున్నవాడు. అచటనే యో హైమావతీ! మనముద్దులకుమారుఁడు కార్తికేయుఁడును చైత్రమాసమున, శుభదినమ్మున భగవానుని దివ్య దర్శనముంబొంది ముప్పేళల భక్తితన్మయతనా భగవంతు నారాధించును దేవగంధర్వ కిన్నరాప్సరసలయాటలు, పాటలు, వాద్యమ్ములు నాలించుచు నాపర్వతోత్తమ భాగమ్మునఁగుహాంతరమ్మునఁ గుమారధారికయను నాపవిత్ర నిర్ఝరిణీతటమ్మున లక్ష్మీ మనోనాయకు భగవాను శ్రీనివాసు జపించుచు, దననెమలి వాహనము తోడంగూడి నియమ నిష్ఠల నానందమున నున్నవాఁడు.

భయంకరమును దుస్సహమునునగు నాఘోర బ్రహ్మహత్యాదోషము, వేంకటనగ శిఖరమును వనన్యభక్తింజూచినంతనే, నారాయణ మంత్రజపము చేతనే పటాపంచలై, తొలఁగినశించిపోయెను. మఱి కుమరుఁడచటనె యుండి నిత్యమును, శ్రీహరింగాంచుచు, సేవలొనరించుకోర్కిని మునింగియున్న వాఁడు, దేవుసేవలు వీడి యాతఁడిటకు మఱలిరా గోరిక నందకయున్నవాఁడు.

అటుపిమ్మట నోదేవీ! కొంత కాలము కడచిపోయెను. భగవంతుఁడా దివ్యనగ శిఖరమున నుండి విడిచి రాకుంటకు గరుడుండు కడుచింతించి యీరత్న మండిత, కాంచనమయ, వృషాచలమును నేపెల్లగించికొని పోయి యట వైకుంఠంబున నుంతునని యోచించెను. ఆతని యాభావన నెఱింగిన దేవుండు చకితుండై చిఱునవ్వొలయు మోమునవానైనతేయుం గాంచియిట్లనియెను. ఓమహాబలీ, పక్షిరాజా! నేనొక మంచిమాటంజెప్పెదనాలింపుము. మనమందఱమీ పర్వత శిఖరమ్ముననే సతతము నివాసముండుదము. ఈవునువరుదెంచి యీ పర్వత దక్షిణ శిఖరమున స్థిరనివాసము

గానియుండుము; అంచు నాదిశేషుంగని, ఓయనంతా, ఆదిశేషా! నీవటగరుడుని నివాసమునకుం దిగువ శైలరూపముంబొంది యుండుము. అని తక్కుంగల తవవారలంగని, మీరెల్లరు నీపర్వతము నందంతట నిరవగునెడలం దావులొనరించికొని నెలవుకొని యుండి నాకుంబ్రమోదముం గూర్పుఁడు. ఈ లోకహితమును గోరి, తద్రక్షణార్థమై, యేనిట నీకల్పాంతము దనుకవాసముండు వాఁడను అనెను.

దేవీ! భవానీ! వింటివిగదా దేవుదివ్యచరితము యుగయుగమ్ములనీ గిరివరము వివిధములగు, నొప్పగు పేరులొంది విలసిల్లుచున్నది. కృతయుగమ్మున నిదివృషాద్రి యనంబడుచుండ త్రేతను గరుడాచలంబనియును అంజనాద్రియనియు, ద్వాపరమున శేషశైలమనియును బరఁగును. మఱికలియుగమున నిది, వేంకటనగం బన నొప్పును. "వేం "కారమిదియమృత బీజము." కట" మన నైశ్వర్యము. అమృతైశ్వర్యము లొసంగునది, మోక్షభాగ్యము నొసంగునది కావున నిది వేంకటశైలమనఁ బరగుచున్నది. మఱియు యుగ యుగముల మునితల్లజులు, మనుజవరులు నీనారాయణాద్రిని పెక్కులగు దివ్యనామములఁ బలుకుచు వినుతింతురు. ఓదేవీ! యట్లాదేవుండా గరుఁడాదులకుంజెప్పి పుత్తెంచిన రమణీమణి సిరితో కలుములచెలితో విహరించుచు నెల్లపుడువినోదించుచు, దేవమానవానురాదులచేఁ బూజలందుచు నటస్వామి పుష్కరిణీతటమున నివాసమొనరించుచు భక్తులం దనియించుచునున్నవాఁడు. ఓహిమగిరితనయా! సుగుణాలయా! సర్వమంగళా! మనమును మనగుణములతోఁ బరివారముతో నా గిరివరమున కుంబోదము. పదపద మనము నచ్చట దేవసేనాపులిందులతో వినోదించు చుండు కార్తికేయుని గుమారుని గాంచుచు ముదమున నివసింతము.

## వృషభాసుర చరితము - వృషభాచల నామప్రాప్తి

తొల్లి వృషభుండను రక్కసుండు మిక్కిలియుంగ్రూరుడై శేషశైలముమ, దత్పరిసరప్రాంతమును నాక్రమించి యందలిమునులఁ దపోధనుల, జనులఁ బలు విధముల నిడుమలు పెట్టసాగెను. వాఁడుపెట్టు బాధలు పడఁజాలక తాపసులా హ్వానీకేశు శ్రీనివాసుందరియం బోయి యా భక్తాభయప్రదాతను శరణుజొచ్చి సర్వంబును కాదికారణుండగు స్రష్టయు, విధాతయునగు నాదేవుఁబరిపరి తెఱగులఁ బ్రస్తుతు లొనరించిరి. వారికింబ్రసన్నుండై యాదేవదేవుండెదుట బ్రత్యక్షుండాయెను. ఆదేవుంగాంచి వారిట్లని మొఱలిడిరి. ఓ యక్షర పరబ్రహ్మస్వరూపా! భగవానుఁడా! మాకు నీవదిక్కు. వృషభుండను దుష్టదానవుండొక్కరుఁడు మమ్ములనెంతయు విక్కట్టులఁ బాల్పఱచు చున్నవాఁడు; ఏమియు మాతపములు సాగనీయఁడు, అతఁడు పెట్టవి హింసలేలేవు.

ఆకట్టిడి దైత్యుని పాలనుండి మమ్ముల రక్షింపుము. మాకు వానివలన భయముంబాపుము. అని దండములిడుచు నిలుచున్నవారికి శ్రీహరి యిట్లులనియెను.

ఓముని వరులారా! యాలింపుఁడు. మున్నీ వృషభుఁడు కడుబలవంతుఁడు నుద్దండుడునై, తుంబుర తీర్థంబునఁద్రికాలంబుల స్నానంబు లొనరించుచు, నధోముఖియు, భయంకర ముఖియునైన నృసింహస్వరూపిణి యగు సాలగ్రామ శిల ననేక వత్సరంబులు నియమ భక్తిపూర్వకముగఁ బూజించెను. పూవులకుమారుగ నతడు తనతలనే నరికికొని పూజించెను. మఱల నాతనికాతల యెప్పటి యట్ల మెడపై మొలిచి నిలిచెను. ఇట్లు దినదిన మాతఁడు తనసిరసునే పూలుగఁజేసి యర్పించుచుండ నాతని పూజలకుమెచ్చి ప్రసన్నుండనై వానికెదుటం దోచితిని. వాడును నన్నుంగని ముదంబున దండప్రణామ మొనరించి మేనుమఱచి కొంతతడవునకుఁ దెలివొంది లేచినన్నుంగని యిట్లనెను. యాదిదేవా! కేశవా! జగన్నాథా! నాకేమియు స్వర్గమును వలదు, మోక్షమునువలదు. నేనేబ్రహ్మపదమును నాశించుటలేదు. కాని నేకోరునది యుద్ధభిక్షయు, నీతో రణమొనరించుటయె నాకోరిక. అదియ నాకు నీవొసంగుము. నేను వివిధావతార విభూతియు, వందు నీపరాక్రమమును వినియున్నవాఁడను. ఆతేజో విక్రమములు నేడు నాతోడి సమరమున సత్యమొనరింపుము. అనుచున్నవాని యా యుద్ధ దుర్మదమున కెంతయు నాకునవ్వు కలిగెను. అపుడు వానితో నేనిట్లంటిని. రాక్షసవరా! నీవాంఛితము నెఱవేరఁగలదు. ముందుముందు నీయభీప్సితము సఫలము కాఁగలదు. దానికిందగు కాలము రాఁగలదు; అనియంతర్ధానమందితిని. విచారింపకుఁడు. వానికోరికియుం దీరును, మీకు సుఖమును నబ్బును. అనుచు నాయరిమర్దనుఁడు దామోదరుఁ డప్పుడె యావృషభదైతేయుని మీదికింబోయెను. కదన మొనరింప వైకుంఠుండు తనపైకి నెత్తి వచ్చుచున్న వాఁడవి యెఱింగి వృషనిశాచరుండును సన్నద్ధుఁడై వచ్చి వానినెదిర్చినిలిచెను. వృషాసురవాసుదేవుల కట ఘోరానీకము ప్రవర్తిల్లెను. అందా దనుజవైరి యే మొనర్చిన నది యా దానవుండును పొనరించును. వాని సమరాటోపము, రణకౌశలముం గనుచున్న త్రిదశులకును మిక్కుటమగు నబ్బుర మొదవెను. ఇంతయేల ! భగవంతుఁడె యాతని స్వయముగ బాగుబాగని ప్రశంసించెను. ఆలమాభీలముకాగా నంబుజనాభుండా యాతుధామంగమంగొని, ఓయీ సురద్విషా! ఇదోచూడుము నాసౌరుష శక్తులు అనుచు ఖగేశ్వరుఁడు. వికటోత్కట భయంకర వికృత రూపుండై తోచెను. వానిపై విష్టరశ్రవుఁడు, పుండరీకాక్షుండు వేయి బాహువులతో వెలుంగుల యాయుధముంబట్టి భీకరాకారుఁడై యవ్యయవిశ్వరూపమునఁ బ్రత్యక్ష మాయెను. అదిగను గొన్నియా క్రవ్యాదుడును, నావిష్ణు మాయనమకరించుచు, రాక్షసమాయను బ్రదర్శించుచు దానును గరుడారూఢుఁడును వేయిచేతుల వాడును వైవికటాట్టహాసమువఁబోరుసాగింపసాగెను. అదిగన్నది వొకసులును

నెవ్వరెవ్వరో యేర్పరింపంజాలక మోహమున మునింగిరి. ఆనక్తంచర మాయల నెల్ల విధముల నతిక్రమింపఁగల వాఁడయ్యు నాపసిడిపుట్టము తాలువు వాని బాపురె బాపురె యనుచుఁ బొగడెను. పిమ్మట నిట్లనెను. ఓయీ యమరారీ! ఇకనీవు లేవు. ఇదిగో నాచక్రధారల నీతలతాటి పండట్లు నేలరాల్చెదనన నావేయంచులవాలు ప్రభావము నెఱింగిన వాఁడగుట నప్పుడ యారాత్రించరుఁడు నారాయణ దేవునకెదుట సాష్టాంగదండ ప్రణామంబొనర్చి లేచి పలుతెఱంగుల ప్రస్తుతు లొనరింపసాగెను.

ఓ చక్రపాణీ! చతుర్భుజా! సదయహృదయా నీమహిమ నెఱుంగ నెవరికేమి వశము? దేవదేవా! యదంతయుఁ దెలియునాకు. ఈ నాచేత నిన్నెఱుంగక యేమికాదు. తమచేతి చక్రాయుధమహిమయును నాకు దెలియును. చక్రతప్తులగు వారవశ్యము ముక్తి లాభముంబొందుదురు. తప్తచక్రముద్రల నందినవారు, అన చక్రముద్రాంకితులు మహారాజులై యవిరళకీర్తిలాభము నందుదురు. అట్టిచో సుదర్శన చక్రధారల హతుఁడనైననేను పొందునది మీలోకమే. వైకుంఠ సదన ప్రాప్తికంటెను నాకుం గావలసిన దేమి? అనుచునా దేవదేవుదివ్య పదములంటి యానందగద్గదభాషల నిట్లనియెను. ఓ దివ్య ప్రభావా! నాకీ యొక్కవరముం బ్రసాదింపుము. ఈ పర్వత రాజము నాపేరున విరాజిల్లుగాత మనుచుండ నాతనిందన చేతులందీసికొని నీయభిలాష యెట్లట్లు యగుగావుత మనెను. ఇంతలోనన కేశవప్రేరితమగు నా గుడునుకైదు వారక్క సితల నటికి యునురులు బాపెను. అప్పటి నుండియు నాగిరి వృషభాచలమనియు వృషశైలమనియు నొప్పెను.

## త్రేతను అంజనాద్రియను పేరుగల్గుట

అదియాలించిన రాజు శతానంద మునివరుంగాంచి గురువరా! యీ త్రేతా యుగమున నీధరాధరమునకు నంజనాద్రియను నామమెట్లుకలిగె? సెలవీయుండన గురుండిట్లని చెప్పందొడంగెను.

ఈ త్రేతను కేసరియను వానరశ్రేష్ఠుండొకఁడుండెను. అతని ధర్మపత్ని యంజనాదేవి. సుశీల సంపన్నయగు నాపతివ్రతాశిరోమణి యందమునకుం బెట్టినది పేరుగనుండెను. చిరకాలమయ్యు నాపుణ్యదంపతులకు సంతానము కలుగదాయెను. దానికైవారెంతయు వగను గుందుచుండిరి. బిడ్డలు లేక వెతనందుచున్న యాయమ యొకదినంబున మతంగమున్యాశ్రమమున కుంబోయి, యామునితల్లజు పదముల కెఱఁగి తనదుఃఖమును గద్గదకంఠమున నివేదించెను. కనులనీరు గ్రుక్కుచు, ఓ తపోధనా! సంతానవిహీననగు నాగతియేమి? అని విలపించు నంజనయందు మిగులఁ గనికరము కలవాఁడై మునివరుండిట్లనియెను. బిడ్డా! విచారింపకుము. ఈ భూతలమున,

పంపాసరోవరమునకు నేబదియోజనముల దూరమునఁ దూర్పుదెస నరసింహాశ్రమము కలదు. దానికిం దక్షిణపుదెసను నారాయణాచలము నందున స్వామి పుష్కరిణికి నుత్తరమున నొకకోసెడు దూరమునఁ బ్రఖ్యాతమగు నాకాశతీర్థంబుకలదు. ఓకళ్యాణి యటకానందమున, సుఖముగఁబోయి యట, నాపుణ్యతీర్థంబునఁ బవిత్రజలముల దినదినము మజ్జనమొనరించుచు నియమ తపంబుల దేవునారాధింపుము అపుణ్యమున నీకు గుణాధికుఁడుఁ తేజోధికుఁడు, నగుకుమారుఁడు కలుగఁగలఁడు అనెను. ఇట్లు మతంగముని నుండి యనుమతింగొని బయలువెడలి యటనుండి పోయి, పతిదేవుని కడనుండి పెద్దల నుండి యంగీకారముం దీసికొని నారాయణగిరిం జేరెను. అటస్వామి పుష్కరిణిని స్నానంబులొనరించి, యశ్వత్థ వృక్షరాజమునకుంబ్రదక్షిణ ప్రణామంబు లొనరించెను. పిమ్మట వరాహదేవుందర్శించి నమస్కృతు లొనరించి వరాహ తీర్థమున బావనజలంబులతానమాడి, ముందునకు సాగిపోయి యాకాశగంగను జేరియందున మజ్జనమొనరించి తపశ్చర్యకుంబూనెను. పతిదేవుని మునిచంద్రుల నెమ్మనమునెంచి యా మంత్రించి వ్రతమునకయి, భక్ష్యములువీడి, యుపవాసముంబూని, యాతరుణీమణి బాహ్యభోగముమాని, శుచియై పవిత్రప్రదేశమునఁదనతనువును గాష్ఠమట్టుల నిలిపి తపమునొనరింపంబూనెను. ఇట్లు కఠోరనియమంబులఁ దపశ్చర్యల నొకయేడు కడచెను. ఆకాలమున మహాబలుఁడు వాయుదేవు డామెయందునఁ గనికరమూని దినదినము మునిమాపున, ముని వేషమునంది తీయనిమంచి ఫలములందెచ్చి యామెకునిచ్చి పోవుచుండెను. ఒక దినమున నీశ్వరభగవానుడొక ఫలమునఁ దనతేజము నింపి యావాయువున కిచ్చెను. వాయువాఫలము నంజనాదేవికరముననిడి పుత్రవతివికమ్మని యాశీర్వదించి పోయెను. ఆమెయు నాకలింగొన్న దగుట నప్పుడేయాఫలమును భక్షించెను.పిదపనామె గర్భముందాల్చెను. వాయుదేవు ననుగ్రహమున, నాదేవువరమున నామె గర్భముందాల్చెనని తెలిసిన మునులును వేలుపులును నెంతయు ముదమందిరి. ఆ పిమ్మట నామె దశమ మాసాంతమున, నుత్తముఁడు తేజోవంతుఁడు నగు పుత్రుంగనెను. పవిత్రులగు మునివరులాబిడ్డనికి హనుమంతుండని నామకరణం బొనరించిరి. ఆపర్వతమున నంజనా తరుణీమణి తపశ్చర్యలు నడిపి లోకోత్తరుఁడు దైవకార్యాచరణ దురంధురుఁడు నగు పుత్రునిం గన్నదగుట నాశైలమంజనాద్రియని లోక విఖ్యాతినందెను.

ఓం శ్రీ త్రివిక్రమాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ అచ్యుతాయ శ్రీ వేంకటేశాయ నమః

## అగస్త్య ముని వరురాక - తపమాచరించుట

ఆకాలముననే భగవద్దర్శనమాకాంక్షించి యగస్త్యమునివరుండు మలయాచలమున నుండి తపసు నాచరించుచుండెను. అటకుఁబరమేష్టియేగి ఓమునివృషభా! యిటఁగాదు వేంకటగిరికింబోయి తపసునొనరింపుము. త్వరలోసిద్ధింబొందఁగలవు, అని పల్కి యంతర్ధానమందెను. అదివిన్నయామౌనియు వేంకటాద్రికింజేరి ఘోరమగు తపము నాచరింపసాగెను. పెద్దకాలమున కాతని కొకనా డశరీరవాణినుండిట్లు వినవచ్చెను. ఋషీవరా! లెమ్ము, లెమ్ము. ఇటనీపావనాచలరాజమ్మున బలుదివ్య తీర్థమ్ములు కలవు. వానియం దెల్ల మునుకలిడుము. వాని పవిత్రతనీచే లోకప్రసిద్ధమగుగాక. ఉత్తమ విద్యాప్రాప్తియు, శాస్త్రాధ్యయనమును, దయా సత్యశౌచమ్ములును, బవిత్రచరితమును, ఎల్లరందున నన్నుంగని, వారిం దగుసేవలఁ దనియించుటయునే, భగవదారాధనము దయయే ధర్మము, అహింసయేయర్చనము. అవ్యాజ నిస్స్వార్థ పవిత్రసేవయే భక్తి; ఇద్దియెఱుంగుము. ఇట్టి పవిత్ర నియమా చరణగలవారే బ్రాహ్మణులు. ద్విజోత్తములు. భక్తవరులు. మఱియొక్క విషయము ఎల్లమానవులకు నదియె యట్టిపవిత్రాచరణమె, మానవత. అట్టి మానవుల్లెరు నాకుంబ్రియతములె. వారును ద్విజత్వముంబొందిన వారెయగుదురు. ఈ వ్యర్థమగు శరీరక్లేశమేల? నాచెప్పి నటుల పొనరింపుము. అదియె నీకు సిద్ధినిచ్చును. ముక్తినిచ్చును. అని వినవచ్చినపల్కులంతలో వాగిపోయెను. అదివిన్న మునితల్లజుఁడగస్త్యుడెంతయుఁ బ్రమోదమంది శిష్యులకెల్ల నాపల్కులు వినిపించి, వివరించి, తెలిపి, సేవాతత్పరులఁ గర్మణ్యుల నొనరించి వారితో గలసి యాయా తీర్థంబులెల్ల సేవించి వేంకటాద్రికిం బ్రదక్షిణంబు లొనరించి, దేవుననుమతి చొప్పున, బ్రజలదనియించుచు, దనియుచుఁదపోసిద్ధి నొందెను. దేవుని పలుకుంగొని, పవిత్రా చరణంబున, సద్భక్తిని నెల్లెడలం గలుగుదేవునింగని పావనులగువారు, గిరితలమునఁ బ్రదక్షిణము లొనరించుచుఁ దన్మధ్యమునఁబితామహుని, నీశానదిశను నీశ్వరుని దూర్పున నింద్రాది దేవతలను, నాగ్నేయమున నగ్నిభట్టారకుని, దక్షిణమున ఋషిమునులతో ధర్మదేవతను, నైరుతిదిశను నపరివారు నిర్బుతిని, బశ్చిమమున రుద్రాదులను నపరివారులుగ దర్శింపఁగలరు. వాయువ్యోత్తర దిక్కుల ఋషిముని యోగులయుఁ బావనులగు భగవద్భక్తులయు దర్శనము కాగలదు. అచటి యగస్త్యుని యునికిం దెలిసిన యోగులు, తపోధనులునగు, మునివరులు నటకుచేరివచ్చి యాదేవుం గొల్చి తృప్తినొంది తరించిరి. తరించుచున్నవారు.

## మాధవుఁడు వేంకటాద్రింజేరుట - పాపవిముక్తి

అత్తఱి దైవయోగమునఁగొందఱౌత్త రాహులగు రాజులు యాత్రార్థము బయలు దేరి వరాహగిరి ప్రాంతముంజేరిరి. అటనటఁ దిరుగుచుఁదిరుగుచు ఒకానొక భ్రష్టుడు అభాగ్యుడు అయిన మాధవుండును వారింగలిసెను. తనగత జీవితమున కెంతయు వగచుచుఁ జేయునదిలేక వారువిడిచిన యుచ్ఛిష్టములుగుడుచుచు వారితోడన పోయి పోయి యేపూర్వ కర్మపుణ్యముననో శేషగిరింజేరెను. ఆక్షత్రియవరులు కపిలతీర్థముంజేరి భక్తి శ్రద్ధల స్నానంబులొనరించి ముండన మొనరించికొని తీర్థస్నానములొనరించిరి. అదిగన్నవాని చేతము, తనపూర్వకర్మలం దలంచి తలంచి యనుతాపమున దగ్ధమగు చుండెను. అట్లు సంతప్త హృదయుఁడగు నామాధవుఁడును నట ముండన స్నానంబులొనరించికొనెను. స్నానపూతుఁడాయెను. ఆరాజులట శ్రద్ధాభక్తులతోఁ బార్వణపిండములనొనర్చి పితృదేవతల కర్పించి యానందించిరి. దీనుఁడు మాధవుఁడును తనగత జీవితమునకు వెతనందుచు, మఱల నట్టి పాపపు భావమునం, బాపపుజీవితమునం బడకుండఁ జేయుమని దేవుంబ్రార్థించుచు నట తానములాడి పితరులకుం బిండ దానములంజేయఁగోరెను. ఏమిచేయును, తనవద్దనేమియున్నది ? అయినను మట్టితోడనె పిండము లొనరించి పితృదేవతలకు శ్రద్ధతో నర్పించెను. పశ్చాత్తప్తుఁడగు వాతఁడా కర్మాచరణముచేతనే పాపముక్తుఁడాయెను. ఎవఁడు భక్తి పూర్వకముగ, పవిత్రమానసమున, నీతీర్థావగాహనమొనర్చి కొని, పితృశ్రాద్ధమును, బిండదానము నొనర్చునో వానికి, దప్పక ముక్తి కలుగును. ఈ పవిత్రపురుషోత్తమ పుణ్యక్షేత్రమహిమను వేమనిచెప్పునది తన కడచిన దుష్కృత్యమునకు, పాపుచేతకు పరితప్తుడై మృత్తికా పిండదానము లొనర్చిన మాత్రముననే యావిప్రునిపితరులెల్లరును నాయాదిదేవు ; దామోదరు, కరుణమ్మక్తి సంపన్నులయిరి. తెలతెల్లవారుచుండఁగనే యాక్షత్రియ సంఘము, పుత్రమిత్రులతో, బంధుపరివారముతో నాపవిత్ర పర్వతారోహణ మొనర్చిరి. వారితోడన యా మాధవవిప్రుఁడును పున్నెములమల నాశేషశైలమునెక్కెను. ఆకొండనెత్తమ్ముల వారెక్కడెక్కడికింబోయిన నాతఁడును నచ్చటచ్చటకుంబోయెను. ఎందెందువారు విల్చిన నాతండు నచ్చటచట నెల్లనాగెను. ఆపవిత్ర పుణ్యభూధరము వంటిన మాత్రముననే, యనుతాపాగ్నితప్తుడైన యాపాపి పాఱునంటి యున్న పాపము లన్నియు గాలివి రావియాకులల్లలాడి నట్లు దడదడలాడిపోవుచున్నట్లాయెను. అగ్గిఁబడిన దూదిపింజమట్లు లఘుములు, వానినంటియున్నవి భస్మములై తొలఁగిపోయినవి. పాపముక్తుఁడగు వానినొక దివ్యతేజమావరించెను. అదిగన్న చెంతలవారెల్లరు వింతలంబడి మఱిమఱి వానిమూగిచూడసాగిరి. దేవతలును మహీధరమాహాత్మ్యమును, మహీసురు

వద్భుష్టమును బలుతెఱఁగులఁగని ప్రశంసించిరి. నిజమునకాతడు చేసిన పాపములు వానిదేహమునుండి వెలువడినంత వానిచే, నాపాపములచే నాకొండయెల్ల కంపుకొట్టిన దయమ్నును. కానియాపావన పర్వతోర్భవపుణ్యాగ్నులచే నవియెల్ల బుగ్గియైపోయినవి. కాకున్నవందుండుటయే యేరికిని వశము కాకుండెడిది. ఆహా! ఏమా పవిత్ర ధరాధరమాహాత్మ్యము! ధన్యము, ధన్యము దానింగనఁ జిత్రచిత్ర విమానముల నెక్కి బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు వచ్చి గగనతలమున నుండి కని యబ్బురమున ముక్కులపై వ్రేల్లిడుకొనిరి. ఆజన్నిగట్టు భాగ్యమునకుం దలలూచి వానిపై పూలజల్లులు గురియించిరి.

## పరమేష్ఠిరాక - మాధవు భావింజెప్పుట

ఆహా! ఏమి శ్రీహరీ నీయనుకంప ఆనాఁడు పాపాత్ము నజామిళుఁజేపట్టి పాలించితివి. ఈనాడీయఘాత్ము మాధవునుద్ధరించితివి. అనుకొనుచు నాపరమేష్ఠి వేలకుందిగివచ్చి యక్కటిక మిక్కుటమగు నెడందతోఁ బాపవిముక్తుఁడగు నాబావని దరియన్వచ్చి యాదరమున నాతనితలఁదనచేయిడి యిట్లనియెను. ఓహెరాహెరా ధరామరవరా! ధన్యుఁడవు. నీవీపుష్కరిణిందానమాడిన మాత్రాననే పాపములెల్లఁ బాసి పవిత్రుఁడవైతివి. పొమ్ము. నిష్పాపుఁడవగు నీవు దయామయుఁడగు, వరాహదేవుం దర్శించినతులు నుతులు పొనరింపుము. ఈకలుషిత దేహముంబాసిన పిమ్మట నీవు మహారాజుగఁ బుట్టి రాజ్యపాలనం బొనర్పంగలవు. తుండీరమండలమును బాలించుచున్న పాండవ వంశోద్భవుఁడగు మిత్రవర్మయను రాజు తన ధర్మపరిపాలనచే సుధర్ముఁడన నొప్పును. వానిపట్ట మహిషి మనోరమ పాండ్యరాజ దుహిత, ధర్మానురక్త, పవిత్ర అపుణ్యదంపతుల బిడ్డవై ఆకాశవర్మ (వియద్రాజు) వనునామముల నొప్పుచు నారాయణపురము రాజధానిగ, నిష్కంటకముగ, ధర్మయుక్తముగ రాజ్యపాలనముం జేయుము. జగన్మాతయే నీకుం బుత్రికాగలదు. జగన్నాధుడే నీకల్లుడు కాఁగలఁడు. ఆమీఁద నీవు వైకుంఠధామముం బొంది తరింతువు. అనుచుఁ జతురుఁడగు నాచతురాననుఁడు ఆయద్రిరాజమును, ఆ మాధవు నట్టివాని మహాపాపములనే నాశమొనరించినదగుట వేంకటాచలమను పేరంబిలిచెను. "వేం" అన మహాపాపములను, "కట" అనదగ్ధమొనర్చునది యనిభావము. వేంకటాచలమన మహాపాపములను దగ్ధమొర్చివేయు పర్వతరాజము అని భావము. అప్పటి నుండియు నిజమగు పరితప్త హృదయులగు వారి మహాపాపములనెల్ల భస్మమొనర్చునదై వేంకటాద్రియను పేర వర్ధి ల్లుప్రసిద్ధమై యుండెను. ప్రొద్దుప్రొద్దుటనే లేచి పవిత్రమగు మనమున నీ వేంకటాచల నామమును, వేంకటాద్రీశుని స్మరించునాతడు, గంగాది పవిత్ర తీర్ధదర్శన స్నానముల,

సేతుదర్శనస్నానముల నొనర్చిన మహాపుణ్యము నందఁగలఁడు. అతఁడాదిన మంతయునేకాదు; భావిజీవితమంతయు నేవిధమగు పాపముల జోలికింబోక పావనముగఁ గడుపునుగాత. పాపములొనరించుచు వేంకటాద్రింజేరి పుష్కరిణిం మున్గుచుండిన పాపము పోవునని మాటిమాటికిం బాపము లాచరించువాడు. మోసగాడు దేవునే మోసగింపనెంచువాడు మహాపాపి వానిపాపములేమియు నశింపవు. ఇంకను ఇనుమడిముమ్మడి గాగలవు. కావున జీవితముం బావనముగ గడుపువానివే గతపాపములు తొలగును వానికి ముక్తి చేపడును. అనుచు పవిత్ర పరమకళ్యాణ దాయకేతిహాసమును దనతండ్రి గౌతమ మహర్షి తనకుం జెప్పెనని శతానందుఁడు జనక నరపాలునకు వివరించెను. అద్భుతము హర్షదాయకమునగు నీకథయంతయు నాలించి జనకమహారాజ వరుండెంతయుఁ బ్రసన్నచిత్తుఁడాయెను. తనగురువరు బురోహితు శతానందుని గనుంగొని మఱియు నిట్టులనియెను. ఓగురుదేవా! విప్రవరా! మీయీ చెప్పిన యాఖ్యానమెంత విన్నను తనివి తీరుటయేలేదు. కావున నాకును నావేంకటాద్రీశునింగూర్చి యింపగుకతలు చెప్పంగోరెదను. అన్న జనకనరపాలునితో శతానందుఁడిట్టులు చెప్పసాగెను. ఓ రాజా నేను విన్నదాని వివరించి నీకుం దెలియఁ జెప్పెదను; మనసుంచి యాలింపుము. ఆనాడు ప్రాచీన కాలమున వామదేవముని వరుఁడు యజ్ఞకాలమున నిమికుమారుఁడగు మిదికి జనక నరపాలునకుంజెప్పి వినిచిన యాకథనె యిప్పుడు మీకు వివరించి చెప్పెదనాలింపుడని రోమహర్షనుడు శౌనకాదుల కిట్లనెను.

## అగస్త్యాదులు పరదైవమును నారాయణదేవు నన్వేషించుట

ఒకప్పుడు మిధి నరపాలుఁడు విదేహుండని పిలువంబడు నాతడు మీపూర్వజుడు, జనక బిరుదభాసితుఁడు గంగానదీ తీరమున నశ్వమేధ మహాయాగముంబొనరించుచు వ్రత దీక్షితుఁడైయుండెను. వ్రతదీక్షితుఁడగు నారాజవరు కడకు మునివరులే తెంచిన వారింబూజించి, రాజు ప్రేమతన్మయుఁడై ప్రసన్నమతి వారితో నిట్లనియెను. ఓమహామ భావులారా! మీరందఱిటు నాయజ్ఞవాటికకు ననుగ్రహించివచ్చి నిజపాద తలమ్ములం బవిత్రమొనర్చితిరి. నేనెంతయు ధన్యుఁడనైతిని.నాజన్మము సఫలమాయెను. నాతపమ్ము ఫలించినది. ఇట్లును రాజవరు సౌమ్య వచనంబులకెంతయు నలరి మునివరులు ప్రసన్నులై యా రాతిరంతయు నటనె నిలిచిపోయిరి. పరస్పర ప్రీతిసంభాషణముల నారేయిగడచెను. తెల్లవారెను. ప్రాతఃకాలీన సంధ్యాదికర్తవ్యముల నెల్లనెఱవేర్చికొని మునితల్లజులు రాజవరు యజ్ఞవాటికకు నేతెంచిరి. అట భూపతి చెంతనె వారువవిష్టులై పరస్పరము

శ్రీమన్నారాయణదేవు దివ్యగాధలంజెప్పికొనుచు నుండిరి. అంతలోనప్పుడె మహాతేజస్వి, మునిశ్రేష్ఠుండు మహర్షి వామదేవుండు భూమండల మెల్ల బరిభ్రమణంబొనరించుచు నచ్చటకు వచ్చి చేరెను. వేదపారగు నాఋషితల్లజు, నభ్యుత్థాన మొనరించి వారెల్లరుంగొనివచ్చి సుఖాసీనుంజేసి యిట్లులడిగిరి. ఓ విభూ! వామదేవా! మీరిప్పుడీ భూమండల మంతయుంజుట్టి వచ్చితిరి. కావున మేము మీనుండి శ్రీమన్నారాయణ భగవానుని శుభమయ గాధల నాలింపఁగోరుచున్నారము. దేవాది దేవుఁడు శ్రీనివాసుఁడు, జగత్పతి భగవానుఁడిప్పుడెచ్చట నివాసమొనరించి యున్నవాఁడు? వారియానివాస స్థానమెచ్చట? మహాత్ముండగు నీజనక భూపాలుని యభిలాషయు నిదియెటుంగనె ప్రేమంజెప్పరే, యని వారడిగినంత వామదేవ తపోధనుఁడిట్లులు చెప్పందొడంగెను.

ద్విజవరులారా! ముని తల్లజులారా! ఇచటికి దక్షిణమున రెండు వందల యోజనముల దూరమునఁ బర్వతోత్తమ మొండు నారాయణ గిరియననొప్పియున్నది. అందుననా వెంకటాచలమున దేవకిన్నర గంధర్వ సిద్ధులు తోగూడ మహర్షి వరులు మవ్రతులైనివసించుచున్నవారు. నేను నాగిరివరమునకుంబోయి యుంటిమి. అటనే నగస్త్య నారద, పులహ, పులస్త్య, క్రతు, దక్షిణాంగిరస, జాబాల్యాది మహర్షివరుల యోగాభ్యాసానురక్తులగాంచి వారితో నిట్లంటిని. ఓ మహామభావులారా! మీరెల్లరీ కొండనెత్తమున నేలగుమిగూడి యున్న వారు? అన్న నాకు వారెవ్వరునింతయుఁ బ్రతివచనం బీయలేదు. కాని వారలందలి మహాయశస్వి యగస్త్యమునివరుఁడచ్చటి వారలయునికింగూర్చి యిట్టులు వచించెను.

## మునులకు నారాయణాద్రిని దివ్యమూర్తి దర్శనము

దేవర్షి వర్యుఁడు శ్రీనారదమునివరుఁడు యోగి జనశ్రేష్ఠుండు గోదావరీనదీ తటమ్మున నుండి చిరకాలము తపంబొనర్చి యొనర్చి భగవంతు శ్రీనాదు దరిసెనముం బొందఁజాలని వాఁడై యటనుండి వైకుంఠమునకే యేగియు బరువచ్చటను గాంచనివాడై కడుంగడు నుద్విగ్నమానసుండై దుఃఖ పరితప్తుండై సనాతను బరమేష్ఠింబ్రహ్మను గనఁ బోయెను. ఓపితామహా! సర్వాంతర్యామి, పరమాత్మ, భగవానుఁడెచ్చటికేగెను ? అన్న నారదు నాలించిన లోకపితామహుఁడు చాలసేపట్టిద్యాననిమగ్నుఁడై యుండి, పిమ్మట నెదుటఁ జేతులు జోడించి నిలిచియున్న నారదమునివరుంగని యిట్టులనియెను.

ఓమహాముని ! భూమండలమున నొక్కెడ నారాయణాచలమను పర్వతంబొండు కలదు. పురుషోత్తముండు భగవానుండట నారాయణాద్రిని లక్ష్మీయుతుండై విహరించుచు నున్నవాఁడు. ఆపర్వత శిఖరమ్మునందు భగవంతునకెంతయు నమరాగము. ఓయీ

నారదా! నీకావర్వాత్మ్యం బరమాత్ముం గాంచఁ గోరికయేని యచటికేపొమ్ము. ఇట్లు హిరణ్యగర్భుఁడు పరమేష్ఠి పలికినంత నారదుండచ్చటి నుండి కదలి యీ పర్వతమునకు వచ్చెను. వారిటకు వచ్చునపుడు మార్గమ్మున మేమును వారింగాంచి వారిననుగమించి యిటకు వచ్చితిమి. మాయెల్లరితో నారదమునివరు లీనగమునకుఁజేరికొనిరి. పిమ్మట దేవతలతో గూడిన వాఁడై సురజ్యేష్ఠుండు లోకేశుండు నలువయు నిచటికి వచ్చిచేరెను. తొలుదొల్త నానలుమొగంబుల వేలుపు మాయెల్లరి తోడ నీపర్వత రాజమున దేవు నన్వేషించుచు బాగుగఁ దిరిగియునెందున నాపరంధాము నవ్యయుఁ బరముఁ గనుంగొనక పోయెను. అంతనాతఁడు నారదునితో, మాయెల్లరితోనిట్టులనియెను. ఓతపోధనులారా! యోగితల్లజులారా! ఇటువినుఁడు. ఈ యద్రితలమున నెల్లెడఁ దిరిగి తిరిగి, యెన్నెన్ని మునిజన సంసేవితములు, కొండవాగులు, చెరువులు, నదులు, నదములు, సరోవరములు వాపీకూపములు, బావులుజలాశయములు. గలవోవానియన్నింట మునుకలిడుచు, దేవుధ్యానించుచు నర్చింపుడు. పర్వతము నకుఁ బ్రదక్షిణము లొనరించుచుం దిరుగుఁడు భగవంతుని దరిసెనంబగు వంత దనుక మానక యిట నీకొండనే యుండి తిరిగి తిరిగి నెమకుఁడు అనుచు వచించి తమ్మిచూలి విధాత తన యనుగాములగు దేవతలతో నచ్చటనె యంతర్ధానమాయెను. అటు పిమ్మట నెల్లమునులు నాయవ్యక్తజన్మునకు బ్రహ్మకు నమస్కృతులొనరించి వృషభాచలవాసిని, పరబ్రహ్మను, భగవానుని, వాసుదేవుని, ధ్యానించుచు వారి దర్శించుకోర్కి ముమ్మరముకాగా నీకొండ పడమటి భాగమునఁ దిరిగి యట నుండి యుత్తరముదెసకు వచ్చిరి. అటనగస్త్యముని శ్రేష్ఠుండు, దేవాది దేవుని బరమాత్మను ధ్యానించుచు బమ్మపలుకులుతలఁపునఁ గొనుచు మునితల్లజులతో, గలిసి తానును నిటు నటు నా కొండఁదిరుగాడసాగెను.

సూర్య సమాన తేజోవంతులు, జటామండలధారులు, జ్ఞాననిష్ఠులునగు నాయెల్ల మునులతో నగస్త్యుఁడు కొండను వాయువ్యదిశకుంబోయెను. అటవారికొక యద్భుత దృశ్యము కానవచ్చెను. అట నొకయెడ శుద్ధస్ఫటికమణి యట్టుల స్వచ్ఛము శ్వేతమునై చూచుటకెంతయు నందము, మనోహరమునై నునుపై విశాలమగు నొక శిలాఫలక ముండెను. ఆశిలాఫలకముపై నొకయున్నత దీర్ఘకాయుడు తన మహదున్నతకాయమున రెండవ పర్వతమట్టు లొప్పియున్నవాఁడు. దీర్ఘభుజములు విశాల నేత్రములు, మహాదంష్ట్రలు, హనువుకలవాఁడై రక్తమాల్యాంబరములు దాల్చిన, రక్తచందన మలదికొనిన, రత్నములు పొదిగిన, యెట్టిని ప్రకాశవంతములగు కుండలములు దాల్చిన చంద్రునట్టి స్వచ్ఛమై స్నిగ్ధమగు బంగరుమయమగు ననేకానేక రత్నములు కూర్చిన యత్యంత సుందరమగు, కాంతివంతమగు, కిరీటమును దాల్చిన యొకపురుషమూర్తి యుండెను.

విశాలకాయుఁడును, మహాపరాక్రమియునై, ఆజానులంబిత దీర్ఘభుజములుగల యాపురుషుని వద్దకు, జేరి మునులెల్లరు నెంతయుఁ జకితులై మాటిమాటికా పురుషునె కాంచసాగిరి. సూర్యునట్టి తేజోమయు నాతనింగాంచి ప్రణమిల్లి యగస్త్యముని యిట్లులనియెను. ఓ పరాక్రమీ! ప్రియదర్శనా! మీరెవరు? ఎవ్వారివారు? ఈయది మాకెల్లరకు నున్నదున్నట్టుగ; నిక్కముగ వచింపుఁడు. వినుటకింపగునిట్టి తీయని పలుకులు పలుకుచున్నముని నాలించియు నాపురుషుఁ డగస్త్యమునికి నించుకయుఁ బ్రత్యుత్తరమీయలేదు. మాటి మాటికి వినతులు, వినుతులు పొనరించుచు నిలిచియున్న యగస్త్యు నట్టె యామూర్తికాంచ సాగెను. మఱియు మహాత్ములగు నామునులెల్లరుం దన్నుఁ జూచుచుండగనే యామహాతేజస్వంతుఁడగు నా పురుషుఁడట్టె యంతర్హితు డాయెను. అదియొక వింతయగు విషయముగఁదోచెను. సాక్షాన్నారాయణ పర్వతరాజమే యిట్టులు మహదద్భుత దివ్య శరీరమును దాల్చితోచెను. ఆదేవుడు నారాయణు దివ్యమూర్తియే.

అంతనామునులెల్లరు నాశ్చర్యోత్ఫుల్ల లోచనులై యిట్లుపలుక సాగిరి. ఆహా! మనమెట్టివింతల వింతయగు దృశ్యముంగాంచఁ గంటిమి. అజ్జారే ! సూర్యునట్టి తేజోవంతమగు, నాశ్చర్యమయుమగు, రూపమును జూపించి మనలనెల్లర మాయామోహితులుగ నొనరించి, మనచూచుచుండగనే యింతలో నాతఁడంతర్ధానుఁడై పోయెనే. ఇట్టులనికొనుచు నామునులెల్లరు నద్భుతమూర్తియుఁ దేజస్వియునగుచుఁ దోచిన భగవానునకుఁ బ్రణామంబులొనరించి యొనరించి మఱల నాయద్రిని చరియింపసాగిరి. ద్విజశ్రేష్ఠుండు మహాత్ముండు నగు నగస్త్యముని తల్లజాతోఁగూడి యాయోగివరులెల్లరు నవినాశిని దేవాదిదేవుని పరమాత్మను జూచునాకాంక్షను ఆతావును విడిచియట నుండి యంతంతలోనా నారాయణాద్రిని విశాలమగు విమలమగు నుత్తర ప్రాంతమునకు సాగిపోయిరి.

మునివరులతో మహాత్ముండగస్త్యుండాపర్వతోత్తర భాగమునఁజరించుచు వింత వింత సుందర దృశ్యములు పెక్కులు గాంచెను. అందంతట పెద్ద పెద్ద విశాలోన్నతములగు నేరేడుచెట్లు నిండి యుండి ముదమును గూర్చుచుండెను. అందాయాయెడల పాపములెల్ల వినాశమొనరించు స్వచ్ఛ పవిత్రజల ప్రపూర్ణంబులు పెక్కులు పుణ్యనదులు కానంబడెను. మునులతోఁ గూడి యగస్త్యమునివర్యు డెల్లి కార్యములు నివర్తించుకొని మనంబున నారాయణు వాసుదేవుభగవాను నాదిపురుషు పురుషోత్తము. హరిం ధ్యానించుచు సుస్థిరమానసమ్మున వానదుల స్నానములొనరించి ముదమందెను. వారెల్లరట్లు తానములొనరించి, భగవంతువేదమంచి పూజించిరి. భగవంతుంగాంచు నుత్కంఠతో నామునితల్లజులెల్లరు నాపర్వతమునం దంతట బాగుగఁ

దిరుగుచుఁ బలుతెఱంగులగు పెక్కులు ఫలపుష్పభరితములగు చెట్లుతో, లతలతో మేఘములట్టుల, కొండలట్టుల శోభిల్లుచున్నట్టియు, చూచిన మాత్రన శుభములొనఁగూర్చు నట్టియు వృక్షాదులతో నొప్పు నాపర్వతోత్తర భాగము, నతసుందరమును, సమ్మోదమ్మున గాంచిరి. అందొక యెడమృగపక్షివ్యాళాది ప్రాణులతో నలరుచున్న ప్రదేశమున, సుఖ స్పర్శంబుల, పరిమెళంబులఁ బ్రమోదముంగూర్చు పిల్లతెమ్మెరల నొప్పు నాసుందర తలమ్మున విరిసిన పద్మాది పుష్పములనొప్పి, పూవులతేనెంద్రావుచుఁబాడుచు నీపూవున కాపూవున కెగురు గండుతుమ్మెదలు, నలుదెసలఁజెట్లపైనుండి కూయు తీయతీయని కూకూ, కొకో, నినదమ్ముల పాడు కోయెలలు ముదములగూర్చు చుండెను. అందందు నెమళ్లు పురులువిప్పి మించిన యానందమునఁ గింకారము లొనరించుచు నాడుచుండెను. మత్తి, జువ్వి, రావి, మారేడు, నేరేడు, మావి, పనస, రేగు, మాదిఫలము, మొదలగు, కొమ్మల రెమ్మల రొదసినలమిన పండ్ల చెట్లు, కుటజ, కోవిదార, కురవకీ, గోరంటమున్నగు పూలచెట్లు, మల్లి మరువకము, జాజి, జాపత్రి, మాలతి మున్నగు పూలమొక్కలు, తీవెలు మొదలగువానిచే నెంతయు నందమై కనుల విందగు నాపర్వతోత్తర భాగముంగాంచి వారెంతయు ముదమందిరి.

## అగస్త్యాదులు సనత్కుమారాదులంగాంచుట

మునివరులతో నగస్త్యమహర్షియట నాపర్వతో పరిభాగమున, దేవుంగను గోమ కోర్కియతిశయింప నటునిటు,దిరుగుచు సుగంధితనేర్వాది ధాతువులతో, సుందర ప్రకాశిత మణిసంతతులతో నొప్పులుకులుకు నొకయెడ వికసిత సుందర పుష్పములనొప్పు, పద్మలతలతో వివిధానేక పుష్పముల శోభిల్లు, కలువలు మొదలగు తీవెలతో సుగంధితనిర్మల జలముల నిండి, కనువిందొనరించు, సుందరరాజహంసాది జలవిహంగమ కుల విహారములతో, కలకూజితములతో ముదమును గూరుచు, నొకతామరకొలకుమ గనుంగొనెను. అద్దానింగన్న యగస్త్యతపోధనుఁడు హర్షాతి రేకమ్మునఁ దోడితాపసులతో నిట్టులనియెను. ఓసోదరమునివరులారా! మనమీసరమ్మున ముదమ్మున మునుకలిడి తూరుపుదెస కొండకుంబోదము. ఈ శుద్ధపావన పద్మాకరము తనయందుప స్నానంబులొనరించు వారి పాపంబులనెల్లఁగడిగివైచి, యెల్లదుఃఖములు దూరమొనర్చును. సకల పుణ్య తీర్థముల స్నానపుణ్య ఫలము నొసంగును. కావుననే యిది పాపనాశనియని పేరంది వెలయుచున్నది. అనినంత నా మునులెల్లరు నందున మునుకలిడి భగవంతు మనంబునం దిరముగ నుంచికొని తలపోయుచు హృషీకేశు, సనాతను, వాసుదేవు, పూజించి తపిపి యందందుఁ జరించుచుఁ దన్మయులు కాసాగిరి. తిరుగుచుఁదిరుగుచు నట వారాపాపనాశినీ తామరకొలకున కుత్తరతటమునకేగిరి. అట సిగచితులె

సమోన్నతాసనంబుల నుపవిష్టులై దక్షిణముఖులై కడుంగడు భక్తిని కనులు మూసికొని భగవంతునందు మనస్సును లగ్నమొనరించి తపంబొనరించుచున్న మహాతేజస్విని సనత్కుమారుని, దేజోవంతులు, తపోధనులు, యోగపారగులునగు మునులతోఁ గాంచి యగస్త్యాదులెంతయు నానందంబంది వారిందరిసిరి. అట్టులు దరిసిన మునులు, యగస్త్యుంగని వారెల్లరును ముదమున సత్కరించి పూజించిరి. వారలచే నెల్ల విధముల సత్కృతుండై యగస్త్యుండు వారలతోఁదీయని మృదువచనముల నిట్టులనియెను. మహాత్ములారా! మీరిచ్చటనేమేని వింతలు గంటిరా? ఇచ్చట నెందేని యెవ్వండేని మహాపురుషుండు పురుషోత్తముండు వసించుచున్న వాడే? మీరెల్లరెవ్వరిం గూర్చి, ధ్యానంబొనరించుచున్నవారు? మీరిచ్చటికెందుకే తించియున్నవారలు? మేమీ విషయములెల్ల విని తెలియంగోరుచున్నారము. దయయుంచి మాకుఁదెలియజెప్పుడు. అని శుద్ధాత్ముండగస్త్యుండడిగిన యంత యోగిరాజు సనత్కుమారుండిట్లు చెప్పందొడగెను.

యోగిసత్తములారా! మునివరులారా! యీగిరివరమ్మున సర్వాత్ముండు, సర్వాంతర్యామి, భగవంతుండు శ్రీవిష్ణు పరమాత్ముండు నెలవుకొనియున్నవాఁడు. ఓతపోధనులారా? పురుషోత్తముండా తఁడొక్కండె చింతనీయుఁడు. ఆయచింత్యు విధాత, నవినాశిని పరమాత్మనే మేమనన్యమతి మదినిడి ధ్యానించుచున్నవారము. ఆజగన్నాథు, జనార్దను గాకమతి యెవ్వని మేము తలంపుగొనము. ఓధన్యపురుషులారా! ఆబ్రహ్మభూతు సనాతను పురుషోత్తము పరమాత్ము, ఆసర్వలోకేశ్వరు, సర్వరక్షకు హరిని, విష్ణు, దేవపూజ్యు మీరలును త్వరలోనె దర్శింపంగలరు. భగవంతుని దర్శన మింతకుమున్నొకమారు మేమును బొందఁగలిగితిమి. ఓ మహామునులారా! పుణ్య ప్రదాయిని యగు నీపవిత్ర వేంకటాద్రియందుఁ బురాకాలము నుండియుఁ దూరుపు దెసనొక వింతల వింతయగు దృశ్యమొండుకలదు. అద్దాని వింతవరకు నెవ్వరుమ గనఁ గలిగినదిలేదు. ఓమునిపుంగవులారా ! యీదివ్య పర్వతమునందలి యాశ్చర్యకరమగు వాదృశ్యముంజెప్పెద మాలింపుడు. ఈశైలరాజమున దేవాదిదేవు సర్వాంతరాత్ముగను కొర్కిని దేవవరులతో నమరనాథుఁడు శచీపతి యింద్రుఁడు నివసించుచున్నవాఁడు. మీరును త్వరలోనె యామహుపుంగాంచఁగలరు. అగస్త్యమునివరా ! యామునితల్లజాలతో మీరాతూరుపు దెసకుంజనుడు. అనియంతలోననే తేజోవంతులగు వాసనత్కుమారాది మునులెల్ల రంతర్హితులైరి. వారలట్టులు కనుమరుగై కవరాక పోవుట వారలకెంతయు వింతకొలిపెను. అట్టులా యోగధనులు మహాత్ములంతర్ధానమ్మైన పిమ్మట, నగస్త్యేశ్వరుఁడును నున్న మునివరులును నెల్లరటు తూరుపుదిక్కున కేగి యొక వింతల [illegible]. ఆతూరుపు దెసఁబెద్దపెద్ద విశాలమగు దీర్ఘోన్నతములగు,

కొమ్మలతో, రెమ్మలతోఁ బూవులఁ బండ్లనిండి యొకమహావృక్ష మీపర్వతోపరి భాగమంతయు నీడలఁగప్పి వ్యాపించియుండెను. ఆచెట్టుమొదట నాదిత్య సమాధిక తేజోవంతులు మహాత్ములు, సప్తర్షులు భగవంతునందునను మనంబు లుంచి స్థిరమతిం గూర్చుండి యుండిరి. వారిం గాంచినంత నగస్త్యుండును తోడితాపసులతో వారిచెంగటికిం బోయెను. మునులతోఁగూడి వచ్చిన, సంయముల, మౌనులనెల్ల శ్రేష్టుండగు నగస్త్యుంగాంచి ప్రేమ వివశులైన యాయేడ్వురు తాపసులు లేచి యుచిత సత్కారముల నాదరించి పూజించిరి. పిమ్మట నాతేజస్వి యగస్త్యుండా మునివరులకు నమస్కరించి, నమ్రతతో నర్థవంతములు, మృదువులునగు పలుకుల నిట్టులనియెను. ఓతపోధనులారా! మీరీ దివ్యోత్తమ పర్వతమున కేమి కారణమున నేతెంచినారు?ఓ ముని శ్రేష్ఠులారా! మీకుం ధ్యానమున నున్న యాదేవశ్రేష్ఠుండెవ్వరు? ఎంతయుం గోర్కి నిక్కముం దెలియఁగోరి యడుగుచున్న నాకుం దగురీతి నుత్తరమిండు. ఈ విషయము నెఱుంగ నేనెంతయుం గోరిక పడుచు మిమ్ములనడుగుచున్నాను. అగస్త్యుండిట్టులడిగి నంత నాసప్తర్షులతనితో మంచిది; మేమిదే వంచించుచున్నారము. ఆలింపుడు, అనియిట్టు చెప్పసాగిరి.

ఓ బ్రహ్మ! విశాలనేత్రు, దేవదేవు, జనార్దను, జగద్రక్షకు, లోకేశ్వరు, నారాయణు భగవంతు దర్శింప వచ్చితిమి. ఆ సర్వాంతర్యామి పురుషోత్తముఁడే మాకు ధ్యేయము. ఆజగత్పతి హృషీకేశుఁడు గాక మరెవ్వరు మాకు ధ్యేయులులేరు. చరాచరముల కెల్ల నేలికయగు, వరదాయకు, బూజ్యు నచ్యుతుఁ గృష్ణభగవానునే మేము ధ్యానించుచున్నారము. ఓ మునివరులారా! మీరును నాకమల నేత్రుఁబరమాత్మను దర్శింపఁగలరు. ఈ సింహాగిరియందు మీరు తూరుపుదెసగఁ బొండు అనిమహర్షులు పలికినంత నగస్త్యమునియు, సహచరులును వారెల్లరియనుమతింబొంది, జగదాదికర్తను, భగవంతుని మనంబున ననన్యభక్తిం దలపోయుచు నటనుండి బయలువెడలిరి. మనంబున నాటి పితామహు పలుకులు స్మరణకుందెచ్చికొనుచు నప్పుడె వారాపర్వతంపు తూరుపుదెసకుం బయనమై పోయిరి. అదృష్టపూర్వంబగు నాపర్వతోత్తర భాగంబును జూచి యట దేవుంగనఁ జాలక వారా దేవుందర్శింప నెంతయునుబలాటపడుచుఁ దూరుపు దిక్కునకుంబోయిరి.

## అగస్త్యాదు లింద్రుంగాంచుట

సూర్యునట్టులు, వెలుగులు చిమ్ము, తోడిమునివరులతో నగస్త్యుండు నారాయణాద్రిని బూర్వదిశను జేరెను. అందుఁదిరుగుచుఁ బర్వత శిఖరములట్లున్నత విశాలములగు పుష్పఫలభరితములగు వృక్షములను, మదమత్తవారణములను,

భయంకరముగ గర్జించుచున్న సింహాది మృగములను, ఇచ్ఛావిహారముల వినోదించుచున్న పెక్కుర గుహ్యాక, కిన్నరగంధర్వ యక్షాదులను నొప్పియున్న దానింగనుచు నుత్సాహాహారమతులై యాతపస్యులటం జరింపసాగిరి. అట్టులందందుఁదిరుగుచు నొకచోఁ బాతాళబిలమట్టులు కనువారికి వెఱపుం బుట్టించు, వింతనుగొలుపు నొక మహా బిలమును వారుగాంచిరి. దానింగన్న వారికే మనమ్ములు విమోహితమ్ములాయెనన్న సామాన్య జనులమాట వేఱెచెప్పుటేల? వారు దానిందరిసిరి. దానింగని యగస్త్యుం డిట్టులనియెను. అయ్యారే! యీగిరిరాజ ముంజూచు కోర్కిని వచ్చిన జనులిటకుంజేరి దీనిం గాంచిరేని విభ్రాంతిం దీనంగూలి పోఁగలరు గదా! మృత్యుముఖమట్టి యీబిలమిట నెంత మాత్రముండరాదు. దీని నిటలేకుండ పొనర్చుటయే మన విధియని యాతపోధనుం డట నిలిచి కనులు మొగిచి, ధ్యానంబొనర్చినయంత నామునివరు మహాత్మ్యము కతమున నత్యంత మద్భుతముంగొలుపుచు నాబిలమంతర్హిత మాయెను. అట్లాబిలము తొలఁగి పోయిన పిమ్మట నా మునివరుఁ డగస్త్యుఁడు తనవారితో నటన మహాపుణ్యాదాయకమగు వెంకటాద్రిని వినోదవిహారమొనరింప సాగెను. అక్కడ నటవారొక మహాసాలవృక్షమును మున్నెవ్వఁడెవ్వరుఁ గననట్టిదాని నత్యంతము నద్భుతము గొలుపు ఫలపుష్పభరితములగు పెక్కులున్నతదీర్ఘ విశాలశాఖల నొప్పుదానింగాంచిరి. అద్దానిం గాంచిన వారికెంతయు వింతయాయెను. వారద్దాని చెంగటకుంబోయిరి. అటఁజేరినవారు సాలవృక్షశాఖలట్టి దీర్ఘభుజముల నొప్పువానిననేకానేక రత్నజటిత సువర్ణకిరీటముం దాల్చినవాని వైడూర్యాది మణులచే, రత్నకుండలములచే కటక కేయూరాదులచే నలంకృతుఁడగువాని, జేతవజ్రాయుధముంబట్టిన వాని, విశాలనేత్రు, రెండవ నారాయణునట్టులు వెలుగుచున్నవాని, దివ్యాంబరధారి నింద్రు, శచీపతిని, సూర్యయమాగ్ని వసుకుమారాశ్వీపి కుబేర,వరుణ, గంధర్వ, కిన్నరాది దేవతలచే సేవితుఁడగు వానింగాంచిరి. కాంచినంత మహాతేజస్వి యగస్త్యమునివరుం డాతని చెంగటకుం జనెను. మునివరులెల్లరితో గూడి యాతేజోనిధి యగస్త్యుఁడు త్రిలోకనాథు దేవాధిపు నింద్రుని యధోచితముగఁ బూజించెను. దేవతలును బురుహూతుండును వచ్చిన మునితల్లజుల కెల్లరకు యధోచితపూజలు, సత్కారములు కావించిరి. మహాత్ముఁడగు నగస్త్యునితోఁగూడ వారెల్లరుమ ముఖోప విష్టులైరి. పిమ్మట విస్మితచేతసుండగు నగస్త్యుఁడు మోమునఁ జిఱునవ్వులొలయ నింద్రాది దేవతలంగాంచియిట్టులనెను. ఓదేవవరులారా! మీరలిచ్చటికెందులకేతెంచి యున్నవారు? ఇటమీరెవ్వనిం ధ్యానించుచున్న వారు ? ఈ పుణ్యమయ శైలరాజమున వేమేమి వింతల, దృశ్యముల మీరుగను గొన్నవారె ? ఓయమరశ్రేష్ఠులారా ! మీరంతయు మున్నదున్నట్టుగ మాకుంజెప్పి వినిపింపంగోరెదము. మాకదియెంతయు వినఁ గుతూహలముగుచున్నది. తపోధనుఁడు యోగివరుఁ డగస్త్యుడిట్టు లడిగినంత విప్రదేవత, లసురారు, లాతనికిట్టులు

పలికిరి. ఓమునివరా ! మేమందఱ మొకటిగఁ గూడి కమలనేత్రు నారాయణు, హృషీకేశు, శంఖచక్రగదాధరు, శార్ఙ పాణిని భక్తజనార్తిహరు, పద్మపత్రనిభేక్షణు, బ్రహ్మతత్త్వ విష్ణు దేవు సనాతను గనుగొను కోర్కినిచ్చుటకీ యున్నత సింహశైలమునకు వరుగుదెంచి నారము. ఓబ్రాహ్మణవరా! దానికైయే మేము దేవాధిదేవు భగవాను నజరామరు మహాపరాక్రము, మహౌజసు, సృష్టి స్థితి సంహారకారకు లోకేసు, సుస్థిరమతి స్మరించు చున్నారము, ప్రార్థించుచున్నారము. ఓ యోగివరులారా ! మేమా సనాతను భగవాసునే ధ్యానించుచున్నారము. అట్టివాఁడు మరొండులేడు, కనరాఁడు. ఓమహాభాగా ఈ పర్వతమునకు దక్షణ భాగమున వింతల వింతనొక్కటి మేముకాంచివారము.

## మునులకు శంకరభగవానుని దర్శనము

సర్వాత్ముఁడు పినాకపాణి, సర్వశక్తి మానుఁడు, మహేశ్వరుఁడు, హరుఁడు, భగవానుఁడీశుఁడు తనప్రమధగణములచే, భూతములచే, కిన్నరోరగరాక్షసాదులచే సంసేవితుండగుచు నీగిరివట దక్షిణతలమున వసించుచున్నవాఁడు. మీరచ్చటకింబోయి భువనేశ్వరుదేవేశు మృత్యుంజయుంగాంచఁ గలారలు. అటమీరు మహర్షిని దూర్వాసుని నందికేశ్వరుని, గనుంగొనంగలరు. ఓమహామునివరులారా! భగవంతు నాదిశంకరు ననుచరులింకను నెందఱెందరు గలరందటినిమీరటఁ జూడఁగలరు. మహేశ్వరుండు పశుపతి, హరుండు నెలవుకొనియున్న యాసర్వశుభప్రదంబగు నెలవునకు మీరెల్లరిప్పుడె యిటనుండి దయచేయుఁడు ఆలసింపకేగుఁడు.

ఆనిర్జరవరులెల్ల రిట్లు వచించినంత నగస్త్యాదులును, వారెల్లరినుండి, యనుమతింగొని, యాభూధరపూర్వభాగమును పరిక్రమించి దక్షిణపు దిక్కునకు పాగిపోయిరి. దక్షిణంపుదెసను దరియుచున్న వారాగ్నేయమునందుఁ దమకాంతుల దశదిశలు ప్రకాశింపఁ జేయుచున్న యొకేతీరగు వస్త్రభూషణ మాలాదుల ధరించి కూరుచున్న యొకే రూపున నలరుచు, స్వయంప్రకాశులై, చూచుటకతిసుందరులై శంఖచక్రగదా శార్ఙశక్తి హల నందాద్యాయుధములు దాల్చి సంశోభితులగు వారింగట కేయూరాద్యాభరణ సంశోభితులఁగాంచిరి. అట్టులకస్మాత్తుగ వారింగాంచిన యామునులు వింతంబొందిన మనమ్ముల వారిదరికిం బోయి యానందోత్సాహములు ముప్పిరిగొన వారికి నమస్కృతు లొనరించిరి. నమస్కరించి యంజలించి స్తుతు లొనరించి ప్రదక్షిణము లొనరించి విస్మితోత్ఫుల్ల హృదయులయి యాదిదేవు జగన్నాధు మహాదేవు దర్శించు కోరిక నటనుండి ముందునకు సాగిరి. అట్టులు దేవగణ పూజితము పావనమునగు నాగిరితలమున సంచరించుచు మునివరులతో నగస్త్య మహర్షివర్యుండు దక్షిణ దిశకుంజేరెను.

అందు ననేకానేక వృక్షములు పూలతోఁ బండ్లతోఁ బెద్దవగుకొమ్మలతో, రెమ్మలతో నాకుల,జిగుళ్ల నీడలఁ గొండనంతనుగప్పి మనసునకు మోదముంగూర్చుచుండెను. పరిమళములు చిమ్మ విఱిసిన పూలతోఁ జెంతఁజెట్టుల నెక్కియలమియున్న తీగెలు, నాపూవుల తావులుకొని, బరువెక్కి మెలమెల్లనఁదిరుగాడు పిల్లతెమ్మెరలు మనసునకు నాడలికిముదమును, సుఖమును, గూర్చుచుండెను. సుందరములు, విశాలములునగు, రాతిపలకలు, నందందవ్వానిని సుఖాసనమ్ములుగఁ జేసికొని, శాంతసుస్థిరత మనమ్ముల యోగయుక్తి నొప్పు తాపసులు తపంబులొనరించికొనుచుండిరి. ఆయా యెడలఁదమతమ సహజవైరములుగూడమఱచి విచ్చలవిడిందిరుగాడు జంతు సంతతులు కనువిం దొనరించు చుండెను. కొండయందందుఁ బరిశుభ్ర పావన జలమ్ములం బాఱు సెలయేళ్లు, తామరలు మొదలగు బాగుగవికసించిన పూవుల. హంసాది పక్షుల కలకూజితముల నొప్పులుకులుకు - కొలంకు లేడందలకుఁగడింది ముదంబుం గూర్చుచుండెను. చిలుకలపలుకులతోఁ గోకిలల కుహూకుహూలతోఁ బురులు విప్పి యాడు నెమళ్ల కేంకారములతో నాయద్రి యానందాల యందాల నిలయముగ నొప్పుచుండెను.

అందందు గంధర్వకిన్నర దంపతులు నాటలపాటల నోడలు మఱచిదేవునతులు నతులు పొనరించుచుఁ దనివినందక యుండిరి. అటుఁ దిరుగాడుచున్న యా మునివరు లందున నొక యెడ (బత్రపల్లవ పుష్పఫలములతో నిండి విశాలోన్నతములగు శాఖోపశాఖల వింతల వింతఁగొలుపు, నింతదనుకనెవ్వరుంగాంచి యుండని యొకమహావృక్షముం గనుంగొనిరి. కాంచినవారెల్లరాచెట్టునంతలో నసే సమీపించియచ్చటి యాదృశ్యముంగని కడుంగడు నబ్బురము నానందమునొంది తన్మయులైరి. వారియాయానందమునకు హద్దులే కనరాక యుండెను. వారలట నావృక్షతలమునఁ బెద్దజడలముడిందాల్చిన తలను గంగను, గంగ ప్రక్కను జంద్రరేఖను ధరించిన, వృషభదాలువుం, కంఠేకాలు, మాహేశ్వరుంగాంచిరి. ఆ దేవుండాచెట్టు క్రిందనుత్తరమునకు మోముంచి కూరుచుండి యుండెను. సూర్యసమానమగు నాతని తనుకాంతులు దిశలలమి వెలుగు చుండెను. విశాలోన్నతోరస్థలంబున నస్థిమాలలుదాల్చి, సూర్యచంద్రుల నగ్నిని లోఁబట్టి యుంచికొనిన మూఁడు కన్నుల నొప్పు నాసౌమ్య దివ్య మూర్తింగాంచినవారెంతయుందనిసి, దేవునకు మ్రొక్కులందించుచు వినుతులొనరింపసాగిరి. నలువైపుల పరాక్రమ విరాజితులు, నందీశ్వరాదులు, ప్రమథులుం బలిసికొలిచియుండిరి. తిరమగుమతిం దేవునిడికొని. కన్నులాదేవునందేనిలిపి సర్వంబునసీశు, నీశునం దఖిలంబుం గాంచుచు సర్వంబునఁ దన్నుదనయందున సర్వేశునెఱింగియచటనె యున్న దూర్వాసుంగని వారెంతయుఁ దన్మయులైరి.

ఆ॥ కాలకంఠయీశ, గౌరీమనోహరా ॥
మూడుకన్నులయ్య మ్రొక్కులివిగొ.
ఈశ, శంకర, హర యేటితాలుప శంభు
వినతులందికొనుము విశ్వనాధ.

ఆ॥ పశుపతి, మృడశూలి ఫాలలోచన శర్వ
ప్రణతులంది కొనుము ప్రమథ నాథ
వేల్పులకును వేల్ప వెలిమల వేలుప
మిత్తిగొంగ ప్రణతులిత్తుమివిగొ.

అనుచు సాష్టాంగ నమస్కారములొనర్చిలేచియంజలించి ప్రసన్నుండవగు మనుచుఁగోరి నిలిచియుండిరి.

ఇంత ప్రార్థించియుఁ బలుకకున్న మహేశ్వరుఁ జంద్రశేఖరు నానారత్న విచిత్రవలయ విభూషితు, స్వర్ణమయ కేయూరాలంకృతు వరదు సర్వాంతర్యామిని, సర్వదేవతాసంసేవితు, దేవవందితు, భగవంతు, నర్ధనారీశ్వరు నుమారమణు గాంచి యగస్త్యముని వరుఁడిట్లులనియెను. ఓ శంకరా, భక్తవ శంకరా మీసన్నిధికి వచ్చి వినుతించు మమ్మలం గనికరింపరేమి? కనుంగొనరేమి? పలుకకున్నారేమి?

ఓదేవ మీరేమేని పరధ్యానంబున నుంటిరా? మీరెవ్వరిందలంచుచున్నవారు? ఈయెడమీతలంపునంగల వారెవ్వరు? ఓదేవదేవా! సెలవీయరేయనెను. ఇట్లనుచున్న మునితల్లజానగస్త్యుంగనుంగొని మహాతేజస్వి మహాదేవుఁడు మేఘగంబీర వాక్కుల నిట్టులనియెను.

ఓయగస్త్యమునివరా! మునితల్లజులారా! పరాపరములకుం బ్రభువుమ, సర్వాంతర్యామిని, దేవదేవుని, సర్వలోక కారణు, జనార్ధను, నారాయణునే ధ్యానమొనర్చు చున్నవాఁడను. నాకును, నెల్లరకును నాతఁడే ధ్యానయోగ్యుఁడు; ధ్యేయుఁడు. ఆసర్వాంతర్యామి, పరాత్పరుఁడు వాసుదేవుడుకాక మరెవ్వరు నెందున ధ్యానయోగ్యులు కానరారు. పరాత్పరుఁడా భగవానుడు నారాయణదేవుఁడీ పర్వతమున వసించుచున్నవాఁడు ఆసర్వేశ్వరు, సనాతనునందె నామనంబు సంలగ్నమైయున్నది. కావుననే వచ్చిన మీతో నేనేమియు బలుకజాలకపోతిని. మఱివేరుకారణమేమియులేదు. మీరునునా విశాలాక్షు, లోకేశ్వరు, సర్వభూతశరణ్యు ననాదివిధను, హరిని, జ్వలన్మకుట కేయూర కట కాదివిభూషితు, దివ్యవైజయంతీమాలా విరాజితు, వైనతేయారూఢు, రమాధవు మదిమంచుఁడు, నిశ్చలమతిందలంపుడు. మీరు నామాధవు, విశ్వరూపుదరిసె

ఫ్యముంబొందఁగలరు. ఓ నిష్పాపులారా! తొల్లి బ్రహ్మ పరమేష్ఠి మీతో నిదియొపలికెంగదా. నేను నిదెచెప్పుచుంటుని. మీరాజగన్నాథుఁ దప్పక దర్శింపఁగలరు. ఇందేమియు సందియమందం బనిలేదు. కొద్ది కాలములోనే విశ్వాత్ముఁడు, పురుషోత్తముఁడు భగవానుడు, కేశవుఁడు మీకుందరిసెన మీయఁగలఁడు. మీరును దొంటియట్లనె యీనగమ్మున దేవునన్వేషించుచు సంచరింపుడు. మీరు మీ మనమ్ములాదేవునందె లగ్న మొనరింపుడు. అనియిట్టులు తపోనిష్ఠుఁడు శంకర భగవానుఁడు చెప్పిన పిమ్మట వామునులును శంభునకు నమస్కృతులొనరించియు; మహేశ్వరునందున మనంబు లెంతయుఁదగిలి యుంట నటనుండి వారు కదలఁజాలకపోయిరి. అటులున్న మునులు తోడి యగస్త్యుంగాంచి యీశానుఁడు శంకరభగవానుఁడును వారెల్లరుంగాచుచుండగనె తవపరివారముతో నంతర్ధానుండాయెను. మునులును బరమేశ్వరుస్తుతించుచు నమస్కరించుచు నగస్త్యుతో నటనుండి కదలిపోయిరి. అటు పిమ్మట నగస్త్యుఁడు తోడిమునివరులతో మహేశ్వరునకుఁ బ్రణామమ్ములాచరించుచు నారాయణగిరి యొక్క యాదక్షిణ భాగమ్మును విడిచి నైరృతి దిశకుంబోయెను.

## మునులు విష్వక్సేనుం గనుట

వారట్లుపోయి పోయి యొకచో మంథరాచలమట్టి మహోన్నతమై విస్తృతి శతశత శాఖల దెసలలమియున్న యొకపెద్ద మట్టింగాంచిరి. దానిమొదట మిగులఁబెద్దదయి, విశాలమయి, సమోన్నతముగనున్న యొక రాతి పలకను, దానిపై భగవంతు ధ్యానమున లగ్నుఁడై రెండవ మహేంద్రు నట్ల కూర్చుండియున్న వాని, బరాక్రమవంతులగు నమచరులతో, దేవవరులతో, గూడియున్నవాని లోకాతిశాయియగు, తేజోయుతు విష్వక్సేనుం బొడఁగాంచిరి. వందలకొలఁదిగ, వేలకొలఁదిగ, పరాక్రమవంతులగు రక్కసులు గంధర్వపతులు దక్షులు, యక్షులు, దరిఁజేరి, నలువైపులఁగొలిచియుండి వానినుతించుచు, వివిధాయుధములు పూనినవారైయుండిరి. విష్ణుదాసులు వారలిగివ లోకమ్ములెల్లద్రుంగింపం, సముద్రములెల్లంద్రాగివేయం గలవారైయుండిరి. రూపమ్ముల మేరుమంథరములట్టు లుండిరి, అట మధురాతి మధురమ్ముగఁ బాడుచు గంధర్వ కిన్నరాదులు, నాట్యంబులొనర్చుచునచ్చరలు నానందబును బొందుచుండిరి. పెక్కురు మునులు, సిద్ధులు తేజోవంతు లాయెడంజేరి భక్తి నాసక్తి దేవుఁదలంచుచుండిరి. వారలగాంచిన యగస్త్యాది మునులెంతయు నబ్బురమందివ మనమ్ములతో బులకలెత్తివ యొడళ్లతో, వారిందరిసి నమస్కృతులొనరించిరి. అగస్త్యుఁడు విష్వక్సేనుం గనుంగొని తీయని పలుకుల నిట్టులనియెను. ఓదేవా! ప్రసన్నుండవు కమ్ము. దేవా! ప్రసన్నుండవు కమ్ము. అనుచు నిలిచియున్న మునివరుంగాంచి, శంకచక్రగదాదులు దాల్చిన రెండవ

నారాయణునట్టులున్న పరాక్రమమున విరాజిల్లు విష్వక్సేను డిట్లులనియెను. ఓముని వరులారా! మీకివేవందనమ్ములు. మీరీ పర్వతవరమ్మున దేవాదిదేవు, విశ్వరూపధరు, నమితామిత తేజోయుతు, భగవంతు నారాయణుం జూడఁగలరు. సందియములేదు. సర్వవేద ప్రతిపాదితుఁడగు నాపరమాత్ముని యనుచరులమే మేము. ఇటనుండి భక్తిందలఁచి కొలిచి యాదేవు, శంకచక్రగదాధరు,శార్ఙపాణిని సర్వాధిపాధిపు, సర్వాంతర్యామిని నారాయణు భగవంతుం దర్శించితిమి. పరాత్పరుఁడు, పురుషోత్తముఁడీ పర్వతరాజమ్ముననే వసియించుచున్నవాఁడు. ఓమహామునులారా! మీరెల్లరిటఁదొంటి యట్టులనె దేవదేవు శ్రీహరినెమకుచు, భక్తిందలంచుచుఁ దిరుగాడుఁడు. మీరలు దేవుంగాంచఁగలరు. మేమిట నాశార్ఙపాణి భగవంతు ననుగ్రహమున మున్నెన్నడు నెవ్వరుంగాంచని దివ్యాద్భుత దృశ్యములను గాంచితిమి. దేవుం దరిసింప యోగయుక్తివి భక్తివి, శ్రద్ధను నెవ్వరిటఁ దపమ్ము నొనర్తురో వారికాదేవుఁడు పురుషోత్తముఁడు దర్శన మిచ్చును. ఓ మునిసత్తములారా! మీరును మాయట్టులనె యీగిరి వరమ్మున విష్ణువి పరబ్రహ్మను గోవిందుని జగద్రక్షకుఁ గేశవు మనమునంజేర్చి భక్తియుక్తులై చరింపుఁడు, అన్వేషింపుడు, మీకుందొరకఁగలఁడు, కన్నులకానందముగఁ గానరాఁగలఁడు. అన్న నా మునివరులాదేవు విష్వక్సేను; దేవానుచరు యనుమతింగొని వారలకుంబ్రణతు లొనరించుచు దేవు మాధవుం దలంచుచు నటనుండి బయలువెడలిరి.

ఆమునివరులు తొంటియట్ల యావేంకటాద్రిని వృక్షసమూహాది విభూషితమ్ముల, కొండకొమ్ముల విహరించుచుండిరి. దేవదానవకిన్నర, కింపురుష గంధర్వగుహ్యావిద్యాధరాదులచే, మహాత్ములచే సంసేవితమగు నాకొండ కొమ్ముల, నొకదాని నుండియొక దానికి వారుదిరుగుచునుండిరి. అట్లుతిరుగుచు వారొకరమణీయమగు శిఖరమ్మునకుజేరిరి. అట నామునులు, కామరూపులు, నతిబలవంతులు, వేగమ్మున వాయుసమానులు, మేరుమంధరములట్టి యున్నతాతి బలయుక్తకాయులు, నగువారి గంధర్వయక్ష దక్షకిన్నరాదులంగూర్చుండియున్న వారింగనుంగొనిరి.

వారింగాంచిన యగస్త్యుండు విస్మయ వికసిత నేత్రులం దోడి మునులం గాంచి యిట్టులనియెను. ఓ తపోధనులారా! బలవీర్యవంతులగు నీమహాత్ముల సాయమునవే తొల్లిమహేంద్రుండు దేవాసురయుద్ధంబుల దైత్యులంగెలువఁగలిగెను. మిగుల బలవంతులును, చిత్రవిచిత్ర వస్త్రధారులునగు వీరు నానాప్రకారాస్త్ర శస్త్రమ్ములు దాల్చియద్భుత రూపమ్ములం దోచుచున్నవారు. వీరింగాంచి పిమ్మట సర్వాంతర్యామి, నవ్యయాత్ముఁ బరమాత్ము వాసస్థాన మీవేంకట నగమ్మున వృషభాద్రిని దేవుందర్శింపఁ జరింపంబోవుదము. ఇట్లగస్త్యుండు పలికి వారితో గంధర్వాదుల కడకుంజేరెను.

తపోధనులతో నగస్త్యుండు తమ్ముంజేరవచ్చుటంగాంచిన వారెల్లరు నొక్కుమ్మడి బ్రహ్మదేవుండు వచ్చిన నిలుచు దేవతలట్లు లేచి మహాత్మునగస్త్యుచెంతకు వచ్చి ప్రణతులై నిలిచిరి. వారింగాంచిన మహర్షి యగస్త్యుండు వారలకిట్టులనియెను. ఓపరాక్రమ ధులారా! నాపలుకులాలింపుడు. మీరెవ్వరివారు? ఎందులకై మీరీ భూధరమ్మునఁ జరించుచున్నవారు? మీరేమేనివింతల, వింత దృశ్యములంజూచితిరా? లేక ఉన్న దున్నట్లుగ మీచరిత్రము మాకుంజెప్పుఁడు. ఇటనున్నమీనుండియిది యెల్లవిన మేమెంతయుఁ గుతూహలపడుచున్న వారము. అందులకే యిట్టులడుగు చున్నారము. అవ వారలామునివరుంగాంచి యల్లన నిట్లనిరి.

ఓబ్రాహ్మణవరులారా! మునితల్లజులారా! ఆలింపుడు. ఎల్లలోకములకుం బ్రభువు, మధుకైటభాంతకుఁడు, భగవంతుఁడు, ఆ శ్రీహరియొక్క భక్తానుచరుడు సర్వసేనాని విష్వక్సేన, ప్రభువు బుద్ధిబలవీర్య సంపన్ను నావిష్వక్సేను నమగాములము మేము. మేమెల్లరమిట సుస్థిరచిత్తులమై యాదేవుందలంచుచుఁ బూజించుచున్నారము. సర్వలోకములెవ్వని యాజ్ఞలఁ బావించుచుండు నా సర్వాంతర్యామి దేవదేవు ననుచరుఁడు విష్వక్సేనుఁడు. అమహాపరాక్రము నాజ్ఞలపాలించు వారలము మేము. ఆ విష్వక్సేనుఁడు తొల్లి నారాయణదేవునానఁనొంది కడుంగడు పరాక్రమశాలియు, బలాతిబలుఁడు వగు దైత్యరాజును ఋషభుని దునుమాడెను. దేవాసుర సమరమున నాదేవుండు విష్వక్సేనుండు వేల దైత్యులంబరిమార్చెను. ఎల్లపుడా దేవునానతిందలఁదాల్చి మసలువాఁడాతండు. అవ్వాని బలపరాక్రమములు, సాహసౌదార్యములు, నెన్నవేరికింగాదు. ఆతఁడే యలిగిన దానవాధిపుల, దేవవరులఁగిన్నర గంధర్వ గుహ్యకనాగాదుల, నెల్లర, నెల్లలోకముల వారి నంతలోనన తునుమాడంగలవాడు, అద్దియంతయు నాదేవు కరుణ పెంపువవేకాదా. మేమాలోకవిఖ్యాతు, భగవంతుననుచరు, విష్వక్సేను ననుచరులము. అనిచెప్పనంత వాయగస్త్యముని వరుఁడెంతయు ముదమంది విష్వక్సేమునెంతయుం బ్రశంసించి లోకేశ్వరునకు నమస్కృతులొనరించి యాగంధర్వాదులం, దేవానుచరులం బరామర్శించి యనుమతులంగొని, మహాతపోనిధానులగు తనతోడి మునివరులతోఁ గడు ప్రసన్నమతి నారాయణదేవుం దర్శించుకోర్కిని తొంటియట్లనె మఱల వాగిరివరమునఁ దిరుగాడ సాగెను.

ఆరమణీయమగు వృషభాచలశిఖరమున నిటునటుదిరుగాడుచు నాముమివరులు, కొండకొమ్ములవలెనున్న పుష్పితానేక వృక్షములు, వృక్షాకీర్ణములగు వాయూతావులు, పెద్దపెద్ద గుహలు కందరములు, శుద్ధ నిర్మలజలమ్ముల నొడ్డులవంటి పాఱునదులు, సెలయేళ్లు, హంససారసకారండవాది పక్షులచే శబ్దాయమానములగు కొలకులు కోనేళ్లు,

చక్రవాకాది పక్షులు, సారంగమదమత్త మాతంగాదులు మున్నగువానిచే నెంతయు శోభిలుచున్న కనులకు మనములకు ముదముంగూర్చుచున్న యాకొండను నెన్నియో వింతలం, దృశ్యములంగాంచి ముదమందిరి. కుంద, నీపసాలార్జున తిలకకోవిదార చంపకాశోక చూతపనస పున్నాగాసనాది వృక్షములచే నొప్పుగట్టులతోఁ దనరు నాచెఱువుల, కొలకుల, మునుకలిడి దేవదేవుంబూజించుచు, జపమ్ములు సలుపుచు జితేంద్రియులగు నామునివరుల గస్త్యాదులు, పచ్చిక బయళ్లను దిరుగుచు, గడ్డిపోచలఁ గొఱుకుచు మేయుచు గంతులిడు లేళ్లగముల, ఇటు నటు పరుగులిడు కుందేళ్ల నీచెట్టున కాచెట్టునకీ కొండ కాకొండకు దుముకులిడుకోతుల కొండముచ్చుల, మేఘోన్నతముల దంతావళముల గాంచుచు ననన్యములగు వింత దృశ్యములుగనుచు, బ్రహ్మదేవరపలుకులు మదినెంచి కొనుచు సనాతను నాదిపురుషుభగవాను నారాయణు దర్శించు కోర్కెఁ జాలకాల మటఁదిరుగాడుచునే యుండిరి. అట్టులటవారు తిరుగాడుచు దేవునర్చించుచు నుండ నొక దినమున నాపర్వత శిఖరముననొక్క యెడఁబైకొమ్మున రాతిబండమండి క్రిందికింబడి పాఱుచున్న, స్వామికార్తికేయ సంసేవితమగు కుమారధారను గాంచిరి. ఎల్లపాపముల నాశమొనరించు, పున్నెములపెంపొందించు, దేవఋషి మునిసిద్ధ మనుజాదులచే సంసేవితమగు నాపవిత్రధారను గాంచిన యామునితల్లజులెంతయు నానందమును నబ్బురమును బొందిరి. అత్యున్నతమగు శిలాశిఖరమ్మున నుండి యాధార పాపహరాఁతి పుణ్యపుష్కరిణి యందునఁబడుచున్నది. ఆపవిత్రజల ధారయందువనె మునుకలిడుచు అచటనె నెలవుకొని మహాప్రతాపిదేవ సేనాపతి సుబ్రహ్మణ్యుఁడు, నసురసంహారమొనరించు స్వామి కార్తికేయుఁడు మధుదైత్యుని సంహరించిన యాపురుషోత్తము నాదిదేవునకుం బ్రీతిగఁగఠిన తపోవ్రతధారియై ముప్పేళల జగత్పతిని శ్రీనివాసుని శ్రీవిష్ణుని బూజించుచు నా దివ్యాద్రిని నివసించుచున్నవాడు, మునులతో నగస్త్య తపోధనుఁడును నాయెడ కుమార దారికకుం జేరి స్థిరమతి నాచమనం బొనరించి దేవాదిదేవు నధోక్షజు జగత్పతిని భగవానుని స్మరించుచు స్నానమ్మొనరించి యథావిధి నాచమనమ్మొనరించి, దేవాదిదేవు భగవాను గోవిందుని దివ్య సుగంధిత పుష్పమ్ములఁ బూజించెను. తోడిమునివరులును స్నానమ్ములొనరించి జగత్పతిని జగద్ధాము సర్వపాపహరు బ్రహ్మణ్యు నారాయణు మనసుంచి భక్తిని, యుక్తిని, బూజించిరి.

సర్వలోక నమస్కృతు వరదు, వేంకటాద్రీశు, భక్తజనదుఃఖాపహారు, సర్వేశ్వరు, మాయాతీతు విష్ణు భగవాను నర్చించుచు తొంటియట్టులనే యాపర్వతశిఖరమున నాముని తల్లజులు మహాత్ము నగస్త్యుతో సంచరింపసాగిరి. దేవదానవ గంధర్వ సిద్ధచారణ పన్నగ వాలఖిల్యముని ఋషివరులచే సంసేవితమగు నాదివ్యోన్నత పర్వతమును మునులతో నగస్త్యుండు పాప వినాశకరములగు దివ్య తీర్థముల మునుకలిడుచుగాంచి

తియుచుండెను. అగస్త్యమునివరుండా పవిత్రవేంకట నగమ్మునం గ్రుమ్మరి యేయే పవిత్ర తీర్థంబులంగాంచెను.? వానియందున మునుకలిడిన మనుజునకుం గలుగు ఫలమేమి? వచింపరేయన్న నా మునివరుండిటులు చెప్పసాగెను.

ఆశైలరాజమునంగల పుణ్యతీర్థములం బూర్తిగ వివరింప నేరికి వశముగాదు. గురువరునుండి నేను వినిగ్రహించినంత దనుక వివరించి చెప్పెద నాలింపఁదగును

వరాహతీర్థము, వామనతీర్థము, సౌమ్యతీర్థము, దివ్యతీర్థము, పంచనద తీర్థము, శిలా తోయ తీర్థము, మహాతీర్థము, పద్మతీర్థము, సూర్య తీర్థము, పాపనాశన తీర్థము, ఇంద్ర తీర్థము, వాయుతీర్థము, వరుణ తీర్థము, బ్రహ్మ తీర్థము, మరియు నెల్ల మేఘములు హరించు నగ్నితీర్థము నెల్ల కోర్కుల నొసంగు పంచతీర్థము, మహాపుణ్యప్రదమై యెల్లలోకములం బూజితమై యొప్పు గౌరీ తీర్థము, కడుంగడు విఖ్యాతమగు నశ్వినీకుమారతీర్థము. ఇదియ అశ్వినీతీర్థమనియు నొప్పును. పరమేశ్వర తీర్థము, మహాపుణ్య మయమగు చక్రతీర్థము, పరమ పావనము శంఖతీర్థము, శోకనాశములగు విజయ తీర్థ, విమల తీర్థములు, దివ్యములగు మత్స్య, కూర్మ, గరుడ, పాండవ తీర్థములు, మాయామయ మహాతీర్థము, కాహలతీర్థము, దాడిమ తీర్థము నిత్యాదులు,ఇవ్వియన్నియు నాపావన శేషశైల రాజమునం బుణ్య వర్ధకములు, మోక్షదాయకములు, నగు దివ్యతీర్థములై వెలయుచున్నవి.

కపిల తీర్థమునకుం బడమటిదెసను బవిత్రమును బుణ్యవర్ధకమును నగు పంచతీర్థము కడుంగడు ప్రసిద్ధము. ఇయ్యది బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రహరిజనులకుం గ్రమముగ నెంతటి పాపులైనను మనసులు మాఱి నిర్మల మతిందేవుందలంచుచు నందు మునకలిడిన వారి పాపములెల్ల హరించి పరమ పదమును జేకూర్పఁగలదు. ఆయాజాతుల నభిమానముగల దేవగణములుకడు ముదమునం గపిల లింగమును దర్శించుచునటం దపంబొనరించుచున్నవారు. మఱియుఁగడు పావనదమున వరాహాచల వాసియగు వరాహభగవాను నందుఁ దల్లీనులైవారు, పూజిలొనరించుచు స్తుతులొనరించుచు సేవించుచున్నవారు. ఆపంచనదమున జాతిమతకులభేదములెన్నక మనసులు మాఱి, నిర్మల నిశ్చలమతి తానంబులొనరించి, కపిలేశ్వరు, వేంకటనాధు, వరాహదేవు నర్చించు వారలు వినుతించివారు తరింతురు. ఆ పంచనదమున విష్ణు భగవానుఁడు, వరాహదేవుఁడు, నిత్యము, ప్రేమమతి నివసించుచు నందు మునుకలిడి భక్తితత్పరుల, నిర్మలమతుల నుద్ధరింపసంసిద్ధుఁడై యున్నవాఁడు. తమతమ వర్ణాశ్రమ ధర్మకర్మల చేతనే దేవునర్చించి భక్తులు పావనులై దేవు కృపంబొంది తరింపంగలరు. వర్ణాశ్రమ

ధర్మంబుల, కర్మంబుల నుచ్చ నీచంబుల నెన్నం బనిలేదు. అవ్వి యాచరించు విధమునందె కలదాభేదము. దేవుని కొఱకై దేవుని నియోగయుక్తి నాచరించునవి యెల్లపావనంబులే యగును. ఆయంజనీ పర్వతంబున నింకను దృశ్యములు, నదృశ్యములునగు నెన్నెన్నియో దివ్యతీర్థములు కలవు. వానినన్నింటి నెన్ననెవనివశముం గాదు. పుణ్యములంబొందఁగోరు ఋషిముని, యోగివరులు, దేవసిద్ధ గంధర్వ యక్షరాక్షసులు, గుహ్యావిద్యాధరులు, పన్నగాప్సరసలు కిన్నరులు నాగులు మొదలుగ నెందఱెందఱోయట నిలిచి యాదివ్య తీర్థములను ముక్తిఁగోరి సేవించుచున్నవారు. ఆయా కొండ శిఖరముల వెలువడి, పావన జలములందోచు నేతీర్థమేని ముక్తిదాయకమే. దేవు ననుగ్రహమ్ముం బొందించునదియే. కావునఁ గానంబడు నాదివ్యతీర్థములందెల్ల భక్తి శ్రద్ధలఁ బవిత్రమనమ్ముల స్నానంబు లొనరించుచుఁ దిరుగందగును. ఇంత యెందులకు! సర్వపాపహరము స్వయముగ నాభగవత్స్వరూప మాపర్వతమే, వేంకటాద్రియే యొక మహాతీర్థము, అందలి శాలివాహతీర్థము, రోగఘ్న తీర్థము, శాంత తీర్థము, సర్వరోగముల దూరమొనర్చు కృష్ణధ్యాన తీర్థము, పాపనాశనము, దేవునకు విహారస్థలమగు స్వామి పుష్కరిణీతీర్థము నిట్టి వెన్నెన్నొ దివ్యతీర్థములు, సంసేవ్యము లందుఁగలవు.

ఓం శ్రీ వేంకటగిరీశాయ వాసుదేవాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ చంద్రలావణ్యాదాయినే, శ్రీవేంకటేశాయ నమః

# సప్తమాధ్యాయము

## శంఖనరపాలుని చరిత్ర

తొల్లి హైహయవంశమున ప్రశిద్ధగుణుఁడు బలవంతుఁడు విశ్రుత నాముఁడునగు శ్రుతుండను రాజుకలఁడు అతడు ప్రజలను కన్నబిడ్డలటుల నెంచి హితమును గలిగించుచు పరిపాలించెను. ఆతనికుమారుఁడు శంఖుఁడు మహాతేజస్వి, బలవంతుఁడు, సర్వసద్గుణ ప్రశిద్ధుండు, శత్రువిజయి. ఆతండు వనపర్వతాది సహిత మిహీభూమండల మెల్ల నేకచ్ఛత్రాధిపత్యముగఁ భావించుచుండెను. శ్రీమంతుండు పరమధార్మికుఁడా ప్రథుపీ భూమిని ప్రహ్లాదునట్టులఁగడుంగడు భగవద్భక్తుఁడు. అతఁడహంకార మమకారము లెఱుంగక యోగయుక్తి ననేకాశ్వమేధాది యజ్ఞములతో సర్వస్వామిని, భక్తవత్సలు, ప్రణతార్తిహరు, భగవాను నారాయణునర్చించి భజించెను. ఎల్లజన్మములు నాతఁడు భక్తిపూర్వకముగ హృషీకేశు నారాయణు ప్రీతి కొఱకునే యొనర్చి వేవేలు దక్షిణ లొసగెను. దానధర్మములు పొనర్చెను. అజరామరు బరమాత్ముని దర్శింప నారాజనన్యా వ్యభిచారిభక్తి భావప్రపూర్ణుండై నిండు మనంబున ననేకానేక యజ్ఞము లొనరించి, భజించియు నాదేవుంగనఁ జాలమినెంతయు దుఃఖితుఁడాయెను. మహాత్ము నారాజును దుఃఖితుని గాంచి పురాణ పురుషోత్తముండు, విభుండు భగవానుఁడు వాసుదేవుఁ డంతర్హితుండుగనే మేఘగంభీర వాక్కుల నిట్టులు పలికెను. " ఓరాజా! నీకు నన్నుంగను కోరికియేని యిట నుండి నారాయణాద్రికిం గదలి పొమ్ము. అటనూరు ధనస్సుల పొడవు, వెడల్పును గల వైడూర్యమణులట్టులు నిర్మల పవిత్ర జలపూర్ణంబగు, తన్నుంగాంచి స్నాన మొనర్చినవారి పాపమ్ము లెల్లందూర మొనర్చు త్రిలోకవిఖ్యాత పుణ్యప్రద స్వామిపుష్కరిణి నాబడు కొలంకు, గంగాది పావన నదుల కెల్ల సమము కలదు. అందున స్నానమొనర్చిన వారెల్ల బాపములంబాయుదురు. ఆనారాయణ గిరింజేరి నీవాపుణ్య పుష్కరిణీ తటమ్మున నేయుండి, భక్తియుక్తి నిశ్చల దృఢ తపమ్మునాచరింపుము. పొమ్ము! నారాయణాద్రికిం బొమ్ము. పెక్కులువత్సరమ్ములు కడచిన పిమ్మట నన్నుంజూచు కోరికను పెక్కురు మునులతోఁ గూడి తేజోధికుఁడు, బ్రహ్మవిదులందెల్లమేటి యగస్త్యముని తల్లజుఁడా గిరినెల్లెడం దిరుగుచు నటకు నీయున్న కడకురాఁగలఁడు. ఆమౌని తల్లజుండటకు వచ్చిన పిమ్మటఁ దొందరలోనే నా యనుగ్రహమ్మున నాయోగి వరుతోఁ బాటు నీవును నన్నుం దర్శింపఁగలవు. కావున నోరాజవరా! చింతవిడనాడుము. అటనీకునేవభీష్టంబులు వరంబు లొసంగంగలను అనెను." ఓ రాజా! జనకభూవరా! ఆవాడట్టులు స్వామినారాయణ దేవుండే స్వామి పుష్కరిణి యెల్లవిధముల గంగాది దివ్య తీర్థంబులకు సమమని వచించెను. బుద్ధిమంతుఁడా శంఖభూపాలుఁడును, నంతర్హితుఁడుగనే యుండి ప్రేమను బలికిన

శార్ఙ్గధరు,నారాయణ భగవాను దివ్య మధుర వాక్కులు విని యప్పుడె రెండవ యింద్రునట్టి, వీరవిక్రమ తేజోవంతుఁడును శాంతుఁడునగు పురుష సింహుఁదనపుత్రు వజ్రారాజ సింహాసనమునం గూర్చుండంబెట్టి, పట్టంబుగట్టి తాను భగవంతుంగాంచు కోరికిని నారాయణుని నివాసమగు, దివ్య తమంబగు నారాయణాద్రికిం బోయెను. ఆశంఖ భూపాలుడు భగవంతు నాదేశాను సారమటకుంబోయి స్వామి పుష్కరిణీ తటమున విషయ వాంఛల నెల్ల తొలఁగించి నిశ్చల మనమ్మును నారాయణ పరబ్రహ్మమందున సంలగ్నమొనరించి విధివిధానమ్మున నర్చించుచుఁ గఠినాతి కఠినమగు తపమును గావింపసాగెను. ఇంద్రియముల నెల్లవశమున నుంచికొని యాభూవరుఁడనేక వత్సరములు ఘోరతపమాచరించెను. వాలఖిల్యాది మహాముని సత్తములును, సిద్ధులును, నిత్యమాపుష్కరిణిని స్నానములొనరించి తపములాచరించుచున్నవారు. ఈపురాతనము పుణ్యప్రదమునగు పుష్కరిణిని సేవించువారు, మనసులు కడిగికొన్నవారు, మున్నెట్టి పాపములొనర్చిన వారైనను విముక్తిని బొంది సుఖానందము లందఁగలరు. పరమభక్తిని పుష్కరిణిని సేవించువారు దేవాధిదేవుని, శ్రీకృష్ణపరమాత్ముని కరుణచేఁ బరమగతిం బొందఁగలరు. ఎవ్వఁడేని సకాముఁడై స్వామిపుష్కరిణిని సేవించిన యాతఁడున్న దనయిచ్ఛితవాంఛలఁ బొందఁగలఁడు.

వేలకొలఁదిగ గంధర్వులా సరస్తటమ్మునం జేరి దేవాధిదేవు భగవంతుఁ బ్రసన్నునొనరించుచు ననవరతము స్తుతులొనరింతురు. కిన్నరులును మధురస్వరములఁ బాడుదురు. అచ్చరమచ్చెగంటులు వివిధానేక పుణ్యకర్మల దేవదేవు రాత్రింబవళ్లు పాడుచు, నాడుచు సంతుష్టునొనరింతురు. దేవతలెల్లరిచే నిటులు వినుతింపబడుచున్న యాదివ్యపుష్కరిణిం గూర్చి పలుమారులు భగవంతుఁడు శ్రీమన్నారాయణదేవుఁడు కూడనియ్యది నాకెంతయుఁ బ్రియమైనది, మనసున కెక్కినదనివచించెను.

అట నగస్త్యుండును తోడి మునివరులతో నాశేషశైలమునఁ జరించుచు నందందుం గల యసంఖ్యాకములగు పుణ్యప్రద తీర్థములమునుకలిడుచు నెంతయుఁ బ్రసన్న హృదయుండాయెను. ఆయా తీర్థంబుల పుణ్యోదకముల మునుకలిడుచుఁ దోడిమునివరులును సుస్థిరమానసమ్ముల సనాతను భగవాను బూజలొనరించుచు నెంతయు ముదితమానసులైరి. త్రికాలాధినాథు జగన్నాథుఁ బురుషోత్తము, సకల లోకానంద కరు శ్రీకృష్ణభగవాముంజూచు నభిలాష ముమ్మరము కాగా దేవుదర్శనమెప్పుడు కాఁగలదాయను మత్కంఠ, పెంపెక్కనా జితేంద్రియు లగస్త్యాది మునివరులు భక్తియుక్తి నాపర్వత శిఖరమునఁ బరమాత్మునన్వేషించుచు నెంతయుఁ గాలము కడచనినను జగద్రష్టపరమాత్మ నారాయణుడు కనరాకపోగా నెంతయు దుఃఖమానసులైరి. ఇదియేమో! యని తలపోయుచు నాకొండ నలుకెలంకులం దిరుగుచుఁ దిరుగుచు నొకచోనొక మహాగుహం గాంచి యందునంజేరి కూరుచుండిరి.

మీరటఁ దప్పక భగవాను దర్శనముం బొందఁ గలరను సురజ్యేష్ఠ బ్రహ్మదేవు వాక్యములు మాటిమాటికిం దలంచుచు నిట్లగుటయేమో? యని, యామునులందునఁ జేదేవుఁ దలంచుచుఁ దపించుచు నగస్త్యుం జుట్టి కూరుచుండిరి.

వారటం గూరుచుండి యుండ భగవద్భక్తుఁడు బృహస్పతియు, జ్ఞానివరుఁడు శుక్రుఁడును నటకువచ్చిచేరిరి. ఎల్లపుడు భగవంతు సాన్నిధ్యముంబొంది యున్నట్టియు, ముష్ను బ్రాహ్మణవరుల శాపమ్మునఁ బాతాళమునకుం బోయియు నాపాతాళకూపమున నుండి భక్తప్రియు భగవానుచే నుద్ధరింపం బడిన యుపరిచరవసువును నటకుం జేరెను.

## ఉపరిచర వసువు చరిత్రము

అనినంత జనకభూపాలుడు గురువరు శతానందుంగని, ఓగురుదేవా! వసు భూపాలునకు బ్రాహ్మణులచే శాపంబెట్లు లేల కలిగెను? ఆతని పాతాళపతనమెట్లు? అటనుండి యాతని దేవుండెట్టులుద్ధరించెను. ఆకతయెల్ల వివరముగ నాకుంజెప్పరే యనమునివరుండిటులు చెప్పందొడఁగెను.

ఒకపుడు మహర్షులును దేవతలును ధర్మసంశయమున మునిగి దానిందేల్చికొన నుపరిచరవసువు కడకుంబోయిరి. వచ్చినదేవవరుల మహర్షి సత్తములఁ గాంచి ప్రభువరుండట్టె లేచి వారికెల్లరకు నుచితాసనములు మణికాంచనమయములు కలిగించి యుపవిష్టులంజేసి, యుచితరీతుల వారినెల్లరిఁ బూజించి సత్కారములఁ దనియించెను. వారలకెల్లరకుఁ బ్రణామమ్ము లాచరించి మిక్కిలి వింతనొందిన మనసుతో వారల కిట్టులనియెను. ఓమహాభాగులారా! మూఁడులోకములందుం బూజ్యులు, వేదవేదాంగ పారగులు, మీయెల్లరిరాకచే నేధన్యుఁడనైతిని. నేనెంతయుఁ గృతకృత్యుఁడనైతివనుచు, చేతులుజోడించి మఱియునిట్టులనియెను. ఓమహాభాగులారా! మీయెల్లరి సుభాగమనమిటకేమి కారణమున నాయెను? నావలన మీకుం గావలసిన యాకార్యమేమి? ఓ తపోధనులారా! దేవవరులారా! ఇదియెల్లనాకునను కంప సంక్షేపమ్మునఁ దెలుపరే అనినంత నాచేది భూపాలు నుపరిచరవసుని వాక్కులు వినినంత దేవతలును మహర్షులును నెంతయు ముదిత మానసులయిరి. ధర్మసంశయ సంపన్నులగు తపోధనులు మహర్షులు చేది భూపాలుంగని యిట్టులనిరి.

ఓ వసునరేంద్రా! ధర్మసంబంధమగు సంశయముత్పన్నమగుటం దానిందీర్చికొన మేమెల్లర మిపుడు మీసన్నిధికి నేతెంచిన వారము. మీచే నాధర్మతత్త్వంబుదెలుసుంగుట మాకావలసినది. కావున నోనృపాలా! మాయెల్లరి యీధర్మసంశయమును నిర్మలవిశ్వాసమతిని ధర్మబుద్ధిందీర్పుము. సజ్జనులగువారు పశుబలియొనర్చి యజ్ఞము నొనర్పవలయునా?

లేక యహింసామతింబూని యోషధులచే నొనర్పనగునా? ఇది ధర్మయుతముగ సమబుద్ధిం జెప్పుడు. మాయీధర్మసంశయమును దొలగింపుడు. మాకెల్ల విధముల మీరె ప్రమాణము అన్నమునుల వాక్యముల విన్న నరపాలుఁడు చేతులుజోడించి యిట్లుపలికెను. ఓ బ్రాహ్మణవరులారా! తొలుతొల్త మీరీ విషయమును వాకు విక్కముగ విశదముగఁ జెప్పుడు. ఇందెవ్వరి మతమేమిగనున్నది? అన్నరాజును వినిమునులిట్లనిరి.

. ఓ ధర్మజ్ఞా! నరవరా! అటఁనరణ్యమునఁ దాపసులము మేమువిబుధవరప్రీత్యర్థము సవనమునొనరింపఁ దొరకొంటిమి. ఎన్నేని బలిపసువులు యూపస్తంభంబుల బంధితములై యుండెను. అదియేమి వింతయో వానికన్నుల జలజల నశ్రువులు జాలువారుచుండెను. అదికాంచిన మాకును కన్నీరుకాలువలుకట్టెను. దరియగుచున్న మృత్యువున కడలి యవి విలపించుచున్నవని మేమెతింగితిమి. జన్నములొనరించి త్రిదశులం దృప్తుల నొనరించుట ధర్మమే కానిదేవతలను దృప్తిపరుప నిన్ని జీవుల హింసించుటతగునా? హింసలేకయే వారింబ్రముదితుల జేయుటమేలుకదా! వీనింజంపిన పున్నెమున కన్న పాపమె యెక్కుడుచేకూరంగలదు. ధాన్యముల, నోషధుల, వారిం బూజింప నుభయతారకముగదా? అదియె యెంతయుమేలు. అనిమేమెల్లరము చింతంబడి యోచించితిమి. అట్లులై యోషధులను బూజాద్రవ్యములుగఁ గూర్చికొని సవనమొనరింపం బూనితిమి. అంతలోపవె మరవరులేతెంచి యట్లుకాదని, జంతువులనేక్రతువులఁ దమకర్పింపనగునవియు, దేవతాప్రీతి కొఱకగునది హింసకాదనియుఁ బలుకసాగిరి. అదేమో! మాకు హింసహింసగనే తోచుచున్నది. ఒకనికడుపుకొట్టి వేరొకని కన్నము పెట్టుటయా? అదెంతటి పున్నెము! అహింసయే పరమధర్మము. అట్టులు వేరురీతిని, అహింసాయుతముగజేయు, వర్పించు మా పూజలదేవతలు తృప్తులగుట యెంతయుఁ దగునని మాభావము.

ఇందు మాయుభయుల పథములును వేరువేరైయున్నవి. ధాన్యములచేతనే యజ్ఞము లొనరింపందగునన్నది. మాతాపసులమతము. అటులుకాదు పశువులచేతనే యజ్ఞములు చేయవగునని దేవతలమతము. ఇందేదికార్యము? మాకు వివరించి చెప్పందగు నన్న మునులనాలించిన, యాత్మజ్ఞానియుఁ, గర్తవ్యవిజ్ఞాతయునగు వసుధరణీశుఁ డర్ధానవేమి వచింపవలయునాయని మనమున విచారింపసాగెను. ఇట దేవతలొకపక్షము. ఇదో యీ మునులెల్లరొక పక్షము. వీరలందు దేవతలు ప్రప్రధమ పూజ్యులు కావునవే నిట దేవతల పక్షమును గ్రహించెదను అను నిశ్చయమునకు వచ్చి దేవతాపక్షపాతియై యా నరాధిపుఁడు పశువులతోడనె యజ్ఞము నొనరింపందగును. దేవతలు పలికినదెంతయు యుక్తతమము. అందన్యాయములేదు. ఇట్లనుచున్న వసుభూపాలువచనము లాలించిన మునులు కనులెఱ్ఱవడ సంక్రుద్ధులై రాజుతో నిట్టులనిరి.

ఓరాజా! నీవచించిన యీవాక్కులు ధర్మసంయుతములు కాకున్నవేని నీవిప్పుడె గంభీరపాతాళగహ్వరమ్మునఁ గూలిపోఁగలవు. అట్లుగాక నీవాడుపలుకులు సరియగునవేని, నీతీర్పుతిన్ననగునేని మేమేయెల్లరమును పాతాళమునఁ గూలిపోఁగలము. భగవానుఁడు, విధాత, పరమేశ్వరుడు, సర్వాంతర్యామి, మధుసూదనుఁడు, కమలలోచనుఁడు శ్రీకృష్ణుఁడే యీధర్మతత్త్వము నెఱింగినవాఁడు. ప్రపంచమున మఱెవ్వరు నీధర్మరహస్యము నెఱింగినవారు లేరు. సర్వమునకు సృష్టికర్తయగు పితామహుఁడు పరమేష్ఠియు దీనితత్త్వము నెఱుంగఁజాలడు. పురాంతకుఁడెల్ల ప్రాణిసంహారకుఁడు సాక్షాత్పరమేశుఁడు శంకరుడును దీనిదెలియడు.

మునివరులిటులు పలికినంతనె యాచేది భూరాట్టు వసువు మనంబున నెంతయుఁ బరితాపమందెను. అయ్యో! దేవతలు ప్రథమపూజ్యులని యెంచితిని. ఇంద్రుండు మిత్రుండు విమానమొసంగ నన్నుపరిచరుంజేసెనని యెంచితిని. వదియెల్లవమ్మయ్యెనే యని మనంబునఁ దనతప్పు నెఱింగి యెంతయు ననుతాపమందెను. తనయిష్టదైవమును రక్షకుమధుఘాతిని, క్లేశహారిని శ్రీహరిని కృష్ణదేవుఁ గడుంగడు భక్తిభావమున సంస్మరింపుచు మనమునఁనేమియుఁ గోరికలేనివాఁడయ్యు నాఘోరకంటకమయమగు నగాధ పాతాళమ్మున వెళ్లిపడెను. అట్లుకూలిపోవుచున్న యారాజునుఁ బాతాళమునఁ జరించుచున్న వాయువు కాంచి భగవంతు పరమ భక్తుఁడని యెఱింగి యట్లెపట్టికొని మెలమెల్లగ దైత్యదానవ సేవితమగు నాపాతాళమునందునఁ జేర్చెను.

పాతాళమునం జేరినరాజు సుఖదుఃఖసముఁడు, క్షమియునై మనమున నేకోరికలులేక, యింద్రియవాసనలు తొలంగి నిగ్రహమున మనమ్మున నవక్రవిక్రముం భగవంతుం జేర్చికొని సృష్టిస్థితి సంహారకారకు సర్వేశ్వరువాసుదేవు శంఖచక్రగదాధారిని, క్లేశహారిని శ్రీహరిని శ్రీకృష్ణుని ధ్యానించుచు సర్వేశ్వరు, సర్వపాలకు, సర్వాంతర్యామిని శ్రీమన్నారాయణ దేవుద్వాదశాక్షర మంత్రరాజమున జపింపసాగెను. సమస్తేంద్రియములు వశమున నుంచికొని పరమభక్తి నాతఁడు మునిగియుండి, పాతాలమ్మునఁ గూలియు నిమమంతయుఁ జింతింపకయుండెను. ప్రసన్నమతి జ్ఞానంపు వెలుగున మెలఁగుచునత్తఱి రాజుశోకమోహభయాదు లేమియు నంటనివాడై భక్తిభావమునఁ తన్మయుఁడై యుండెను.

చేదిభూపాలుడు పాతాళమున జేరుట యెఱింగి కవిన రక్కసులు వందలువేలుగఁ గడుంగడు బలవీర్యవంతులు, మహౌజసులు, మహాదంష్ట్రులు పూర్వవైరమును దలంచిన వారై చేతుల బలవదాయుధములు పూనివానిం జంపవేవేగ దరియవచ్చిరి. వారలు శస్త్రాస్త్రములంగొని, యాతేజోధికు మహాత్మునింజంప నలుకెలంకులం జేరి ప్రహారము లొనరింపసాగిరి. కాని యదియేమివింత, యోగిభగవద్ధ్యాన తత్పరతవాతని కా

పాతాళవాసులు రక్కసులొనర్చు వాయుద్ధండ దుండగము లెఱుకయే లేకయుండెను. ద్వంద్వాతీతుఁడై యాతఁడు శ్రీహరియందె స్థిరమతిం దగిలియుండెను. అటవారి జతనమ్ములన్నియు వ్యర్థమ్ములేయాయెను. వారియేయస్త్రశస్త్రములాతని కింతయు హానింగూర్పఁజాలకపోయెను. అంతనంతనె భగవంతునానతిని భక్తవరు ధీరు నారాజును రక్షింపఁ; జూడభయంకరమగు సుదర్శన చక్రరాజమట పాతాళమునకు రాజాదరికివచ్చెను. ఆ సుదర్శన చక్రాగ్నియందా రక్కసులు ప్రయోగించిన యాశస్త్రాస్త్రములన్నియు నగ్గినిగూలిన మిడతలట్లు నిలువున నీఱయ్యెను. ఇదియంతయుంగన్న యాదైత్యు లప్పుడెవేగఁ దామే యేయెడలనుండివచ్చి రాయాయెడలకుఁ దమతమ తావులకుఁ బరుగులువారిచేరిరి. వసుభూపాలుఁడును మధుసూదను భగవాను స్మరించుచు మధురవాణిని భగవంతు నారాయణుఁ బురుషోత్తము స్తుతింపసాగెను. ఇట్లుపశ్చాత్తాప పరితప్తుఁడును. భగవద్భక్తి యుక్తుఁడు నగు నారాజుయొక్కయన్నత పాపదోషపంకిలము పరిమార్జితమగుట, ననుకంపఁబూని సర్వస్వామి, సర్వవ్యాపి, సర్వాత్ముఁడు, సనాతనుఁ డవ్యక్తరూపుడు, పరమాత్ముఁడు విష్ణువు, భక్తానుకంపి, దేవేశుఁడు, క్షీరసాగరశయనుఁడు, జగన్నాథుఁడు గరుడుని దలంచెను. దేవుతలంచినంతన వినతాపుత్రుఁడు గరుడుఁడు భగవంతుచెంగటకు వచ్చినిలిచెను. వచ్చిన ఖగేశ్వరు వైనతేయుంగని భగవంతుఁడు మేఘగంభీర వాక్కుల నిట్లులనియెను. ఓవైనతేయా! నాకు నిత్యప్రియుడు, రాజర్షి వసు భూపాలుఁడు బ్రాహ్మణుల శాపముకతమున ఘోరమగు పాతాలమునం గూలిపోయెను. అట రసాతలమునం బడియు నాతఁడు తనమనమ్మును నాయందున నె లగ్న మొనరించి భక్తియుక్తుఁడై నాభజనము మానక పొనరించుచున్నవాఁడు. ఓ ఖగేశ్వరా! వినతాపుత్రా వాపచనమ్మున నీవిప్పుడె పోయి యారాజవరునటనుండి కొనిరమ్ము. అటపాతాళమున నుండికొనివచ్చి వానియువ్వయు స్థానముంజేర్పుము. వైనతేయా! తొందరగఁ బొమ్ము. ఓ గరుడ! శుద్ధాత్ముఁడాతఁడటఁ బాతాళముననట్లు పడియుంటయేమియు భావ్యముకాదు. ఇట్లు భగవానుఁడు పలికినంత గరుడుఁడు మంచిదియటులనె" యని రసాతలమునకు వేగముగ బయలువెడలెను. శీఘ్రగామియగు నాతని యావేగమున ఱెక్కలగాలి తాకున పాతాళమునం గలయెన్నెన్నియొ పన్నగము లాహతములై పడిపోయెను. పాతాళవాసు లెందఱెందఱో దైత్యులుక్షతగాత్రులై గరుడుని గని వెఱపున పఱుగులిడిపోయిరి. పర్వతమ్ములు వణకిపోయెను, వృక్షములు వేళ్లతో మొదలంటఁ బెల్లగిలి నేలంగూలెను. ఖేచరులగు దేవతలును వేవేగ నాకసమువీడి దివికేగిరి.

అట్టులు వినతాసుతుఁడు గరుత్మంతుఁడు రసాతలముం జేరి యట భగవంతు జగన్నాథు పురుషోత్తము నారాయణు నాదిదేవు స్తుతించుచు భక్తితత్పరుఁడై యున

ష్ఠుఁడైయున్న చేది భూవరు వసుమహీపతిం గాంచెను. తన్నుంజేరిన యాపక్షిరాజుం గాఢ్యంగాంచినరాజు చట్టునలేచి నిలిచి చేతులుజోడించి నమస్కరించి సాదరమునఁ బూజించెను. గరుడుండును రాజు నాదరమునంగని సత్కరించి చిఱునవ్వులఁ బ్రసన్నుంజేయుచు నిట్టులనియెను.

ఓ భూపాలవరా! యిటువినుఁడు. సృష్టిస్థితిసంహార ప్రవర్తకుఁడు, అమితతేజస్వి, సుఖదాయకుడు భగవానుఁడు శ్రీవిష్ణుదేవుఁడు నన్నుంగని వైనతేయా! రసాతలమునకుం బొమ్ము. అటనున్న నాభక్తు, నన్ను స్తుతించుచు నాయందునవె మనను లగ్నమొనరించియున్న వాని వసు నరపాలుని భూమికింగొని రమ్ము అనిపలికెను. ఇట్టులాదేశించిన దేవునానతిం గొనిమిమ్ముంగొని పోనేనిటకు వచ్చియున్నాఁడను. కావున వోరాజా! యిదిగో యిట నాభుజముపై నధిరోహింపుము. అన్నయాగరుత్మంతుని యాపలుకులాలించి మిగులఁ బ్రేమాదరమగ్నుండైన, భక్తితత్పరుఁడైన, చేదిభూరాట్టు వమవుగరుడునితో నిట్టులనియెను. ఓశుభేక్షణా! గరుడదేవా! సాక్షాద్భగవానుఁడు గోవిందుడు, జగన్నాథుఁడు శ్రీహరి యధిరోహించు మీయీపవిత్ర భుజపీఠమ్మున నే నధిరోహింపనిచ్చగింపను. పవిత్రస్థానమది నాకుంబూజనీయము. అటనెక్కి కూరుచుంట నాకుచితముగాదు. ఇట్టులు ధీరుఁడు, ధీమంతుఁడు భక్తవరుఁడు చేదిరాట్టు పలుకనాలించిన గరుత్మానుఁడిట్టులనెను. ఓ వసురాజా! మీపలుకులు మీకుం దగునట్టులయున్నవి. ఇదోనేనె నాచేతుల మిమ్ముంబట్టికొందును. అనితనచేతుల నాభూపాలుంబట్టికొనియెను .రాజును వైనతేయు భుజములఁ దనచేతులంగట్టిగఁ బట్టికొనెను. అంతం గరుత్మంతుడు రాజుం బట్టికొని వేవేగనట పాతాళమున నుండి యెగిరెను. అట్టులెగిరి వచ్చుచున్న యాతనిఱెక్కల వేగముననైన గాలితాకున పర్వములు భయభీతములై నలువైపులకుం బాఱిదాగెను. దైత్యదానవులు రక్కసులు వేవేలు కృష్ణభగవానుఁడే వచ్చుచున్నాడను శంకను, వెఱపున దిక్కులకుంబాఱిరి. ప్రతాపవంతుఁడగు గరుడుండును నారాజును చేతులంబట్టి యెగిరిభూమికి వచ్చియట శేషగిరిందించి రాజా! మీరిచటనయుండి మీవెలవునకుం జేరునదియని పలికియటనుండి యెగిరి వెడలిపోయెను.

## వస్వాదులు వగస్త్యాదులు కలియుట

అటంజేరిన రాజు వేంకటనగమునఁ దిరుగుచు గురుశుక్రు లుపవిష్టులై యున్నయా యెడకుం జేరెను. అటనుండి యాముప్వురును వింతలందోచు నాకొండకొమ్మున సూర్యులట్టులు వెలుగొందుచున్న యగస్త్యాది మునివరులున్నయెడకు వచ్చిచేరిరి. చేరివారాయగస్త్యాదులు, దుఃఖమానసులయి కూరుచున్నవారింగాంచిరి.

వచ్చిన యామూవురను మూర్యాగ్నులట్టుల, విందుచందురు వట్టుల

వెలుగొందుచున్నవారి వసుగురు శుక్రలగాంచి యగస్త్యాదుల మితాదరమ్మున లేచినిలిచిరి. వస్త్యాదులును వారినెంతయు నాదరించిరి. అందఱటఁ గూరుచుండి శాంతప్రమోద భావమ్ముల నిష్టాగోష్ఠినాదినమంతయుఁ గడపిరి. వారెల్లరుఁ దమయన్యోన్య సంగతిని, సమావేశమునవారేయి యంతయు, శుభప్రదమై వినోదముగఁ గడచెనని ముదమందిరి.

అంత బృహస్పతి శుక్రులగస్త్యాదులంగాంచి మహానుభావులారా! మీరెల్లరీ పవిత్ర పర్వతాగ్రమున కేమికారణముగ నేగుదెంచితిరి? మీరిటులేల దుఃఖభావమున నున్నవారు? మీరిట నెవ్వరింగాంచఁ గోరికపడుచున్నవారు. మీరెల్లరీ విషయమును సమగ్రముగ మాకుందెలియఁ జెప్పుడు. మేమిది యెఱుంగ నెంతయు నాశించుచున్నారము. అనిపలికిరి. అదివిన్న యగస్త్యముని తల్లజుఁడు వారలకిట్టులనియెను. మహాత్ములారా! అదియెల్లమేము వచింతుము సావధానులై యాలింపుడు. ఈశైలరాజమున వశించుచున్న యవ్యయానందమూర్తి నవ్యక్తునప్రమేయు నాదిమధ్యాంతరహితు శంఖచక్రగదాధారిఁ బీతాంబరధారిని సమస్తలోకోత్పాదకు, రక్షకుఁ గళ్యాణదాతను నవ్యయుభగవాను దేవాదిదేవు పురుషోత్తమునచ్యుతు వైకుంఠుంగాంచు కోరికను మేమిచటికీ శిఖరికినేగుదెంచినవారము. ఈ పర్వతోపరి భాగమంతయునెంతయో కాలమున నుండి పరిభ్రమించి వెదకి వెదకి యాదివ్యమూర్తిని పుండరీకాక్షుని గానఁజాలకపోతిమి. కావుననే మేమెల్లరమిటులు వ్యాకులమతులమై యున్నారము. అవ్యక్తు నద్వితీయు బరమాత్ము గోవిందు మహావిష్ణు దర్శనము కామిని మేము వికలచిత్తులము, దుఃఖస్వాంతులమునై యిటనిట్లు కూరుచుండియున్నారము. అనిపలికిన యామునులనాలించిన గురుఁ డిట్టులనియెను.

ఓ మహామునివరులారా! హైహయవంశమున శ్రుతసేనుండను రాజవరు పుత్రరత్నము శంఖభూపాలుండొండు కలఁడు. ఆతఁడు బాల్యమాదిగ సన్మార్గగామియై యవ్యయానన్య భక్తిదేవునెదనిలిపినవాఁడై యుండెను. ఆ రాజర్షి యిట నీపవిత్రాద్రిని, స్వామిపుష్కరిణీ తటమ్మునను యుండి తపమొనరించుచున్నవాఁడు. ఆరాజవరుని కొఱకు దేవాదిదేవుఁడు భగవానుఁడు నారాయణుఁడీ కొండనవతరించి యున్నాఁడు. అవివినియున్నారము. ఆశంఖధరా రమణునకు విష్ణుదేవు విశ్వమూర్తి సందర్శనము కాఁగలసమయ మాసన్నమైనది. ఇదియె సమయము. పదండి పదండి. మనమందరము నచటికి, దేవతలచేతను సంసేవితము, సర్వాభీష్టఫలప్రదాయిని, శుభమయి, పుణ్యమయి స్వామి పుష్కరిణి దరికింబోదము. అటకుంబోయి శంఖనరవరుతోఁ బాటుగ మనమును కోరికలెల్ల నొసంగుసర్వేశు సర్వాంతర్యామి పురుషోత్తము, భగవాను దర్శనముం జేసికొందుము. కావున నోమునివరులారా! లెండు లెండు. మీరును మేమును నటకిప్పుడె తొందరగఁబోదము. అవివంత వారెల్లరానంద తన్మయులయిరి. అట్టులె యప్పుడె లేచి

యామహాభాగులెల్లరు గతమోహులు, గతజ్వరులునై యటనుండి బయలుదేరి దేవమునిగణ సంసేవితమును, స్వామిపుష్కరిణీ తటమును బోయిచేరిరి. మార్గమునఁ బోవుచు వారలు నామహీధరముం గాంచుచుఁ బ్రసన్నచిత్తులై తమలోఁ దాము దాని మాహాత్మ్యమెన్నుచు మాటలాడుకొనసాగిరి. ఇద్ది వివిధానేక మహద్వృక్ష సమలంకృతము, ధరాధరోత్తమము. ఇది వాసుదేవునకు భగవంతునకు జగత్స్రష్టకు నెంతయుఁ బ్రియము. ఈ పుణ్యమయగిరి వరమును నెలవుగఁ జేసికొని పురాతనులు మునులు పురాతను భగవాను దర్శించియున్నారు. భగవద్భక్తులు దేవు పురుషోత్తము సంస్తుతించుచు నీయద్రిరాజమధిరోహించి భక్తవరదు దీనజనావను దర్శించి తన్మయులు కాఁగలరు.

ఈ మహద్గిరివరమె జగతీతలమున నెల్లతావులకును మించి పరమాత్మకుఁ బరమేశునకు నమితప్రియమైయున్నది. దేవదేవునుం దీనిమించిన ప్రియమైన తావువేరొండులేదు. ఇట్లువారు భక్తితన్మయులు దేవుని, దేవుని ప్రియతమమగు నాశైలమును నందలి స్వామి పుష్కరిణిని బొగడుచుఁ బోవుచుండనప్పుడా యుదంతము నెఱుంగంగన్న శ్వేతద్వీప నివాసులు వేలకొలందిగ సిద్ధులు నచ్చటకు వచ్చిచేరిరి. వారు క్షీరసాగరశయను నారాయణు శ్రీహరి శార్ఙ్గధరు కరుణను నాదేవుసారూప్యమునను బొందఁగలిగిరి. ఎల్లపుడా దేవదేవు నాజ్ఞలపాలించు వారై సర్వాంతర్యామి జనార్దను విశ్వకర్తను, విశ్వేశ్వరు బ్రసన్నునొనర్చుచున్నారు. ఆసిద్ధులు శ్వేతద్వీపవాసులటకుం జేరి మహత్తపోయుక్తుల నగస్త్యాది ఋషివరుల పర్వతగాముల ననుగమించిరి. ఆశ్వేత ద్వీపనివాసులు సిద్ధులగస్త్యాది ప్రముఖతపస్వుల మిగుల ప్రేమయుక్తులై పూజించిరి. ఆమునితల్లజులును నెంతయుఁ బరితప్తులై వచ్చిన యాభాస్కర సమతేజుల సిద్ధులనెల్లర నన్నివిధములఁ దగురీతి నధికముగ విధివిధానమునఁ బూజించి తనియించి తనిసిరి. ఇట్టులు మహాత్ములు శ్వేతద్వీపవాసులు సిద్ధులు, మహాతపోధనులు మునులు, దేవగురుఁడు బృహస్పతి, శుక్రభగవానుఁడు, వసుమహీపాలుఁడు నందఱుంగూడి సర్వాంతర్యామి భగవాను శ్రీశుని ప్రియనివాసమగు శ్రీస్వామి పుష్కరిణీతీరమునకుం జేరికొనిరి. అటఁజేరిన వారు మేఘప్రతీకాశు పద్మపత్రనిభేక్షణు; భగవాను సందర్శనమును బొందఁజాలకపోయిరి. కాని యటవారు భగవాను నారాధించుచు నుగ్రతపం బొనరించుచున్న జితేంద్రియు శంఖనృపాలుని గనుంగొనిరి. రాజపుత్రుఁడు శంఖుఁడు వచ్చిన వారినెల్లరం గాంచి రోమాంచితుడై కడుంగడు ప్రసన్నుఁడాయెను. అప్పుడెయాతఁడు " అగస్త్యాదులు వచ్చిచేరిన పిమ్మట నేను మీకుం దర్శనమిత్తును " అన్న భగవాను తొల్లిటిపలుకులు తలంపునకుం దెచ్చికొని తన్నెంతయుఁ గృతకృత్యునిగా నెంచికొనెను. ఆశ్రీహరి దివ్యవాక్కులు తలంచుచు నాతఁడువ్వెత్తుగ లేచినిలిచెను. వారలకందఱకు

నమస్కృతులొనరించెను. ప్రేమవశమున నత్తరి రాజవరుశంఖుని తనువెల్ల గగుర్పాటంది తన్మయమాయెను. సిద్ధులకు, శ్వేతద్వీపవాసులకు, మహర్షులకు, భార్గవునకు శుక్రునకు, గురువకు బృహస్పతికి, వసువునకు నెల్లరకు భక్తియుక్తిఁ జేతులు జోడించి సాష్టాంగ నమస్కారము లొనరించెను.

## పరమాత్మ సందర్శనము - దివ్యమూర్తి వర్ణన

అప్పుడెయగస్త్యాది మహర్షులు, శ్వేతద్వీపవాసులు సిద్ధులు, దేవగురుఁడు బృహస్పతి, మహాముని శుక్రుఁడు, నుపరిచరవసువు, శ్రుతపుత్రుఁడు శంఖుఁడు నెల్లరు పవిత్రజీవులు శ్రీహరిం భగవంతు జనార్దను జూచుకోర్కినట స్వామిపుష్కరిణీ తటమ్మున నేకత్రితులైరి. ఆదిమధ్యాంతరహితు సర్వాంతర్యామి నచ్యుతు, గోవిందు, శ్రీమహావిష్ణు నచటను వారుగాంచఁ జాలనివారై యేకాగ్రచిత్తులై భగవచ్చింతన మొనరింపసాగిరి. వారట విమల శుభజలముల నొప్పుస్వామి పుష్కరిణిని దినదినము మించిన భక్తితత్పరులై స్నానపానము లొనరించుచు, దివ్యసుగంధిత పుష్పముల భగవంతు హృషీకేశుఁ బూజించుచు నవ్యక్తరూపు ననంతు నాదివిష్ణు దర్శింపఁదపం బొనరింపసాగిరి. ఇటులు మూడు దినములు గడచెను. నాల్గవదినమున శుభనక్షత్రయుక్త పుణ్యదివసమున రవివాసరమున, సర్వాంతర్యామి, సాక్షాన్నారాయణుఁడు పురుషోత్తముఁడు, భగవానుఁడు సర్వలోకేశుఁడెల్ల లోకములఁ దనదివ్యతేజమున వెలిగింపఁజేయుచు సర్వమునఁ దానయై సర్వముమ దనయందు నొప్పదివ్యరూపమున వారలకుం బ్రత్యక్షమైతోచెను.

ఇట్టులనుకంపం దోచిన దేవు వారెంతయు భక్తితన్మయులై జెప్పవాల్పక తదేకదృష్టిని విస్మయావిష్టులై కాంచసాగిరి. అవ్యక్తరూపు వాసుదేవు శ్రీహరి దివ్యరూపమునేమని వర్ణించునది. నవోదిత సూర్యచంద్రులట్టులు ప్రకాశించు ననేకానేక నయనంబులు నవరత్న జటితసువర్ణకిరీటముల వెలుగొందు పెక్కులు శిరములు ప్రవాళములు కూర్చిన సువర్ణమయ నానావిచిత్రరత్న సంశోభిత కుండలాలంకృతము లనేకానేక శ్రవణంబులతో, కంబుకంఠములతో నొప్పునాదివ్యమూర్తి నెంతనిచూడనగును. లెక్కకురాని విశాలవక్షములు సుదీర్ఘములై పరిపూర్ణములగు నేనుగు తొండంబులట్టుల నందములగు, వివిధా భూషణా లంకృతమ్ములు వివిధానేక శస్త్రాస్త్రసంయుతములు సంవ్యాప్తములునగు పెక్కులు భుజముల, సహస్రానేకములు పాదముల నొప్పియామూర్తి యతితేజోవంతమై చూడనశక్యమై యుండెను. ఆదేవువిశాల కాయమున నదీవనపర్వతాలంకృతము లెల్లలోకములు, నెల్లదేవతలతో, దైత్యదానవులతో యోగిమునిజనములతో మానవులతో విరాజితములై తోచుచుండెను.

సాలవృక్ష శాఖాసదృశములు, సుదృఢములు, పరిపుష్టములు, సుకోమలనఖ సంయుతము, సులక్షణ రేఖాన్వితములు కోమలారుణ హస్తములు, ఏన్గుతొండములట్లులతి దీర్ఘసుందరములనేకములు బాహువులు విరాజిల్లుచుండెను. ఏభుజములచే సాగరములు పర్వతములు వనములతోడి భూమండలము, తలవితల రసాతలాదియెల్లలోకములు నెల్లదేవతలు మనుజులు, రాక్షసులు నింకను గలయెల్ల ప్రాణులతోడి బ్రహ్మాండములును చెక్కుచెదరకుండ పెక్కురీతులఁ గాపాడుచుండెనో, ఏభుజములచే వైష్ణవులకు, భక్తజనులకు, దుఃఖమును, విడుమలను గలిగించు దుష్టమానవులు, రక్కసులు చంపఁబడుదురో, నేభుజముల శరణమునొంది, దేవతలు సజ్జనులు నిత్యనిర్భయులై మనఁగలుగుచున్నారో, దేవదేవు పరమేశు నాభుజములు పొడుపుకొండ నుదయించుచున్న యాసూర్యభగవాను కిరణములట్లులు ప్రకాశించుచుండెను.

ఆ పరమాత్మునారాయణదేవు శ్రేష్ఠసుందరరూపము, రత్నసమూహములచే నొప్పుహారముల నలంకృతమై, మెఱపుల వరుసల వెలుగొందు వానకారునందలి సుందరమేఘమునట్టి కాంతులనొప్పు దేహమున నెంతయు నొప్పులు కులుకుచుండెను. మనోహరములగు, చిఱునవ్వులు వెలయించు నెఱ్ఱని పెదవులపై విశాలములగు కనులు, చాపములట్టి కనుబొమలు, విశాలోజ్జ్వలమగు లలాటము సుకోమల సుందర కపోలములు, మకరకుండల సంశోభిత కర్ణములు, నెంతయునందమయియుండెను. సుందరకర భోరువులు, పద్మసుందర మృదుపదములు, ఝణఝణలాడు రత్నమణిఖచిత సువర్ణనూపురములు, విచిత్రకాంచనమయ బ్రహ్మసూత్రము నొప్పి, కనువిం దొనరించు చుండెను. ఒక్కటిగఁ జేరిన సహస్రాదిత్యుల తేజమ్మునట్టి తేజమున, నచింత్య మహాదద్భుతమేరు మందరసంకాశుఁడు, నీలపర్వత సన్నిభుఁడు సముచ్ఛ్రితోరస్థల మొప్ప, సౌమ్యసమాయుత విశాలలోచనుఁడై దివ్యపీతాంబరధారియై, దివ్య గంధాను లేపనమున నొప్పుచు దివ్యవైజయంతీమాలను ధరించియుండెను. అందమై, నీమలవిందుగ మెలమెల్లని మృదుధ్వనులిచ్చుచున్న చిఱుమువ్వల గజ్జెల నొప్పుచు మెఱపుల బ్రకాశించు మేఘము నట్టుల వింతశోభ వెలుగొందుచుఁ బదిదెసల వెలిగించు మణిసమూహముల నలంకృతుఁడై యుదయించుచున్న చంద్రరేఖలట్లు లెంతయుగాంతులనగు నఖముల నొప్పునంగుళుల, నందములై యంకుశ, ధ్వజ, చక్ర, కమల, శంఖ, వజ్రరేఖల నొప్పుచరణ కమలముల వెలుగొందుచుండెను. తలనున్న కిరీటము వెలువడి కప్పినముంగురులచే ముఖాంబుజము శశాంకముచేఁ బ్రకాశించు చంద్రమండలమట్లు విరాజిల్లుచుండెను. లోకేశు, పరమాత్ము శుభదృష్టులు, వ్యాలోలములు, సుప్రసన్నములునై తోచుచుండెను. వంచిన విండ్లను వంచించు నాకనుబొమ్మలు, నాక్రింద పద్మనయనంబుల నుండి

వెలువడు చూపుటమ్ములచే భయభీతులై పాపులు, దుష్టులు పాఱుచు మృత్యుసం గతులగుచుండనట నాభక్తుల, సహృదయుల డెందమ్ము లమందానందకందళితము లాయెను. సహృదయులు మానవులు వానింబొంది, దుర్లభదైవత్వము నంది ముక్తిపథగాములగుచుండిరి. దెసలలుముకొనుచున్న తనదివ్యకాంతులచేఁ దూరపుకొండను దోచుచునెల్ల దెసలఁ దనకిరణములు వ్యాపింపఁజేయు నవోదితసూర్యునట్టుల విరాజిల్లుచు నాదేవుఁడు వారలకన్నులకు విందొనరించుచుండెను. చూడఁజూడ నామూర్తినుండి వెడలుకాంతులు కనులు మిఱుమిట్లుకొన దుస్సహములై తోచెను. ఆ వెలుగులకెల్ల వారలెంతయుఁ బరితృప్తులైరి. ఆదివ్యస్వరూపము సువర్ణమయము, ప్రకాశయుక్తము, కాంతియుత  సూర్యసమానమునై యద్భుతమై యుండెను. చేతులఁగలట్టి యుగ్రతరాయుధముల నుండి తీక్షణకాంతులు ప్రళయకాల సూర్యకాంతులట్లు దెస లలుముకొనుచు నుజ్వలమొనరించుచుండెను.

తనివి నెఱుంగక యింకయింక కాంచునభిలాష నందుచున్న భక్తులకాచూపులు మోదముంగూర్చుచు సౌమ్యమగుచుండెను. సహస్రానేక బాహుల దివ్యతేజమ్మున, దైత్యదానవుల రక్కసుల యసురుల హృదయమ్ములు వ్రక్కలించి వెఱపుం గొలిపి యునురులు దీసి మృత్యువు వాతంగూల్చుచున్న, సూర్యాగ్ని తేజమ్ములుగ్ర శస్త్రాస్త్రమ్ములతోడి యాబాహువులు భక్తులకభయానంద దాయకములు శీతలములునై ప్రకాశవంతములు సూర్యచంద్రులట్టులు మనోహరములై వినోదమును గొలుపుచుండెను. ఆయశేషమూర్తి భగవానుఁడిట్టు లబ్బురముం గొలుపు రూపమ్మున శిరములందలి మణిమయ కిరీటకాంతులతోఁ బ్రళయాంతమునఁ దనకిరణమాలలతోఁ బ్రకాశించు సూర్యులట్టులు ప్రకాశించుచు శోభించుచుండెను. ఆప్రసన్న నిర్మలముఖములు మహత్తేజోవంతములైసుందర సురమ్యశరీరము ప్రళయాగ్నియట్టులు కాంతులు చిమ్ముచుఁ బ్రకాశించుచుండెను.

ఓం శ్రీ కుముదాక్షగణ శ్రేష్ఠసేనాపత్యప్రదాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ నారాయణార్థితాశేషజన దృగ్విషయాయ శ్రీ వేంకటేశాయ నమః

## దేవుందర్శింప బ్రహ్మాదులు వచ్చుట

భగవానుఁడు శ్రీహరి కృష్ణదేవుఁడు వారలకెల్లరకుం దనదివ్యరూపమును జూపెను. భగవానునట్టి యాయద్భుతరూపము మున్నింతదనుక దేవతలు మునులు యక్షకిన్నర గంధర్వసిద్ధ చారణులు, యోగిజనులు, విద్యాధరులు తాపసులు, వాలఖిల్యులు వాదిగనెవ్వరుం జూచియెఱుంగరు. అంతనామహర్షివరులు తపోధనులు నేకాగ్రదృష్టులై ప్రేమతన్మయత వివిధానేకరత్న సముజ్జ్వలమగునుజ్జ్వల కిరీటముచే వ్యాలోలసుందర కుండలములచే శోభిలుచున్న ముఖకమలమున నొప్పు భగవాను దివ్యరూపామృతము నచంచల నేత్రపాత్రము లంబట్టి త్రాగివేయుచున్నట్టులుండిరి. ప్రేమ విహ్వలులాముని తల్లజులప్పుడొక్కుమ్మడి నేలంబడి సాష్టాంగ నమస్కారము లొనరించిలేచి నతమస్తకులై నిలిచిరి. శుక్రాగస్త్య వసుబృహస్పతులును సువర్ణమయ గిరిశిఖరమున నీలమేఘమట్లు సువర్ణ వైనతేయు భుజస్కందము నధివసించియున్న భగవానుం గాంచి భక్తివాసక్తి నమస్కృతులొనరించిరి. ఇటులు వారెల్లరు భక్తినేకాగ్రచిత్తులై, ప్రసన్నదృక్కులం దమ్ముఁ గనుచున్న భగవానుంగని దేవదేవ ప్రసన్నుండవుకమ్ము, ప్రసన్నుండవుకమ్ము అనుచు నుతింపసాగిరి.

ఆ సమయముననె యాకసమున నొక్కుమ్మడిగఁ బాంచజన్యములట్టి దివ్యశంఖములనేకములు భంభంధ్వనులీనుచు మ్రోగసాగెను. వానితోఁబాటుగ హేమరత్నయుతములు మృదంగాదులు దివ్యవాద్యంబులు ధ్వనింపసాగెను. ఆ శంఖములయు, వాద్యములయుఁ దుముల ధ్వనులచేఁ బ్రహ్మాండమంతయు నిండి ప్రతిధ్వనులీనెను. దాన దానవులు భయభీతులై సంక్షుభిత మానసులైరి. అట నారాయణాద్రింగల వారెల్లరానంద తన్మయులైరి. వేంకట శైలస్థిత సింహాదిమృగ సంతానములు నెంతయు శాంతి ప్రమోదములఁ బ్రసన్నములై తోచెను. ఆ యతులానందమయ ధ్వనులాలించిన పితామహుండు, పరమేష్ఠి భగవానుఁడు శ్రీహరి యాదినారాయణుఁడు శేషశైలమునఁ బ్రకటమాయెనని యెఱింగి, మునిదేవ బ్రహ్మణ్యాదులం గూడి శ్రీకృష్ణభగవాను కడకు నంజనాద్రికి వేంకటశైలమునకు వచ్చెను. దేదీప్యమాన సూర్యకిరణములట్టులు, వెలుగొందు జటాజూటమున నొప్పె త్రిపురాసురాంతకుఁడు ముక్కంటి భగవంతుఁడు శంకరుఁ డాసద్దునాలించి వేలుపుల వేలుపు వేంకట నగాధినాథు శ్రీనివాసు సాన్నిధ్యమును గ్రహించి యాదేవుంగనం గొనఁదొందరతొందరగ దూర్వాసాది మునులతో నందీశునితో నటకువచ్చినేరెను. అయుబ్బురంపుటులివు లాలించి యాలించి వేలుపులదొర పురుహూతుఁ డింద్రుఁడు హృషీకేశుఁడచ్యుతుఁడు భగవానుఁడు జగన్నాథుఁడు ప్రత్యక్షమగుట యెఱింగి దర్శింప

సేవింపఁ గుతూహలమంది దేవతల దేవాధినాధుల వెంటనిడికొని, భగవంతు ననామయు నారాయణు సావధానచిత్తుండై పప్తసచివులతో వచ్చిచేరెను.

మఱియు నాయులివులాలించిన సనకసనందనాది యోగిజనులు, సప్తర్షివర్యులుం గూడ వేవేగవచ్చి యట దేవునిదరిసిరి. అటనాశైలమున వాయువ్యదిశను శిలాతలముననున్న మునివరులకుం గానుపించిన యాయద్భుత దర్శనుఁడు దివ్యపురుషుఁడు నామంగళ ధ్వనులాలించి భగవాను దర్శింప దేవదేవుదరికి వచ్చిచేరెను. ఇట్టులెల్లరుం జేరి శార్ఙ్గధరు భగవాను పద్మనాభు సమీపించి కడుంగడు భక్తియుక్తులై ప్రసన్నచిత్తులై బంగరుకొండ నెక్కికూరుచున్న యట్టులు సుపర్ణువైనతేయు నదిరోహించియున్న భగవాను నారాయణు విష్ణునిగాంచి యెల్లరుందలలు వంచి దేవునకు మ్రొక్కులర్పించిరి; నతులొనరించిరి. ఓ దేవదేవ! జయము జయము. ఈసర్వేశ మీకుం జయమగుగాక యనుచు వారెల్లరు దేవునకు మ్రొక్కులిడుచు, ఓదేవాధిదేవా! ప్రసన్నుండవుకమ్ము. అనుచు మాటిమాటికి వేడికొనుచు నాబ్రహ్మాదులు, తపోధనులు, సిద్ధులు, శ్వేతద్వీపవాసులు, నెల్లరుంగూడ నాదేవుదివ్యతేజముచేఁ బరితప్తులై మధురిపుహరియొక్క యాప్రచండ రూపమ్ము ప్రళయకాలమునఁ బ్రచండతేజునాదిత్యుం గాంచఁజాల నియట్టులా దేవు విచిత్రరూపమును , నిజనేత్రములంగాంచను శక్తిచాలనివారైరి. అత్తరి నాదేవుతేజమున సంతప్తదృష్టులు గలవారై బ్రహ్మేంద్రేశ్వరాదు లెల్లరు నట్టికన్నులు మూసికొనినవారైరి.

## బ్రహ్మకృత భగవత్స్తుతి

దేవదేవు శార్ఙ్గధరు శరీరకాంతుల సంతప్తుఁడై కనులు మూసికొనిన పరమేష్ఠియంతలోనె కన్నులు తెఱచి గరుడారూఢునవ్యయు నవినాశి భగవాను వైకుంఠునట్టి కనుంగొని తలలువంచి నమస్కరించి యిట్టులు స్తుతిపొనరింపసాగెను. వేవేలు తలలు కన్నులు గలదేవరా! వేడికోలిదెకొమ్ము వినతికొనుము. ఉజ్వలమణి కిరీటమ్ములు నొనరఁ దాల్చినదేవ వందనాల్గొనుము గనుము. పురుషోత్తమా! దేవ! గరుడాధివాహన! ప్రణతులొనర్తును బరమపురుష పరిధి సమానదివ్యానేక సుందర, భుజముల వెలయు దేవరదండములను గొనుము.

విశ్వతోముఖ శ్రీహరి విశ్వనాథ, దేవదేవ సనాతన దివ్యమూర్తి; అణువులకు నెల్లనణువు మహత్తులకును; కడుమహత్తగు హరిదండమిడుదుగొనుము. వరదసనాతన నమదేశప్రణతులు; సురనాయకా పురుషోత్తమనతి పరమ జగన్నాధ భక్తజనావన భక్తిదండములిడువాడనభవ॥ సత్తునకుఁ బరునసత్తునకుంబరు, పుండరీకనయనుఁ బోల్చి కొల్తు॥ కారణంబులకును గారణంబగు దేవ, కర్మయుంటని శుద్ధగతి మహాత్మ॥

నీయందేలీనమగుదురు. ఓదేవేశ! పురుషోత్తమ! ఇంద్రుండును వందలశ్వమేధములొనరించి, విన్నర్చించి, భజించి దేవేంద్రపదమును బొందెను. అమరాధినాథుండాయెను. వేవేలశ్వమేధములచే నిన్నర్చించి, నర్చించి దుఃఖశోకరహితమగు దివ్యపరమ బ్రహ్మపదమును బొందఁగలిగినాఁడు స్రష్ట ఇంతయెందులకో దేవదేవ! జగదీశ! నేనును సర్వమేథ మహాక్రతువున నిన్నారాధించి యెల్ల దేవతలకును, దుర్లభమగు నీదేవదేవత్వమును, మహేశ్వరత్వమును బొందఁగంటిని. హేసర్వేశ! నీవెజగద్ధాతవు. సర్వపోషకుఁడవు. నీవయీజగత్తునకు గతివి. నీవయీ జగదుత్పత్తి సంహారకారకుఁడవు. శోకార్తిహరునకు, మోహనాశకునకు నీకిదే నమస్కరించుచున్నాఁడను. త్రిగుణాత్మకమగు మాయయిదియంతయుఁ గలిగినను నీవలననే కాని యీమాయకతీతుఁడవు నీవు ఓ సహస్రవదనా! సహస్రానేకలోచనా! సర్వలోకాధిపా! సర్వలోకపరాయణా! ప్రసన్నుండవు కమ్ము. ఓ విష్ణుదేవా! అనేకానేక భుజములనొప్పు తమాలవృక్ష వర్ణమ్మగు, ననేకవక్త్రనేత్రముల నొప్పు, జాజ్వల్యమానములగు రత్నజటితములగు కిరీటములచేఁ బ్రకాశించు నీదివ్యరూపమునకుం బ్రణామములు. సర్వమున నీవు, నీయందు సర్వమొప్పు. సర్వసాక్షికి, సర్వద్రష్టకు, నీకివేవందనములు.

## మహర్షికృత భగవానుని స్తుతి

ఇట్టులు పరమేష్ఠియుం, బృహస్పతియు, బ్రార్థనలు ప్రణతులు నొనరింపన్వినియుఁ గాంచియు నెంతయుఁ బ్రమోదమానసులు భక్తితత్పరులు మునివరులిట్లు ప్రార్థింపసాగిరి. హరికిఁ బరునకుఁ గృష్ణునకబ్జనాభునకును, విష్ణునకచ్యుతునకును సర్వలోకరక్షకునకు బ్రహ్మరూపునకును, బ్రణతులొనరింతుమేవేళ భక్తిమేము. ప్రాణిలోకమ్ము నెల్లఁగాపాడు ప్రోడకార్తజనరక్షకునకు నవ్యయునకు, కబ్జ నాభునకును హృషీకేశునకును నీకు; భక్తిసక్తినొనర్తుము వందనములు.

భక్తజనాభీష్టములు దీర్చు హృషీకేశ, భక్తజనావన, ప్రణతిపాల, శేషనాగశయన, వాసుదేవా, శ్రీశ, కమలాక్ష, జగదీశ, కమలమాలి, జగదాదికారణ సర్వజ్ఞ సర్వేశ, నారాయణా, శ్రీహరీ, నాగశయన, వేవేల సూర్యుల వెలుగుల వెలుగొందు దేవేశగోవింద దివ్యమూర్తి! వందనశతమ్ములివె నీకు వాసుదేవ. వందనములు నీకు సతముకోదండపాణి. భక్తికైమోడ్పులివె దేవప్రణతిపాల హరిముకుంద నమస్కృతులందు మయ్య యోగిజనులును, జ్ఞానధనులును, గూఢమెవ్వాని రూపముంగాంచఁ జాలరో, నిజతత్వమెఱుంగం జాలరో యాక్షీరసాగర శయనునకు నీకు నమస్కరించుచున్నారము. ఓ భగవంతా! యనంతా! మేమార్తులము. సర్వశరణ్యా, సర్వార్తిహరు నీశరణమ్ముం బొందియున్నారము. ఓ సర్వశరణ్యా సర్వేశ,

ఆబ్రహ్మాయు మీయిట్టి యాదివ్యస్వరూపమును నద్భుతమూర్తిని గాంచి యెఱుంగఁడు. ధన్యులము ధన్యులము. నీయనుగ్రహమతులితము. దండములు, దేవ వేవేలు దండములివె.

## సనకాది పరమయోగులొనర్చిన భగవత్స్తుతి

ఇట్టులు, బ్రహ్మాదులు, మునిజనులు, బ్రార్థనలొనరించినంత సనకాది యోగిజనులిట్టులు పరమాత్మునకు నమస్కృతులొనరించి వినుతులు కావింపసాగిరి.

జయము యజ్ఞపతీ! దేవ, యక్షరపరమాత్మ! నీకు జయము జయమచింత్యా శార్ఙ్గధరునకు చక్రహస్తునకు నీకు సదాజయము జయము. జయవిశాలాక్ష యచ్యుత జయము విభునకు నీకు సర్వేశునకును కమలదళమట్టు భూమండలమును పంటికొనఁ దాల్చిన ప్రతాపమూర్తికి నీకు వరాహరూపున కవ్యయానందమూర్తికి జయము జయము. ఓసర్వదా, సర్వేశా! సర్వాంతర్యామీ! పద్మనాభా! ఓపురుషా, పురుషోత్తమా! మానదా! జయము జయము. జయ జయసర్వేశ! జయపద్మనాభ! జయ జయపద్మాక్ష జయవేంకటేశ

ఓప్రభూ! నీమోహినీ మాయచే నెల్లదేవతలును, సమ్మోహితులగుచున్నారు. అనేకరత్న సంఛన్నము. సువర్ణమయము, సుందరసురమ్య కిరీటముం దాల్చిన యచింత్యరూపునకు, నీకు నిరంతరాబి వందనములు. యోగిజనధ్యేయున కవ్యయానందునకు నత్యంత శుద్ధునకు సర్వజ్ఞునకు నాదివేదసునకు నీకు నివె మా నమోవాకములు. ఓ పరబ్రహ్మస్వరూపా! వరదా! నతులమగుచున్నాము. అవ్యక్తునక ప్రమేయునకు సువర్ణునకు నీకు నోశ్రీధరా! దండములిడుచున్నాము. మావినతులు, వినుతులు గైకొనుము. శ్రీకాంతునకు, దాంతునకు నీకు మ్రొక్కులు. భక్తజనులకు ముక్తినొసంగు లోకజనార్తిహరునకు నీకు నేవేళ వందనములొనరించుచున్నారము. ఓ పురుషోత్తమా! శక్రాదిలోకపాలకులకును, రక్షకుఁడవగు పీతాంబరధరునకు నీకు నిత్యము నమస్కరించుచున్నారము. ఓవిభూ ! హేనాధా! ఎల్లయందున వ్యాపించియున్న విశ్వాత్మవునీవు. నీచేనీయాకాశమెల్ల పరివ్యాప్తమైయున్నది. పద్మసమానములు, కాంతిమయములు, చంచలముల చంచలములు, కనుదమ్ములు కలిగిన, సర్వాంతర్యామివి నీవు నీకు నమస్కరించుచున్నారము. ఓశ్రీహరీ, చిన్మయరూపా! ఈసృష్టియందెందును నీచేఁ బరివ్యాప్తము కానివస్తువెద్దియునులేదు. ఎల్లయందున నీవలరియున్నావు. స్వచ్ఛామల సూర్యునట్టి ప్రభలవెలుగొందు, నుజ్జ్వల కిరీటహారములు దాల్చిన శుభోరువునకు నీకు నోదేవదేవ వందనము లొనరించుచున్నారము. జన్మజరామృత్యు శోకాది దోషములులేని;

దేవదానవ మానవాదులెవ్వరు నింతదనుకఁ గాంచి యెఱుగని; విద్యుత్తునకును నధికమగు కాంతుల వెలుగొందు మీయీ విమలస్వరూపమునకు నివే వేవేలు దండము లిడుచున్నారము.

## ఇంద్రాది దిక్పాలకు లొనరించిన భగవంతుని స్తుతి.

అంతనత్తఱి నింద్రాది లోకపాలకు లెల్లరుం గూడ, సర్వప్రాణి లోకాంతరాత్ము మధుసూదను నమస్కరించుచు, నంజలించుచు విస్మయోత్ఫుల్లలోచనులయి,భక్తి తత్పరులయి భగవంతుఁ బరమాత్మునిట్టులు స్తుతింపం దొడఁగిరి. పీతాంబరధరునకు, దృశ్యరూపునకు, విశ్వరక్షకునకు, విశ్వాంతర్యామికి వేవేలు వందనములు. శార్ఙ్గచాపము, నందకఖడ్గము, కౌమోదకీగదను, పాంచజన్య శంఖమును, సుదర్శనచక్రముం ధరించిన తేజోధికునకు దివ్యమూర్తికి సర్వామర రక్షకునకు నవ్యక్తునకు భక్తిపూర్వక ప్రణామమ్ములు. మధుసూదనునకు, కైటభాసురహంతకు, కాలాగ్నిసదృశ చక్రమున సురవైరుల నెల్లహతమొనరించిన తేజోమూర్తికి నెల్లవేళల నిర్మలమతి, నిశ్చలమతి నమస్కారములు సొనరించుచున్నారము. దేవదేవునకివె నమస్కృతులు. నుతులు. సర్వకళ్యాణభూతునకు, భక్తులకు నర్థిజనులకు వరదాయకునకు, సదృశ్యరూపునకు మేమిదే నమస్కరించు చున్నారము. పరబ్రహ్మకు, భవ్యునకు యజ్ఞస్వరూపునకు నిత్యునకు నీకునిరతంబు, మ్రొక్కులర్పింతుము. శ్రీవత్సాంకితవక్షునకు, క్రూరదైత్య దానవభయ దాయకునకు, హరికి, నీకు నెల్లవేళల మ్రొక్కులర్పింతుమేము. స్వర్గవాసులకు మాకెల్లవు డడుగని భోగభాగ్యము లొసఁగెడు, భగవంతునకు ఏయిడుమలు వందకుండ మమ్ముల నమకంప ననవరతము రక్షించి పోషించుచున్న నీకు నేవేళ నమస్కరించుచున్నాము. నిత్యమచలునకు వరేణ్యునకు నమస్కృతులు. అవ్యయునకు, నశరణ శరణ్యునకు పదావందనములు. క్షీరసాగరశయనా! యోగాత్మా, యోగేశ్వరేశ్వరా దామోదరా నీకు మేము సాష్టాంగ నమస్కృతులొనరించుచున్నారము. ఉత్పత్తిక్షయవృద్ధివిహీనునకు, నిత్యునకు నిర్మలునకు నిర్గుణునకు, మేమెల్లవేళల భక్తియుక్తినిదలలతో దండములిడుచున్నాము.

నీవ పరముఁడ, వనిర్దేశ్యుఁడ, వచింత్యుఁడ వజుఁడ, వక్షరుఁడ వవ్యయుండవు; నిత్యపరంధాముండవు. పరబ్రహ్మవునీవ. నీయట్టివాఁడు మఱొండులేఁడు. నీవసర్వమునకైక మూర్తివి. మీయాపురాతన పరబ్రహ్మరూపంబు మేమెవ్వర మెఱుంగజాలము. తమచూపిన యీదివ్యరూపము వెఱుంగుము. ఓ విశ్వేశ్వర విశ్వతోముఖ! ఈయెల్ల ప్రపంచమును బుట్టించి పోషించి విలయమొనరించు వోసర్వప్రభూ! సర్వేశ! వందనములు. నీవసర్వమునకు

స్థానము. నీవ విశ్వమూర్తివి, సర్వవిశ్వకారణుడవు. భగవంతుఁడవు. నీకివే వందనములు. ప్రసన్నుండవుకమ్ము; ప్రణామములంగొనుము. జయ జయ సర్వేశ జయ జగదీశ.

## శ్వేతద్వీపవాసులు
## సిద్ధులుపొనర్చిన దేవదేవుని సంస్తుతి

ఓవిష్ణుదేవా! దేవదేవా! పురాణపురుషునకు, శుభోరుపాదునకు, నాద్యునకు నీకు మేము నమస్కరించుచున్నారము. నీకు సురేశున కజునకు విశ్వకర్తకనాది మూర్తికి ప్రణామములాచరించుచున్నారము. దంష్ట్రాగ్రమున నుండి వెలువరింపఁబడిన, దేవమానవరాక్షసాదులచే నెల్లప్రాణులచేఁ చరాచరములచేఁ బరిపూర్ణమగు నీభూమినెల్లం బట్టి పాలించువానికి, బ్రేమ బోషించువానికి నెల్లపుడును దండములిడుచున్నాము. వరదునకు సప్తైశ్వర్యప్రదాతకు, బరమాత్మకు మేము మ్రొక్కుచున్నాము. దుష్టరాక్షసులఁ దునుమాడు వానికి, సజ్జనావనునకు, సదయునకును, బ్రహ్మాండమందంత వ్యాప్తమై యున్నట్టి సర్వాత్మునకు మహాసత్త్వునకు నాదికారణునకఖండ శక్తికి నీకుఁ బ్రళయ కాలంబునఁ బట్టి సర్వంబును, సమయఁజేయు నీకు శాశ్వతునకుఁ, బాలకడలిం బండు పరమార్థతత్త్వమునకు, బాలరూపునకును నీకుఁ బ్రణతులొనర, భక్తిభావానఁ బొనరింతు మబ్జనాభ. కరుణనాదుకొమము. ప్రళయాంతమున సృష్ట్యాదిని నాభికమలమున లీలామాత్రముగ వణచి పట్టియుంచిన బ్రహ్మాండమునెల్ల లీలామాత్రమున వెలువరించి, పొడమించు, సృష్టిపొనరించు నీకు ననంత వినోదునకు నమస్కృతులు. జగత్పీడాకరులగు భయంకర దుష్టదానవులం బట్టి మాటిమాటికి నంతమొనరించి జగత్తును రక్షించు మేలొనరించు నారాయణునకు నిత్యునకు నమోవాచకములు. ఏ పరమపదమును, బ్రహ్మాది దేవతలు, నన్యులేవారును, మేమునుం గూడనెఱుంగమో అట్టిపరమపదమునీవ. వృద్ధివినాశములు లేని యాయక్షయస్థానమీవె. ఓ భగవంతుఁడా! మాయందునునుకంపఁ బూనుము. రక్షింపుము. మీకివే నమస్కృతులు, ప్రణతులు, వేవేలు దండములు, కైమొగుపులు. జయజయ పరమేశా! జయజయ పరమేశ జయమవ్యయానంద జయము జయము.

## విశ్వరూప దర్శనము

ఈరీతిని బ్రహ్మాది దేవతలు, నిర్మల నిశ్చలమతు లగస్త్యాది మహామునులు, సప్తర్షులు, శ్వేతద్వీపవాసులు సిద్ధులు, వసుభూపాల, శుక్రబృహస్పతులు, దూర్వాసమౌనివరుఁడు, సనకాది యోగివరులు, నింకను దేవుదర్శనముం

బొందవటకుఁజేరిన భక్తవరులాయా పరిసరముల వారెల్లరు నారాయణదేవునకు, సర్వలోక శత్రునాశకునకు, మాటిమాటికి నమస్కృతులొనరించుచు దేవునింజుట్టి విలిచి ప్రార్థనలొనరింపసాగిరి.

కమలనయనుఁడు, మహాబాహుఁడు, దేవాధిదేవుఁడు భగవానుఁడు గరుడారూఢుడు దిక్కులలమించు తేజోమూర్తియై యవ్వారి మధ్య వారినెల్లరం గరుణాదృక్కులం గాంచుచు నిలిచియుండెను. అమృతాహారముంగొను నచ్చరమచ్చెగంటులు భగవాను దివ్యకర్మలు పాటలుగఁ బాడుచు నాడుచుండిరి. కొందరు గంధర్వులాదేవుండొనర్చిన వీరగాథల గీర్తింపసాగిరి. కొందరా దేవుండొనర్చిన రావణవధను సంకీర్తన మొనరింప మఱికొందఱు కంసకేశి జరాసంధ, సాల్వబాణ దుర్యోధనాదుల సంహారములు సాశ్చర్యములు కీర్తించిరి. మఱియుం గొందఱు గంధర్వవరులు హిరణ్యాకశిపువధను, ప్రహ్లాదురక్షణను, వారసింహోదయమును నభివర్ణించిపాడిరి. ఈరీతిగవారు వారాదేవునాయా యవతారముల నొనర్చిన దివ్యకార్యములఁ బలుతెఱంగుల భక్తితన్మయులై వినుతించుచు, సంకీర్తనలొనరించుచు, దన్మయులగుచుండిరి. మఱికొందఱు బ్రహ్మమొదలుగఁ బిపీలికలవరకు నాదేవుఁడొనర్చిన మహద్విచిత్రసృష్టిని బ్రశంసించు గానమొనరించుచుండిరి.

అంతనంతన యాపరమాత్ముండు వారికిందన దివ్యాద్భుత మనోహర మూర్తింబ్రదర్శించెను. అనామయు నారాయణునట్టులు చూచుచుం జూచుచు, బ్రహ్మాది దేవతలు నగస్త్యాదిమునులు వస్వాదులు సిద్ధాదులు నెల్లరునాశ్చర్య చకితులైరి. దేవాధిదేవుని, కమలలోచను, బరమాత్ము దివ్యమహాద్భుత రూపముననెల్ల బ్రహ్మాండము లొక్కయెడ వింతగ నాటబొమ్మలట్టులఁదోచెను. ఎల్లపర్వతములు నదీనద వనగ్రామములు దేవాసుర మానవులతోడి యెల్లద్వీపములు నీరేడులోకములు నెల్లస్థావరజంగమతిర్యగ్వృక్ష శిలామహారణ్య మహెూరగములతో, మఱియు నింకను నదృష్టములగు నద్భుత దృశ్యములతో నిండిన బ్రహ్మాండమునంతను నాదేవురూపమున వింతతమవువం గాంచియెంతయు నబ్బురమందిరి; యానందమునఁ దన్మయులైరి. కాంచఁగాంచ వారికన్నులు మిఱుమిట్లుకొనెను; మనసు లుద్విగ్నములాయెను. భయాకులులై వ్యాకులీకృత సర్వాంగులైరి. అట్లున్నవారిం గాంచిన దేవుండు విమల కమలనయనముల, శుభేక్షణములఁ బ్రసన్నుండై చూడసాగెను. అట్టులు భగవంతుచే, శార్ఙ్గధరుచేఁ బ్రసన్న దివ్యాయత నేత్రములం గాంచఁబడిన వారెల్లరునంతలోనె తేరికొని మోహభయములు పాసినవారై ప్రసన్నమతులైరి. సర్వలోకేశుఁడు, విశ్వరూపధారి, సనాతనుఁడవ్యక్తుఁడు శ్రీహరిబ్రహ్మాది దేవతలెల్లరు నాలించుచుండఁ బ్రేమపూర్ణమేఘ గంభీరమధురవాక్కుల దిక్కులు ప్రతిధ్వనింపఁ జేయుచు నాయెడనామువి తల్లజాల నెల్లరంగాంచి యిట్టులనెను.

అత్యంతామిత తేజోయుతులారా! మునిఋషివరులారా! మీకు నావలనంగావలసినదేమి? మీయభీష్టములేమి. మీకోరునవేమియో కోరికొనుఁడు ఇందేమియు నిటమీకు వెనుక ముందాడవలసినది లేదు. ఈభూమిని నన్నుంగాంచిన మానవులు కొద్దికాలములోననే తమకోరిన కోర్కుల నెల్లంబొంది కడపట సుదుర్లభమగు ముక్తినిగూడఁ బొందఁగలరు. నన్నుంగాంచిన యేరుగాని విఫలమనోరథులై పోయినదిలేదు. కావున మీరిపుడె మీమీయెడందలం గల యుత్తమవరములను గోరికొనుడు. అన్నవిన్నమునివరులాదేవునకు మఱియు మఱియు దండములిడుచు నిట్టులనిరి.

ఓవనాతవ దివ్యరూపా! మిమ్ముంగాంచి మేమే కృతార్థులమైతిమి. దేవ నీయనుగ్రహములేక, నీవు ప్రసన్నుండవుకాక నీయీ దివ్యదర్శనమేరికిం గలుగువదికాదు. ఇట్టులేరికివి మిమ్ముంగవ శక్యముకాదు. మిమ్ముందర్శించు కోరికిచేతనే చింతాక్రాంతులమై, ఓ పురుషోత్తమా! యనంతా! మీపదపద్మముల దివ్యపరిమళముల నవిదిన యీపవిత్ర నారాయణ నగరాజమువఁ దిరుగాడితిమి. ఓవిభూ! గోవిందా! మిమ్ముం దర్శించిన మాకింకను గోరికలేమి? ఇట మిమ్ములం దర్శించి యీ సంసారసాగరము నుండి విముక్తిపొందవె మీచరణకమలమున నాశ్రయించినాము. ఓ దేవేశ! భీతింగలిగించు నీభవబంధములం ద్రెంచి మాకుముక్తి ప్రదాతవుకమ్ము. ఇట్టులు కోరిన వారియభీష్టము నాలించిన పంకజాక్షుఁడు వెంకటహరుఁడు, మురహరుఁడు, భూతభవిష్యాదినేత భగవానుఁడు వారికిట్టులనియెను. ఓ భక్తవరులారా! తపోధనులారా! మీరెవ్వరేమి కోరిన నదియెల్ల మీకునొసంగినవాఁడనె, ఇందుసందియములేదు. నేను ప్రసన్నుండను కాగా మీకు ముక్తియు సులభ్యమె. అదియేమియు దుర్లభముకాదు. ఓ మహానుభావులారా నాయనుగ్రహమున మీరాముక్తిని కల్పాంతమునం బొందఁగలరు. అంతదనుకను మీరలీ ప్రపంచమునఁ దపమొనరింప విశ్రయించికొని నాకథలనాలించుచుఁ జెప్పికొనుచు, దృఢతరాతి దుర్లభ తపోవ్రతమును బూనియుండుడు, మీకదియునేమియుం గష్టముకాదు సుఖులుకండు అనెను.

## బ్రహ్మదేవుని విజ్ఞప్తి

అదేసమయమున లోకపితామహుఁడు హిరణ్యగర్భుఁడు బ్రహ్మబద్ధాంజలియై జగత్పతికిఁ బరమాత్మకు నమస్కరించి యమితతేజస్వి నారాయణదేవున కిట్లనియెను.

ఓ సర్వలోకేశ! సర్వయజ్ఞమయ! భగవంతా! యనంతా! యచ్యుతా యాదిదేవా! దైత్యులదుండగములు పెంపొందినవి. వారీయింద్రాది దేవతలనెల్లర నెల్లవిధములఁ బరాభవించి యున్నారు. యజ్ఞభాగములెల్లవారేకైకొని మెక్కుచున్నారు. అందింతయు

ప్రతిలకుం జిక్కుటలేదు. ఐన నారక్కసులేమేని యజ్ఞకర్తలకు, లోకమునకు హితముచేయుచున్నారాయన్న అదియేమియు లేదు. యుద్ధముల నారక్కసుల దైత్యదానవులను దునుమాడుటకీ దేవతలకేమియు శక్తిచాలకున్నది. పెంపొందుచున్న యాదుష్టదానవుల దౌష్ట్యమునోదేవా! మీరిపుడె వినాశమొనరింపంగలరని కోరుచున్నారము. దయదలంపుడు. ఇట్లులనుచున్న యజుని, నాభిజన్మునిగని దైత్యారి చిఱునవ్వొలయ నెల్లవనిట్లనియెను. అగునగు, కడుంగడు పరాక్రమవంతులు మాయావులు; మహాత్ములు, తేజోవంతులునగు వారల సమరముల జయింప సమయింప నెంతయుఁ గష్టమగుపనియె. అనుచు సర్వాంతర్యామి భగవానుఁడు హృషీకేశుఁడు ప్రతాపియగు విష్వక్సేనుం గాంచి యిట్లులనియెను. నీవిపుడె ససైన్యుడవయిపోయి ప్రచండముగ వవరివారముగ నాదుష్టరాక్షస సమూహమును వెదకివెదకి సమూలముగఁ దునుమాడుము; అలసింపంబనిలేదు. ఇట్లని యటువసువుం గాంచి యిట్లుపలికెను. మహావీరా! చేదిభూపాలా! నృపశ్రేష్ఠా! నీకు నీకోరినదెల్ల నేనొసఁగినాడను. నీవీసంసార బంధముల నుండి శీఘ్రముగ విముక్తిని బొందఁగలవు. తొల్లియెల్ల బంధముల నుండి ప్రహ్లాదుని నేఁగాపాడితిని. ఆతండొక్కడే నీకుందుల్యుఁడు, భక్తుండు. మరొండు నాకుంభక్తుండు నీకు సమానుడులేడు.

ఇట్లాచేది మహీపాలునితో, వసువుతో బలికి దామోదరుఁడగస్త్యు భక్తితన్మయుఁ గనుల భాష్పములు నించి తన్నుంగనుచున్న వానింగని యిట్లనియెను. ఓ ద్విజశ్రేష్ఠా! నేనెంతయుఁ బ్రసన్నుండనైతిని. నీయభీష్టమేమి? కోరుకొనుము. అర్థియెట్టి దుర్లభమైనను నేను దానినీకుం గాదనక యొసంగంగలవాఁడను. ఇట్లులు భగవానుఁడు పలికినంత నాస్త్యమహర్షి మహదానందభరితుఁడై తలనుచేతులు చేర్చియంజలించి మ్రొక్కుచునానంద తన్మయుఁడై పరమాత్మతో నల్లననిట్లనియెను.

ఓకేశవా! మహాబాహూ! దేవదేవా! ఆదినారాయణా! ఈ పవిత్ర పర్వతరాజమున మిమ్ముం దర్శింపఁ దిరుగుచు దిరుగుచు మాకు మూయువత్సరములకుం బైగా గడచిపోయినవి. చిరకాలమిట నట్లులు తిరిగి తిరిగి మిమ్ముందర్శింపఁ జాలకపోతిమి. కావుననెంతయు నుద్విగ్నమతి దుఃఖితులమైతిమి. ఓ పురుషోత్తమా! నేడు ప్రారబ్ధమున, నదృష్టవశమున, మీయనుగ్రహమున నోజగత్స్వామీ! మిమ్ముంగన్నులారా గాంచగంటిమి. కావున నోదేవదేవ నేనింతకు మున్నెమనమున నిశ్చయించికొనియున్న యభావరదానము నుఁ గోరుచున్నాను. ఓ ప్రభూ భూతభవిష్యద్వర్తమానకాలముల నెల్లప్రాణులయు గతికడుంగడు దుర్బోధము, దుర్జ్ఞేయము. కావి ఓశ్రీహరీ, ఆదుర్జ్ఞేయమగు దుర్బోధమగు గతినే నేఁదెలియంగోరుచున్నాను . వేవేలవిధముల వివిధయువేతిని వియుదులును దెలియ సమర్థులు కాకున్నారో ఆదుర్బోధమగు గతిని మీయనుగ్రహమువనేఁ దెలియం గోరుచున్నాను. అదినాకు సుబోధకమగునట్లులను గ్రహింపుడు. మతియును నోదేవదేవా!

మీయందున నాకెల్లపుడు నుత్కృష్టభక్తి కలిగియుండునటు లనుగ్రహింపుడు అనుచు నిట్టులగస్త్యముని వరుఁడు కోరికొనినవిని లోకరక్షకుడు భగవంతుఁడు నవ్వుచు మేఘగంభీరవాక్కుల నిట్టులనియెను.

ఓ యగస్త్యా! నీవీపర్వతమున నొనర్చిన పూజకెంతయుం బ్రసన్నుండనైతిని. మునితిలకా నీకోరినదెల్ల నట్టులెయగుగాక! కావున నీవుకోరినయీకోర్కి నీకునే నొసంగితిని. అన్నవాలించి యగస్త్యుఁడు ముదమంది భగవంతుంగని మఱియు నిట్టులనియెను. పరమేశా! దయామయా! ఇతరులకు నెల్లప్రాణులకు సద్భక్తియుతులకు, సచ్చరితులకుం దర్శనమొసంగుచుఁ దమరీపర్వతమ్మునసే నివాసము పొనరించికొనియుండ నేమిమ్ముల నెంతయుఁ బ్రార్థించుచున్నాడను. అన్న యా యగస్త్యునకు జగదీశుండిట్టులనియెను.

ఓపాపరహితా! పుణ్యాజీవీ! అగస్త్యా నీకోరినయటులనే నేను శ్రీభూసహితుండనై యీపర్వతరాజమున భక్తులకు, పావనార్థిజనులకు దర్శన మొసంగుచు వాసముందును. కాని ముక్తిప్రదమును నాకాశగామియు, నచింత్యము, నానారత్నయుక్తమువగు నాయీదివ్యవిమానము గుప్తముగనెయుండును.

ఓ భక్తవరా! ఈనారాయణగిరినెక్కియీ విర్మలపావన స్వామిపుష్కరిణిని గాంచి యందు స్నానమొనరించి యీపవిత్రజలములు త్రావినాయందునసె యనన్యభక్తిని మవస్సుచేర్చి నన్నె యాశ్రయించి నాకుంబ్రీతి నొనర్చువారికి భక్తజమలకుఁ, బుణ్యమయమగు పర్వపావవాశకమగు విమానమునంగల నన్నెంచి నాపూజలు పొనరించువారికి నెల్లపవిత్రములు కోర్కులు నెంతదుర్లభములైనను నొసంగంగలవాడను. వందలయోజనముల దూరమున నుండియు నన్ను బవిత్రమనమువ నుంచి భక్తియుక్తి నీపర్వతమునకు నమస్కరించువారును నాయనుగ్రహమునొంది, పాపరాశులు, వశించినవారై పుణ్యాపదమును బొందుదురు. నిత్యమును నీస్వామి పుష్కరిణిని మనమున ధ్యానించుచు నిత్యసేవన మొనరించువారు, స్నానములొనరించు తఱిపవిత్ర పుష్కరిణీ జలస్నానమొనరించుచున్నాడనమకొను వారును, పవిత్రమానసులు, భక్తులు ముక్తింబొంది తరింతురు.

*ఓం శ్రీ నవకాది మహాయోగి పూజితాయ శ్రీ వేంకటేశాయ నమః*

*ఓం శ్రీ శేషపర్వతరూపత్వ ప్రకాశనపరాయ శ్రీ వేంకటేశాయ నమః*

# అష్టమాధ్యాయము.

## భవిష్యత్తున కలియుగమున వేంకటాద్రిని భగవద్దివ్య విమానము - దానిమహిమ.

అగస్త్య మహామునివరుండు తనతోడి మునితల్లజులకు నట మహేంద్రగిరిని నీకథ వివరించి చెప్పెను. ఇదియెంతయు నాకర్ణ నీయము, భక్తిముక్తిదాయకము. ఓతపోధనులారా! భావినికలియుగమున నాపవిత్ర వేంకటాచలమున నాదివ్యవిమాన దర్శనము మఱలకాఁజాలదు. ఆదియింతకుమున్నె కనుమఱుగైపోయెఁగదా. మఱియటఁదోచుటయను నదిలేదు. కాని భక్తవరదుఁడు శ్రీనివాసుడు తనబిడ్డల నెల్లెమఱియుండఁగలఁడు! వారిందరింపఁజేయనే యోచించు చుండును. కావున వనన్య భక్తవరులచే భగవత్ప్రేరణ చేతనే యట నాస్వామి పుష్కరిణీ పవిత్ర తటమున దివ్యము మహోన్నతము, సూర్యునట్టి కాంతుల వెలుగొందంగల యనుపమమగు విమానము మానవులచే నిర్మింపంబడును. అద్దానిదియు మాహాత్మ్య మమేయము, మహాద్భుతము. ఆదివ్య విమానము సర్వామరులచే, నమరాధిపులచే, సంపూజితంబగుచు దేవాధి దేవునకు వేంకటనగాధి వాసునకు శ్రీనివాసునకు ననవరత నివాసమై నిశ్చల నిర్మల మతిం దన్నుం జేరిన వారికి భక్తియుక్తిపరులకు భక్తిని ముక్తిని నొసంగునదై యలరారంగలదు. ఇందేమియు నందియములేదు. భక్తజనుల, త్రైలోక్యవాసుల, నెల్లప్రాణుల నుద్ధరింపఁదరింపఁజేయ ననుకంపంబూని తానుగవచ్చి, భగవంతుఁడు నెలకొనియున్న, లోకత్రయోద్ధారకునకు, లోకకళ్యాణ ప్రదాతకు నప్రమేయునకు, ప్రియతమమైన నివాసమైన యాయాలయమును, ఆదివ్య విమానమాహాత్మ్యమును, దేవతలును పూని వందల సంవత్సరములును, బూర్తిగ వర్ణింపఁజాలరన్న, మానవులంగూర్చి చెప్పుట యెందులకు? శ్రీభూమాతలతోఁగూడిన వాఁడై జగదుద్ధరణాభిలాషను దేవాధిదేవుఁడు వేంకటేశుఁడు, శ్రీ శుఁడు నెలవుకొనియున్న పాపహారియగు నాదివ్య విమానమును భక్తి శ్రద్ధల నిర్మలమతిందర్శింపంగల మానవులా విష్ణుదేవుని ప్రసాదమున, నమగ్రహమున నెల్లబంధనములుంబాసిన వారై సనాతన దివ్యధామమునుంబొంది తరింపంగలరు.

కలియుగమున నక్కాలమునను సిద్ధులతో చారణులతో దేవతలు, గంధర్వులతో మహర్షులు, పన్నగులతో యక్షాదిత్యులు, వసురుద్రులు, దిక్పాలురు, మరుత్తులు, చతుర్ముఖుఁడు బ్రహ్మ, శంకరభగవానుఁడు, వింకను నన్యాన్య మహాజ్ఞములటకు వచ్చి దేవాధిదేవునీశ్వరు పరంధాముని దర్శించి మతించుచు మ్రొక్కులర్పింతురు. మానవులు భక్తి తత్పరులు పావన స్వామి పుష్కరిణీ జలముల స్నానములొనరించి దేవదేవేశు

నారాయణు ననామయు నమస్కరించి, యాదివ్య విమాన సంస్థితునాదిదేవు గోవిందు పురాణపురుషోత్తము నహర్నిశలు సంస్తుతులొనరింతురు. ఎట్టి పాపులును మనసులు మారి, తమచేనైన పాపములకుంబరితాపమందుచు మఱియెట్టి పాపములకుం బూనుకొనని వారై పావనమతింబోయి యాపుణ్యప్రదమందిరము దివ్యాలయమును గాంచువారు నిస్పందేహముగ నెల్లపాపములుం బాసిన వారై సుఖులగుదురు. ఏదేశము వారైనను, ఏవారైనను ఆదివ్యవిమానమునకు నాలయమునకు నెదుట నిలిచి నిశ్చల నిర్మలమతి నమస్కరించువారు, వేంకటాచలమునకు మ్రొక్కువారు, పావనమతిం దేవుందలంచి నతులనర్పించువారు, ఎల్లబంధములు బాయుదురు. తరింతురు. భగవంతుఁడట నాలయంబునవె యనుట యెందులకు, నాకొండ నెల్లెడఁ దానై స్వయముగ నసించును. ఎల్లగుహల, కందరముల, శిఖరముల, పవిత్ర పావన ప్రవాహముల, సానువుల, గుంటల మెట్టల మిట్టల, భగవంతుఁడు నానావిధముల రూపములవూని తానుగనపించును. ఒక్కొకచో దేవరూపమున, మఱికొన్ని యెడలఁజెట్టులు పుట్టలట్టులు, పక్షులు మృగములవలె, మనుజరూపమున నింకనునేమేమియో వింత రూపముల నెల్లెడఁదానయై విలసిల్లును.

కావుననే అమ్మహాదివ్య పర్వతమున నెచ్చటనేని కూరుచుండి భక్తి తత్పరుఁడై దేవాదిదేవు భగవంతు జనార్దను నర్చించువాఁడు, ఉపాసించునతఁడు భగవంతు సాన్నిధ్యముంబొందును. ఇంతయెందులకు భగవానుఁడు దయామయుడు, అచ్చట కాపవిత్రశైలమునకు బోజాలనివారు తమయిరవులనెయుండి తన్మయత, నాపావన పుష్కరిణిందల పోయువారి యెడను నాదేవుడు మనసుంచి వారి వినుతుల నాలించి కోర్కుల మన్నించితరింపం జేయుననుటకు సందియములేదు. అటవా కొండను, కొండదరినీ, అజ్ఞానముచేనైనను పాపములాచరించుహీనుని, శ్రీవిష్వక్సేను నాజ్ఞచే గంధర్వులు, సర్వనాశమొనరింతురు అన్న తెలిసి, చేయవలయునని పాపకర్మలు చేయువారిపాటులు దుర్గతులు వేరే చెప్పుటెందులకు? కావున ముఖ్యముగనాపావన వేంకటాచలమున శేషాద్రి దరినేరును నేవిధమగు పాపమును పొనరింపరాదు, చేయను దలంపనెరాదు.

అటునాశేషశైలమున, పావన వేంకటనగముననేదియుం బ్రాకృత జీవిలేదు. దేవతలెల్లరు నాయారూపములొందియట దేవునర్చింపఁజేరియున్నారు. అందెల్లరు నాదేవుఁడును ప్రకటితరూపమునమండి సర్వముంగాంచుచుండును. కావున నటకుంబోయి నిర్మలమతి, పవిత్రకార్యముల దేవునర్చించి తరించుటయె యెల్లమానవుల కర్తవ్యము.

అటంజేరి దేవద్రవ్యముల నపహరించువారు భక్తుల ధనాదుల నపహరించువారు, పాపులు పొందు హీనస్థితిని వర్ణింపనేరికింగాదు. వారురౌరవాది మహా నరకములంబొంది భూమిని నీచజీవులుగ బుట్టుదురు. కావునం జెప్పునదేమన నెవరు నెచ్చట నేవిధమగు పాపకార్యమునకుందొరకొనరాదు. అందునను, దేవ భక్తుల, నమాయకుల గువారల హింసింప మోసగింపం బూనరాదు. దుష్టులగువారులోకుల కనుమఱిగి తమ దుండగములు కొనసాగింపంగలరు. కాని సర్వవ్యాపియు, సర్వాంతర్యామియు నెల్లెడం దానయై యనంతనేత్రుండై సర్వముంగాంచు, వినుచు మనయెల్లరి హృదయములనుండి భావముల దెలియుచు చేతలం కనుచునుండువాని మఱుంగ, మోసగింపనే వాని కింగాదు. కావున నెట్టి పాపపు చేతకు, భావమునకు మాటకు, నెప్పుడు నెక్కడం దొరకొనరాదు.

## స్వామి పుష్కరిణీ దరిని చేయు దానాదుల మహిమ

ఓముని శ్రేష్ఠా! నారాయణ గిరివరమున నుత్తమదానము లేమేమియొనర్చిన మానవుడే పాపములంబాసి యెట్టిపున్నెములంబొందును. అనియడుగుచున్న జనకనృపాలునకు నామునివరుండిట్టులనియెను.

నారాయణ గిరివరమున స్వామి పుష్కరిణీ తటమ్మున నిష్కాముండైయున్న దానమొనర్చు నాతండుత్తమ, పుష్కల విష్ణుభక్తిని బొంది కొద్దికాలముననే యోగము నొంది పరమగతిని పొందును. మననుమారి, పావనమతి పుష్కరిణివిజేరి యందునముమకలిడి, ఎవ్వరుతమ శక్తికొలందిగ వేంకటనగమ్మున స్వామి పుష్కరిణిదరిని, బంగారము, గోవులు, వస్త్రములు, భూములు, తిలలు సుగంధ ద్రవ్యములాదిగ యోగ్యులగు వారింగనిదానము లొనర్తురో వారలారోగ్యవంతులై దీర్ఘాయువునందుదురు. కోరికలెల్లందీరి సుఖింతురు. కడకుంబాపము లెల్లంబాపి, యుత్తమగతి నొందుదురు. తొల్లివామదేవ మహామునియాపవిత్ర వేంకట నగమ్మునఁబెక్కువత్సరము లావిధాతం గూర్చి భక్తి నిష్టల దపమాచరింపం బ్రసన్నుండై మరజ్యేష్ఠుడు, బ్రహ్మ ప్రత్యక్షంబై ప్రేమగంభీర వాక్కుల నిట్టులనియెను. ఓవామదేవా! భక్తవరా! మీవలననే నెంతయుం బ్రసన్నుండనైతిని మీకోరిన వరమీయనే నేవిటకు వచ్చితిని. మీకోరునదేమియున నాదేవుంగని మునివరుండిట్టులనెను. ఓభగవానుండా! ఈపర్వతోత్తమమునంగల స్వామి పుష్కరిణీ తీర్థముయొక్క మాహాత్మ్యమును, తద్దర్శన ఫలమును, తత్తీరమున నొనర్చు దానఫలమును మీవలన నెఱుంగం గోరుచున్నాడనది యెల్ల మీరునాకుందయయుంచి తెలుపుండన విధాతయుతని కిట్టులనియె.

ఓ మునివరా! క్షీరసముద్రోద్భవుఁడు చందురుడు ఈ స్వామి పుష్కరిణీ తీరమున సువర్ణాభరణమొండు దానంబొనరించి తత్ఫలితముగ సాటిలేని పరమసౌందర్యమునొంది యలరుచున్నాడు. కాముడు దీనితటమునఁగన్యాదాన మొనరించి కామదేవత్వము పొందఁగనెను. అచ్చట సువర్ణదానము నొనర్చినవాఁడగుటనే కుబేరుఁడు ధనాధ్యక్షుఁ డాయెను. అటనాస్వామి పుష్కరిణీ తటమ్మునఁ బదునారు విధములగు దానము లొనర్చియే యింద్రుఁడును నజేయబలాదులనొంది, దైత్యులందాకి విజయముంబొందఁ గలిగెను. తొల్లి కాలజిత్తు నాఁబడునొక బ్రాహ్మణవరుండు బ్రహ్మజ్ఞానమును బొందుకోరిక నిట నీతీర్థతటమునకు వచ్చి చేరెను. శ్రీ వేంకటాధీశుఁడు శ్రీ శుఁడు తాను స్వయముగ నాతని జేరంజేరి బ్రహ్మజ్ఞానమును సుబోధల నొసంగెను. అట్లు జ్ఞానమును బొందిన యాతఁడే "బృహస్పతి" యాయెను. భూమియందెల్ల నెప్పుడు భగవానుడు ప్రకటముగ నుండనేయుండును. కానియీ వేంకటాచలమున నాతని యునికి యొక ప్రత్యేక విశేషరూపమున నుండును. కావున నటపాలకులు, ధనికులు, శక్తకొలందిగ నెల్లజనులుఁ బాత్రదానంబులొసంగనేవలయును. పవిత్రమున భక్తియుక్తి దేవు నారాధింపనే వలయును. దానిచే వారలుత్తమ లోకము లొందుదురు.

తొల్లి తొలుదొల్తను నేనె భాద్రపాదమాసమున శుక్లపక్షమునఁ జిత్రానక్షత్రయుక్త శుభతిథిని భగవంతుని శ్రీహరిని బ్రసన్నునొనరింప మహోత్సవమును బ్రారంభించి యొనరించితిని. అప్పటినుండియె దేవదేవునకట నుత్సవములు ప్రారంభ మాయెను. ఎల్లయుగముల భగవంతుని విష్ణుదేవుని ప్రసన్నతకునై స్వామి పుష్కరిణీతటమున, ధర్మాత్ములగు మానవు లుత్సవములను పొనరింతురు. పొనరింపంజేయుదురు. భాద్రపదోత్సవమున నింతమాత్ర ము పాసన యొనరించినను భగవంతుడు విష్ణుదేవుఁడ వ్వారికంతట నత్యంత దుర్లభములగు వరములొసంగి తనియించును. నారాయణా చలమున, దేవునుత్సవ కాలమున నాయెడకుం బోయి యుత్సవములంబాల్గొను వారుపొందు నాసత్ఫలముల నాలింపుము. ఎవ్వాడు శ్రీనారాయణాచలమునం జరుగు నాదేవుని యుత్సవమునంబాల్గొన బయలుదేరునో యాతఁడు తనయింటి నుండి బయలువెడలి సాగి వేంకటాద్రివైపునకు సాగించిన దేవునుత్సవముం జేరు దనుక నిడిన యొక్కొక్క యడుగున కొక్కొక్క యజ్ఞమొనరించిన యజ్ఞపుణ్యఫలము నొందును. శ్రీవృషభాచలమునఁ జరుగుదేవునుత్సవములం బాల్గొనవచ్చుపుణ్య యాత్రికులకుఁ దమశక్తి కొలందిగ సేవలర్పించు, సుఖమును గూర్చు వారికి భగవంతుఁ డెంతయుం బ్రసన్నుఁడై వారికోరిన వరదానములొసంగును. అట్టిభక్త యాత్రికులకుఁ దమశక్తికొలఁదిగ సేవలంజేయక, ఆశలమువిగియుండి యా పవిత్ర భక్త యాత్రికుల హింసించు, మోసగించి,

యిడుమల ముంచు, ధనాదులు దోచుకొను నామహాపాపులు పొందు శిక్ష కంతమే యుండదు. భగవంతుఁడు వారినెంత దనుక శిక్షించునో యెవ్వరికెఱుక ? వారుకల్పాంతము దనుక ఘోరనరకముల మగుదురు. అధనముల మెక్కువారి కుటుంబమువారును నరక యాతనలంబడిన వెతనందుదురు. పిమ్మట నీచాతి నీచములగు పుట్టువులంది మడియుదురు. ఆస్వామి పుష్కరిణీతటముల, నావేంకటాద్రిని భగవత్సేవలకై దివ్యోద్యానములు నాటి పెంచువారు కల్పాంతముదనుక నందనో ద్యానమున నానందింపంగలరు. విస్తరించి చెప్పుటయెందులకు ! అట నాపవిత్రస్వామి పుష్కరిణీ తీరమున వేంకట నగమున, జేసిన పుణ్యకార్యఫలము లనంతములు; వానింజెప్పంగొలదు లెంచ నేరికిందరము కాదు. ఇట్టులెంతయుం జెప్పి లోకపూజితుడు బ్రహ్మదేవుడంతర్ధానము నొందెను. అదియ నీకునే జెప్పితినన నంత నదియెల్ల వినిన జనక భూపాలుఁడు ప్రసన్న హృదయుఁడై నారాయణగిరికి దేవుందర్శించి పూజలందింప నరిగెను.

## మార్కండేయుడు ముల్లోకములం గల తీర్థముల మునకలిడిన పుణ్యఫలమందుట

ప్రపంచమునంగల పావన తీర్థములెల్ల నెట్టులెప్పుడు వచ్చియా పావన స్వామి పుష్కరిణీ జలములంగలియును? అట్టులెందులకు వచ్చి చేరును? అనతీయుండన మునివరుండిట్టులనెను. తొల్లి మార్కండేయ మహామునివరుఁడు భాగీరథీ పావననదీ తీరమున నునవసించి సర్వజగత్స్రష్టను భువనేశ్వరు బ్రహ్మనుగూర్చి పరమోగ్ర తప మొనరించెను. చిరకాలమునకు లోకపితామహుండు ప్రజాపతి ప్రసన్నుండై యాముని వరుందరిసి దర్శనమొసంగి, "ఓ మార్కండేయ! నీతపమునకే నెంతయుం బ్రీతుండనైతిని. నీకోరునదేమియొ కోరికొనుము. నేనొసంగువాఁడ" ననెను. అట్లుతోపలికిన దేవునకు, బరమేష్ఠికి నమస్కరించి భక్తి వినమ్రుండై మునివరుఁడిట్లనెను. ఓసురజ్యేష్ఠా! సురశ్రేష్ఠ! ముల్లోకములంగల పావన దివ్య తీర్థములన్నింటికి యాత్రగంబోయి మునకలిడంగల శక్తి సామర్థ్యములు నాకుం బ్రసాదింపుము. నాకోరువరమిదియె; యనవాలించిన బ్రహ్మచతురాననుఁడు నవ్వుచు నతనికిట్లులనియెను.

ఓ బ్రహ్మవరా! మార్కండేయమునీ! ప్రపంచమునంగల యెల్ల తీర్థముల కుంబోయి స్నానములు, నూరువత్సరములకును నేరును జేయఁజాలరు. నేనుం జేయఁజాల, నాశంకరభగవానుఁడును జేయ సమర్థుండుకాఁడు. అన్న వినకజెప్పనదేమి? అయినను నీకు దానికై యొక మంచి యుపాయము చెప్పుచున్నాడను. ఇక్కడకుం

దక్షిణ దిగ్భాగమున రెండు వందల యోజనముల దూరమున ద్రవిడ దేశమునఁ వేంకటాచలమన నొక యుత్తమ నగరాజముకలదు. అద్దియమరాధిపుల చేతను పంసేవితమగు పావనధరాధరము. పుణ్య ప్రదమగు నాపర్వత విశాల శిఖరమ్మున నెల్ల కోర్కులొసంగంగల పాపనాశినియగు "స్వామి పుష్కరిణి" యను పేరంబరగు నొక యుత్తమ సరసియొప్పియున్నది. ఓమునివరా! ఆ పుష్కరిణి ప్రపంచమునంగల యెల్ల పుణ్యతీర్థములకును స్వామిని, మార్గశీర్షమాసమున, శుద్ధద్వాదశి తిధిని అరుణోదయ కాలమున లోకమ్మునంగల మూడున్నరకోట్ల పావన తీర్థములు వచ్చి యా స్వామి పుష్కరిణీ పావనజలమ్ములఁజేరివసించును. అవియట్టు లెందులకుం జేరునందువా? అవి తమ్మంజేరి మునుకలిడినవారి పాపము లెల్లందాముకొని వారింబావనులంజేసి పుణ్యము లొసంగి పంపుచున్నవి. ఇటఁ దమ్మంజేరిన యాపాపములం గడిగికొన నే యవ్వి యాపుణ్యకాలమున నాపుణ్యపుష్కరిణీ జలములంజేరుచున్నవి. ఓమార్కండేయ మునివరా! నీవాస్వామి పుష్కరిణికింబోయి తానమాడి యెల్లతీర్థముల స్నానము లొనరించిన పుణ్యఫలము నొందుము.

అది యెల్ల తీర్థములకును స్వామినియగుటనే స్వామిపుష్కరిణి యనంబడు చున్నది. ఓమునివారా! నీకునేమటొండు ధర్మరహస్యముంజెప్పుచున్నా నాలింపుము. అద్దియెటింగినమటి నీకన్యమెఱుంగవలసినది యెయుండదు. ఈ పృధ్వీ తలంబునంగల గంగాదియెల్లదివ్య తీర్థములందును, మటియు మేరుపర్వత శిఖరమ్మున కైలాసమున, మంధరాచలమున, బాతాళమ్మున, సింధునది తటమ్మున, మటియు నితరములగు ద్వీపములంగల తీర్థములందున స్నానములొనరించుటచే, జపతపము లొనరించుటచే, వ్రతములు హెూమము లొనరించుటచే నేదివ్య పుణ్యఫలములు కలుగఁగలవని, వేదములు, పౌరణములు, స్మృతులు వచించుచున్నవో అవ్వాని నెల్ల నొక్క మారేతాను పొందవలెననియెవ్వాఁడు కోరుచున్నాఁడో ఆమానవుఁడు, మార్గ శీర్షమాసమున శుక్ల పక్షమున ద్వాదశి దినమున, జితేంద్రియుఁడై నిశ్చల నిర్మలమతియై మహాపుణ్యప్రదమగు వేంకటాచలమున, స్వామి పుష్కరిణీ తటమ్మున, వేదపాఠియు విష్ణు భక్తుఁడునగు శాంతధీరునకు, శతుమిత్రసమునకు బ్రాహ్మణునకు, దీనజనునకు యేమేని శక్తి కొలందిగ దానముంజేయు నాతఁడు సర్వతీర్థముల స్నానమొనరించిన వాడేయగును. అట్టులె యింకను కలిగిన కొలందిగ పత్పాత్రదానమ్ము లొనరించువారును నాసత్ఫలమందుదురు. కోరిక తీరిన వారగుదురు. మునీశ్వరులు చెప్పిన యాపదునారు దానములలో నేయొక్క దానమేనియు మార్గశీర్షశుద్ధ ద్వాదశి దినమున స్వామి పుష్కరిణీ తీరమున జితేంద్రియుఁడై యొనర్చు వాతడు సర్వతీర్థముల సర్వదానముల నొనర్చిన యాతడే యగును. ఆయా

పుణ్య ఫలంబులనాతఁడు సంపూర్తిగ పొందఁగనును. ఆపదునారు వస్తువుల దానఫల మాతనికొక్కమారుగఁ జేఁజిక్కును. ఇది కడువింతయగు విషయము కదా. మార్గశీర్షమున శుక్ల పక్షమున ద్వాదశిదినమున అరుణోదయకాలమున స్వామి పుష్కరిణీ జలముల నెల్లతీర్థములు వచ్చిచేరును ఆసమయమున॥ మంత్రము:-

ధనుర్మాసే సితే పక్షే ద్వాదశ్యామరుణోదయే ।
ఆయాన్తి సర్వతీర్థాని స్వామి పుష్కరిణీజలే ॥

ధనుర్మాసమున శుక్లపక్షమున, ద్వాదశి దినమున నరుణోదయమున,స్వామి పుష్కరిణి పావనజలముల ,సర్వతీర్థములు, వచ్చియు జేరును,అనుమంత్రము నుచ్చరించుచు స్వామిపుష్కరిణీ జలముల నెవ్వారు స్నానమొనరింతురో వారలెల్ల తీర్థముల మునుకలిడిన పుణ్యఫలమును బొందఁగలఁరు. ఈమాహాత్మ్యమును సాక్షాద్విష్ణు భగవానుఁడే తొల్లినాకు వచించియున్నవాఁడు. అనిబమ్మపలికి తానంతర్ధాన మాయెను.

అట్టులు ప్రజాపతి స్రష్టయంతర్హితుండగుటకు మార్కండేయుండెంతయుం జింతించెను. కానియంతనె ప్రసన్నమానసుండై విధి, విశ్వస్రష్టువచించినట్టుల నారాయణగిరికి వెడలిపోయెను. అక్కడకుఁ జేరిమునివరుఁడు స్వామిపుష్కరిణిని గాంచియద్దాని పవిత్రవిపుల విభవమునెంచి యాపావనజలమ్ముల స్నానమొనరించి యటనాపావనతటమున భగవంతు హృషీకేశుని పూజలు భక్తినొనరించెను. అటదేవు నర్చించుచు, స్నానములొనరించుచుఁ బావనమతినట మూడేండ్లేకమతి నాతఁడుండెను. ప్రతిసంవత్సరమాశుభ దినమున నెల్లతీర్థములరాక, యాపావన పుష్కరిణీ జలములఁ జేరిక నెఱింగి యందునఁ దాను మునకలిడి యామార్కండేయ మునితల్లజుఁడు శార్ఙధరు భగవాను కరుణచే శాశ్వతానందమును బొందెను.

మార్గశీర్షశుద్ధ ద్వాదశి నెవ్వారీ స్వామి పుష్కరిణీ తీర్థమాహాత్మ్యమును భక్తిశ్రద్ధలఁ జదువుదురో, విందురో వినిపింతురో వారియెడ భగవంతుండెంతయుఁ బ్రసన్నుండై సర్వాభీష్టఫలంబుల నొసంగి తనియించును. ఆ వేంకటాచలమున మార్గశీర్షమున శుద్ధ ఏకాదశిని ఉపవసించి ద్వాదశీదినమున నరుణోదయకాలమున స్వామి పుష్కరిణీ జలమ్ముల స్నానమొనరించి యట జగన్నాథు దేవదేవునర్చించి యేవారు పూజలర్పింతురో వారలు భగవదనుగ్రహమునఁ బాపరాశి నెల్లంబాసినవారై, పావనులై పరమాత్మను సుఖస్వరూపుని పరమధామమును బొందంగలరు.

శాస్త్రముల సారము వేదములు. ఆవేదముల సారమే భగవంతుఁడు శ్రీహరి. అట్లనే సర్వతీర్థముల స్వామి, స్వామిపుష్కరిణి యుత్తమోత్తమము. ఇట్టులు చెప్పి

యామునివరుండు జనకభూవరుతో ఓరాజా! మీరును ఆనారాయణగిరికింబోయి స్వామి పుష్కరిణీజలముల మునుకలిడి, జితేంద్రియులై, తత్తీరమున నున్న, యెల్లప్రాణులకు శరణ్యుడైన భగవాను నారాయణు నారాధింపుఁడు దానమీరెల్లకోర్కులు పొందినవారగుదురు అనెను.

ఆమార్కండేయుడు నారాయణగిరి కేగి దేవుదయనంది తరించెనని శతానందునిచే విన్న జనకభూపాలుఁడును మిగులముదమంది మంత్రులతో గూడి నారాయణాద్రికిం బోయి స్వామిపుష్కరిణీ జలముల స్నానములొనరించి శ్రీభూసహితు శ్రీనివాసు నర్చించి జనకుఁడెల్లకోర్కులుం దీరి మఱలమిథిలకు వచ్చి పృథ్వీపాలన మొనరించి ప్రజలందనియించి తానుతనిసి తరించెను.

## శ్రీవేంకటాచల మాహాత్మ్యము మార్కండేయుని తీర్థాభిలాష

శౌనకాదులంగాంచి రౌమహర్షణి మునివరుండిట్టు లనియెను. ఓముని తల్లజులారా! తొల్లిమృకండుతనయుండు,మార్కండేయుఁడు ప్రసన్నమూర్తిం బురుషోత్తము, భగవంతు సేవలొనరించి దేవుననుకంప దీర్ఘాయువునొంది చిరంజీవి యాయెను. అటనుండి బుద్ధిమంతుఁడామార్కండేయుఁడు, భక్తిని, బయలువెడలి వచ్చి తమయాశ్రమమువ నెల్లతాపసుల యెదుటనే వంగి, భూమినంటి తలిదండ్రులకు భక్తి యుక్తి సాష్టాంగ నమస్కృతులొనరించి లేచినిలిచెను. ఆనమ్రమూర్తి తత్త్వజ్ఞుఁడు మార్కండేయుండు పితృదేవతలకుఁ దనకడచిన వృత్తాంతమంతయుం జెప్పి వినిచి ప్రమోద చిత్తులనొనరించెను. పిమ్మట నాతఁడు వారలతో నిట్టులనియెను. ఓ మాతృదేవీ! పితృదేవా! నాకోర్కినాలింపుడు. భగవదను గ్రహమున నాజీవితము పూర్తిగఁ బెంపొందినది. ఓపుణ్యదేవతలారా! తలిదండ్రులారా! నాకుంబుణ్యతీర్థముల, క్షేత్రముల నెల్లందిరుగ దేవునర్చింపఁగోర్కియగుచున్నది. మీరిర్వురు నాయం దనుగ్రహము కలవారై పుత్రకా! సుఖమునఁబోయిరమ్ము "అనివలికి దీవించి యనుమతించిపంపుడు. లౌకిక కార్యములందేకాని, వైదికకార్యములందేకాని, యన్నిట మాతాపితల యనుమతిం బొందుట ప్రధాన విషయము." పుత్రునాపల్కు లాలించిన పుత్రవత్సలుఁడు మృకండు మహర్షి పుత్రరత్నముం గాంచి యిట్టులనియెను. ఓ కుమారరత్నమా! నీయీ పవిత్ర భావనచే, విట్టి పావనోదారభావన గలిగిననీచేమనవంశము, పితరులము మేమును ధన్యులము; పవిత్రులమునైతిమి. దివ్య తీర్థములుఁ బుణ్యభూములంబోయి సేవింపవలెనను కోర్కికలుగుటయేమేలు. నీమతి యెల్లవేళల మంచి యందునే, పవిత్ర భావనల వేలగ్నమైయుంట యెంతయు మేలు. కాని నాయనా! నిన్ను వెడలిరమ్మనుటకు,

విన్నిడ బాసియుండుటకు మాకెట్టులు మనసొప్పును? మేమెట్టులుండఁగలము? ఈ విషయమెల్ల యెడల నెల్లకాలముల నందఱకుం దెలిసినదియ. వారెట్టి వారైనను బిడ్డలతోడి వియోగదుఃఖము తలిదండ్రులకుఁ గడుంగడు దుస్సహము. ఇఁకసత్సంతానముతోడి, సత్పుత్రుని తోడియెడబాటన్న దుస్సహాతి దుస్సహము.

ముద్దులబిడ్డా! యానందకందమా! నీవమాకెంతయుఁ బ్రియంకరుఁడవు; నానందకరుఁడవు. నీవెంతయు బుద్ధి మంతుఁడవు ఆస్తికుఁడవు, కడుంగడు భగవద్భక్తి కలవాఁడవు. నీతోడియెడబాటు బాధను, దుఃఖమును మేమెట్టులు సహింపఁగలము? మమ్మేం బాయక చెంత దమబిడ్డలుండం గాంచఁగలుగుటయె తలిదండ్రుల కుంగలుగు నానందములనెల్ల నుత్తమోత్తమానందము. వారల గొప్పదగు సత్కర్మఫలమే పుత్రరూపమున వారల చెంత నుండి సేవలనానందము నొసంగుచుండును. ఇట్టులుండ నోముద్దుబిడ్డా మమ్మిర్వుర నిటవిడిచి నీవెట్టు లెందుఁబోగలవు ? నీవచెప్పుము. ఇట్టులనుచున్న పితృదేవునింగాంచి తనయుఁడు మార్కండేయుఁడిట్టులనియెను. ఓయమ్మా! ఓనాయనా! నాకైమీరిట్టు లేమియు వగనొందకుఁడు. నేను ప్రతివత్సరము నియమముగ నిశ్చయముగ నిటకు వచ్చి మీయిర్వురిని దర్శించికొందును. పుణ్యక్షేత్రములకేగుటచే, బుణ్యతీర్థములమునుగుటచేఁ మిక్కుటమగు పున్నెము కలుగు ననియు అట్టి పుణ్యము చేతనే వాని సంపూర్ణకులము పవిత్రమగుననియుఁ జెప్పఁబడు చున్నది. ఇందుచే నోతల్లీ, పితృదేవా! మీరు నాకిప్పుడె, తొందరగ నాశీర్వదించి వెడలి రాననుమతియిండు.

ఇట్లు తనయుఁడు నయవినయముల తోడి యూపలుకులు పలికినంత వారిర్వురును బుత్రుం గాఢాలింగనమొనరించి. ఓమాకన్నయ్యా! నీవు చిరంజీవివికమ్ము. ఎల్లపుడానందముతో నుండుము. ఎల్లకాలము మాకానందము నొసంగుము. మిగుల ధర్మపరాయణుఁడవై యుండుము. శీఘ్రముగఁబోయిరమ్ము. ఇట్టులాశీర్వాదము లొసంగుచు వారందెతన్మయులైయుండిరి.

ఇట్టులు తలిదండ్రులు పలికి యనుమతి నొసంగినంత మృకండ దారమతి తనయుఁడు మార్కండేయుడు తలిదండ్రులకుం బ్రదక్షిణ నమస్కారము లొనరించి తీర్థయాత్రలు సొనరింప సదవకాశ మార్గమునఁ బ్రస్థానమొనరించెను. కాశీనగరమున పుణ్యభూమిని జేరి పవిత్ర గంగానదిని స్నానమొనరించి యొద్దున కెక్కి విశ్వనాథ భగవానునకుం బ్రణామము లొనరించి యచటనే తీరమునఁగొంత సమయము దనుక నిటునటు తిరుగ సాగెను. ఇంతలో నాతనికట నాకసమున వైష్ణవాగ్రణి పక్షిశ్రేష్ఠుఁడు ఖగపతి గరుడుండెగురుచుఁదిరుగుచుఁ గానంబడెను. అంతనాతఁడు తార్క్ష్యు వైనతేయుం గని యిట్టులనియెను.

ఓవైనతేయా ! విష్ణువాహనా ! మీకివేనమస్కారములు. తమరిప్పుడెచ్చటి కేగుచున్నవారు ? ఓ మహామతీ ! పుణ్యతీర్థముల, పుణ్యక్షేత్రముల యాత్రసాపరింప నెంతయుంగోరికి పొందినేనిచటికి వచ్చితిని. ఓఖగేశ్వరా ! మహత్పుణ్యక్షేత్రములు, పుణ్యతీర్థములునేవి ? దయయుంచి వానినాకు వివరించిచెప్పవే. యన్న వినిగరుడుండాతని కిట్లులనియెను.

## మార్కండేయునకు గరుడుండు వేంకటాచల మాహాత్మ్యమును జెప్పుట

ఓమునిశ్రేష్ఠా మార్కండేయా! నేనిదే తత్వవాక్యమును వచించు చున్నాఁడను. సావధానమతినాలింపుఁడు. తీర్థస్థానంబులఁబరమోత్తమ తీర్థస్థానము, క్షేత్రమ్ముల నుత్తమోత్తమ క్షేత్రముంజెప్పుచున్నాడ. మనసుంచి వినునది. ఇచ్చటికిందక్షిణమ్మున సువర్ణముఖరీ నదియతిపావనము కలదు. తత్తీరమున వేంకటాచలమను మహత్పర్వత మొండుకలదు. అచ్చట నెల్లవారు శాంతి సుఖములు, శుభములు పొందఁగలరు. పరమవస్తువును, పరమునుగాంచను, బొందను బ్రార్థనలొనరించుటకు, సంస్తుతు లొనరించుటకుఁ బరమయోగులు, మౌనివరులచటనె వసించుచుందురు. అప్పర్వతమునకుఁ బున్నెంపుకొండకీ ప్రపంచమున నెన్నెన్నియొ పవిత్ర నామములుకలవు. అందునఁగొన్ని పుణ్యమయంబులు నామంబులు నీకుంజెప్పివినిపింతును. శ్రీవేంకటాద్రి శేషశైలము, నారాయణమహీధరము, అంజనాద్రి, సువర్ణాచలము, రత్నగిరి, ఇత్యాదు లింకను నెన్నెన్నియో పెక్కులు నామమ్ములద్దానికిం, భువన ప్రసిద్ధము లుత్తమంబులు పరమ పవిత్రములు, పుణ్య ప్రదములుకలవు. అద్దాని సంకీర్తన మెల్లపాపముల నాశమొనర్చును ; తద్వందన మెల్లవిధముల సౌఖ్యముల నొసంగఁగలదు. దానింగూర్చి చేయు యాత్రయెల్లదేవతలచే సంపూజితమగును. ఇట్టులా వేంకటా చలమన్నివిధముల మహనీయము; దాని మహిమయత్యంతము. సమస్త తీర్థము లందునకు వచ్చి చేరుచుండును. తీర్థంబులందెల్ల పుణ్యతీర్థము, ముఖ్యము, స్వామి పుష్కరిణి అద్ది స్వామి సరోవరమనియనబడును. అదియచ్చటన శైల రాజముననే కలదు. దానిమాహాత్మ్యంబు నేనేమి వచియింపంగలను? అద్దాని పశ్చిమ తీరమున నత్యంత సౌమ్యమూర్తి ప్రపంచమునకుం బరమోపకారి, సాక్షాద్భూవరాహ భగవానుఁడు తన ప్రియురాలితో గూడి నివాసమొనరించుచున్నవాఁడు. దానికిం దక్షిణతీరమ్మున శ్రీవైకుంఠపురవాసి వరదాత సర్వేశ్వరుఁడు విష్ణుభగవానుఁడు శ్రీలక్ష్మీదేవతతోఁగూడి చిరకాలమునుండి నివాసమొనరించుచున్నవాఁడు. వారల సేవలొనరించుచు

దేవతలెల్లరు నచటనేవసేవించుచున్నవారు. ఓ మార్కండేయమహాముని! మీరును నటకు వేంకటాచలమునకుం బొండు. అటస్వామి పుష్కరిణిని స్నానములొనరించి, శ్రీవేంకటాద్రీశు భగవాను శ్రీనివాసు దర్శనమొనరించి పరమానంద హృదయులు కాఁగలరు. నేనునిప్పుడా వేంకటనగమ్మునకే దేవుదర్శించి భగవాను సేవలు చేయుటకే పోవుచునున్న వాఁడను. అటవిష్వక్సేనుఁడు, శేషనాగుఁడు పెక్కు దినములనుండి, దేవుని సేవలు చేయుచునున్నవారు. ఈ ప్రపంచముననేకాదు, ముల్లోకముల శ్రీవేంకటాద్రికి నీడగు పుణ్యప్రదేశమేదియులేదు. అట్టులే స్వామి పుష్కరిణికి సమమగు పుణ్యతీర్థమే దియులేదు. ఇట్టులు వచించియా శ్రీగరుడాల్వార్లు వేంకటాచలమునకు నెగిరి వెడలిపోయిరి. ఇట మునిసత్తముడా వినతాపుత్రు పలుకులాలించి ఎంతయు ముదమందిన వాఁడై విస్మిత భవమ్మునఁనే నీవఖగేశ్వరుఁడయను పరమ పుణ్యక్షేత్రమును, పావన తీర్థమును వినితెలిసితిని. ఇది నాపున్నెమె, యదృష్టమె. నేనిప్పుడెయచ్చటికిం బోయి దేవుసేవించి తరింతు ననియుటకుంబోనుత్కంఠుండాయెను. అప్పుడయాతఁడు ముందునకు సాగిపోయి కతిపయదినములకు సువర్ణముఖరీనది నికటకమునకుం జేరెను.

## శుద్ధుడు మార్కండేయుం గలిసి - వేంకటాచలమున కేగుట.

అప్పుడు జ్ఞానధనుఁడు గుణాతీతుఁడు మార్కండేయుఁడా సువర్ణముఖరీనదికుత్తర భాగమున శేషాచలమునుగాంచి తన్నికటమునకుం బోయెను ; ఆకొండ చఱియను గపిలతీర్థముందరిసెను. దైవయోగముననప్పుడగస్త్యమునివరుశిష్యుఁడు శుద్ధుండను వాతఁడచటికివచ్చెను ; వచ్చిన యాతఁడు మార్కండేయుంగలిసెను. ఆకపిల తీర్థమునకుం బైనఁబైనఁ గ్రమముగఁబెక్కులు తీర్థములు, ఇంద్ర తీర్థము, విష్వక్సేన తీర్థము, అగ్ని తీర్థము, బ్రహ్మ తీర్థము, సప్తర్షి తీర్థములు, పంచాయుధ తీర్థములు మున్నగునవి యెన్నేనిఁగలవు. శుద్ధనామకుఁడగు నగస్త్యమునివరుశిష్యుంగూడి మార్కండేయమహాముని కపిలాది పదునేడు పావన తీర్థముల స్నానములొనరించి పవిత్రుండాయెను. దానికింబశ్చిమముననా వేంకటనగమ్మున నధిగమించి యందందుం గల బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర తీర్థములం దానములాడి యింకను నారాయణాద్రి పైకెక్కి యట, భక్తప్రహ్లాదు ననుగ్రహించి వరములొసంగిన, యానందవైభవరూపునకు లక్ష్మీనృసింహదేవునకు నిలయమగు, ప్రపంచమున, సుప్రసిద్ధమగు నారసింహ గుహాస్థానమును దర్శించెను. ఓమధుసూదనా! దాసానుదాసులము, కనికరింపుము, రక్షింపుము. అని ప్రార్థించి నమస్కరించి ముందునకు సాగి శుద్ధునితో స్వామి పుష్కరిణిని సమీపించెను. ఆపుణ్యమహాతీర్థమున విధి పూర్వకముగ, ససంకల్పముగ స్నానమొనరించి,

దానిపశ్చిమ తలమ్మునంగల పృధ్వీధరుండగు శ్రీ శ్వేతవరాహమూర్తింగాంచి సాష్టాంగ ప్రణామమాచరించి మఱియుదేవుని స్తుతింపందొరకొనెను. సర్వలోకస్వరూపా! వరాహమూర్తీ నమస్కృతులు. మహాజలముల మునిగియున్న చరాచరముల తోడి మహద్భూమండలమును బట్టి యెత్తి, మహాజలరాసినుండి యుద్ధరించి, తనయొంటి పంటికొమ్మునం బట్టి యుంచిన స్వయంభువు భగవానుఁడు మమ్మనుగ్రహించుంగాక. ఓ పురుషోత్తమా! పోత్రీరూపానీకివే నమస్కారములు. వరదాతా! స్వామిపుష్కరిణీ తీరవాసా! వందనములు. అచ్యుత, అనంతా, ప్రభువరా, శ్రీవేంకటవరాహదేవా! ప్రణామములు, సర్వమంగళ స్వరూపా! మంగళప్రదాతా! భగవంతా, భక్తరక్షకా, అనేక ప్రణతులు. దేవదేవా! కైమొగుపులు. దయామయాతలతోడి దండములు. ఇట్టులాదేవుని స్తుతులొనరించి, చరణోదకములు గ్రహించి, త్రావి, యటనుండి పుష్కరిణీ దక్షిణ తటమునకుంబోయి యట దేవుని మందిరముంగని, ప్రదక్షిణములు, వందనములు పొనరించి లోనికింబ్రవేశించెను. అందునట శంఖచక్రగదా ధారిని, వరదాతను, వారిజేక్షణు, భగవాను, శ్రీవేంకటేశుం దర్శించెను. మఱియు మఱియు నావేంకటనగాధీశునకు శ్రీశునకు మ్రొక్కుచు నిట్టులత్యంతోత్తమ సంస్తుతి నొనరించెను. "పవలురేయిచే యువారల సూర్యచంద్రులం గన్నులందునను, భాగ్య దేవతను రమాదేవిని పెన్నురమునను దాల్చినవాడా! లోకములనెల్లంబుట్టించు బమ్మకుంబుట్టువునిచ్చి బొడ్డుతమ్మిని బొడమచేసినవాఁడా! ఋషిమునిగణముల, తాపసుల తలపులనుండి వారిం దన్మయులుగఁ జేయువాఁడా! లోకాధినాధు శంకరు భక్తవశంకరుచే నిరతముం బూజలం బొందువాఁడా! నీకివే వినతులు, వినుతులు పొనరించుచున్నారము. కామదేవు మదమని కన్నయ్యకువంజలి. వేంకటాద్రి వాసనీకిదెవేడికోలు. ఇడుమలుడిపి, వగపులెల్లను దొలగించు వరద! వేంకటేశవందనములు కమల నయనదేవకరుణా పయోనిధీ బ్రోవుమయ్య భక్తి ముక్తి నొసఁగి నారాయణ నగవాసా! కారుణ్య పయోధివరద కమల దళాక్షా! క్రూరాసురసంహారా! ధీరనమస్కృతులు గొనుమ దీనశరణ్యా! కరుణింపుము రక్షింపుము! కరివరదాకనుల విందు కావింపుమయా! ధరణీధర! కైమోడ్పులు; మురళీధర వందనముల మ్రొక్కులు గొనుమా; పుండరీకనయన దండముల్వేవేలు, వందనములు మాధవామరారి. అంజనాద్రివాసఁ యంజలింతుము. కృప, నాదుకొనుము మ్రొక్కులబ్జ వాభ.శ్రీవేంకటాద్రినాధుండు కాకవేరొండు నాధుండు లేడు, ప్రభుండులేడు. ఎల్లపుడా వేంకటేశునే స్మరింతుము స్మరింతుము. శ్రీహరీవేంకటేశా! ప్రసన్నుండవుకమ్ము. మంగళప్రదాతా! శుభసంవిదాతా! వందనంబులందికొను మేలు కొనుము. మీదు పాదపద్మములమ చేకొనికొల్వ, వచ్చినాము. దూరభూమినుండి, పాదపద్మ మిమ్ము

పాలింపుమీ మమ్ము చేదుకొనుము కరుణ శ్రీనివాస, మేమజ్ఞానులము. మావలన నెన్నేనిదోషములు కలుగవచ్చును. శేషశైలశిరోమణీ! శ్రీనివాసా! అవ్వానినెల్ల క్షమింపఁగల వాఁడవునీవ, క్షమింపుము, క్షమింపుమ.., దరిఁజేర్చికొనుము. తరింపంజేయుము. ఇట్టులు శిష్యవరుఁడు శుద్ధునితోఁగూడి మార్కండేయుఁడు భక్తి భావమున నాదరమ్మున స్తుతులొనరించితలను జేతులు జోడించి, చేర్చియంజలించి యద్దేవునెదుట తన్మయతనట్టే నిలిచి యుండెను.

## మార్కండేయునకు, శుద్ధునకు దేవుచే వరప్రాప్తి

అప్పుడు వేంకటేశుండు మార్కండేయుంగనియిట్టులనియెను. కడుంగడు బుద్ధిమంతా! పాపరహితా! మార్కండేయా! నీవలననే నెంతయుం బ్రసన్నుండనైతిని. అటనప్పుడాగరుడుని మాటలాలించియప్పుడె యిటకు వృషభాచలమునకుం దరలి వచ్చితివి. నన్నెంతయు యుక్తముగ భక్తియుక్తిని పరిపూర్ణ సంస్తుతు లొనరించితివి. నీకోరిన వరమ్మొలీయ, నేనున్నవాడను. కోరికొనుము. అన్నదేవునాలించిన మునివరుం డిట్టులనియెను. ఓదేవా! జనార్దనా! వేంకటేశా! నాకెల్లపుడు, నామనమ్మునఁ ద్రికరణముల మీయందున నిశ్చల నిర్మల నిరంతర భక్తి, స్మృతి వట్టియుండవలయును. ఇదియనాయభీష్టము. కావుననోభక్తవత్సలా! నన్నటులు తీర్చిదిద్ది రక్షింపుము. ప్రభూ నమస్కృతులు; అనిన మార్కండేయునకు నట్టులెయగుంగావుత మని పలికి భగవానుఁడు శ్రీహరి అగస్త్య శిష్యవరు శుద్ధుంగని యిట్టులనియెను.

ఓపవిత్ర శుద్ధమునీ! నీచేనెన్నెన్నియో దుష్కర్మలు, పాపములునైనవి. నీవోపరితప్తుఁడవై నన్నుసేవించితివి. మత్సేవాప్రభావమున నవియెల్ల శాంతించినవి; నశించిపోయినవి. నీవు శుద్ధుండవై సార్థకనాముఁడవైతివి. ఇటనావిమానమును బ్రదక్షిణించుము. పిమ్మట నిటనుండి గురునాశ్రమమునకుం బోయి గురుసేవల ధర్మాచరణ మొనరింపుము, తరింతువు. అనినంత శుద్ధుండు దేవమందిరమును ముమ్మారు ప్రదక్షిణములొనరించి, దేవునకుంబ్రణామము లొనరించి నిలిచెను. అప్పుడా శుద్ధుంగాంచి, మార్కండేయముని తల్లజుండిట్టులనియెను. "ఓశుద్ధమునివరా! మీరెచ్చటినుండి వచ్చినారలు? మీగురువరులెవరు? వారి పవిత్రాశ్రమ మెచ్చటుం గలదు? మీచేనైన, భగవంతుని శ్రీహరిసేవలచే నశించిన యామహాపాపములేమి? నాయందున దయ గలిగినదియెల్లఁ దెలియంజెప్పుడు.

## మార్కండేయ మునివరునితో శుద్ధముని చెప్పిన తనచరితము

ఇట్లుఅడిగిన మార్కండేయ మునివరుంగాంచి శుద్ధుండిట్లు పలికెను. ఓముఖివరా! నాచరితమును విక్కముగ నున్నదానింజెప్పెద నాలింపుడు. కాంచీదేశమున మధ్య రాష్ట్రముననుండు వాడను నేను బహుకుటుంబీకుఁడను. కుంటుంబపోషణమునకై నేను కాదనక దుర్దానములను బట్టువాడను. కట్టఁబట్టయుఁ దినఁదిండియు లేనివాఁడవగుట నూరూరందిరుగువాఁడను. పాపినై యేకోద్దిష్టముషోడశ శ్రాద్ధాన్నములను భుజించు వాఁడను. భ్రాంత చిత్తుఁడనై యెల్లపుడు డబ్బుడబ్బని తిరుగాడుచుండువాఁడను. స్నానసంధ్యలు, జపహోమములు, దేవాతిథిపూజలు, వైశ్యదేవము, జపయజ్ఞములు, బ్రహ్మయజ్ఞము, మున్నగునవేమియునే నొనరించియెఱుంగను. పాపినగునన్నుంగాంచి యాగ్రామ వాసులెల్లరును మహాబ్రాహ్మణుడని యనాదరమున హేళనగఁ బేరిడి పిలిచెడివారు.

నాయిల్లాలు రేవతియెంతయు బుద్ధిమంతురాలు. ఒకదినమున నాతోనాతో నిట్లులనియెను. ఓబ్రాహ్మణవరా! పతిదేవా! కుటుంబమును బోషింపవలెనను కోర్కిని మీరిటనెన్నేనియుఁ బాపకర్మలాచరించియు, నెందునేమియు ధనమును బొంద జాలకున్నారు. ఓ బ్రాహ్మణా! ప్రేతమునుద్దేశించియీయఁబడిన గోదానములు, వస్త్రదానములు గ్రహించితిరి; భోజనములు మెక్కితిరి. ఇట్లెప్పుడును నేనెన్ని నింద్యకర్మ లాచరించితిరి. ఇట్లులెడతెగని పాపమ్ములొనరించియు నింటనేమియు గనరాదు. లేమియేలేమి. ఇంటబిడ్డలాకటన్మాడు చున్నారు. మీకును నాకును, గన్నబిడ్డలకును గట్టబట్టలులేవు. మనమెంతయు దరిద్రులమై యున్నవారము. ఇట్లులయ్యు మీమనమున నీచింత యావంతయుఁ గలుగకయున్నది. నిశ్చల నిర్మల మనమున భక్తి యుక్తి నొక్కమారునమస్కరించినను ఆయురారోగ్యైశ్వర్యము లాదిగ సర్వము నొసంగంగల దేవోత్తముండు వేంకటాధీశుండని జ్ఞానిజనులు వచించుచుందురు. కావున నోవిప్రవరా! మీరచ్చటికింబోవసంసిద్ధులుకండు. మనకిచ్చటకు నుత్తరపు దిక్కున సువర్ణముఖరియను పవిత్రనదికలదు. దాని తీరముననే వేంకటాద్రియను శ్రీహరిక్షేత్రమొండుకలదు. ఆకొండ నావేంకటాద్రీశు శ్రీశుసేవింప నిప్పుడెయిట నుండి బయలువెడలుఁడు. స్త్రీలెల్లరు లక్ష్మ్యంశా సంభవులుగ నందురని, విద్వాంసులు జ్ఞానివరులు వచించుచుందురు. కావున నావాక్కులు ప్రమాణముగఁగొని సుఖసంప్రాప్తికై తొందరగ బయలువెడలుడు. ఇట్లను నాప్రియురాలి పలుకులాకర్ణించి యప్పుడెపయనమై యైదుదినములకు నేను సువర్ణముఖరీ నదిని దరిసి యగస్త్యమునివరు నాశ్రమమును జేరితిని. ఆసువర్ణముఖరీతటమున

శంకరునకు, శ్రీశివదేవునకు నెదుటఁ దపమ్ము నాచరించుచున్న యగస్త్యుంగాంచి" ఇదోమునివరా! మీకు నమస్కరించుచున్నాను. అని నమస్కరించి చెంగట నిలిచితిని. పరమదయాళుఁ డగస్త్యముని సత్తముఁడు నన్నుంగని, " నీవెచ్చోటి నుండి వచ్చు యున్నాడవు? ఏమి కారణమున నీవిట్లుదుఃఖితుఁడవుగ నుంటివి? ఇటనేమిపని? అని యడిగెను. అంతనాతపోధనుకుంభ సంభవముని తల్లజుంగని నేనిట్టులంటిని. ఓకరుణాసాగరా! పాపులందెల్ల మహాపాపిని. నన్నుందయను బ్రోవుము. మత్కృతమ్ములవియెల్లమీరు మీతపోబలంబున నెఱుంగంగలరు. కాంచీ ప్రదేశమ్మున నొక గ్రామము నా నివాసము ఆగ్రామవాసులెల్లరునన్ను మహాపాపినిగనెంచి, మహా-బ్రాహ్మణుఁడని హేళనగ పల్కుచుతేలికచేతురు. అందువలన నేనెంతయు దుఃఖితుఁడనై, శ్రీవేంకటాద్రిం దర్శింపఁ గోరికవడివచ్చితిని. నాయొనర్చిన యేపుణ్యఫలప్రాప్తి గనోమార్గమధ్యముననేయిటఁ దమరునాకుం గన్నులంబడిరి మీదివ్య దర్శనమాయెను. గత జన్మముల పుణ్యఫలముగనే సజ్జనుల దర్శనమగును. మీరు నాయందు నను కంపంబూని నన్ను శిష్యునిగ స్వీకరింపుఁడు నేనిదే మీశిష్యుడను. నన్నుం బాపకర్ముని కాదనక గ్రహించి పవిత్రునిగ నొనరింపుడు. ఇట్టులనుచున్న నన్నుంగని యా తపోధనుం డిట్టులనియెను. అగునగు తపోబలమున నాకంతయువిదితమాయెను. నీవింతయుఁ బాపమాచరించితివి. కాని శ్రీవేంకటాద్రికింబోవనీకుమతియాయెను. దానిచేనీవిపుడు పరిశుద్ధుఁడవైతివి. ఇట్టులని చెంతనుగల ద్విజవరులంగనుగొని, ఓపాఱులారా! "నీవుశుద్ధుండవయితివి" అని మీరెల్లరీతని బలుకుండని, వారట్టులన్నంబిదపనన్నుంగని మఱల నిట్టులనియెను. ఓబ్రాహ్మణా! నీవుశీఘ్రమ్ముగ శ్రీవేంకటాద్రికిం బొమ్ము. అట భూవరాహదేవుని, లక్ష్మీశు వేంకటనగేశుని దర్శించి భక్తిని సేవలొనరించియిట కుం దిరిగిరమ్ము. తదుపరి పాపములెల్ల నశించిన నీకునే శీఘ్రమ్ముగ మనలమ్ము లొసంగంగలవాఁడను. భగవానుఁడగస్త్య మునివరుడిట్లు పలికి సేవాక్రమమును బాగుగనుపదేశించినన్నట నుండి, పయనమొనరించి పంపెను. అచ్చటనుండి వచ్చుచు అదృష్టవశమున మార్గమున, బ్రమోదాతిశయముగ మిమ్మునేఁ గాంచఁగలిగితిని. అదినాభాగ్యము.

## శుద్ధుడు మార్కండేయుడు అగస్త్యాశ్రమమునకుం బోవుట

నే నగస్త్యమునివరు శిష్యుఁడను శుద్ధనాముఁడను అని మఱియునిట్లులనియెను. ఓమార్కండేయమునివర! అనువర్ణముఖరీ నదీతీరభూమిని దయానిధి యగస్త్యమునివరు నాశ్రమమునకుంబోవుదమా! వేంకటాచలమాహాత్మ్యమునెఱింగిన వారలందెల్లమేటి, పూజ్యానగస్త్యమునివరుంగాంచ మీరు వత్తురే? మీయభిమతమేమి? వచింపుడు

అప్పుశుద్ధునకు మార్కండేయుఁడిట్టులనియెను. అమ్మునిపుంగవుందర్శింపనేనునువత్తును. ఆసువర్ణముఖరీతీరమునకు, కుంభ సంభవమున్యాశ్రమమునకు నీతోనన్నుంగొనిపొమ్ము. ఇట్టులన్నంత నాయిర్వురు సుజనవరులు నావేంకటనగమును మెలమెల్లందిగి సువర్ణ ముఖరీనదికి నగస్త్యాశ్రమమునకుంబోయి చేరిరి.

అటనగస్త్యమునివరుండనేకులు సజ్జనులనడుమ తజ్జనసేవింతుడై కూర్చుండి యుండి, వారలకెల్లరకును శ్రీవేంకటేశకథా వ్యాఖ్యానమునఁ దత్పరుఁడైయుండెను. శుద్ధుండును, మార్కండేయుండును నచ్చటి వారెల్లరకును, విశేషించి, యగస్త్యునకును వినయవినమితులై నమస్కృతులొనరించి, యగస్త్యమునివరుచే నత్యంతము. బహుమా నితులు సంపూజితులునై తాము నాసభాజనమధ్యమునఁ గూరుచుండిరి. ప్రసన్నచిత్తుఁ డానందమయుఁడు లోపాముద్రాపతి యగస్త్యుఁడు ఓబ్రాహ్మణవరులారా! భక్తవరులారా! శ్రీవేంకటగిరిదేవుల మాహాత్మ్యమును మహచ్చరితమును మనసుంచి యాలింపుడు" అనియిట్టులు చెప్పసాగెను.

## అగస్త్య వర్ణిత వేంకటాచలవైభవము

ఓభక్తవరులారా! పావనమతులారా! పాపనాశనమగు శ్రీ వేంకటాచల మాహాత్మ్యం బెంతయు నాలింపందగినదియ. దానివర్ణింపఁజెప్పనెరికిని వశముకాదు. విష్ణుదేవునకు లోకైకారాధ్యున కది ప్రియతమ నివాసము. దేవుండు సర్వవ్యాపి,అవిభక్తుఁడు. ఆతడంతట నున్నవాడె. కానియాతని యనురాగమిందెక్కుడు. కావున నాతని ప్రేమభావమిందెక్కుడు కావుననేదీని మాహాత్మ్యంబమితము. ఆతఁడు కరుణామూర్తిజగద్వాసుల మానవులం దరింపఁ జేయనేయాతఁడిందు ప్రేమమూర్తియై నెలవుకొనియున్నవాఁడు. ఒకప్పుడు దేవుని దర్శింపనెల్ల లోకములు తిరిగితిరిగి బ్రహ్మాదులతో, దేవవరులతో, ఋషిమునులతో మేమును దేవునిచటనే కాంచి తన్మయులమైమితి. ఎల్లరమాస్వామిపుష్కరిణివి స్నానంబులొనరించి తన్మయత దేవుందలంచుచుండ నాపుష్కరిణీ తీరమున దేవుని దేవాలయముందోచెను. అందున శ్రీనివాసుడు లక్ష్మీయుతుఁడు దర్శనమిచ్చియెల్లరం దనియించెను. ఆదేవతామూర్తి కరపద్మముల శంఖచక్రములు పట్టియుండెను. తనయెడమ చేతిని వామజంఘమునిచి నాపదపద్మములు శరణందిన వారికీ సంసార సాగరము జానుదఘ్నమెయగును. కావున నాచరణకమలములె యెల్లరి కాధారము, సద్గతియిని యాదివ్యమూర్తి తెలుపుచునున్నవాఁడు. భక్తుల మనంబులకోర్కెల నొసంగ, మనోరథంబులు తీర్పనేమనడుము కట్టియున్నాను, సంసిద్ధుఁడను. అని తెలుపుచు రెండవచేతిని కటిబద్ధముగఁజూపుచుండెను. లచ్చికకిరవగు పెన్నురంబువాని, చిఱువవ్వు

వెన్నెలలుగాయు మోముచందురువాని, సర్వభూషణాలంకృతు, శ్రీవేంకటేశు, శ్రీనివాసు, శ్రీహరినెల్లవారును గనులపండువుగఁ గనుంగొనిరి. అప్పుడెల్లరాదేవునకు, బడిపడి నమస్కృతులొనరించి సంస్తుతులొనరింపసాగిరి. జగన్నాథా! దేవదేవా! జయము జయము. సర్వలోకైక వందితా! వేంకటశైలేశా! కరుణాకరా! పాహిపాహి! ఓ వేంకటాచల నాయకా, మోదదాయకా! మీకిదేనమస్కరించుచున్నాము. మమ్మెల్లర రక్షింపుము రక్షింపుము. కరుణింపుము. ఇట్టులటంజేరిన యజాభవేంద్రాదులు, మునులు, సిద్ధులు వాదిగనెల్లరు దేవుని బ్రస్తుతులొనరించి మ్రొక్కులర్పింపసాగిరి. అప్పుడు కరుణా సముద్రుడు శ్రీనివాసుఁడు వారలంగని యిట్టులనియెను. ఓవిబుధులారా! మీయెల్లరి ప్రార్థనలచే సద్భావనచేఁ బ్రసన్నుండనైతిని. మీమీమనంబు లందలికోర్కులెల్ల నొసంగితిని. అవియెల్లమీకు సంసిద్ధములు అని వేంకటనాథుఁ డవ్వారల కెల్లరకు వరప్రదానమొసంగెను. మఱియు నీకలికాలమున నిందెయుండి భక్తిశ్రద్ధల, పవిత్ర మానసమ్మున నిటంజేరియోదూరముననుండియో నన్ను నర్చించువారిం బాప రహితులుగ పొనర్చుచు, గోర్కులనిచ్చుచునుందును. ఎల్లరనన్నుంగాంచుచు నెల్లరఁ బ్రేమానురాగముల సేవల దనుపువారె నన్నుసేవించి తనుపువారు. వారలిట కోర్కులొంది సుఖించి యాపై తరించురు. నన్నుంజేరి మహదానందమొందుదురు. అనియెల్లర యభీష్టము లొసంగి యా శ్రీగిరినే స్థిరనివాస మొనర్చికొనియుండెను.

ఓం తత్సత్

ప్రథమ భాగము సమాప్తము



ఓం శ్రీ గోవిందాయ శ్రీ వేంకటేశాయ నమః

ఓం శ్రీ శ్రీనివాసాయ శ్రీ వేంకటేశాయ నమః